శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః



# చమత్కారకథాకల్లోలిని

## ప్రథమతరంగము



రాధాకుచమండల
సారపటీరార్ద్ర హృదయ సమధికశౌర్యో
దార నతమానిజనమం
దారా దయఁజూడు నన్నుఁ దామరసాక్షా.

శ్రీమంతంబును చతుర్దశభువనభూషణంబును నగుమానుషలోకంబునందు మహనీయతపఃప్రభావసంపాదితసకలజనస్తవనీయమాహాత్మ్యమండను లగుమానిపుంగవులు వసియించు నీభరతఖండంబున నఖండతేజఃప్రచండచండభానుభానుప్రభాభాసమాన భవ్యవజ్రమణివార విశోభితంబగు రోహణపర్వతసమీపంబునం జిత్రకేతనంబను నొక పత్తనంబుగలదు. అదియు నభినవతారుణ్యలక్ష్మీవిలాసభాసమానలగు విలాసవతులచే నొప్పుమిగులుచు సమస్తసంపత్సమృద్ధంబై యఖిలవిద్యాపారంగతులగు బ్రాహ్మణవర్యులచేతను, బాహువీర్యవిజితశాత్రవులగు క్షత్రియకుమారులచేతను, లెక్కకెక్కుడగుధనంబు గలకోమటులచేతను, సమస్తధాన్యములచే నొప్పు గొప్పకాఁపులచేతను మిగుల వన్నెకెక్కుచుండును. ఆ నగరమును బరాక్రమనిర్జిత శత్రుచయుండగు శత్రుంజయుండనురాజేలుచుండు. అతఁడు మానసంబున ధర్మదేవతవలెను, కోపమున యమునివలెను, అనుగ్రహమునందుఁ గుబేరునివలెను, ప్రతాపమున నగ్నివలెను, బలమున వాయువువలెను, ప్రజ్ఞయందు బృహస్పతివలెను, రూపమున మన్మథునివలెను, తేజంబున సూర్యునివలెను వెలుంగుచు సకలప్రజలను తనప్రజలవలెఁ బోషించుచుండును. మఱియు నారాజునకు ఇంద్రునికి బృహస్పతియు, దశరథునికి వసిష్ఠుండును, రామునికి విశ్వామిత్రుండును, నలునికి సుమతియు మంత్రులయినరీతి విచారసారుం

డను విప్రుండు ప్రధానమంత్రియై యుండె. ఆశత్రుజయుండు ననివార్యంబగు బాహువీర్యంబున శత్రురాజులం జయించి యావిచారసారుం డనుమంత్రియందు రాజ్యభారంబు నునిచి కర్తవ్యశేషంబు లేక కామపురుషార్థంబుఁ జరితార్థంబు సేయంగోరి

సీ. లలితసౌధగతితజలజాకరములందుఁ గృశమధ్యలనుగూడి క్రీడసల్పు
శశికాంతవేదికాసముదయంబులనుండి యంగనాసంగీత మాసవినును
కమనీయసౌధభాగములందు సుందరీజనులతో గోష్ఠులు సల్పుచుండుఁ
దలిరులశయ్యల జలజనేత్రలఁగూడి రతివిశేషంబుల గతులెఱుంగు

గీ. బాలికాతతితో వనకేళిసల్పు
భామలనుగూడి ప్రీతిశోభావలాడు
నివ్విధంబుగ నాధరిత్రీశ్వరుండు
తరుణభావసుఖంబులఁ దనియుచుండె.

ఇట్లు బహుకాలంబుగ నిరతరములైన జీవలోకసుఖంబులను స్వాంతంబులుగ ననుభవించునాతని యంతిపురంబు తనయముఖకమలదర్శనసుఖంబులేమి శరవణంబు చందంబున నిష్ఫలపుష్పదర్శనంబయియుండె. యౌవనమతిక్రమింపనతిక్రమింప నాభూవిభునికి విఫలమనోరథుం డగుటం జేసి యనపత్యతాసంభవంబగు మహాసంతాపంబు ప్రవృద్ధంబయ్యె. విషయోపభోగసుఖేచ్ఛలు మనంబునెడబాసె. కన్నులు గలవాఁడయ్యుఁ దన్ను నంధునిగఁదలంచె. సకలభువనంబుల కవలంబనుండయ్యుఁ దనకవలంబము లేదని యెంచె. వేనవేలుగ నరపతులు తన్నుం బరివేష్టించియున్నను సహాయశూన్యుని పగిది మనంబున వగచుచుండె.

ఇట్లుండి యొక్కనాఁడు తనగృహంబునకేతెంచిన నొకసిద్ధునింగాంచి భక్తిపురస్సరంబుగఁ బ్రణామంబులాచరించి బంగారుపీటపయింగూరుచుండం బ్రార్థించి గోవు నిచ్చి యఖిలోపచారంబులఁ దనిపి సుఖాసీనుండై సేదదీర్చుకొనియున్న యాజడదారిం డగ్గఱి కృతాంజలియై రాజు "ఓయయ్యా! మీరు సదాచార్యునివలన యోగక్రమం బభ్యసించి భోగంబులుబాసి రాగంబున నాగాధిపుండు వసియించు భోగవతియును నలువ వసియించు సత్యలోకంబును గాంచియున్నారుగదా. మీ కెఱుంగని విషయంబులు లేవు. ప్రపంచకార్యంబులెల్ల భవాదృశులగు పురాణమునుల వాక్యానుసారంబు లయికదా ప్రవర్తిల్లుచుండు. నేనొక్క సంశయం బడిగెదను. కరుణించి తెల్పవే" యనవుడు నామానిసయు "రాజా! నీమనోగతం బెఱుంగుదును. నీవు సుతులులేక పరితపించెదవు. సుతప్రాప్తికిం బ్రతిబంధకంబగు పాపవిశేషంబు జన్మాంతరంబునం జేసియున్నాఁడవు. తన్నివర్తకంబుగ నీవొనరింపవలసిన కార్యంబు చెప్పెదను వినుము. సర్వలక్షణసంపన్నంబగు

సురభియను గోవును తగువిధంబులం బోషించుచు సమస్తరత్నాభరణంబుల నలంకృతం జేసి యొక్క పుణ్యదినంబునందు వృద్ధలగు గోపవనితల రప్పించి వారలకువలసినవన్నియు నొసంగి బంగారుకలశంబుల సర్వపుణ్యోదకంబులందెప్పించి యందు నవరత్నంబులు నించి క్షీరతరుపల్లవంబులసువాసితంబులుచేసి మంగళస్నానంబుచేసియున్న నీభార్య నాయావుక్రిందం గూరుచుండ నునిచి యాగోపవనితలచేత నాతీర్థోదకంబుల నభిషేకింపఁజేయవలయు. ఇట్లువత్సరంబొనర్చిన నీకుంగుమారుండు జనియించునని చెప్పి యోగియుఁ దనయిచ్ఛం జనియె.

రాజును సిద్ధునిమాటలువిని నమ్మి తనదేవియగు మణిమాలచే వ్రతంబు నిర్విఘ్నంబుగఁ జేయించిన నాసుదతియు గర్భంబుధరియించి శుభలగ్నమునం గుమారునిం గనియె. ఆకుమారుని యంగసౌందర్యంబుఁగాంచి వీఁడు మన్మథునివలెఁ జూచిన వారలకు వలపుఁగొలపుఁగాన మదనమోహనుండను పేరిడఁదగునని పురోహితులు సెప్పఁగా రాజు నట్లు నామకరణంబుగావించి జ్యోతిషకుల రావించి యీకుమారుని జాతకభావంబుందెల్పుఁడని యడుగఁగా వారు శత్రుంజయునితో నీతనయుండు నాలుగు సముద్రములవఱకు నుండు నీసమస్త ధరామండల మేలంగలఁడు. వీని బాహువీర్యమునకులుకి యెల్ల రాజులును కప్పములను గట్టుచుండుదురు. సర్వసుగుణసమృద్ధిగలిగి వృద్ధుల సేవించుచు మనునీతిప్రకారంబు ప్రజాపాలనంబు సేయు. అయిన నితనియం దొక దోషము చంద్రునియందుఁ గళంకమువలెఁ గనుపడుచుండును. అదియెద్దియనఁ వీఁడు సర్వవిద్యాపారంగతుండై ధనుర్విద్యయందర్జునునివిధమునను, ధర్మమునందు యుధిష్ఠిరుని తెఱంగునను, సత్యమున హరిశ్చంద్రునిపగిదిని, బాహువీర్యమునందు శ్రీరామునివలెను బ్రవర్తించువాఁడై పరకాంతారతియందు శ్రీకృష్ణుననుకరించుచుండునని చెప్పిన రాజు తనమనంబున వ్యాకులతఁజెంది పరకాంతారతుండు పట్టాభిషిక్తుండయ్యెనేని యట్టి రాజ్యంబుపూజ్యంబయినం బ్రజలకుఁ ద్యాజ్యంబేయగు. లేక లేక పుట్టినపట్టి కె శౌర్య ధైర్య గాంభీర్యాదిగుణంబులకుం బుట్టినిల్లైనవానికిం బట్టంబుగట్టక యెట్లుందు. ఇంతవఱకును కుమారుండు లేఁడనుచింతయు నిప్పుడిందు కేమిచేయఁదగు ననుచింతయు హృదయమును గలంచుచున్నవి. కర్తవ్యంబు తోఁచదు. అని యొకింతచింతించి తలయూచి మంత్రి పుంగవునింగాంచి యిట్లనియె. ఓ ప్రధానశేఖరా వింటివే యీజ్యోతిషికుల వచనంబులు; లోకంబున రాజకుమారుల కభినవయౌవనము గలుగు నప్పుడు సర్వానర్థంబులు గలుగకమానవు. అందుతోడ రాజ్యలక్ష్మియుం గూడెనని వహ్నికి వాయువు సహాయంబైనవిధంబున వంశములదహించుచుండు. ఓయిసారవిచారుఁడా! స్వార్థసంపాదనపరులై యీకాలపుఁగుమారులు జూదమాడుట వినోదంబనియు, పరదారగమనము సామర్థ్యమనియు, వేఁటాడుట వ్యాయామంబనియు

పానంబు విలాసంబనియును, ప్రమత్తర శౌర్యంబనియు, స్వదారపరిత్యాగంబు వ్యసన
శూన్యత యనియు, గురువచనంబుల నవధీరణసేయుట ప్రభుత్వమనియు, భృత్యులను
గౌరవించుట సుఖసేవ్యత్వమనియు, నృత్య; గీత, వాద్య, వేశ్యాభిరక్తి రసికత్వ
మనియు, మహాపరాధానాకర్ణనము మహానుభావత్వమనియు, పరిభవంబులసహించుట
క్షమయనియు, దేవతల నవమానించుట మహాబలశాలితయనియు, వందిజనులుపొగడుట
యశంబనియు, చంచలతయే యుత్సాహంబనియు, విశేషము లెఱుంగలేమియ యపక్ష
పాతంబనియు, దోషంబుల గుణములుగఁదలంచి తమకుఁదామె విహసించుకొనుచుఁ
బరులవంచించు సామర్థ్యంబుగణించుచు ధూర్తులుసేయు స్తుతులచే వంచితులై విత్త
మదంబుతలకెక్కి చిత్తంబులు స్వాయత్తంబులుగాక యాత్మనళీకాభిమానంబు లారో
పించికొని మర్త్యధర్మములయ్యుఁ దమ్ముదివ్యాంశావతీర్ణులుగాను అతిమానషులుగాను
ఉత్ప్రేక్షించుకొనుచు దివ్యోచితములగు కార్యంబు లుపక్రమించి సర్వజనుల
కును బరిహాస్యులై యుండలేదా. అనుజీవివర్గంబు లాత్మవిడంబనలుసేయ నభినందించు
చుండలేదా? తమ్ముఁజతుర్భుజావతారులని నిశ్చయించుకొని తక్కినబాహుయుగళ
మంతఃప్రవిష్టంబై యున్నదియని యెంచుచుండలేదా? తమ్ముఁద్రిలోచనావతారులను
కొని లలాటంబునం దృతీయలోచనంబు త్వగంతరితంబై యున్నదియని యాశంకించు
చుండలేదా? దర్శనంబిచ్చుటయ యనుగ్రహంబనిగణించుచుండలేదా? దృష్టి
పాతమే యుపకారమని స్థాపించుచుండలేదా? మఱియు నిష్ఫటీవ్యావహారికులు తమ
స్పర్శమే పావనంబనితలంచి మిథ్యాభిమానమాహాత్మ్యగర్వనిర్భరులై దేవతలకుఁబ్రణా
మంబులుసేయుటలుమానియు, ద్విజపూజలువదలియు, మాన్యులను సన్మానించకయు,
అర్చనీయుల నర్చించకయు, గురువుల కభ్యుత్థానంబు సేయకయు, విద్వజ్జనులనలౌకి
కులని యపహసించుచును, వృద్ధజనోపదేశంబులు జరావైక్లబ్య ప్రలపితంబులని వద
రుచుఁ దమప్రజ్ఞలకుఁ బరిభవకరంబులని సచివులమాటల కసూయపడుచు హితవా
దులపైఁ గోపగించుకొనుచు నహర్నిశము నంజలిగావించుకొని యన్యకర్తవ్యంబులు
మాని యధిదైవతముంబోలె స్తుతించువారినభినందించుచు వారిఁ దమకు సమీపమున
నిలుపుకొని మాటలాడుచు, వారియుపదేశంబులు వినుచు, వారి బహుమానించుచు
వారికిధనంబులు వర్షించుచుఁ బరాభిసంధానపాటవంబున నొప్పెడు వారలం బురో
హితులుగను ప్రకృతులంగవించు వారలమంత్రులుగను గైకొని పరులసంపదల యం
దాసక్తితో సహజప్రేమార్ద్రహృదయులగు సహోదరులంబరిత్యజించి పలువిధంబుల
మెలంగుచుండుట మనము గాంచుచున్నారముగదా! నాకుమారుండు మహామోహాంధ
కారమగు యౌవనమందు జనులచేనపహసింపంబడకయు, సాధువులచే నిందితుండుగా
కయు, గురువులచే ధిక్కారంబునొందకయు, సుహృజ్జనులచే నుపాలంభింపంబడకయు,

పండితులచే ననుతపింపంబడకయు, విటులచే వంచింపంబడకయు, ధూర్తులకు స్వాధీన పడకయు, వనితలచేఁ బ్రలోభంబునొందకయు, మదంబున నున్మత్తుండుగాకయు, ప్రకృతిధీరుండై ప్రవర్తించువిధంబునం జేయవలయునని చెప్పఁగా మంత్రియు దేవరా! 'శ్లో. హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి, లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే' అనువచనము మీరలెఱుంగనిదే! అయినను మనబుద్ధికొలఁది ప్రవర్తింతము. అనంతరఫలంబు దైవాయత్తంబైయుండు. ఇందుకై తామింత విచారపడవలదని చెప్పిన రాజును సమాధానపడి మంత్రిని వీడ్కొలిపి తనయంతిపురంబునకుం జనియె.

రాజకుమారుండును దినదినప్రవర్ధమానుండై శైశవంబునందె మహాప్రాణత్వము నొంది గజకలభంబుల చెవులుపట్టుకొని క్రిందికివంచి నిలువంబెట్టుచును సింహకిశోరంబులను బట్టుకొని సటలు వెఱుకుచు వాని దంతంబులు గణించుచు నిట్లు సర్వలోక విస్మయనీయంబు లగుబాల్యక్రీడలచేఁ జెలంగుచుండె.

ఇట్లు శైశవంబుగడఁచి కౌమారంబు జరుగునప్పుడు పితృనియుక్తులగు మహామతులసన్నిధిని సకలవిద్యల నేర్చి పదియవయేట నుపనీతుండై సాంగంబులగు వేదంబు లనుధనుర్వేదంబునధిగమించి చాపవిద్యయం దపరధనంజయుండో యనం జనులకత్యామోదదాయకుండై బుద్ధియందు బృహస్పతిని శౌర్యంబునం గుమారస్వామిని ధర్మంబున నజాతశత్రునింబోలి గురూపదిష్టంబులగు నర్థంబుల విశేషీకరించుచు సంగీత సాహిత్యంబుల ననురక్తిం జెందియుండ నభినవయౌవనారంభం బారాజకుమారుని యంగంబు నలంకరించె. అది కల్పవృక్షంబునకుం బుష్పోద్భేదంబు చందంబునను, కమలవనంబునకు సూర్యోదయంబునంగంబునను, 'నెమలికిఁ గలాపంబు భాతిని వివిధవిలాసయోగ్యంబయి తనర్చె. మన్మథుండును దనకవసరంబు దొరికిన సేవకుని చందంబున మెల్ల మెల్లన సమీపించె. అప్పుడాతనికి లక్ష్మితోడ వక్షస్థలంబు విస్తరించె. బంధుజనమనోరథంబులతోడ నూరుకాండంబు లాపూరించె. శత్రుజనంబులతోడ మధ్యభాగంబు కార్శ్యంబు నొందె. నితంబభాగంబు త్యాగంబుతోడన వృద్ధిఁజెందె. ప్రతాపంబుతోడన రోమరాజి పైపై కారోహించె. శత్రుకాంతాసమూహముల యలకలక్షలయనువున భుజయుగళంబు వ్రేలాడందొడంగె. చరిత్రంబువిధంబున నయనయుగళంబును ధవళత్వంబు నొందె. ఆజ్ఞతోడ శిఖరదేశంబు గురువై వెలింగె. స్వరంబుతోడ హృదయంబును గాంభీర్యంబునొందె.

మఱియు నతండు షోడశవత్సరంబుల వాఁడై గురుజనానుమతివడసి తండ్రిచే యువరాజోచిత సౌధంబునందు విడియింపంబడి సకలసుఖంబు లనుభవించుచు కృత

బుద్ధి యనుమంత్రికుమారుండును భరద్వాజుం డనుపురోహితకుమారుండును గంధ
సారుం డను వైశ్యకుమారుండును జయభద్రుం డను శూద్రకుమారుండును దనకుం బ్రాణ
సఖులై వర్తింపం గొంతకాలంబు రాజనీతి ప్రతిపాదకంబులగు కామందకీ ప్రముఖంబు
లం బరిశీలించుచును, గొంతకాలంబు నవరత్నకంకణంబులు గదలం దానె మృదంగంబు
వాయించుచు సంగీతప్రసంగంబు చేయుచును కొంతకాలంబు వేఁటతమకమున నవి
రళవిముక్త శరపరంపరలచే నరణ్యంబులు శూన్యంబులు గావించుచును, కొంతకాలం
బతివిదగ్ధులం జేరిచికొని కావ్యప్రబంధరచనలం జేయుచును, కొంతకాలంబు శాస్త్రా
లాపంబు లొనరించుచును, కొంతకాలంబు ఆఖ్యానాఖ్యాయి కేతిహాసపురాణంబు
లాకర్ణించుచును కొంతకాలంబు విచిత్రచిత్రరచనా వినోదంబులను, కొంతకాలంబు
వీణావాదనంబునను, కొంతకాలంబు తన్నుంగాంచ నేఁగుదెంచిన మునిజనులకుం జరణ
శుశ్రూషయొనర్చుచు నివ్విధంబునం గాలక్షేపం బొనరించుచుండి యొకనాటిరాత్రి
వెన్నెలబయట మనోహరంబగు నొక సైకతస్థలంబునం గూరుచుండి సుహృజ్జనంబులు
నానావిధంబుగఁ గ్రీడాపరిహాసచతురంబుగా నఖిలదేశ రాజచరిత్రంబు లుపన్యసింప
నతి మోదంబున వినుచు నా సభాసదులం జూచి యిట్లనియె. ఓ చతురమతులారా!
యేనొక్క విషయంబు ముందలించెదను. దానికిం దగిన సమాధానంబుఁ దెల్పనగు నది
యెద్దియనం దెల్పెదను వినుండు. లోకంబున జన్మమెత్తినందుకు ఫలంబెద్ది? యెదివినవిన
నింపుఁ బుట్టించుచుండు? అనఁగా నప్పుడు భరద్వాజుండు లేచి విను మోరాజకుమా
రుడా! తొల్లి భర్తృహరి 'శ్లో. ఆవాసః క్రియతాం గాంగే పాపహారిణివారిణి, స్తనద్వయే
తరుణ్యా వామనో హారిణి హారిణి' అని చెప్పియున్నవాఁడు గాన అతిమనోహరమగు గంగా
నదియొక్క నీటియందు వసియించి యందువలన సమస్తపాపంబులును బోఁగొట్టుకొని సద్గ
తిపడయుటయే నరుఁడు జన్మమెత్తినందుకు ఫలము. అట్లు కాదేని యతిసుందరమై ముత్తి
యంపుం బేరులచే నలంకృతంబగు నిండుజవ్వనుల కుచయుగళంబున నధివసించుటయె
జన్మఫలంబు. అని చెప్పగా నప్పుడు జయభద్రుండు రాజుం గాంచి యోరాజకుమారకా
భరద్వాజుండు వచియించిన విషయములలో మొదటిది యప్రత్యక్షవిషయంబుగాన
నమ్మంజనదు. 'శ్లో. ఆత్మాస్తి దేహాద్వ్యతిరిక్తమూర్తిః భోక్తా స లోకాంతరితః ఫలానామ్,
ఆశేయమాకాశతరోః ప్రసూనాత్ గరీయసీ స్వాదుఫలప్రసూతా' అని పెద్దలు చెప్పి
యున్నట్లు శరీరంబునకంటె నితరంబైన యాత్మ యొక్కటియున్నది యనియు అది
లోకాంతరంబులయందు సుఖానుభవంబును జేయుననియు అందుకై యాగాదిపుణ్య
కార్యంబులు సేయవలయు ననియెడియీయాస యాకసంబున మొలిచిన వృక్షము పూలు
పూచి తియ్యనిపండులు పండును. అవి మనము భక్షింపంగల మనునాసయే గాక యన్యంబు
గాదనియున్నది. గాన మొదటి పక్షంబు అనాదరణీయంబు, రెండవపక్షంబే రసికజన

సమాదరణీయంబగు. మోక్షముం గోరి తపంబు సలుపుచు విశ్వామిత్రాదిమహర్షులును అట్టి కట్టడిపనులు చాలించి లీలావతులసుఖంబులు మఱిగి మేలయిన జన్మఫలంబులం గాంచిరి. అది యనాదరణీయంబగునేని వారలు మనంబునకైనం దలంతురా? నత్తపోభంగంబగునని యెఱుంగరా? అందుఁ బరకాంతారతియే రతంబుగాని యన్యరతంబు నిరతంబైన నదిసురతంబుగాదు. మఱియు ఃదినసికజ 'మనోవినసంబైయుండు 'శ్లో. సంతత్యై దారరతిః కందూశమనాయ చేటికాగమనమ్, తత్త్వలు సురతం సురతం కృచ్ఛ్రాల్లబ్ధం యదన్యదారేషు' అన్నట్లు ఎల్లప్పుడు నింటిసలంబడలి యత్తలకు మామలకు మఱఁదులకు భయపడుచు; లీలావిలాసవాసనాశూన్యలై తిథివారనక్షత్రాదులం బరిశీలించుకొనుచుం దమకంబుమాలి మగని మనంబునఁ గోపంబుప్పతిల్లునేమోయని యేలుకొనుచు లోపలన నీసడించుకొను నాత్మపత్నులరతంబు పితృఋణంబు దీర్చుకొనఁ గోరి సంతతినపేక్షించినవారికేగాని రసికవరులకేలా? అదియునుంగాక వారకాంతారతి యరసికులై పశువులచందంబునం గామబాధాపీడితులైనవారికింగాక చతురులకు రుచింపదు. మఱి యనంగశరపరంపరాపూరితహృదయులై తద్వ్యథాశతంబులకు సోలిబాలిందాళలేక జాలిందూలి కేలుఁ గేలంబులంగిలించి కనువేదురునం బురుషుని గాలిసోకినంతనఁ గఱంగుచునుండెడి వెలిచవులు మఱిగిన యన్నులకలమిన్నలం జేరి కవుంగిలించు సుఖంబుకదా సుఖంబు. మఱియు నీటం బంటంబగబట్టి పోరాడు బావగారికిందెలియనీక కత్తికోతయైపోరు నత్తగారికిం గించిత్తైన నవగతంబుగానీక, మాటిమాటికిమండిపడు మామగారిమాయజేసి, మగనిమదికి సంశయంబుం గలుగనీక, యతిచతురత నుపపతికి సంకేతంబుచేసి, యదనుగనివచ్చి మదివిరాళి హెచ్చి, నెమ్మది మ్రుచ్చిలించు పచ్చవిలుకాని వెచ్చనకు రిచ్చవడి, విటకొనిపయింబడి, గ్రుచ్చియెత్తి నచ్చినమనంబుతోఁ దచ్చవలులేని తమకంబునం గూడునన్యరమణీమణిరతంబెకదా సురతంబు, జారకాంతారతియె రసావహంబని వేదంబులు సహితము చెప్పుచుండలేదా? అనిచెప్పఁగా భరద్వాజుఁడు హరిహరీయని చెవులుమూసికొని సభవిడిచి లేచి పోయెను.

అంత రాజకుమారునిం గాంచి కృతబుద్ధియను మంత్రికుమారుండిట్లనియె. ఓ రాజకుమారకా వినుము. పరకాంతారతి దోషావహంబైనను రసావహంబైయుండు. అందుకుం దగినసహాయులు దూతియు, దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతివేశిని, లింగిని, శిల్పినియు నతివిదగ్ధలగువారుగావలయు. ఇందుకే నొక్క మంత్రికుమారుని వృత్తాంతంబు చెప్పెదను సావధానత నాకర్ణింపుమని యిట్లనియె.

## అతిరూపామతిమంతులచరిత్రము

తొల్లి యఖిలదేశములకుం బ్రధానంబై యాంధ్రదేశంబు ప్రతాపధనులగు రాజవర్యులచేతం బరిపాలింపంబడుచుండె. ఆ రాజవరులకు మేటియై ప్రతాపవర్మకుమారుండగు విజయసేనమహారాజు సకలరాజులంజయించి యనేకదేశంబులు తనకువశగతంబులుగం జేసికొని హారితపుత్త్రంబను నగరంబేలుచుండె. అవ్వీరుండును తననగరంబునంగల రూపయౌవనసౌందర్యవతులగు కన్నియల ననేకగూఢచారులవలనం దెలిసికొని తల్లిదండ్రులం బలాత్కరించిగాని మఱియు ధనప్రదానంబునంగాని వారికి సమ్మతిపఱచి యనేకకాంతల వేలకొలఁదిగ వివాహంబుచేసికొని వారితో రతిసుఖంబులం దేలుచుండును. ఇట్లుండ నొక్కనాఁడు గూఢదూతికలవలనఁ దననగరంబున మాధవపతియనువాఁడు తనకూఁతు నసమానరూపవయోవిలాసభాసురాంగి నతిరూపయను కన్యకామణిని తనమంత్రికుమారుఁడైన మతిమంతుఁడనువానికి వివాహంబుచేసి యివ్వ నిశ్చయించుకొని యుండుటయు నదియును మతిమంతునంద యనురాగభరితయై యున్నదనియు నెఱింగి కార్యనియుక్తులం బనిచి మాధవపతిం బిలిపించి యాయతిరూపం దనకీమని యడిగిన నాతఁడు సమ్మతింపకయుండ నక్కన్యపయి మిక్కిలి మక్కువ గల్గియుండువాఁడగుటం జేసి తనరాజ్యంబునందుఁ గొంతభాగంబు వానికిచ్చి యాకాంతాతిలకంబుం బెండ్లియాడెను. అతిరూపయు ధనలోభంబునం దనతండ్రి చేసిన యక్కి వంబునకు మనంబునన పెక్కువిధంబుల సంతపించుచు సర్వకాలంబును మతిమంతునంద బుద్ధినిలిపి తనకు లభ్యంబులై యున్న రాజసుఖంబులకు వెగటుపడుచుం జింతాసంతాపదంతురితయై యాహారంబుపై వాంఛమాని యలంకారంబులు సేయక యన్యులతో మాటలాడనొల్లక విరహదవదహన దోధూయమానమానసయై మిగులసంతసించుచునుండ నొక్కనాఁడు దానిచేటియగు నిపుణికయనునది యేకాంతంబున నిట్లనియె. ఓదేవీ! యఖండమండలాధిపతియు నవక్రపరాక్రమజితశత్రుభూపాలుండగు విజయసేనభూపాలుఁడు నీకు భ్రుకుటీభటుండై ప్రవర్తించుచున్నవాఁడు, నిన్ను బెండ్లియాడినది మొదలితరకాంతలఁగంటనైనం జూడఁగోరండు. అనవరతంబు నీరూపంబు చింతించుచుండు. నిన్నెడబాసి యరనిమిషం బొందుచోటికరిగినను గార్యాంతరంబులు నీయింటసంచారభూమిపయింబఱచియున్నవాఁడు. ఇట్లుండ నీవేకాఁతవలన ననూయాకులహృదయవై యుండెదవు. గతంబుఁదెల్పవేయన నాయతిరూపయు నిపుణికతో ఓ నాప్రియసఖీ! నీవు నాకు బహిశ్చరంబయిన ప్రాణంబవుగానఁ బల్కెదను. నీకు నిదివిదితంబయినదియె. ఇది యితరులచెవికెక్కెనేని నీకును నాకును ప్రాణహాని సంభవించకమానదు. నీమనంబున నేయుంచుకొనుము. దుఃఖసాగరంబు పయింబయిపొంగి వేలాతిక్రమణంబొనరించు

నప్పుడు ప్రియసఖులతోఁ జెప్పికొనినం గొంతసహ్యావేదనంబగుఁగాదె. ఈ నగరంబు నకు మంత్రియైన మతిమంతుఁ డనుకుమారుండు నాకు బాల్యసఖుండు. అతనిసౌధం బును మదీయపితృగృహంబుననుండు కన్యకాంతఃపురప్రాసాదంబును సమీపసంబద్ధంబులయి యొక్కటిగఁ జేరియుండుటంజేసి యీమందిరంబులవారికిం బోకరాకలు సౌధమార్గంబునన కొంతజరుగుచుండు. బాల్యంబున మేమిరువుర మొక్కటిగ నాటలఁ బాటలం బ్రొద్దులుపుచ్చుకొందుము. క్షణకాలంబయిన నేనాతని నన్నాతఁడు నెడబాయము. అనేకవిధముల నాటలఁబాటలం గేళిమెయి విహరింపుచుండు మాకు తలంచుగ నాలుమగలయాటలపై మిక్కిలియిష్టంబు. ఇట్లుకొంతకాలంబు శైశవంబువంజరుగ నంకురిత యౌవనులమగు మాకు నాయాటలు ప్రసక్తంబులయినయప్పుడన్యోన్యముఖవీక్షణంబులలజ్జయు పరస్పరాంగసంగంబునం బులకలు గ్రమ్ముటయు నిట్టివి కొన్ని గుణంబులుగలుగుచుండు. బాల్యముననుండి మాయింటం బెరిగి నాతోఁగూడ నాటలఁబాటలం దేలుచుండుటంజేసి మా పెద్దలు నాతని నిషేధింపరైరి. ఏనును ద్రయోదశవత్సరంబులదాననగుచు నామలకంబులంబోలు కుచకోరకంబులతో నీమన్ను కలిత కుసుమగుళుచ్ఛ మనోహరంబైన మాధవీలత యనువున వెలుంగ.

సీ. సమయంబు దొరికినఁ జయ్యన నేతెంచి మోముమోమునఁజేర్చి ముద్దుగొనును
గంటులువడకుండఁ గ్రక్కున నునుమోవి మొనపంటనొక్కుచన్మొనలుబుణుకు
నింటనెవ్వరులేక యొంటినుండఁగవచ్చి రతికేలి సేర్పఁ గారడము సేయు
నిలుకటములలోన నిట్టట్టుచననీక తటుకుననీవి వదల్చికూడు

గీ. నాలుమగనాటలాడుదామాయటంచు
నడిగి ప్రార్థించుమందహాసాస్యుఁడగుచు
నతనితో జారలీలలనభిలషించి
కన్నెనయ్యును గనుచుంటిఁ గామసుఖము.

క. బాలురము గాన ధైర్యము, చాలకయచిటుక్కుమన్న సంగతిసలుపం
జాలకవీడుచు భయమున, బేలల మైయుంటిమమ్మ పిన్నతనమునన్.

ఇట్లుండ మా ప్రవర్తనంబులు జననీజనకులెఱింగి మమ్మొండుచోటుల నునిచిరి. అదిమొదలు పరస్పర ముఖనిరీక్షణము లేక మేమిరువురము నజాతచాతుర్యుల మగుటం జేసి మనంబున నుమ్మలించుచుంటిమం తెకాని యొండేమియు నెఱుంగము. సమారూఢ యౌవనుండయిన మంత్రికుమారుండు నన్ను బరిణయంబు చేసికొనవలయునను తనయభిప్రాయంబు తనజననీజనకులకెఱింగించిన వారును సంతసించి నాతల్లిదండ్రులనడిగిరి. వారు నందుకొడంబడిరి. పెండ్లిపనులు సేయుయత్నించుచుండ నీభూపాలుండు పలువిధ

ములగు నిర్బంధములచేతను రాజ్యప్రదానంబుచేతను నాతండ్రినివంచించి నన్నుం బరిణయంబుచేసికొనియె. నాకు మతిమంతునందె యుల్లంబు పల్లవించుచున్నయది. ఏమి సేయవచ్చు.

చ. మదనునిగుమ్మితూపులనలుమాటికిమర్మములంటఁబాఱినన్
వదలనికోరికల్ మొలిచివర్ధిలి డెందమునందుఁ గ్రిందినన్
హృదయము రాయిచేసికొని యింపుఁదలంపక యుండఁ గాఁదగున్
కదలఁదరంబె యొక్కనికిఁ గంఠముఁ జూపినకంబుకంఠికిన్.

అని చెప్పి యూరకున్న నానిపుణిక రాజపత్నింగాంచి యోదేవీ! యీసులభకార్యంబునకై యింతవంతఁ గుందనేల? ఈ విషయంబున మనంబునచ్చి యాహారంబుగూడ నిచ్చగింపక యిట్లనవరతంబును కరకలితకపోలవై యుండుట యుచితంబుగాదు. సర్వాలంకారాలంకృతవై పెనిమిటి దూరంబుననవచ్చుచుండ లేచి ప్రత్యుత్థానంబుచేసి కైదండయిచ్చి కొనితెచ్చి పీటపయిం గూరుచుండంబెట్టి పయింటచే విసరుచు మిక్కిలి మక్కువయున్నట్లు పయికిఁగనపఱచుచు నాతనిమనస్సుకెక్కఁ బ్రవర్తించుచుండుము. మగనివిషయంబున మిగుల ననురాగంబుతోఁ బ్రవర్తించు దానివలె నటించినంగాని యుపపతింగూడి సుఖించుట కనువుపడదు. ఏఁజెప్పినవిధంబునం బ్రవర్తింపుము. లేచి యాహారంబుగైకొనుము, భూషణంబులఁగై సేయుము. సుమమాల్యంబుల ముడుచుకొనుము. లీలావిలాసంబుల మెలంగుచుండుమనిన నా యతిరూపయు మనంబున సంతసంబంది యదిమొదలును సమస్తసుఖంబు లనుభవించుచు మంత్రికుమారునిపొందుకు నువ్విళులూరుచుండె.

ఇట్లుండ నొక్కనాఁడు రాజు బహుదూరంబున నుండు నొకకొండచఱియలోఁ దనపశువులు వసియించుచోట వ్యాఘ్రంబువచ్చిచేరి యాపశువుల విశసనంబుసేయుట పశుపాలకులవలనవిని తద్వ్యథార్థంబు మృగయావినోదంబు సేయందలంచి దానికిందగిన వేఁటకుక్కలంగొని యెఱుకులువెంటనే తేర పురంబు వెడలిచనియె. రాణియు నిదియ మంత్రికుమారునిం గలయుటకు సమయంబనియెంచి నిపుణికంబిలిచి యాచేటి కపరిమితములగు భూషణాంబరాదుల నొసంగి సంగతి విశదీకరింప నాచేటియు నెవ్వరు నెఱుంగకయుండఁ బురుషవేషంబు ధరించుకొనిపోయి మంత్రికుమారునికిం గార్యంబు తెఱంగెఱింగించి నీవును చేటీవేషంబుధరించి యేదేనియొక విచిత్రవస్తువు విక్రయించు దానివలె నతిరూప వసియించియుండు మేడకు సమీపంబునసంచరించుచుండుము. నేను వచ్చి నిన్ను దానియొద్దకుం గొనిపోయెదనని చెప్పి తనకార్యంబుననుండెను. సూర్యుం డస్తమించుడు మతిమంతుండు నట్లస్త్రీ వేషంబు ధరించుకొని మిగులమనోహరములగు

నల్లపూసలపేరు లమ్ముకొనుచు నాయతిరూప యుండు సౌధంపుసమీపంబున నిట్టి నటుతిరుగుచుండ నా మాయాకాంతం గాంచి దానిచమత్కారపువచనంబుల కచ్చెరువు పడుచు రక్షకభటులు పిలిచిపిలిచి మాటలాడుచుఁ బరిహసించుచుఁ గనుగీటుచు సన్న సైగలు సేయుచు మెలంగుచుండ నాసఖియోతెంగి నిపుణిక యేతెంచి యో యెఱుకల దానా! నీయొద్దమంచినల్లపూసలున్నవా? ఉండెనేని మా రాణిగారు విలువకొందురట, ఈదినంబున నీ యదృష్టంబు పండెనని చెప్పఁగా మంత్రికుమారుండును "మంచిపూస లున్నవి. ఈనగరంబున నుండెడివారెల్ల ధనరాసులిచ్చి యీనల్లపూసలుకొని యున్నారు. విచారింపుమని రాణిగారితో మనవిచేకొనుము. ఉత్తరువయ్యెనేని యేన యంతఃపురంబులోనికివచ్చి విన్నవించుకొనియెద" ననఁగా నిపుణికయు నట్లకాని మ్మని లోనికింజని యతివేగంబునవచ్చి యామంత్రికుమారునిందోడ్కొని యంతఃపురంబు లోనికింజని రాణియుండుపడకటిల్లుదరిసి రాణికత్తెలంగౌఁగిలించిన నామెయు నంతకు మున్నె తనపనికత్తెల కందఱకు రాజుగారు లేకుండుటచేఁ బనియేమిలేదుగాన మీరు మీయిండ్లకుంజనుఁడని సెలవిచ్చి వారినంబంపి యేకాకినియై మంత్రికుమారునిరాక కెదురుచూచుచున్నది గాన తటాలునలేచివచ్చి మంత్రికుమారుని పేరురంబుపై వ్రాలి మోవినొక్కి కులుకుంగుబ్బ లురంబుగాడ నాలింగనంబుచేసికొని లోపలికింగొని చని శయనంబుపయింజేరిచి "యోచిన్నసామీ! నిన్నుంగాంచి యెన్నిదినంబులయ్యె, పున్నమ నాటికళానిధి నెడబాసిన కలువలకొలనిచందంబున విన్నదనంబున కాకరంబై యుంటి. ఇన్నిదినంబులకు బేదకుం బెన్నిధిదొరకినచందంబునం దొరకితివి. నిన్ను నెన్ని తెఱంగుల బతిమాలుకొంటి. కన్నెతికంబునంజేసిన చిన్నె లెప్పటికైన నాకు మరపురావు" అని చెప్పుచు మణిమయకనకకంకణ ఝణాత్కారముఖరంబుగం దనహస్తంబున నాతని కొప్పువట్టి మోవిపానకంబులానుచుం జెక్కిలిగొట్టుచు చుబుకంబుముద్దుగొనుచు నోరీ ధూర్తశిఖామణీ! నీవు బహుదినంబులుగ నాకుందక్కకుండి దైవవశంబుగ నీదినంబున నాచేతంజిక్కితివి. నిన్నూరక విడిచిపెట్టుదునా? పెక్కుదినంబులనుండి నెక్కొనుచున్న మక్కువ నొక్కదినంబున నైనందీర్చుకొనకపోవుదునా. నాకోమలమగుమీరుకోడెమిటారి గబ్బిచనుగుబ్బలనీయురంబు గ్రుమ్మి ధైర్యకంచుకంబు సించకమానుదునా? సగ్గనితమిం బిగ్గగవుంగలించి నిగ్గులుదేఱురుటంపుఁబెందొడలనదుముచు నగ్గలమగు మోహాతిరేకంబు మీఱి దిగ్గునంజేరి మగపోడిమింగూడిపీడక పొన్నబోదియకుంజుట్టుకొన్న చిన్నికన్నెతే మావితీవియ యనువునం బెనంగి యనంగసంగరక్రీడలనిన్నలయింపక విడుతునా? నీ నును మోవిఁగొఱికిగంటులు సేయక మోహాంబుధింగడతునా? పద్మాకుమారతంత్రపారీణుండ వగు నినుంగలసియలసిసొలసి పలుతెఱంగుల వేడి పునారతిం బలువన్నెలుచూపి పున్నమ చందురునకుంగలుగునందనపుచంద్రకాంతమణిమాలిక యనువున నురంబున వ్రాలి శరీ

రంబులొక్కటియై యుష్ణావుటంపజడకింబడలి యొడలెఱుంగక జడనుపడి వడిమిగులనడుమ
నడుమ వినోదంబులుసూపుచు నీరేయియెల్ల నడపక విడుతునా? యని యనేకవిధంబు
లుగఁ బలుకుచుం దనియక మగచెయ్వుల కుపక్రమించి యెదురెక్కిసొక్కి చిక్కని
గుబ్బల నురంబునం గ్రుమ్మి యబ్బినచోటుల నిబ్బరంపుఁదమి ముద్దులుగొనుచు నబ్బురంపు
విలాసంబులుగుల్క నాకుమారుండును వలపుమించి యెదురప్పళించి నునుమోవి
గంటులు వడనొక్కి యొక్కయనువున నీవిసడల్చి పృథులతరనితంబబింబసంక్రాంతమణి
కాంచికావిధృతంబగు దుకూలంబును బొటనవ్రేల వీడిచివైచి మదనమందిరద్వార
నిర్మితకనకరంభాస్తంభంబులో యనందగు నూరుకాండంబులం గిలిగింతలొనరించి
తొడలందొడలతో మెలిచివలచి పుంభావసంభోగసౌఖ్యంబు ననుభవించుచుండె.
నిపుణికయు నాయింటివాకిటం గావలియుండె. వేటకుపోయియున్న రాజును ఊరు
దాటఁగానే మార్గమధ్యంబునన యొక పొదరింటిలోనుండి గాండ్రించుచు నొక నవ
సూతికయగు లేడింజంప నెగుఱుచున్న పులినిం దనపశువులంజంపినదానిఁగా నెఱుకుల
వలనవిని తత్క్షణంబున బాణసంధానం బొనరించి యొకనారసంబున గాడనేయ నా
వ్యాఘ్రంబును భూమిపయింబడి ప్రాణంబులువిడిచె. రాజును శార్దూలచరణాక్రాంత
యైన యా లేడి యమునాతరంగపరంపరలు వెల్లికొని ప్రవహించిన ట్లతి వినీలంబు
లగు తమాలగాంతారంపుఁ గాంతులం గొల్లలాడు బెదురుచూపుల నా వనంబునంత
యుం గువలయవనంబుగ గిరిదోఁచునట్లొనరింప నది తనమనంబున కతిమనోహరంబై
యుండినది గాన నా యాఁడుజింకంబట్టి తెప్పించి దానిసోగ కన్నుల సౌందర్యంబుఁ
గాంచి యతిరూపయొక్క వాలుగన్నులందలంచి మోహంబతిశయించి తక్కిన వారి
నిం బిరుందరానియమించి యంచితరయంబున గంధవాహబాంధవంబగు సైంధవంబు
నెక్కి కదలి యొక్కగడియలోపలం దన నగరునకువచ్చి పన్నీటం జలకంబులాడి
యభ్యవహారంబులందీర్చి యతిరూపాగతంబైన మనంబుతో నా రామామణిశయన
గృహంబగు నంతఃపురచంద్రశాలకుం దరియవచ్చుచుండెను. ఇతం డిచ్చటవచ్చు
చుండునప్పుడు రాజుతోఁ జనియున్నసైన్యం బూరికిసమీపంబునం గోలాహలముఖరి
తంబై యేతెంచుచుండుటంజేసి దుందుభివాద్యధ్వనులు నగరంబువెలుపల వినంబడుట
వలన రాజానక్కడనయున్నవాఁడనియెంచి యెల్లవారు నేమఱియుండిరి, ద్వారపాల
కులును ససంభ్రమంబుగ లేచి తాముజాగ్రతమాలియున్న యపరాధంబు మనంబున
నుద్వేగంబుఁగల్పింప జోహారుచేసిరి. విజయసేనుండు నతిరూపానేత్రసౌందర్య
సమాకృష్టహృదయుండగుటంజేసి యా ద్వారపాలకుల చర్యలనేమియుం బాటింపక
చంద్రశాలసోపానంబులెక్కుచుండగా నిపుణిక యాతనింగాంచి తత్తఱపడుచు
కార్యంబుమించినదని యెంచి తనమనంబున "నీరాణి నన్నునమ్మి గదా యిట్టిసాహసం

బున కొడిగట్టె. ఇపుడు ననుండొట్టి యుట్టిపడినయిట్టి యీకష్టదశ నాకెంతతప్పించు కొనుట యెట్లు. ఏనిప్పుడుపేక్షించియుంటినేని యానందాంబుధిం దేలుచు మైమఱచి యుండునతిరూపామతిమంతులగతి యేమైమునిగియుఁ? నమ్మియున్నవారి యుమ్మలికంబు దప్పించిసొమ్ములుగడించుట చేటీజనములకుం దగవుగాని నెమ్మదిం గమ్మవిలుకానిసంగరమ్మున దేహమ్ముమరచిసొమ్మసిలియున్న కొమ్మను వజ్రపాతకఠినమ్మగు నసిధారాపాతంబునకుఁ బట్టిత్రోయుటచెట్టిదనంబుగాదె! ఎట్లు ప్రవర్తింపనగు? ఎట్టులీపట్టుపురాణిం దగులుకొనియుండు మంత్రిపట్టికి జగజెట్టిరాక బట్టబయలు సేతు. అనిచింతించి తత్తఱపడుచు నిటునటుఁ జూచుచు సమీపించియున్న యొకవాపికయందు భ్రమరము తామరలోదొరకికొనియుత్తలపడుటం గాంచి సమయోచితంబుఁదలంచి బుద్ధికొలఁది బ్రవర్తించినంబిదప బ్రహ్మవ్రాసిన వ్రాఁతప్రకారంబు జరుగునని యూహించి రాజుం గాంచనిదానివలె నిల్చినియె.

ఉ. మాయురె భృంగమా వికచమల్లియల న్విడనాడి తమ్మిలో
నీయెడఁ బువ్వుఁదేనియలనింపుజనింపఁగఁ గ్రోలిసొక్కియుం
బోయెదనన్న భ్రాంతిమదిఁబొందదు రాజుదయించె నిప్పుడీ
తోయజపత్త్రముల్ వరుసతో ముకుళించెఁ జలింపకుండుమీ.

[రాణితోఁగూడి రతిలీలలం దేలుచున్న మంత్రికుమారుని రాజువచ్చుచున్నాఁడని సూచింపఁజేయుటకు నిపుణిక మగతుమ్మెదనుగుఱించి తెల్పుచున్నట్లు విన్ననువు దోప నెఱింగించుచున్నది. ప్రస్తుతమగు భృంగవృత్తాంతముచేతఁ బ్రస్తుతంబయియున్న రాజాగమనంబు సూచింపంబడుటవలన ప్రస్తుతాంకురాలంకారము. మాయురె, ఇది యవ్యయము. భళిరాయని యర్థము.

భళిరా! యోభృంగమా! మనోహరములయిన యుపవనంబులందు వికసించి యే విధమగు నిర్బంధములేక భవదుపభోగార్హంబులై వెలయుమల్లితీఁగెలను బాసి యతి నిర్బంధసంబాధంబగు నీవాపికయందలి తామరపువ్వునంగలుగు పూదేనియలం గ్రోల నేతెంచి పరితృప్తిజనియించునట్లు తదాస్వాదనంబునొనరించి యాకైపు తలకెక్కి మైమరచియున్న నీకు 'మీఁదటం గలుగు చంద్రోదయంబునం గమలిని మొగడిన నందులోఁ జిక్కుకొందును. ఇంతటితోఁ జాలును. మెల్లగ బయలువెడలిపోయెద. అను భ్రమములేక పోయెను. ఇట్లు నీవు దేహము తెలియక పడియుండఁగాఁ జంద్రుఁడుదయించె. ఈతామర ఱేకులును గ్రమంబుగ ముకుళించుచున్నవి. కనుక నిప్పుడు తప్పించుకొనిపోయెదనన్న తలంపువలదు. అట్లు చేసితివేని నీ ఱెక్కలువిరిగిపోవును. మెల్లగఁదప్పించుకొన్నను

సమీపపుబావిలో వినిపాతంబును సంభవించును. గనుక చలింపకయుండుము. అని భృంగపరమైన యర్థము. ఓమంత్రికుమారుఁడా! నీ సాహసమే మెచ్చఁదగినది. నీవు మనోహరాంగులై పుష్పవతులైన నిండుజవ్వనులు నీయింట ననవరతం బనుభవించినను తృప్తిజెందనివాడు పెక్కండ్రుండియు వారివదలి యీయతిసంకటస్థలంబగు రాచనగరులోనికివచ్చి యీరామామణితోఁగూడి రతివినోదసుఖంబు లనుభవించి సురతశ్రమంబున సోలిసొక్కియు నింతటితోనైనను వెడలిపోయెదనన్న భ్రమ కలుగకపోయియుంటివి. రాజు వచ్చుచున్నవాఁడు. ఇతండు మిమ్ముంగాంచెనేని యీరాణికిని నీకును ప్రమాదంబుసంఘటిల్లు. ఇప్పుడు తప్పించుకొనిపోవలయునను ప్రయత్నముఁ బూనుకొనుము. అట్లొనరించితివేని రాజుకంటంబడుదువు. కొననొకచోటనొదిగి సవ్వడి తెలియనీకయుండుము. అని మంత్రికుమారునికిం బోధింపఁబడు నర్థము.]

అనిచెప్పఁగా నంతలో సమీపంబునకువచ్చిన రాజు ఓ నిపుణికా! నీవుచెప్పిన పద్యంబునకు విషయం బేదియనియడిగిన నాచేటియు దేవరా! యిక్కడనిలిచి యింతికు సమీపంబుననుండు నడబావిలో వికసించిన తామరపువ్వునందు చిక్కుకొని పెక్కు గతుల దిక్కుతెలియక వెతలందఁ కొక్కెను మగతుమ్మెదం గాంచుమని మనవిసేయ నది పరీక్షించిచూచుచు నొకింతసేపు నిలిచి కనుంగొని యాసంగతి పద్యరూపంబుగఁ జెప్పినందుకై దానికొకకంఠాభరణంబు బహుమతిచేసి యంతఃపురచంద్రశాలకుం జేరరాఁగా నంతలో లోపలనుండువారు నిపుణికావచనంబులంగలత్తఱపాటువలననే దానిపద్యంబున కర్థాంతరంబు గలదని నిశ్చయించిరి. రాజువచ్చుటయెఱిఁగి చేయునది యిదియని తోఁచమి యేలయీభూపాలుని ద్రోహంబుసేయంబూనితి. ఇఁక నేదిదిక్కు నాకొఱకీ కాంతాతిలకంబునకుం గష్టంబుప్రాప్తించెఁగదాయని యనుకొనుచు శయనంబుడిగ్గి సంభ్రమించు మంత్రికుమారుని వెన్నుచఱచి భయపడకుండుమనిచెప్పి యా యతి రూపతనమంచంబు క్రిందనున్న పట్టుపఱుపులో నాతనిం బెట్టిచుట్టి యొకయోరం బెట్టి రాజును వాకిటికివచ్చునంతలో వచ్చితలుపుతీసి యెదురునడిచికైదండయిచ్చి కొంపోయి మంచంబునం గూరుచుండం బెట్టి కపటంపు ననురాగంబుతో నధికమోహంబు గలిగినట్లు మెలంగుచుండె. రాజును ఓకాంతాతిలకమా! నీవుమంగళులచక్కనొత్తకయుం గంధోదకంబుల స్నానంబుసేయకయు పూలుదుఱుముకొనకయు నుండుటకు గతంబేమి యనియడిగిన రాణి ప్రాణవల్లభా! భర్త యింటలేనివేళ నలంకారము సేసికొనుట పతివ్రతలకుం జెల్లునా? మీరలీరేయి నగరిబహిస్థలంబునన విడిసియుందురని దాసీజనంబులు సెప్ప వారినిండ్లకనిచి యేనొంటిగ నిందుండెదను. నాకు భవద్విరహంబునందు ప్రియసఖులపల్కులును ముల్కులక్రియం జెవులంగాఁటియం బెట్టునని యిట్లనేకవిధములగు సరసాలాపంబుల నతనిమనంబు నలరింప నావిజ౹ సేనుండునమ్మి యతిరూపయుందుఁ

ప్రేమపరవశుండై లాలించి కేలుకేలంగీలించి శయ్యాక్షోణిందార్చిన నామకోమలాంగియు ననేకవిధంబులగు రతిభేదంబులం దనచమత్కారంబు నూపి నాయకుని సమరతిం దేలించి యుపరతిసోలించుచుండ నామంచంబునడుగున పలుపులోఁదగులుకొని కాలు సేతులు గదలింపలేక యపరిమితసంకటంబులనుభవించుచు నందలి చీమలు మొదలగు జంతువు లాడలుగరువ సుకుమారశరీరుండు నింతదనుక యిట్టిట్టిడంపుఁజెయ్వులం దగులుకొన్నవాఁడును గాఁడుగాన సీత్కారంబుగలుపుచు సంపూర్ణమనోరథుండుగామి నాదంపతుల చెయ్వులందలంచుకొనుచు మదనవేదనందాళంజాలక నుసులుచున్నదని రాజుహృదయంబున కవగతంబగు నేమోయని యతిరూపతనముగఁదుమొనపంటమోవి నొక్కఁబోవుడు నధికసీత్కారంబులొనరించుచును గంకణఝణాత్కారముఖరం బుగ హస్తకమలంబులు విదిలించుచు నతివిదగ్ధయై ప్రవర్తింప నదిగని వాకిటనున్న నిపుణిక చాతుర్యంబు మెఱయ నిట్లనియె.

చ. అళికులవర్యపద్మముకుళాంతరమందుననిమ్ముచాలకీ
చలనమునొంద నేలనవసారసమిత్రుఁడు రాకయుండు నే
తొలఁగకయుండెయుండుమిఁకతోయజవైరితిరంబె రాత్రియీ
కలవరమేలతమ్మితుదఁగానకఁ దూరకయూరకుండుమీ.

[తొలుతటి పద్యమువలె నిందును భృంగవృత్తాంతముచేత మంత్రికుమారుని వృత్తాంతంబు సూచింపంబడుచున్నది.

ఓభ్రమరకులోత్తంసమా! తామరమొగ్గలోన నడుమఁచోటుచాలదని సంచలించుచున్నావిదియేలా? బాలసూర్యుఁడుదయించి రాకయుండునా యేమి? తప్పకవచ్చును. ఇప్పుడాకమలమునుదాఁటిరాక దానియందయుండుము. ఇఁకనీచందమామ యీరాత్రి యంతయుస్థిరమా? వేగిరంబయు స్తమించువాఁడేకదా? ఈ భ్రమ నీకేలా? ఈతామర పువ్వుకొనగానఁగవలయునని యెంచి యద్దాని దళములలో చిక్కుకొని ప్రాణములు పోగొట్టుకొనక యున్నచోటన కదలకయుండుమీ. అని భృంగపరమైనయర్థము.

ఓమంత్రికుమారుఁడా! పట్టుపలుపులో చోటు ఇఱుకటముగానున్నదని సంచలించుచున్నావు. ఇదియేలా? ఇంకసూర్యోదయముకాదా? ఇప్పుడుకొంచెమోర్చుకొని దానిలోపలన యుండుము. ఈరాజచంద్రుఁడు ఇక్కడనయుండునా? యీరాత్రి వేఁగానే లేచిపోఁడా? నీకేలయింకకలవరము. ఇదివిడిచి యేవిధముగానైన తప్పించుకొనిపోవలయునన్న ప్రయత్నం బిప్పుడు మానుకొని యణఁగియుండుము. సమయము వచ్చినప్పుడు పోవచ్చును. అని మంత్రికుమారునికిం దెలిపిన యర్థము.]

అని చెప్పఁగా నదిగ్రహించుకొని మంత్రికుమారుం డూరక యణఁగియుండెను. రాజును రాణియు మనోహరములగు సురతలీలావినోదంబులు గాంచుచుండిరి. ఇట్లుండ సుమతియొక్క భార్య సూర్యుఁడస్తమించియుఁ దనమనోహరుండింటికిరామి నొం డేమి యుందోచక రాజుతోఁడ తనభర్త వేఁటకుఁబోలేదని యెఱింగియున్నదిగాన నితర స్థలంబున కేమికారణంబున నీతం డఱిగియున్నాఁడోయని విచారించి యతినిపుణలగు సకియలంబిలిచి విచారింపనందుఁ దరళిక యనునది "రాజు వేఁటకుఁబోయిన వెనుక సుమతి యెక్కడనుండునదియు నెఱుంగంబడదు. అతనిపోలికగల యెఱుకతెమాత్రము నల్ల పూసలమ్ముకొనుచు వీథివెంటం బోవుచుండుటఁ గాంచితిమి. దానిమాటలు నీమగని మాటలతీరుననే యున్నవి. మొగంబు నతని ప్రతిబింబము పగిదిఁదోచెను. స్త్రీవేషము లేనియెడల మనసుమతియేయనవచ్చును. ఆయెఱుకత క్రమక్రమంబుగ రాచనగరుచేరి యతిరూపయుండు చంద్రశాలకు సమీపంబుననుండ నిపుణిక యేతెంచి దానిం బిలుచు కొనిపోయె. ఇదియేమో కపటంబని యెంచి యేనును సంగతి యరయుటకు నారాణి వసియించుచంద్రశాలకుఁ దరిసినయొకలతానికుంజంబుమాటునం డాగి యుండఁగా నతిత్వరితగతి రాజును వచ్చి యాచంద్రశాలసౌధం బెక్కుచుండునప్పుడు నిపుణిక సంభ్రమముగ నొకపద్యంబు నుడివె. ఇంతదనుక నాయెఱుకత చంద్రశాల విడలివచ్చినది కాదు. మఱికొంతతడవున కానిపుణికయే మఱియొండు పద్యంబు చెప్పినయది. ఆపద్యం బుల భావంబుగనుఁగొనఁ బరకాంతారతునికిం జాగ్రతపడియుండుమని హెచ్చరికచేసిన ట్లవగతంబగుచున్నయది. మనసుమతియు నతిరూపయందాసక్తికలవాఁడని యెల్లవారు నెఱుంగుదురు. ఆతం డిప్పు డంతఃపురంబునం బ్రవేశించెనని తోఁచెడిని. రాజు నక్కడికి వచ్చియున్నవాఁడు ఇప్పుడిందుకేమి సేయునగును. ఏమియనర్థంబు సంభవించునో" యని చెప్పఁగా మంత్రిభార్యయుఁ దత్తఱపడుచు నయ్యో నామగనికి నేఁడు ప్రాణంబులు దక్కుట నిక్కంబుగాదు. ఈయుక్కివం బెఱింగనేని రాజు నెక్కొనురోషావేశం బున నాప్రాణనాయకుని మొక్క చెఱచక మానునా. ఇంకగతియెద్దియని ప్రలపిం చుచు నొడలెఱుంగక పుడమిపయింబడి బుడిబుడిపొరలిజడనువడి యుస్సురుమంచు నిట్టూర్పులు నిగుడ్చుచు ననాథగతి విలపింపఁ దరళికయు నాయతివ నాశ్వాసించి యోయమ్మ యిప్పుడు సంకటంబునకుం బ్రతివిధేయం బెఱుంగక యిట్లుదుఃఖించుటవలన నేమిఫలంబు నిపుణిక సమీపంబుననున్నదిగాన మఱేమియు ననిష్టంబు చేకూరదు. అది యతిచతురలగుదూతికలలోనగ్రణి. మతిమంతుండు నన్వర్థనామంబుగలవాఁడు గాని వట్టివాఁడుకాఁడు. అతిరూపయో తనప్రాణంబులైన విడిచి యాతనిం గాపాడును గాని పరిత్యజింపదు. రాజును మృగయాపరిశ్రాంతుండై వచ్చియున్నవాఁడుగాన వేగి రంబ నిద్రించు. అయినను మనస్సు నిల్పనోపవేని చేటీవేషంబు ధరియించుకొని నాతోఁ

గూడరమ్ము. నిపుణికాముఖంబున సంగతులరయుదమనుచుం జెప్ప నొప్పుకొని యా యొప్పులకుప్ప చేటీవేషంబుతో నంతిపురంబు వెడలి శరళికాద్వితీయయై యా యతి రూపయుండు చంద్రశాలకుం దఱిసివచ్చుచుండ నిపుణిక వారిపాదంబుల యందెల నులివువిని మంత్రిభార్యగా నెఱింగి తనమనంబున "నీ యింతి తనకాంతుని వృత్తాంతంబు విని ఘనంబయినయతిశంకచేత [నేమియుఁదోచక] యేతెంచుచున్నది" యని యెఱింగి యిట్లనియె.

మ. అళినీ తత్తర మేలనియ్యెడను నీ యాత్మేశుఁ డౌభృంగముల్
జలజాతస్మరందపానవశుఁడై సానందుఁడై యున్నవాఁ
డులుకింతేనియు లేదు నీ వరుగుమీ యొప్పారఁగా వేడ్కనీ
చెలువుండుంబఱ తెంచు వేసవనరాజీనంబు పుష్పించినన్.

[దీనికి భృంగాంగన పరమైనయర్థ మొకటియు మంత్రిభార్య పరముగునర్థం బొక్కటియుఁ గలదు.

ఓ యాఁడుతుమ్మెదా! యేల యింత తత్తఱపాటుం జెందెదవు. నీయొక్క ప్రాణనాయకుఁడైనభృంగ మిప్పుడిచ్చోటం గమలమునందలి మకరందమును పానము చేయుటయం దాసక్తుఁడై యొడలెఱుఁగక యానందముం బొందియున్నవాఁడు. అతనికి భయమేమియును లేదు. వేడుకతోఁగూడ నీవుపొమ్ము. నీ నాయకుఁడును వేసవనఁ దామరపువ్వు వికసింపఁగానే నీదగ్గఱకే తెంచును. అని భృంగాంగనాపరముగునర్థము.

ఓ యాఁడుదానా! యింత తత్తఱపాటుకూడునా నీకు? ఓ నాప్రియసఖీ! నీ ప్రాణనాయకుండగు సుమతి యతిరూపతో రతిసుఖంబులం దేలి మైమఱచి నిద్రం జెందియున్నవాఁడు. నీమగని కొక్కభయంబును లేదు. నీవు నీచోటికేఁగుము. తెల్లవారినవెనుక నీ ప్రాణనాయకుఁడు తామరలు పూచిన యనంతరము నీయొద్ద కేతెంచును. అని యిది మంత్రిభార్యాపరమైనయర్థము.]

అని చెప్పిన నిపుణికావచనంబువలన మంత్రిభార్యయుఁ దనమగని క్షేమంబు తెలిసికొని యూరటం జెంది కొంచెము సేపటునిటుసంచరించి తనయింటికిం జనియెను. లీలాసౌధంబునందు రాజు తనపత్నితో ననేకవిధంబులగు రతులం దేలి మృగయాపరిశ్రాంతుండై యుండుటం జేసి కొంతతడవునకు నిద్రఁగూరెను. అప్పుడు నిపుణికయు నిదియ మతిమంతునిఁ దప్పించుట కదనని యెఱింగి యిట్లనియె.

మ. సితమై రాతిరి తెల్లవారఁగనువచ్చెం జంద్రు యీకేళికా
యతనంబందు రతిశ్రమన్విభుఁడు నిద్రాసక్తుఁడై నాఁడు నీ
శతపత్రేక్షణ మోమువంచెదు భవచ్చాతుర్యముం జూపి నీ
పతి వేగంబున నేఁగుమా తొలఁగి మాయాత్మల్ సుఖంబందెడిన్.

[ఇందుఁ జంద్రపరమైన యర్థము మంత్రికుమారుని విషయమగు నర్థమును జెప్పవలయు. ఓచంద్రుఁడా! రాత్రిముగిసి తెల్లవారవచ్చెను. మారాజు కేళీగృహంబునందు రాణితోఁ గ్రీడించి యాశ్రమంబుచే నిదురఁగూరుచున్నవాఁడు. ఈతామరరేకులవంటి కన్నులుగల యతిరూపయు మొగము వాల్చినది. నీచాతుర్యంబు దెలియునట్లు వారి కెఱుకపడక తొలఁగి యతివేగంబునం బొమ్ము. మా ప్రాణంబులు సుఖమున నుండును. అని చంద్రునింజూచి చెప్పినది.

ఓ మంత్రికుమారకా! రాత్రిముగిసి తెల్లవారవచ్చెను. రాజు రతిశ్రమచేత నిద్రబోవుచున్నాఁడు. రాణియు రతిశ్రమచే నిన్నుమఱచి మొగమువంచి యించించుకనిదురగూరుచున్నది. ఇతరుల కెవ్వరికిని దెలియకుండ నీ యుపాయంబుదోఁప వేగిరంబ వెడలిపొమ్ము. మనంబున నులుకుమాని మేము కొంచెముసేపు సుఖంబుగ నుండెదము. అని మంత్రికుమారుని పరమైనయర్థము.]

అనిచెప్పఁగా మంత్రికుమారుండువిని సమయంబెఱింగిన వాఁడుగాన తటాలున నాపఱుపుతోసికొని మంచముక్రిందనుండివచ్చి యించించుకవీడుచున్న చీకటులలో నెవ్వరికిందెలియక మెల్లమెల్లన నాయిలువాసి తనయింటికిం జనియె. ద్వారపాలకులును చీకటిచే నిరూపించిచూడలేక రాజకుమారుండని యనుకొని యూరకుండిరి. మఱి యొకింతసేపటికి సూర్యుండు నుదయించు సమయంబయ్యె. వైతాళికులు స్తుతించిరి. వీణావేణుమృదంగతాళాది వాద్యంబులుమ్రోసె. అప్పుడు రాజు మేలుకొని యా యతిరూపయుండు చంద్రశాలడిగ్గి తనయింటికేతెంచి సాంధ్యకృత్యంబులుదీర్చి సభాస్థలంబు నలంకరించెను. పౌరులును ప్రధానులును వచ్చిచేరిరి. సుమతియు రాత్రియంతయు నిదురలేనివాఁడగుటంజేసి యింటికేతెంచి యించుకసేపు నిదురించిలేచి సాంధ్యకార్యములుతీర్చికొనుచుండఁగా రాజభటులువచ్చి జోహారుచేసి యో దేవా! రాజుగారు కొలువుదీరి బహుకాలంబయ్యె. తమరు సభాస్థలంబునకు రామికిం గతంబుదెలిసికొని వేగిరంబవచ్చునట్లుగఁ జెప్పుఁడని రాజుగారుచెప్పిపంపిరి. అనివిన్నవింపఁగా సుమతియుఁ గొంచెము దేహముకుదురులేదుగానఁ దామసించితిని. ఇదిదొరవారితో మనవిసేయుఁడనిచెప్పి రాజభటులంబంపి తానును సంధ్యావందనాదులుదీర్చుకొని యతివేగంబునం బాదచారియై యా యతిరూపవసియించు చంద్రశాలకుం దిగువనుండెడు త్రోవగా రాజసభకేఁగుచుండెను. మంత్రికుమారుఁడు వచ్చుచున్నాఁడనియెఱింగి యతిరూప మేడపైకివచ్చి యతనింగాంచి రిచ్చవడినిలిచి యేమియుంబలుకనేరక గుండెలు మోదుకొనుచుం జేతులు పిసికికొనుచు, భయసంభ్రమంబులం గాళ్లువడవడవడంకఁ బెనుగాలిలోఁదగులుకొన్న చిన్నపూదీవియచందంబున సొంపుచెడి యిలపయిఁ వ్రాలుచుఁ దూలుచు సోలుచు రాత్రినిపుణికాధర్మంబునం దప్పించుకొంటిని. ఇప్పుడెట్లు తప్పించు

కొనఁగు. ఏమిసేతునని విలపించుచు శయనంబుపైఁబడి మూర్ఛవోయిన నిపుణికయు సమీపంబునకరిగి యోయమ్మా! యిట్టియుమ్మలికంబుపడుట నీకేలా? సంగతి తెలిపితివేని యందుకుంజేయవలసిన కార్యంబు సేయుదము. శీఘ్రంబుగఁ బ్రతివిధేయంబగు కార్యంబున దూరచింతసేయుచు నూరకుండి కార్యంబుమించినవెనుక తత్తఱపడుట యుత్తమకాంతలగుణంబుగాదు. వేగిరంబ తెలిపితివేని నాబుద్ధికొలందిని ప్రవర్తింపంగలదానను. అనిచెప్పఁగా నతిరూపయు నాశ్వాసంబునొంది లేచి కూరుచుండి యోప్రియసఖీ! రాత్రి జరిగినప్రమాదంబునకు నీవుగాక యితరులు మమ్ముందప్పింపంగలరా? ఇట్లన్యాపదేశంబుగ జెప్పి యొప్పింపఁగలరా? నీవంటిబుద్ధిమంతురాలు పదునాలుగులోకంబులనైన లేదనవచ్చును. ఇప్పుడాకస్మికంబుగ నొక్కకష్టము సంభవించినది. అందు మేమిరువురము నుమరణమునొందుట తప్పదని నిశ్చయించుకొంటిని. ఇందు నీకుం బ్రతివిధేయంబుండదనియెంతు. అయినను జెప్పెదను. నిన్నరాతిరి యావన్నెకాఁడు నన్నుంగూడి విన్నను వుతో సమరతిసల్పుచుండునప్పుడు నేను వానిరతిచతురతకు మెచ్చి విచ్చలవిడియొడలు బంగారముచూరలిచ్చి మచ్చికమెయి నాగళంబుననున్న యనర్ఘంబగు నవరత్నహారంబామతిమంతునికిం గంఠాభరణంబుచేసి తదీయసౌందర్యంబు సేయ సానందంబుగఁ జూడ నా మోహనాంగుండు చిఱునవ్వుతో నాచనుమొనలంటి గిలిగింతలుచేసి కళలు గరగించిన నేనును సొక్కి యక్కాంతుంగౌఁగలించి మైమరచితి. అట్టిసమయంబున రాజు రాక యెఱింగించితివి. మేమిరువురమును తత్తఱపాటుతో నేమియుందోఁచక ప్రవర్తించితిమి. పిదప వాఁడెప్పుడీయిల్లువెడలిపోయెనో యెఱుంగను. ఇప్పుడాతఁడింటి నుండి రాజసభకేఁగుచుండం జూచితి. ఇదియతిప్రేమచేత రాజు నాకుంజేయించియిచ్చిన యమూల్యహారము, ఇట్టిది యీయూరఁగాని యీదేశంబునంగాని లేదు. ఇదిధరించుకొని యున్న మతిమంతునింగాంచెనేని రాజుమతియెందు విచారింపక వానిని నన్నును శిరఃకర్తనంబు సేయకమానఁడు. అది యతనియురంబునం జెలుఁగువలువ లోపలనుండుటం గని నాకంఠంబుంగాంచుకొని దైవమువంచించెనే యయ్యోయని సంచలితధైర్యనై యేమియుసేయునదిలేక యుండెదను. ఇప్పుడు పాలముంచినను నీటముంచినను నీవేకి "స్థానేప్రాణాః కామినాందూత్యధీనాః" అన్నట్లు మాప్రాణములు నీయధీనములని చెప్పి విన్నదనంబున వేఁడికొనఁగా నానిపుణికయు దేవీ! యింతమాత్రంబునకే యిట్లుచింతించవలయునా? ఏఁబోయి యానవరత్నహారంబుందెచ్చి నీకిడెయిచ్చెద, పోయివచ్చెదనని యా యతిరూపనువీడ్కొని యతిత్వరితగతింజని తానొకభట్రాజువేషంబు ధరియించుకొని సభాద్వారంబునకుఁబోయి రాజుకు సంగతి భటులవలన నెఱింగించి యనేకదేశంబులుచుట్టిచూచి పలుగురుదేశవిభులయొద్ద బహుమానంబులందినభట్టుగాఁ దన్నుం జెప్పుండని వారల వేఁడుకొని వారలునట్లు సేయుడు రాజు నెదుటికేంజని యానిపుణిక యిట్లనియె.

చ. అతులసభాంతరస్థితబుధావళికెల్ల జోహారు వీరరా
హుతులకిదె జోహారు సతతోజ్జ్వలులై తగుసార్వభౌమ సం
తతికినిదె జోహారు వసుధాపతిసేవితుఁడైన యట్టి భూ
పతికి జోహారు మానపరిపాల జోహారు ప్రధానశేఖరా.

[ఈపద్యంబునం బండిత క్రమంబుగ నెల్లవారికి జోహారుచేయుచున్నది. సభాస్థలంబుననసమానబుద్ధిచాతురీవిశేషంబున నొప్పుచుండు పండితులవరుసలకు నిదేయొక నమస్కారంబుఁగావింతు. పిదపలగు సుబ్బపురోహితులకు నమస్కారము. ఎల్లప్పుడు వెలుంగుచున్న రాజసంతతివారి కిదియొనమస్కారము. సకలరాజులచే సేవింపంబడునట్టి రాజునకు నిదేనమస్కారము. మానమును కాపాడందగునట్టి మంత్రిసత్తమా! నీకును బరాకులేకుండ వందనములు చేయుచున్నాను.]

అని పఠియించి క్రమంబుగ వారలకు నమస్కరించుకొనుచువచ్చి తనయొద్ద నిలువంబడిన నాతనినిరూపించిచూచి నిపుణికగానెఱింగి తన్నుమానపరిపాలయని మానమును కాపాడవలసినట్లుగా వేఁడుకొనుటకుం గారణంబు తటాలున దనమనంబునం దోపనప్పుడు ముఖవికారాదు లేమియుందోపనీక యచుఁవూహించి యోభట్టూ! నిన్ను చాల మెచ్చితిని. ఈపద్యమునకు నీకేమియిచ్చినందిరదే యనిపలికి యాసనంబువిడిచి లేచి తన యంగరకాతోఁగూడఁ దనకంఠగతంబగు మణిహారంబును దనభూషణంబులును బహుమతిగ దానిగళంబునవైచి యితరవస్త్రంబులు నాభరణంబులు ధరించి సముచితప్రదేశంబునంగూరుచుండె. నిపుణికయు నచ్చోటనిలువక యతిశీఘ్రంబునఁబోయి తనయింట నా భట్రాజువేషంబు వదల్చి సాధారణయై యతిరూపయింటికేంజని మణిమాలికి నీయ నాయతివయు దానిబుద్ధిచాతుర్యంబునకును సమయోచితప్రతిభావిశేషంబునకును మెచ్చి యనేకధనంబులిచ్చి తనకుంబహిఃప్రాణంబువలె నానిపుణికయందుమచ్చికగలిగియుండె. వింటివా మదనమోహనా!యట్టి యతిచతురమతియగు దూతిక లభించినంగాక పెఱయతివతో రతింగలయుట కెంతకృతియైన వలఁతిగాఁడు.ఓరాజకుమారకా! మనకీ ప్రస్తావంబేల. ఇదిమనరాజుగారిచెవికెక్కేనేని బహువిరసంబై పరిణమించు. పరకాంతారతింగోరికాదె రావణుఁడునశియించె. అనిచెప్పఁగారాజకుమారుఁడు నౌనౌననిచెప్పి యానాటిరసికగోష్ఠిమాని యిష్టులవీడుకొల్పితనయింటసుఖనిద్రంజెందె.కొన్నిదినములు గడవ రాజు తనకుమారునికి యువరాజపట్టాభిషేకంబుసేయఁ బ్రయత్నబడుచుండెను.

మదనమోహనుం డానడిరెయెఱింగి యేకతంబ మంత్రికుమారునిం బిలిపించి యో ప్రాణసఖుఁడా! లోకమున మిత్రులన్నవారు తనస్నేహితునియొక్క మనోరథంబుల నెవ్విధంబుగనైన నెఱవేర్చుచు విపత్తులుగలిగినప్పుడు రక్షించుచు సంపదలమోదమిందుచు సర్వకాలంబును సహసంచారంబుసేయుచు హితంబు చెల్పుచుండువారుకదా!

ఓకృతబుద్ధీ! నీవుమిత్రధర్మంబుల గురుముఖముగ నెఱింగియున్నవాఁడవు. అదియునుఁ
గాక యతిచతురమతివి, నాయొక్క సుఖదుఃఖంబుల మోదఖేదంబులం బొందువాఁడవు.
ఇట్టివాఁడవుగాన నాకు నీవుహృదయాంతరంబవని నీతో నొకరహస్యంబు వచించెద.
అది కాదనక యనుమతింపవలయు. అని యిట్లు సునయాలాపములు సేయుఁ గృతబుద్ధియుఁ
దనమనంబున "నితని కేదో యొక దురాలోచనపుట్టియున్నది. ఇది నెరవేర్పనియెడల
స్నేహమునకు భంగము గలుగక మానదు. రాజకుమారులు మీఁదటియనర్థంబులు చింతిం
పక యొకకార్యంబునకుం బ్రవర్తించి ఫలప్రాప్తిలేక యనర్థంబులు సంభవించినప్పుడు
వానిఁదొలఁగించుకొనజాలకయుండఁ దన్నిర్వాహంబు మంత్రి సేయవలసియున్నది.
అది యట్లుండఁగా నుపక్రమించినకార్యంబు సేయుంజనదన్న నెల్లకాలమును రాజు
మనంబున నుమ్మలిక మానదు. పరస్పర స్నేహహీనతయుం గారణంబై వెలయు. అని
యిట్లాలోచించి రాజకుమారునితో నోచెలికాఁడా నాకుంతదూరము విశేషించి
వక్కాణింపవలయునా? నీయొక్కయిష్టంబు నాకునిష్టంబు. నీవచనంబున కన్యథా
ప్రవర్తించుట నాకునిష్టంబుగాదు. చెప్పుమన రాజకుమారుం డిట్లనియె. ఓకృత
బుద్ధీ! యిపుడు నాతండ్రి యువరాజపట్టాభిషేకంబు సేయ యత్నించియున్నవాఁడు.
రాచకొమరులు రాజ్యకార్యనియుక్తులయి నిగళబద్ధంబులయినకలభంబులభంగి నేమియు
సేయనేరక జనానురంజనము సేయుటకు వశగతులై స్వాతంత్ర్యమెడలి పరులయొక్క
సుఖదుఃఖంబుల విచారించుటతోఁ బ్రొద్దులు గడపుచుండవలయును. కాన బుద్ధిమంతుఁ
డగువాఁడు సకలదేశంబులు సంచరించి ఆయా వినోదంబులం గాంచి యేతెంచి రాజ్య
పాలనానియుక్తుఁడగుట మేలు. అట్లగు నేని యాతఁడు శత్రుమిత్రుల నరసి ప్రవర్తించు
వాఁడగు. కాన నాకీయౌవరాజ్యప్రాప్తి యగుటకుముందు సకలదేశంబులు తిరిగిచూచి
రావలయునను నిచ్ఛ జనించియున్నది. నీకభిమతంబగు నేని భవత్సహాయుండనై యిప్పని
నెఱవేర్చికొందును. అనఁగా గృతబుద్ధియు రాజకుమారునిమాటలకు సంతసించి యట్లె
యనియె. అంత నొకనాఁటిరాత్రి నడిజామున నిరువురును విశేషధనంబులు తీసికొని యతి
వేగంబునం బోవు నశ్వవరంబుల నారోహణంబుచేసి యూరువెడలి యడవిమార్గంబున
నదులును గుట్టలును మిట్టలును చెట్లును పుట్టలును దాఁటుచుం జనిచని సూర్యోదయ
సమయంబున నొకమహావనంబుఁ జేరిరి. ఇట్లు చేరి యారాజమంత్రికుమారు లాయరణ్య
మునంగల చిన్న గున్నమామిడి పైఁగూరుచుండి సన్నని యెలుంగులతోఁ గూయుచుండు
కోకిలల కలాలాపంబులకు శ్రవణంబులు సుఖంబందం జనిచని యమ్మహారణ్యమధ్యం
బునఁ ద్రాగనీళ్లులేక దప్పిగొని యాకట సొలిపోవుచుండునప్పుడు రాజకుమారుండతిసుకు
మారుండు గాన నెండకుఁ దాళలేక తలమిఁదూలియుండ నదిగాంచి కృతబుద్ధియునతని
నచ్చోట నొకవటవృక్షంబు క్రిందం గూరుచుండం బెట్టి యాచెట్టుపై కెక్కి నలుగడలుం

బరికించిచూచి యంతకుసమీపంబున జలపక్షు లనేకంబులు పైకెగయుటం గాంచి యచ్చోటం గొలనొక్కటి యున్నదనియెంచి చెట్టుదిగి వేగంబ యచ్చోటికిం జని యొక కమల పత్త్రంబును దొన్నెగాఁగల్పించికొని పానంజలంబులుగొని తొల్లింటి వట వృక్షంబుదగ్గఱకురాఁ బ్రయాణమయ్యెను. ఇట్లు ప్రయాణమై వచ్చుచుండఁగాఁ ద్రోవకు దగ్గఱనుండు నొకబూరుగుచెట్టుమీఁద రెండుచిలుకలు మనుష్యవచనంబులతో మాటలాడుకొనుచుండుటంజూచి కొంచెసేపచ్చట నిలువఁబడి వినుచుండెను. అందులో మగచిలుక తనప్రియురాలిం గాంచి యోప్రియసఖీ! మనమువచ్చిన కార్యము సఫలం బయ్యె. నింక మనపాణియొద్దకేఁగుదము. రాజపుత్త్రుండగు మదనమోహనుండు నేఁక మరణంబ్రాప్తప్రాయుండు. కాన నచ్చటంజరుగు చిత్త్రంబులంగాంచెదము వేగిరంబ పోదమురమ్ము అనిచెప్పి యాఁడుచిలుకతోఁగూడ తటాలున నాకసంబున కెగసిపోయె. అదిగని మంత్రికుమారుండు కటాకటా! మనరాజకుమారుండు మరణంబ్రాప్తప్రాయుండ యని పల్కుచు నీచిలుకలు తటాలున నెగిరిపోయె. ఈవచనంబువిని మనంబును నాతని కేమేమియనర్థంబులు గలిగెనోయని సంశయంబందుచున్నయది. ఇందుకేమి సేయునగు అనితలంచుచుఁ ద్వరితగతింజని తొల్లింటివటవృక్షంబు క్రింద నామదనమోహనుండు లేమి నధికదుఃఖార్తుండై సేయునదిలేక తనమనంబున నిట్లు వితర్కించె. ఏ నిప్పుడు మరలి నాపురంబునకుజనిన రాజపుత్త్రుం డేడీయని యాతని జననీజనకులడిగిరేని యేమి యుత్తరంబీయగలవాఁడను. ప్రాణంబులకంటె నధికుండగు నాప్రియమిత్త్రుఁడులేమి నేనెట్లుజీవింతు. ఏనొంటిగ నగరంబున కేగితినేని భూపాలకుమారునం దాసక్తులగు పౌరులు నాయందుఁగపటంబుఁదలంచి పెక్కుభంగులనాడికొనరా? ఇఁక నాకుఁగర్త వ్యంబు స్ఫురింపకున్నయది. అని యిట్లనేకవిధంబులం జింతించి చింతించి కర్తవ్యం బేమియుఁదోఁచక రాజకుమారుఁడులేక నగరంబునకుంజనఁగూడదని నిశ్చయించుకొని యాయరణ్యమధ్యంబున నొక్కతపోవనంబుఁగల్పించుకొని నారచీరలుధరియించి కంద మూలఫలంబు లాహారంబులుగా మునివృత్తింబూని తపోనియతితోఁ గాలంబుఁగడపు చుండె. ఇట్లుకొన్నివత్సరంబులుజరిగిన నొక్కనాఁడు తపస్సమాధినుండిలేచి యొకచెట్టు క్రిందనుండు విశాలమగు శిలాఫలకంబుపైఁగూరుచుండి తనప్రియమిత్త్రుండగు మదన మోహనుని మనంబునం దలంచుకొనుచుఁ దద్విరహవ్యథాకులితహృదయుండై తన మనంబున నిట్లువితర్కించె. అక్కటా! నాప్రియమిత్త్రుండింతదనుక నాకెఱుకపడఁడు. ఇన్నివిధములఁగష్టములుపెట్టియు నింకనైనను దైవము దయదలంపకయున్నది. కటకటా! యొకదినంబుననైన మాతాపితృలనెడబాయని నామిత్త్రుండు నన్నేల విడిచిపోయెనో? అతనికి గతియేలాగయ్యెనో? అతనిసడి యించుకయైనను దెలియదయ్యె. "సౌదామినీస్ఫురణ చంచలమేవసౌఖ్యం" అన్నవాక్యంబు సత్యంబయ్యెగదా! ఇందుకేకదా మునులు

సంసారంబులోని గృహంబు లెడబాసి జన్మసాఫల్యంబుకై తపంబులఁ గాసిలుచున్న
వారు. లోకంబున నన్నలు బందుగులు మొదలగువార లనేకు లున్నను మిత్రునితో
సమానులుగారు. బందుగులందఱును గలిమియుండు కాలంబునం గారవింతురుగాని
లేమిడిని మొగంబైనం జూడరు. మఱియును.

సీ. కలిమిలేములయందుఁ గష్టసుఖంబుల సమత నుండెడివాఁడు సఖుఁడొకండె
విపదంబునిధినుండి వేడ్కమైఁ దరిఁజేర్ప శక్తిగల్గినవాఁడు సఖుఁడొకండె
దుష్పథంబులనుండి తొలఁగించి మెల్లన సరస పెట్టెడువాఁడు సఖుఁడొకండె
సంపదగలనాఁడు సైచియుబ్బుచులోన సంతసించెడివాఁడు సఖుఁడొకండె

గీ. ప్రత్యుపక్రియఁ గోరక నిత్యశక్తి
సరసఁ జేరెడివాఁ డిల సఖుఁడొకండె
భావములలోని కార్యముల్ బయలుపఱుప
జతనపడఁ జేయఁగలవాఁడు సఖుఁడొకండె.

అని యిట్లనేకవిధంబులం జింతించుచుండ నంతకు సమీపస్థలంబున నొకయార్త
నాదంబు వినంబడుటయు నాలకించి యోహో! యిది స్త్రీ యొక్క రోదనధ్వని గాఁబోలు
చున్నయది. ఇట్టి గహనంబునందు కాంతలు వచ్చుటకుం గారణంబేమై యుండును. అది
యునుంగాక యీ నాదంబు మిగుల స్నిగ్ధంబును మనోహరంబును గంధర్వకాంతలు
లలితంబులగు నంగుళులచే మీటుకిన్నరలజంటఁ గాంభోజీమేళనంబుఁ జేసిన తెఱంగున
జిత్తంబు నాకర్షించునదియై యాఁడుపురరి యేడ్చునట్లున్నయది. కాన నెవ్వతెయొ యొక
యుత్తమకాంతాతిలకంబు విపత్పరంపరాభిభూతయగుచున్నట్లు తోఁచెడిని. దీనిం గా
పాడుట మిక్కిలి పుణ్యంబు. దిక్కులేక యొక్క నిర్జనవనంబునఁ బెక్కువిధంబులఁ గాఱి
యపడు నొక్క చక్కనికన్నియ నెక్కుదక్కి యుపేక్షించియుండుట చొక్కంపు
విప్రకులంబునం బుట్టిన నొక్కనికిందగవగునా? యని తలఁచి తటాలునం జంద్రహాసం
జొఱవెఱికి ఖేటకంబు ధరించి యావాక్యధ్వని వినంబడుమార్గంబునం జనుచు నొక
చోట బేరెలుంగుతో వెక్కి వెక్కి యేడ్చుచు వచ్చుచున్నదాని నొక్క కాంతాతిలకం
బునుం జూచి సమీపంబునకేఁగి యోయవ్వా! యివ్వనంబున నొంటిగ నీవిట్లు పలవించుట
కుం గారణంబేమి? నాసమీపమునకుం జేరితివి గాన నింక నిన్నెవ్వరును పరిభవింపం జాలరు
నిన్నుం గాంచినఁ జొక్కంపు రాచకన్నియ యని తోఁచుచున్నది. నీకిప్పుడు సంప్రాప్తం
బగు నాపదను పరిహరించి నిన్నుం గాపాడెదను. సింహవ్యాఘ్ర భల్లూక ప్రముఖ
క్రూరమృగ శరణ్యంబగు నరణ్యంబునకు మీవంటివారు వచ్చుటకుం గతంబు మహత్త
రంబై యుండకమానదు. దుఃఖంబడంచుకొని ధైర్యంబుదెచ్చుకొని సంగతి విశదీ
కరింపుము. అని యిట్లు పల్కి యాకాంతలు తిన్నని మాటలనూరార్చి యొకకొన్ని పండ్లు

తెచ్చియిచ్చి యచ్చోటున యాఁకలిదీర్చి సుఖాసీనుఁడనై యున్న యాకన్నియం గాంచి యో చిన్నదానా! నీవంగతికిఁ జెలువమరి యొసంగిన నాకొంతాకెలింబును వెక్కివెక్కి యేడ్చుచు నిలుపరానిశోకంబునం బెదవులదరఁ గన్నులనుండి బాష్పబిందువులు కాలువలై కుచంబులపయింబడి ప్రవహించి జిలుఁగువలువ దడిపి యిలకుంజారఁ బయింటచే దుడుచుకొనుచు డగ్గుత్తికతో నిట్లనియె. ఓకుమారుఁడా! యేనతిదౌర్భాగ్యశాలినిని. నాచరితంబు వింటివేని నీకును మనోవ్యాకులత సంభవించు. అయినను జెప్పెద వినుము.

## మదలేఖాచరిత్రము

ఇక్కడకు బహుదూరంబుననుండు నేపాళదేశంబునందలి చంద్రభాగంబను పట్టణంబు నాజనకునినగరము. నాతండ్రిపేరు ధర్మపాలుఁడు. అతఁడు బహుదినంబులు సంతానంబులేక సంతపించి తత్ప్రాప్తికై పెక్కువిధంబులకు పుణ్యకార్యములొనరించి ముసలితనంబున ముప్పాలుపడుటకు నన్నొకకూఁతుంబడసె. నేనుబాలికనైనను దనకు వంశపాలికకాఁగలననియెంచి మించినవాత్సల్యంబునం బోషించుచు రాఁగా నేనైదు సంవత్సరముల ప్రాయముగలదాననై విద్యాభ్యాసమునఁ జొరవగలిగి పితృనియుక్తనై మాకుల క్రమాగతుండును విద్యాచాతుర్యండునైన వేదవర్ణియనువిప్రునొద్దస్త్రీల కభ్యసనీయంబులైన విద్యలనెల్ల నేర్చికొనుచుంటిని. అతనికుమారుండు సురవర్ణియనువాఁడు నాకంటె రెండుసంవత్సరములు వయసుచేఁ బెద్దయయ్యు బుద్ధిచాతుర్యాదుల నాకంటెం దద్దయుఁ జిన్నయై నాతోడఁ జదువుచుండె. పలుమాఱు నాతఁడునన్నుంగాంచి మదలేఖా! నన్ను పెండ్లిచేసికొందువా? అనియడుగుచుండ నందుకు నేను కొంచెముకోపగించుకొనిచూడ నూరకుండును. నేను బదునాలుగుసంవత్సరముల వయస్సుగలదాననై పుష్పవతిగాక చదువుచుంటి. ఇట్లుండ నొక్కనాఁడు నాతండ్రిపనుపునం బాఠశాల కేఁగితి. అందు నావిద్యాగురుండగు వేదవర్ణి లేకయుండెను. అతనికుమారునిం గాంచి యో సురవర్ణీ! ఉపాధ్యాయుల వారెక్కడనున్నారని యడిగిన నతఁడు చిఱునగవుతో నన్నుం గాంచి యోమదలేఖా! యుపాధ్యాయుం డీయూరలేఁడు. కొన్నికార్యంబులు తీర్చుకొనుటకుఁ గ్రామాంతరంబునకుం బోయియున్నవాఁడు. ఈదినము రాఁడు అని చెప్పి నాసమీపంబునకువచ్చి యోకామినీ! పిన్ననాటినుండి నీతోసహావసించి నీతో బాల్యక్రీడలుసలుపుచు నీకుం బ్రీతిపాత్రుండనై యున్న నాయందు దయయుంచక బహుదినములనుండి నేనువేఁడుకొనుచున్న పరిణయంబునకు సమ్మతింపకయున్నావు. ఇది నీకుం దగునా? యనిన నేను శిరంబువంచుకొని యూరకుంటి. అప్పు డతఁడు మఱియు నిట్లనియె.

శ్లో. ఇందీవరేణనయనం ముఖమంబుజేనకుందేన దంతమధరంనవపల్లవేన,
అంగానిచంపకదళైస్స విధాయధాతాకాంతేకథం ఘటితవానుపలేన చేతః.

[ఓమనోహరాంగీ! నీకుఁ గన్నులు నల్లకలువరేకులచేతను, ముఖము తామరపువ్వు చేతను, పలువరుస మొల్లమొగ్గలచేతను, లేఁజిగురుటాకుచేత మోవియును, సంపంగి పూలరేకులచేత నవయవములును నిర్మించి బ్రహ్మ నీయొక్క హృదయమును మాత్రము ఱాతిచేఁజేసినాఁడే. కటకటా! అనఁగా నీయవయవములన్నియుఁ గుసుమములచేఁ జేయఁబడియుండుటంజేసి యెంతయు మృదువులై యున్నవి. నీ హృదయము ఱాతిచే నిర్మింపంబడినదిగాన నేమి యెంత వేఁడుకొనినను గరఁగకయున్నది. అనిభావము].

అని చెప్పఁగా విని యేను నతనింజూచి మఱఁగాంచి యోగురుపుత్రకా! నీవు నాకు సహోదరునితో సమానుఁడవు. లోకంబున గురువు తండ్రియనియు గురుపుత్రులు సహోదరులవంటి వారనియు వాడుకొనవినవె. ఇట్టిమర్యాదలు నీకేల? నీవు బ్రాహ్మణుండవు. నేను క్షత్రియకాంతను. నేను చతుస్సాగరవేలావలయితంబగు నీభూమికెల్ల రాచపట్టిం జేపట్టుదానను గాని పుట్టుదరిద్రుఁడగు నీబోటి బాపనయ్యనా పరిణయము చేసికొందును. ఇట్టిమాటలు పలుకుము. నిఁక వచియింతువేని నీకుఁ జెట్టసంభవింపక మానదని చెప్పిన నదిమొదలుకొని యా విప్రకుమారుండు నాయెడల ననూయాయుక్తుండై యది వెలువడనీక చెలిమితో మెలంగుచుండె. ఏనును గొన్ని దినంబుల కావిషయంబున మఱపుఁజెంది యాతని విషయమున సహజప్రేమంబుతోఁ బ్రవర్తించుచుంటి. ఒక్కనాఁ డాకుమారుండు నన్నుంగాంచి యో మదలేఖా! యీ రతనం బెంత మనోహరంబైయున్నదో చూడుమని యొకగుళిక నాచేతికిచ్చెను. అది చేతికిఁ దీసికొన్నది మొదలు నే నేమియొనర్చితినో? ఎవ్వరితో నేమిచెప్పితినో? బ్రతికియున్నానో? నిద్రబోవుచున్నానో? ఏమి సేయుచున్నదియు నాకెఱుకపడకయుండెను. మరునాఁ డరుణోదయంబగుచుండఁగా నొక మహారణ్యమందు గొప్పగుఱ్ఱంబుమీఁద నొక చెలితోఁగూడఁ గూరుచుండి దక్షిణాభిముఖంబుగం బోవుచుండి దేహముతెలిసినదాని నై సమీపంబున మఱియొక యశ్వవరం బధిరోహించి నాసరసనవచ్చువాని నొక్కనిం గాంచి యేమియిది? స్వప్నమో? లేక జాగ్రదవస్థయో? లేక యింద్రజాలమో? లేక మాయయో? లేక విధివైపరీత్యమో? కాదేని పోతుటీఁగయైనఁ జొరరాని నా యంతిపురంబెక్కడ! వ్యాఘ్రసింహభల్లూకాది క్రూరమృగశరణ్యంబగు నీ యరణ్యంబెక్కడ! ఏనిచ్చటికిరాఁగతంబేమి? ఎంతదూరం బాలోచించినను మనంబునకు రాకయున్నది. అయినను గతంబుచింతించుచు నేలజేలుపోవలె. ఇఁకఁ గార్యంబు తప్పక బుద్ధితోడఁ బ్రవర్తింపవలయును. అనియెంచి యేను నూరకయ యుంటిని. నా సమీపంబునవచ్చెడువాఁడు సువర్ణియను బ్రాహ్మణకుమారుండనియు వీఁడె నన్నుక్రీవంబునం గొనితెచ్చెననియు నెంచి యాతనిచెంతనైనఁ గన్నెత్తిచూడక కొంత దూరంబుచని యొకచోట నతనిమాటచొప్పున నిలిచి యాతఁ డుండుచోటికి మఱికొంత

దూరంబున నొకచెట్టుక్రింద నాచేటి తెచ్చియిచ్చిన యన్నంబు భుజియించి మించిన సంతాపంబునం గుందుచునుండ నప్పుడాచేటి తావచ్చి "యో మదలేఖా! యీ సురవర్ణి నీకుం జెప్పిపంపినవార్తలు కొన్నిగలవు. అవి విని నీవట్లు ప్రవర్తింపవలసిన దానవుగాని స్వతంత్రురాలవుగావు. నీతలిదండ్రుల నెడబాసివచ్చితివి. నట్టడవిలో నతనిచేతం దొరికితివి. ఇంకం దప్పించుకొనుటకు నీ కసాధ్యంబుగాన నాతనిమాటల కన్యథాగాం బ్రవర్తింపక యుంటివేని మేలుకమకూరదు; అనిచెప్పంగా నేను వలలోం దగులుకొన్న పులుంగుచందంబున నేమియుం జేయనేరక యున్నదాననగుటచేం గాలోచితంబుం జింతించి యోసీ! యట్లయగుంగాక. అయిన నే నొక్క వ్రతంబుసేసి దానిం బరిసమాప్తినొందించి యున్నదానను. కోటిబ్రాహ్మణులకు భక్ష్యభోజ్యాదులతోడ షడ్రసోపేతంబగు నన్నంబువెట్టి తగువట్టిదక్షిణలం బరితృప్తులం గావించినంగాని నేను వివాహంబు సేసికొనను. ఇది నేను వ్రతారంభమునం బ్రతిజ్ఞచేసియున్న విధము. అట్లుచేయక నన్ను నిర్బంధపఱచెనేని రజ్జువిషాగ్నిజలంబులం బ్రాణంబులు వాయుదు. ఆ బ్రాహ్మణులం బరితృప్తులం జేయుదనుక నా సురవర్ణినిం గంటనైనం జూడను. అనిచెప్పంగా నామాట లా చేటివలనవిని యాతండు నట్లకానిమ్ము. ఇంతకు సమీపమున నొకనగరంబుగల దందువసించియుండి నీ చిత్తంబుపగిదిం బ్రవర్తించి విప్రభోజనంబుం దీర్చి నిన్ను పరిణయంబుం జేసికొందుమనిచెప్పి యతండు నచ్చోటు విడిచి కదలి యేనును చేటియును వెంటరాంగా సూర్యాస్తమయసమయంబున నొక పట్టణముంజేరెను. అది యుదయాదిత్యుండను రాజు పరిపాలనముసేయునట్టి కరూశ దేశపురాజధాని. దానియందేము నొకపూటకూళ్లబాపత యింటికింబోయి విడిసితిమి. అతండు గొనితెచ్చినధనము వ్యయముసేయుచు భోజనాదికృత్యంబులు జరుపుచుండె. ఏనును నా విధివైపరీత్యంబు మనంబునం దలంచుకొనుచు నేకతంబ యొకయింట వసించియుంటి. ఇట్లు కొన్నిదినంబులరుగంగా నొక్కనాండు నా చేటికవచ్చి యో దేవీ! వింటివా? మనసురవర్ణి యొక్క పరాక్రమంబు. ఈదినము సూర్యోదయకాలంబున నాతండు యథోచితములగు వస్త్రాభరణాదులధరియించి రాజవీథివెంటం బోవుచుండ నా రాజుయొక్క వినోదశాలయందు సంబద్ధంబైయున్న యొక్కపులి బోను వెడలి యనేకమనుష్యుల సంహరించి యా తోటలోనుండి నిర్గమించి మించినశౌర్యంబునం దనకెదురువడ్డజంతువుల జమునియింటికంపుచు జనులయొడళ్లుచించి రక్తప్రవాహంబులు నించుచుం జూచువారల భయరససముద్రంబున ముంచుచు నేతేరం దదీయ ఖరతరనఖర ప్రహారంబులంజచ్చువారును, గాండ్రింతలువిని పెచ్చు పెరుంగు నుమ్మలికంబున నొచ్చువారునునై రాజభటులు చంపంబోయి యనువుపడక యాయుధంబులు వదలి పరువిడువారై విచ్చిపోవ నప్పు డెదురై పోవుచున్న మనసురవర్ణి తన్నుంగాంచి పౌరులందఱును హాహాకారంబులుసేయుచు ధిక్ఛబ్దముఖరితులై తొలంగు తొలంగు

మని యార్వ నందు కించుకేనియుఁజంకక నోరుదెఱచుకొని తనపైకిఁదూఁకు సామహా వ్యాఘ్రంబును తనమొలవంకితో బొమ్మసంబొడువ నందుకుఁగనలి యాపులి యాపురిం గల మిద్దెలుమేడలువగిలి యిలపయింబడనార్చుచు నతికఠోరంబులగు నఖరంబుల నితనివక్షంబువగులనడిచిన నందుకొంకించుకయైనవెఱవదియక యాబాఁకువెజికి దాని మోమునంబొడిచిన నాపులియు రోదాంతరాళంబులు వగులనార్చుచుంజచ్చి యిల పయింబడెను. మేడపయినిలుచుండి చూచుచున్న యుదయాదిత్యుఁడు మనసురవర్ణినిం గాంచి యాతనిశౌర్యంబున కచ్చెరువంది తనభటులచే నాతనిం బిలిపించి యనేకభూసు రాంబరాభరణాదుల బహూకరించి తనమంత్రులతో నాలోచించి తనసైన్యంబున కంతటికి నధిపతింగాఁజేసెను. అనిచెప్పఁగా నాచేటికావచనంబులువిని యేనును మనంబునందిట్లుతలంచితి. లోకమున బాహువీర్యముక్షత్రియులకుగాని విప్రులకులేదు. ఇతండు బాహువీర్యసంపన్నుఁడని యీచేటిక తెల్పుచున్నయది. ఒకవేళ ద్రోణాచార్య కృపాచార్యుల చందంబున ననేకులుండిన నుండవచ్చును. అయిన నీసురవర్ణి యొక నాఁడును ధనుర్విద్య నభ్యసించినవాఁడు గాఁడు. సత్వంబును ధైర్యంబును వానికిలేదు. నాతోఁగూడి విద్యాభ్యాసము చేయుచుండి పరోక్షమున నీవిద్యలునభ్యసించిన నభ్య సించియుండవచ్చునుగదా. ఉండనిమ్మావిచారంబు మనకేల? అని యిట్లుపలువిధంబుల నాలోచించి తలయూచి యూరకున్న నన్నుంగాంచి యాచేటి యనునయాలాపంబుల నిట్లనియె. ఓమదలేఖా! వినుము. ఆకుమారుండిప్పుడు రాజనగరునకు విశేషముగఁబోక రాకలు సేయుచున్నవాఁడు. రత్నపరీక్షయందతికుశలుండగుటంజేసియు కావ్యనాటక సంగీత సాహిత్య వీణావేణుమృదంగాద్యనేకవిధ కళాకౌశలంబు గలవాఁ డగుటం జేసియు నీపట్టణపురాజైన యుదయాదిత్యుండు మనసురవర్ణినిఁ దనకు బహిఃప్రాణంబు గాఁ దలఁచియున్నవాఁడు.ఆదియునుంగాక తనకు బావమరఁది వరసగల్పించికొని పరి హాసాదులొనర్చుచుండు.ఒక్కనిమిషంబైన నీతని నెడబాయలేఁడు.ఇట్లుండియొకనాఁడు మనసురవర్ణివృత్తాంతంబంతయు విచారించునప్పుడతండు తానింతకుముందు తనకుస్వాధీ నముచేసికొనియున్న యీయూరనుండు రాజవీథిలోని యొకమిద్దెటింటిని దనకుగృహం బుగాఁదెల్పి యందుఁదనభార్యయుఁ జేటీజనంబును వసియించియున్నవారని చెప్పెను. అనఁగానే నేను నోసీ! యేమంటివి? ఈతనికి నేనాభార్యను. నాయింటికిం బ్రతి దినంబువచ్చి పంచాంగముచెప్పి జీవించుబ్రాహ్మణునికా యేనుభార్యనగుదును. ఇఁక నిట్టి మాటలు వారియొద్దబల్కితివేని నేఁడు చేటుసంభవించును పొమ్ము. అనిమొగంబు బావ లికి మరలించుకొనియుండఁగా నాబానిసయు మెల్లనివచనంబుల నోదేవీ! కోపగించు కొనకుము. అతఁడు భార్యయని యన్నంతమాత్రముననే నీవు భార్యవైతివా? ఇతఁడు భర్తయయ్యెనా? గౌరవార్థమక్కడఁజెప్పుకొనియె నంతేకాని వేఱొం డేమియు

సేయఁబూనెదుగదా ? నావచనంబులు మఱియకమున్నుగనే కోపగించుకొంటివి. నేనుచెప్పవచ్చినవిషయము తెలిసికొన్నదానవుకావు. ఏమంటివేని యాప్రాఁతయిల్లు విడిచి తొల్లి యేఁజెప్పినమిద్దెటింటికిఁబోయి యక్కడఁ గాపురముండవలయు. ఇక్కడ నైన నక్కడనైన భేదమేమి ? ఈకార్యంబున నేమితప్పుయున్నది యని యిట్లనేక విధాలాపంబులుసెప్ప నేను నదుకొడంబడి యిట్లంటిని. ఓసి! నీవుచెప్పినచొప్పున నే నామిద్దెయింటిలోఁ గాపురము సేయ నిష్టపడుచున్నాను. అందా బ్రాహ్మణుఁడు క్రిఁది తట్టుననే యుండవలయుంగాని మేడమీఁది చంద్రశాలకు రాఁగూడదు. అట్లగు నేని నేనాయింటికి వత్తునని యంత నతనికి సమ్మతియౌనని యొడంగించి నన్నాయింటి చంద్రశాలలోఁ గాపురముంచెను.

ప్రతిదినంబును చేటీజనంబులు నామిద్దెటింటియధఃప్రదేశమునం బనులు సేయుచుందురుగాని పైకిరారు. నేనంతయు సంతుష్టిచేతం బక్వాన్నాదులు షడ్రసోపేతంబులుగఁ జేయించి బ్రాహ్మణునికిముందుగా నాచేటిచేతికిచ్చిపంపి యాతండభ్యవహారాదికంబులు తీర్చుకొన్నట్లు చెప్పిన వెనుకగాని యేభుజింపను. ఇట్లు ప్రతిదినంబును జరుగుచుండ నొక్కనాఁటిరాత్రి యాబాలసవచ్చి విన్ననైనవదనంబుతో నాయెదుటనిలిచి బొటన వ్రేల నేలవ్రాయుచుండ నేను ఓసీ! యాబ్రాహ్మణుఁడు భుజియించెనా? అనియడుగఁగా నది యోయమ్మా! యాతనికింక నాహారంబేలా? అనిచెప్పెను. నేను నామాటకు సంశయపడుచు నోసీ! యాతనికేమి? యాహారంబు మానుటకుం గారణంబెద్ది? సంగతి యున్నంజెప్పుము. అని యడుగఁగా నదియిట్లనియె. నీవుచెప్పినవిధంబుగ బోనపుటికం గొనిపోయి యొకచోనునిచి భోజనపాత్రంబు నమర్చి యాతనిం బిలువఁబోతిని. సురవర్ణియు వేఁడినిట్టూరుపులు నిగుడ్చుచు నోసి చేటీ! యీరాత్రిమాత్రమేకదా నేను నీచేతి యన్నంబుభుజియించెదను. ఇంక లేదుకదా ? యనిన నేను ఓవిప్రవర్యా! ఆట్లేల పలికెదరు. ఇంతవంతకుం గారణంబేమియని నొక్కియడిగితి? అందుకతండు ఓ చేటీ! నీవలన నగుపనులయ్యేనేని నీతోఁజెప్పవలయునుగాని యెవ్వరికి నసాధ్యంబులగుపనులు నీతోఁ జెప్పినను నీవేమి సేయఁగలవు. నామనస్తాపంబుఁదీర్ప దైవంబుగాని యన్యులు శక్తులు గారు. రేపటిదినము రాఁబోవు నవమానమునకు భయపడి యీదినముననే ప్రాణములు వదలుట మేలని యనుకొనుచున్నాను. అనిచెప్పి నేను పైపైననునయించి యడిగినను మానవానికింగారణంబుఁజెప్పక నిట్టూర్పులు నిగుడ్చుచు నుండియుండి మిగులబతిమాలుకొను నావలన తనమనస్తాపంబు వాపునట్లు ప్రతినచేయించుకొని యిట్లనియె,

ఓసి చేటీ! నిన్నటిదినంబు సాయంకాలము ఉదయాదిత్యునిభార్యయగు విలాసవతియను పట్టపురాణిపంపిన దూతిక మనయింటికి వచ్చియుండెనుగదా? అదియీ దేవిని గాంచినదట. ఆమె రూపరేఖాదులు విలాసవతితో నాదాసి చెప్పినందున నామె

ఘుచ్చెరువందు నిన్నరాత్రి తనభర్తతో మనసువచ్చి భార్యంజూచి రావలయును. అందు
కొతనియింటికెల్లి పోయిరా నానతిండని యడిగిన వాతఁడు నల్లకె నిమ్మని యీనాఁడుదయ
మున నన్నుబిలిపించి యో బావా! మాయంతఃపురకాంతలు మీ యింటికివచ్చి సభాగ్యంబు
జూడవలయుననియున్నారు. ఎల్లిరాఁగలరని చెప్పెను. అందుకేను లోపలసంతసించుచుం
బైకిం దోఁపనీక యాకారగోపనంబుతోఁ బటమోదంబు పొంగిపొరలఁ దోఁచించుచు
నిల్లుంజే. ఓబావా! తమయంతఃపురజనంబు మాకాంతాజనంబుఁజూడ నేతెంచుట మాయ
దృష్టంబుగాదె. సజ్జనులు తముసున్నేహించినచోట శ్రమయించుకొనక ప్రవర్తింతురంతె
కాని సేవకుఁడైనవానియింటికి రావచ్చునా యని యాలోచింపరు. కేవల మంతఃపుర
కాంతాజనముమాత్రము వచ్చుట నాకుఁ దమకింబు కాదు. తమరును మాయింటికి దయ
చేసి నాచేయు నాతిథ్యంబులం గైకొని నన్నుగారవించి రావలయును. అని నేనిట్లు
ప్రార్థింపఁగా నంగీకరించి రాజు సంతసించి రేపువచ్చుట కొప్పుకొనియున్నాఁడు.
అప్పుడు సమయోచితవాక్యము చెప్పవలసియున్నదిగాన వచింపుమని. ఇంటికి రేపువారు
రాకమానరు. వచ్చిరేని నాకవమానంబు సిద్ధంబుగాన ప్రాణంబులు వదలుటయు మంచిది
యనియెంచి యాహారాదుల నిచ్ఛవాని యున్నవాఁడను. ఇదియు నావృత్తాంతంబని చెప్పి
యేమియు ననక యూరకుండెను. అంత నే నేమియుం దోఁచక నీయొద్దకువచ్చితి. ప్రతిజ్ఞ
చేసి తప్పిపోవుటకంటె నాకు మరణంబె యేనును శరీరంబువాయుట మేలని యెంచి
యున్నాను. ఇందుఁ జేయఁదగినపని యేమంచిదనుచు నివేదించి యాపనికత్తె యూరకుం
డెను. అంత నేనేమియుఁదోఁచక బ్రాహ్మణునికి భయపడి యాచేటికతోడ నిట్లంటిని.
ఓసీ! మీరెరువురును నాకతంబున ప్రాణంబులు వదలవలదు. రాజాంతఃపురజనమునకు
యథోచితముగ సర్వసత్కారంబులు నే సలుపుదును. ఆవిప్రుని భుజియింప జెప్పుమని యదియు
మహాహర్షంబుతోఁజని యత్తెఱంగెఱిఁగింప నతఁడు సంతసంబుతో నారేయి భుజియిం
చెను. నేనును మరునాఁడు వేకువనే లేచి యింటికి ననేకవిధంబులగు పరికర్మాదుల
జేయించి మామిడిచిగుళ్లతోఁ దోరణంబులుగట్టించి యతివిచిత్రంబులగు ధ్వజము
లెత్తించితిని. ఇంతలోపల నంతఃపురదాసీజనంబువచ్చి యోయమ్మా! రాణిగారు తమ
యంతఃపురంబు వెలువడిరి. తమయింటివీథికొనన యేతెంచుచున్నవారు. అని చెప్ప
చుండఁగా నేనును సర్వాభరణభూషితనై తూర్యవాద్యధ్వనులు వినంబడుటయు వారి
కెదురేఁగిన నను పైనచేటికరాఁగాఁ గాంతాజనంబులు మోయుపల్లకీలు వెక్కువచ్చి యిం
టికివచ్చినిలిచిన వానినుండి నవజలధరంబులం బాసి విలసిల్లెడు తటిల్లతికలోయన నా
రాజాంతఃపురకాంతాజను లనేకులు రూపయౌవన విలాసవంచితరంభారంభోరువులు
వెలువడ నేనువారి సందర్శనవిధంబున సంభావనంబుచేసి తోడ్కొని యథోచితసత్కా
రంబులఁగౌరవించి యుచితాసనాసీనలం జేసి కుశలంబడిగి సమస్తోపచారవిధులం బరితృప్తుల

నొనర్చి యాస్వాద్యంబులగు కలమాన్నాదుల భుజియింపంజేసి యిష్టాలాపసంతుష్టి కలయఁ గూరుచుండి మాటలాడుచుండఁగా నారాణియు నన్నుంగాంచి తన ప్రియసఖీమణితోడ ననుంజూపుచు నిట్లనియె. ఓ ప్రియసఖీ! లోకంబున ననేక కాంతాతిలకంబులఁగలవుగాని ఈమదవేక్షణంటి సౌందర్యవతి లేదని యేనొక్కి చెప్పంగలనువినుము.

సీ. కన్నులై తేసరే కన్న విన్నవిగాని మించుతళ్కులు ప్రస్మరించవలదె
చన్నులై తేసరే స్మరరాజ్యపట్టాభిషేక కుంభంబులై చెలఁగవలదె
వదనమై తేసరే వరమనోహ్లాది శరదిందు బింబమై మెరయవలదె
రూపమై తేసరే చూపరకన్నులకు సర్వాణసౌఖ్యంబు నించవలదె

గీ. కాంతయైనంతసరియె నిష్కామునైన
మానివరునైన మరునిబంధానఁజాను
జేయవలవదె యిటువంటిచిన్నిచాన
మనుజకాంతలలో లేదు మహిసిజాడ.

అని వారలనుకొనుచుండ నేను నామనంబున నాయొక్క విధివైపరీత్యంబుం దలంచికొనుచునుంటి. ఆవిప్రవర్యుండు నొంకచోట రాజముఖ్యుఁడగు నుదయాదిత్యుని సకలోపచారవిధులం బరితృప్తుంగావించె. ఇట్లాపగలంతయుంజరుగ నారేయి సరసాన్నాదులు భుజియించి మాయిచ్చినబంగారుతగటుదుప్పటులంబరిగ్రహించి సంతసించి తాము తమయింటికంజనునప్పుడు విలాసవతి తనచేటికనంపి తిన పెనిమిటి యుత్తర్వునంది ఎల్లినీవును నీభర్తయునువచ్చి విందారగించి బోవలయునని నన్నుంబిలిచి ప్రార్థించెను. అప్పుడు నేనొప్పుకొనకపోవుట సరి కాదని వారిమాటలకు సమ్మతించితి. ఇట్లు నన్నురమ్మని ప్రార్థించి యాయంతఃపురకాంతాజనంబుతో విలాసవతి తనయింటికింజనియె. రాజును తననగరునకు ఎల్లి విందారగించుమని యావిప్రునిం బిలిచిపోయె. ఏనును ఆవిలాసవత్యుదయాదిత్యుల సుఖంబునకును పరస్పరానుకూలతకును మదిమెచ్చుకొనుచు నాతలవ్రాతం దలంచుకొని విధిందూఱుచుఁ బతులకౌగిళ్లనూరారని సతుల బ్రతుకేలాయనియెంచుచు నొకచోటం బైటకొంగుభూమిపయింబరచుకొని పరుండియుండ యాచేటియు నేతెంచి యోదేవీ! నీవిట్లు భూతలంబునం బరుండుటకుఁ గారణంబేమి? అతిమృదులతూలికాశయనంబులుండ వాని ననాదరించి యీకుసుమసుకుమారంబగు శరీరము నిట్లువెతలం బెట్టుటవలన నీకేమి ప్రయోజనంబుసమకూరు. అనర్ఘ్యంబులగు కుసుమాస్తరణంబుల నలంకరింపకయుండుట నీకుచితంబగునే? యనియిట్లనేకవిధములగుచేటిజనోచితాలాపములుసెప్పుచుం బ్రక్కనఁగూరుచుండి మరునాఁడు రాచనగరునకే వచ్చునట్లు సమ్మతిపఱచుకొనిపోయెను. మరునాఁ డుదయకాలంబున రాచనగరునుండి మనోహరంబగు నొకయందలంబుమోసికొని యనేకదాసీజనంబులువచ్చి నన్నుంగాంచి

యోదేవీ! నిన్నుమారాణిగారు పిలుచుకొనిరమ్మనిరని ప్రార్థింప నేనును సంతసమున మించుచు దానివెంట నా రాచనగరుజేరిన నావిలాసవతియు నాకెదురేగుదెంచి కైదండయిచ్చి తోడ్కొనిచని యత్యాదరంబుతో నఖిలసత్కారంబులు నొనరించి యానాఁడంతయు నిష్టగోష్ఠుల నాతోఁ బ్రొద్దులు పుచ్చుచుండెను. ఆ బ్రాహ్మణకుమారుండును రాజుచే సత్కృతుండగుచు నాదినంబుగడపె. ఇట్టుండ నా నాఁటిరాత్రి భోజనాదికృత్యంబులు జరిగినయనంతరము నేనింటికింబోవ యత్నించుచు నాఁడు విలాసవతి కెఱింగించిన నామెయు ననేకజాంబూనదాంబరాభరణాదుల నన్ను సత్కరించి యింటికంపఁబోవుసమయంబున నొకదాసివచ్చి రాణింగాంచి యో దేవీ! రాజుగారు చెప్పిపంపిన సంగతులు మనవిచేయుచున్నాను. ఆలకింపుమన నామెయు నేమివిశేషంబులని యడిగిన నది యిట్లనియె. ఓ, దేవీ! యీదినము సాయంసమయమున నీయూరికి శ్రీమంతనగరమునుండి యతిచతురులగు భరతశాస్త్రవిచక్షణులేతెంచి రాజుంగాంచిన మహారాజును దనయింటికి వింతలగు నీ మదలేఖా సువర్ణులకు వినోదకరంబుగ నీదినంబె తననగరునం దాట వేయింప సెలవిచ్చియున్నారు. అదిగాంచిన యనంతరము వారును తమయింటికేఁగంగలరుగాన నీవృత్తాంతంబు తమకెఱుకపడంజేయ రాజుగారు నన్నంపిరనిచెప్పి యామె సెలవంది వెడలిపోయె. విలాసవతియొక్క ప్రార్థనంబుచే నక్కడనిలిచితిని. కొంతతడవునకు జీమూతధ్వనులవంటి మద్దెళధ్వనులు వినంబడుటయు నతికుతుకసమాకులహృదయలగుచు నంతఃపురకాంతలు రాఁగా నేనును విలాసవతియు నా రంగస్థలంబునకు సమీపనిబద్ధంబయియున్న యొకమేడపైకెక్కి సన్నని వలవంటి తెరకట్టియుండు దానిగవాక్షముల సమీపంబున సమర్పింబడియున్న ధౌతాంబరాలంకృతంబులగు మృదులతరమంచంబులపయిం గూరుచుంటిమి. మేముగూరుచున్న సౌధంబునకెదురుగ రంగమండపంబునకును మాకును మధ్యస్థలంబున నుదయాదిత్యుండు కవిగాయక విద్వత్పరివారక భట్టాదిసప్తాంగంబులతో సభచేసికూరుచుండె. అంత నాటకంబు నుపక్రమింపంబడియె. కొంతకాలంబుదనుక నయ్యాటఁ గాంచుచుండి యా రాజుయొక్క మణిమయాసనంబునకు సమీపంబుననుండు నొక్కమహాస్థాపనంబుపైఁ గూరుచుండి యుదయశిఖరిశిఖరం బలంకరించు పున్నమచందమామ యనువునం దోఁచు నొక్కపురుషరత్నమునింజూచితి? అయ్యయా! యేమిచెప్పుదు. నా మనోహరాంగుని సౌందర్యంబు.

సీ. చక్షురానందంబు సమకూర్చుతనువున్న నతనుండు సాటియౌననఁగవచ్చు
నడవుల నెండల నాకుల పడకున్న నలవసంతుని సాటియనఁగవచ్చు
ననిమేషకాంతివిస్తారనేత్రములున్న నలజయంతుని సాటియనఁగవచ్చు
బాహావీర్యస్ఫూర్తిఁ బ్రబలుచునుండిన యక్షేశసుతు సాటియనఁగవచ్చు

నాపడుపాటు లచ్చెరువందిచూచుచు నాయంతఃపురకాంతాజనంబు నన్నుంజూచి యో
మదరేఖా! నీకిట్లగుటకుం గారణంబేమియని యడిగిన వారలకేమియును వచింపంజాలక
నాశరీరం బొకవిధంబుగనున్నది. ఏ వేరంబ మాయింటికి రేఁగవలయునని చెప్పినం
దత్కాలంబునన వారియుత్తరువుఁ బొప్పకం గొందఱుకాంతలు నన్నుఁ బల్లకీలోఁ గూరు
చుండఁబెట్టి నాయింటికిం దెచ్చి విడిచిపెట్టిరి. ఏనును బల్లకిడిగి మెల్లమెల్లన నాచేటిక
యందిచ్చు కైదండఁ గొనుచుఁ జంద్రశాలకేఁగి యొకపాన్పుపయిం బరుండి యిటునటుం
బొరలుచు నుస్సురని నిట్టూరుపులు నిగుడ్చుచు నతిశయించిన సంతాపంబునం బొరలు
చుండ నాదాసి సమీపంబునకువచ్చి మదనతాపంబుగా నెఱింగి తదుచితోపచారం
బులు కొన్ని యొనరించియుం గొంచెమైన మేనికాక చల్లారకమించుచుండఁ దానును
లోనభయంబునొంది నాతో నోదేవీ! యింత సంతాపంబునకుం గారణంబేమి.

శ్లో. అంగాసంగి మృణాలకాండ మయతే భృంగావళీనాం రుచిం
నాసామౌక్తిక మింద్రనీలసరణిం శ్వాసానిలాద్గాహతే
ధత్తేయం హిమవాలుకాపి కుచయోర్ధత్తేక్షణం దీపతామ్
తప్తాయఃపతితాంబువత్కరతలే ధారాంబుసంలీయతే.

ఓయమ్మా! లోకమునం దనేకకాంతలకు శరీరతాపంబులు కలుగుటకలదు గాని
యింతవిపరీతం బెచ్చటనైనఁ జూచినదానంగాను. నీయొక్క శరీరముమీఁదఁ జల్లనకై
యిడిన తామరతూఁడు నీశరీర మంటి యంటకమునుపే కనలి తుమ్మెదలగుంపుల విధం
బుగ నల్లనగుచున్నది. నీయొక్క ముత్తియంపుంబులాకి యత్యుష్ణమగు నిట్టూరుపులు
సోకి యింద్రనీలమణి విధంబునం దోఁచుచున్నయది. కుచములయందు శైత్యసంపాదక
మనియుంచిన పచ్చకర్పూరమును స్తనాగ్రములఁదాకగానే క్షణములోపల దీపమయి
మండుచున్నయది. అదికాదని నీళ్లు ధారలుకట్టునట్లు పోసిచూచితే యవియన్నియుఁ
గాలిన యినుమున నీడ్చుకొనిపోవురీతి నీహస్తంబున లీనమయిపోవుచున్నయవి. ఇందుకు
గారణంబుఁదెల్పుము. నీవు నన్ను బహిఃప్రాణంబ ననితలంపుము. దాపక సంగతులనెఱిం
గింపుము. అని యిట్లాదాసి యనేకవిధంబుల నన్నడుగఁగా నేనును గొంచెముసమాళిం
చుకొనిలేచి కూరుచుండి యోసీ! నీవేల నన్నుగుఱించి సంతసించెదవు. పున్నమచంద
మామను కన్నుల కానందకరంబుగాఁ జూడనగుంగాని ముద్దాడుటకు వీలుపడునె?
ఆశ్లేషనందనిమ్రానిపండ్ల కఱ్ఱుసాచివెఱ్ఱినై యున్నదానను! ఇది నేనోరువిడిచి చెప్పినను
నీవేమిసేయఁబోయెదవు. ఈసంతాపంబు తాళంజాలక యున్నదానను. ఇంటివారులేక
యొంటినుండు పంజరపుచిలుకకు బిడాలంబు వేచియున్నవిధంబుగ నీబాపఁడు నాకుఁ
గాచియున్నవాఁడు. ఆతనిబారినుండి వంతలంపుందుటకంటె నాకుఁ జేసేతవిషంబుదిని
యసువులఁబాయుటయ యుచితంబు. నీవు పరమార్థసఖివైతివేని యావిప్రుం డింటికి

రాకముందె నాకువిషంబుఁ గొని తెచ్చి యిచ్చితివేని నేను శరీరంబు వాసి సుఖంబునొందు దు. అనియిట్లు విలపింపఁగా నాచేటియు నోదేవీ! యింతసంతాపపడ నేలా? నీమనంబున నుండుసంగతి తేటపఱతువేని యది నేను సమర్థింపఁగలదానను. కార్యంబు తెఱం గెఱిం గింపుము. తనకుంగలిగిన మనస్తాపంబు సఖీజనంబునకెఱింగించిన నది విభక్తంబైనవిధం బునం గొంతసహ్యవేదనంబై యుండుగాదె? అనఁగా నేను నాదానిఁ గాంచి యి ట్లంటిని. ఓచెలియా! నేను కులకుమారీజనోచితంబైనమార్గంబు వదలి నాసాటివారు నవ్వుదురనులజ్జయుడిగి గౌరవంబుగణింపక ధైర్యభుజంగమంబు నెడమకాలఁదాఁచి ఖల మార్గంబను నంధకారపటలంబులఁ బ్రవేశించితిని. అట్లు ప్రవేశించిన నలభ్యంబగు వస్తువుంగోరి మారునిపూవుటంపడికిం మాలిబాళిఁజెందుచున్నదానను. తొలిజన్మంబున ననేకతపంబులొనరించి సద్వ్రతంబులు సల్పియున్న నారికింగాక యతిరూపవంతులును తరుణులు నగుపురుషులంగూడి మరునిబాధలం దొలంగించుకొనుట కలంతులకు అభ్యం బగునే? చెప్పెదను వినుము. చల్లకువచ్చి ముంతదాచిన నేమియగును? ఈదినముదయా దిత్యుని సమీపసింహాసనంబుపయిం గూరుచుండిన రాజకుమారునిం గాంచినది మొదలు మనంబు తదాయత్తంబై యుత్తలంబందుచున్నది, ఇది నావంటి యదృష్టహీనురాలికిం బనుపడునదియే? ఇఁక నాజీవంబును శరీరంబును తదాయత్తంబుగాని యన్యవిధంబు గాదు. ఇందుకు నావిప్రుఁడు విన్నతోడనే మండిపడక యుండునా? బహుదినముల నుండి నన్ను పెండ్లాడవలయునని యున్నవాఁడు. ఇట్టిసందర్భములవలన నాలోచించి చూచిన మరణంబె శ్రేయంబని తోఁచెడిని. అదియు నింకం గొంతసేపటికిఁ గలుగక మానదు. పంచశరుం డుదంచితశౌర్యంబునం గుప్పించు వాఁడియలుగుల వేఁడిమి కింక నోర్వంజాలను. అనిచెప్పి కన్నీరుమున్నీరై ప్రవహింప నతిదైన్యంబుతోఁ బలుకు నా వచనంబులువిని యాచేటికయు నోదేవీ! యింతమాత్రంబున కిట్లు సంశయింప నేలా? లోకంబున నుత్తమలగువారికి నితరాలంబనమున ననురాగంబు గలుగక తమ కను రాగంబు గలుగదు. అట్లయ్యెనేని యది విరసంబుకాదె. నీ వతనియం దుత్కంఠితవైన రీతి నాతండును నీయెడల నుత్కంఠితుండై యుండనోపునని చెప్పిన నేనును ఓ సఖీ! యాచెలువుండు నన్నెప్పుడుగాంచె, నాయందాతని కాసక్తి గలుగుటకు హేతువేమి? అతం డేయూరనుండువాఁడో యెఱుంగనే. ఇట్లు నన్నాతండు నెఱుంగఁడే? పర స్పరానురాగంబుగలుగుట యెట్లని యడిగిన నది యిట్లనియె. దేవీ! నీవాతని నెఱుంగక పోయినను నిన్నాతండెఱుంగు. ఈదినంబున మీయిరువురకు మన్మథుండెయెఱుకపఱచె. దైవఘటితంబును మంచిదియయి ప్రవర్తిల్లె. "తప్తేనతప్తమివ సంఘటనాయ యోక్తుః" [కఱఁగఁబడిన దానితోఁ జేర్చుటకు మఱియొకదానిం గఱఁచు] అన్నట్లు మీకూడికయు రసావహంబై వెలయు ననఁగా నేను మనంబున సంశయించుచు నోసీ! యా నవమన్మ

ఘుండు నన్నెఱుంగుటకుం గతం బేమియనిన నదియు నో దేవీ! నిన్నెఱుంగకయేనా యిన్నిదినంబులనుండి విన్ననవున నీయెడల మెలంగుచున్నవాఁడు. అన్నంబని తిని యెఱుంగఁడు. నీనాతని మొగంబుం గాంచనొల్లక యుండినను నీపైఁ బ్రేమచే భవత్సంకల్పకల్పితములగు ననేకమదలేఖ లాతఁడంబొదివియున్నవారు. చీమచిటుక్కుమన్నను కోమమ్మత్తదంతినివగునీవు వచ్చుచున్నావోయంచు నెదురుచూచు. అని వినిపింప నేను నోసీ! నీ వింతపల్కులు యా సుకవర్ణినిం జేర్కొనియేనా యని యనఁగా నది యో దేవీ! యాపేరు నాతండు కొన్నిదినంబులనుండి కార్యార్థము ధరించియున్నవాఁడని యనిన నందుకుసంశయమందుచు నేను దానింగాంచి యేమే యోసీ! మనయింటనుండు నతండు సురవర్ణియను మారుపేరు ధరించియున్న యితరుండా? వాస్తవముగా సురవర్ణి కాఁడా? యని యడిగితి. అందు కది యౌనని యూరకున్న నేను దానింగాంచి యితండు సురవర్ణి కాకున్న నెవ్వఁడు? ఏకులప్రువాఁడు? అతని పేరెయ్యది? యని ప్రశ్న సేయఁగా నాదాసియు నో దేవీ! యతండు నీవలపులమగండు, క్షత్రియకుమారుండు, అతనిపేరు రోచనుండు. అతఁడు నిన్ను సుకవర్ణిబారింబడక తప్పించి కొనితెచ్చి యున్నాఁడు. సురవర్ణియని నీతో వాడుకొనుటమాత్రమె కాని యీయూరరోచనుండనియె పిలువంబడుచుండు. నీకుం దనయం దనురాగంబుగలుగుదనుక దన్నుఁ బ్రకాశింపంజేసిన విరసంబగునని నాకు నట్ల యేర్పాటుచేసియున్నవాఁడు. ఈవిషయంబు నీ వెఱుంగనిదానవై యాతండు సురవర్ణియేయని భ్రమసి మొగంబైనజూచినదానవుగావు. ఈదినం బాతని నుదయాదిత్యుని సమీపంబునంగాంచితివి యనఁగా నేను నాతని చమత్కారంబున కానందంబు నచ్చెరువునొందుచు దానింగాంచి యోసీ! కలవృత్తాంతంబంతయుం దెల్పుమనఁగా నదియిట్లనియె. ఓరాణీ! వినుము. నీజనకునియింటికడ నుండు నప్పుడు సురవర్ణి నిన్ను వివాహంబుచేసికొనంగోరి యొకనాఁడు తనభావంబు నీతోఁ బ్రకటింపంజేయ నీవుకోపగించుకొంటివి. అదిమొద లాతఁడు నీయెడల మక్కువగల్గి యుక్కివంబున నిన్నుంగైకొన యత్నించుచు స్త్రీవశీకరంబులగు మణిమంత్రౌషధంబుల ననేకవిధంబులగువాని సంపాదించి యవియన్నియు నీయెడం బ్రయోగించియు ఫలంబు నందక చింతాక్రాంతుఁడై యాహారంబుమాని దురిహాభిభూతుండై దినములుగడుపుచు నెల్లకాలము సిద్ధులకు విశేషములగు ధనంబులొసంగి వారి నన్నపానాదులఁ బరితృప్తి నొందించుచుండెను. ఇట్లుండ నీవును చిన్ని యెలజవ్వనంబున నుండునప్పుడు.

సీ. బంగారుపూసలరంగారుననుచిన్ని మొలకచన్నొగ్గలకులుకుఁజూచి
యించుకించుకసిగ్గుసంచారమై మించుచుఱుకు వాల్చూపుల సొగసుఁజూచి
నానాటికిని చిక్కి నకనక పడునట్టి చిన్నారితేఁగౌనుచెన్నుఁజూచి
తోఁచితోఁచకలేఁత నాఁచుతీవియబోలు నూనూగునూగారుజానుఁజూచి

తే. సరసమై మించుమందహాసంబుఁ జూచి
గడియకొక్కొకవిధమగు కాంతిఁ జూచి
వన్నెలొల్కెడి మురిపెంపువగలు సూచి
బాళిచే సగమయ్యెనా బాపనయ్య.

ఇట్లు విప్రకుమారుండు మదనవేదనాభిభూతుండై యేమియుందోఁచక యితరులతో మాటలాడనొల్లక యున్మత్తునిచందంబునం దిఱుగుచు నొక్కనాఁడు నగరము వెలుపలనుండు భైరవాలయంబున నొకశిలాతలంబుపైఁబరుండి కన్నీళ్లుకాలువలై పాఱ ననేకవిధంబుల దుఃఖించుచుండునప్పు డొకసిద్ధుం డచ్చోటికరుగుదెంచి వాని పడుపాట్లుగాంచి మించిన కరుణాతిశయంబున నోకుమారకా! నీవేల యిట్టువంతలంగుందెదవు. తెల్పితివేని యది దొలంగించునుపాయంబు సాధ్యమగునంత దనుక సేయుటకనువుపడుదును. అనఁగానే యతండును లేచి కన్నీరు దుడిచికొని యాతనిపాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె. ఓయయ్యా! నే నేమి చెప్పంగలను. అసాధ్యజనోచితంబగు మార్గంబున మెలంగంగోరి యలభ్యవస్తుప్రార్థనాపిహస్తధైర్యుండనై మరణంబ శరణంబని యున్నవాఁడననఁగా నాసిద్ధుండు నోవిప్రకుమారా! యలభ్యంబని నీవు తలంచినను నా మణిమంత్రౌషధంబులచే లభ్యంబుకానిదిలేదు. అం దదేని నీకొసంగెదననిన సురవర్ణియు భవత్సంగమంబున కువ్విళ్లూరుచుఁ దనకొక కాంతావశీకరణౌషధంబు గావలయునని ప్రార్థింప యోగియు నొకరసగుళిక యాతనికిచ్చి యిది నీకిష్టయగు కాంతాతిలకంబుచేతి కందఁజేసితివేని యొకరాత్రి యంతయు దేహంబు దెలియక నీకు వశగతయై యుండు. సూర్యోదయంబయ్యె నేని ఈగుళికామాహాత్మ్యం బుపయోగింపదు. ఈలోపలఁ జతురమతివై కార్యంబు సమకూర్చుకొమ్మని చెప్పి అజోగియుఁ దనయిచ్చం జనియె.

సురవర్ణియుఁ జెన్నిధిఁగన్న పేదచందంబున నిన్నుఁ దనకుం బ్రాప్తప్రాయ యని తలంచుచు నతివేగంబ నీచదువుపాఠశాల కేతెంచి యాగుళిక నీచేతనిడిన నదిమొదలు వానికి వశగతంబగు భావంబుతో మెలంగుచుంటివి. ఈమోసంబు సమీపమునసుండువా రెఱుంగుదురనియేమొ యాతఁడు నిన్నేమియుం బలుకరించక నీవును విద్యాశాల విడిచి పోవునప్పుడు నిన్నొకరహస్యస్థలంబునకుఁ బిలిచి "యీనాటిరాత్రి రెండుజాములకాలమునకుఁ బెద్దగంటమ్రోగుసమయమున నిద్దురమేల్కాంచి యొంటరివై భైరవాలయసమీపంబునకు రావలయు. అచ్చటికే వచ్చియుండి నిన్నుఁ దోడ్కొని పోయెద. నీవంతిపురంబు వెలువడునప్పుడు చేటికావేషంబు ధరియించి వచ్చితివేని నిన్నెవ్వరునడ్డగింపరు" అనఁగా నీవునుసమ్మతించి యింటికివచ్చి తద్గతంబగుమనంబుతో మెలంగుచుంటివి.

ఇది యేను చెంతలఁ జెంతలం బొంచి పొంచి యుండి వినుచున్న దానం గాన నెచ్చెలి కాంతాతిలకము కష్టసుఖంబుల ననుభవింపవలసియున్నదో? ఇది యితరులకుం దెలిపితినేని నాకేమి చేటు వాటిల్లునో? యని తలంచి యెవరికిం దెలుపక యేను నాదినంబున నింటికేఁగి భోజనంబుఁ జేసికొని యతివేగమె నీ వుండుచోటికి వచ్చుచుండఁగా నా రెండుజాముల ఘంట మ్రోగెను. అందుకేను మనంబున నింక పదిఘడియల ప్రొద్దున కాలేదు, ఇప్పుడ యీ రెండుజాముల ఘంట మ్రోయుటకుం గారణం బేమో? యని తలంచుచు నతివేగమున వచ్చుచుండఁ ద్రోవలో నాఘంటకొట్టెడివాఁ డెదురుపడిన వాని నడిగితిని. వాఁడును నన్నుఁ జూచి యో లలితా! యీదినము చతుర్దశిగాన మనరాజు పట్టణసమీపమున నుండు శంకరపురంబున నున్న మహాకాళిని దర్శింప నంతఃపురకాంతాసమేతుండై యేఁగెను. ఎల్లి యుదయంబున గాని రాఁడు. నాకు బహుదినంబులనుండి ప్రణయపాత్రం బైయున్న యొకకాంత యనేకప్రయత్నంబుల సమ్మతించి యీ నిశీథసమయంబున నొకసంకేతస్థలంబునకు నన్నురమ్మని చెప్పి పంపినయది. అటమకంబుచే నేను నాచోటికింబోవ సమకట్టి రాజు నూరకేమింజేసి ముందుగనే ఘంటకొట్టి వెడలిపోవుచున్నాఁడను. అని చెప్పిన నేనును వల్లెయని కన్యాంతఃపురమునకు వచ్చి యెదురుగా వచ్చు నిన్నుం గాంచి చేటివేషంబు ధరించియున్న నీసాహసమున కచ్చెరువందుచు నీవెనువెంటన వచ్చుచుంటిని. భైరవాలయంబునకుం జేరినసరికి నొకగుఱ్ఱంబుపై నొకమానిసియు రౌతులేనిగుఱ్ఱం బొక్కటియు నచ్చోటనుండుటం గాంచి నీవు ప్రక్కకుం జూచి యో చేటీ! గుఱ్ఱంబు పయిం గూరుచుండుము. అని యశ్వంబు నధిరోహించిన నాయశ్వంబును రౌతు ఎక్కియుండు గుఱ్ఱంబుతోడన యరణ్యమధ్యంబునకుం జని యనేక దుర్గమస్థలంబులఁ దాటి సూర్యోదయకాలంబున కొకకొలనిగట్టునకుం జేరెను. అది మొదలుకొని నివు దేహం బెఱుంగుదువు. మీర లీపట్టణంబుం జేరినయనంతర మొక్కనాఁ డాసువర్ణవేషము ధరియించియున్న యాతనిం దద్వృత్తాంతంబు సవిస్తరంబుగ నడుగం గోరి ప్రస్తాపంబుఁ జేసితి. అతఁడును తాను విజయాభిధానపురంబునకుం బ్రభుఁడనియు రోచనాభిధానుండనియు ననేకదేశంబులం గాంచుచు నేతెంచుచున్న తనకు భైరవాలయసమీపంబున కాంతాతిలకంబుతో నీవు ప్రాప్తవయితివియనియు వచియించెను. ఆకారమా నింగితమును సదాచారసంపత్తియుం గాంచిన సత్తమక్షత్రియకుమారుండు గాని యితరుఁడు గాఁడని తోఁచెడిని. క్షత్రియకుమారుండు కానిచో వ్యాఘ్రసంహార సమర్థంబగు బలంబును మన్మథుని మీఱుసోయగంబును గలిగియుండునా? యనిన నాచెలి వచనంబులు విని యేను నానందాంబుధిం దేలుచు నో లలితా! శీఘ్రంబ యేఁగి యీరాజకుమారునిం దోడ్కొనిరమ్ము. ఇన్నిదినంబులు భ్రమసియున్న దానం గాన నతని కంటంబడనైతి. నిన్ను నలితయని యెఱింగియు నీ వావిప్రునికి హితంబుగఁ బ్రయత్నించుచు

దానవని యెంచి నీతో మాటలాడుటకు శొల్లకయుంటిని. సైతనియతి యేరికైన నలంఘ్యంబుగాదె. ఇంతదనుక సుకవన్నియని భ్రమసియుంటి. ఇప్పుడు క్షత్రియకుమారుండనియు. సదాచారసంపన్నుండనియు నాయందనురక్తుండనియు విని యెంచుకేనియుం దాళకయున్నదాన. అతివేగంబున నేఁగి యాతనిందోడ్కొనిరమ్ము. వేగిరంబ పొమ్ము. అని చెప్పిపంపిన నదియు వల్లెయనియేఁగి యొకింత సేపునకువచ్చి దేవి! కుమారుండువచ్చి భవదాజ్ఞాప్రతిపాలకుండగుచు ద్వారదేశంబున నున్నవాఁడని చెప్పఁగా నేను నతి కుతుకంబునలేచి దిగ్గనంబానుపుడిగ్గి సన్నవలిపెంపుచీర బిగియంగట్టుకొని, పెనఁగొని యున్న ముత్యాలసరుల చిక్కులెడలించి కుచంబులం గుదురుపఱచికొని, వదలి యున్నతొడవుల నుచితస్థలంబుల నిడికొని, క్రొమ్ముడిదిద్ది, రైకఘటియించి, పైటకొంగునం గస్తూరితిలకంబు నొత్తుకొని నిగ్గులుజేరు నిగ్గునంగొదుకుపూను పాదవిన్యాసంబులతో నేతెంచి ద్వారదేశంబున నతనింగాంచి నిగ్గువిశేషించి తలవాంచి యూరకుంటిని. అప్పుడా మనోహరాంగుండును నన్నుంగాంచి మందస్మితసుందరవదనారవిందుండై యిప్పుడే కృతార్థుండనైతిని. ఓ ప్రాణనాయికా! నీయనురాగవీక్షణంబులకుం బాత్రుండనైతి. ఈనాఁడు మంగలవిడువ్రర మన్మథుం డనుగ్రహించె. ఇఁకనైన నన్నాదరింపుము. ప్రేమరసపరీవాహంబులైన నునువాఁడిచూపుల ననురాగభరంబు నింపుము. నాయంగతాపంబు నపనయింపుము. అనఁగా నేను నాతనికిం గృతాంజలినై యో ప్రాణనాథా! యే నింతదనుక నిన్ను రాచకుమారుండవని యెఱుంగక యపరాధ శతంబు లొనరించితి. అవి క్షమింపఁగోరెదనని యూరకున్న నప్పుడతండు నాకరంబు తనకరంబునందెమల్చి శయ్యాగారంబునకుం దోడ్కొనిచని శయనంబునకుం దారిచి ముద్దుపెట్టుకొని సమీపంబునం గూరుచుండ నునిచి సరసాలాపంబులాడుచు నా యుచ్చతమలపాకుమడుపు లందుకొనుచు నులిక్కిపడి లేచి యో కాంతామణీ! నేనొక చోటం బ్రమాదవడి వచ్చియున్నాఁడను. మనయొక్క లలిత నీవృత్తాంతంబు నాకుం జెప్ప నేతెంచె. అంతకుమున్నె యంతఃపురంబునం జరిగినవిషయం బెఱింగియున్న వాఁడఁగాన దాదింగాంచి "శ్లో. కుశలంతస్యాః" [ఆకాంతామణి సేమముగ నున్నదా?] అనియడిగితిని. అందు కాదాని "జీవతి" [బ్రతికియున్నది]యని యుత్తర మిచ్చెను. అందుకు నేను "కుశలంపృచ్ఛామి" [ఓ దాసీ! కుశలమడుగుచున్నాను గాని బ్రతికియుండువిషయ మడఁగలేదు] అనఁగా నాచేటియు "జీవతీత్యుక్తమ్" [బ్రతికియున్నదియని యప్పుడే చెప్పితి నే] యని యనియెను. అదివిని నేను మనంబున భయంబుతో దానింగాంచి "పునరపితదేవకథయసి" [ముందు జెప్పినదే మరలబలుకుచున్నావు. ఏమది? తెల్పుము] అనఁగా నాచేటి "మృతాన్కథం కథయామియా శ్వసితి" [ఓకుమారుఁడా! ఆ నాయిక యింకా మరణమొందలేదే. అట్లుండ మరణించె నని యెట్లుపల్కుదు. నేను వచ్చునప్పుడు ప్రాణములుపోక కొట్టుకొడుచు నిట్టూరుపులు

నిలుచుచున్నయది. అట్టిప్రాణములుపోకయుండగానప్పుడే చచ్చినదిగా నెట్టుచెప్ప నోపా డను] అనియనెను. అదివిని నేనుమనంబున మదనుండు మహాక్రూరుండు. ఎట్టిక్రూరకృత్యం బైన నొనర్పఁజాలు. అనితలంచుచు నుదయాది[illegible]కొని యచ్చోటువాసి కదలి యతివేగంబున నేగుదెంచుచో నాపిఱికి మధ్యస్థలంబునందు నొకచండికాలయంబు గాంచి ప్రతిదినము నేను వచ్చుచుఁ బోవుచుండునప్పుడు నాకాళికి నమస్కరించి పోవుట వాడుకగాన నవ్విధంబుగ నాదేవికి సాష్టాంగనమస్కారంబుఁజేసి లేచి స్తుతించి భవదధీనంబగుమనంబుతో నాచేతనుండు చంద్రహాసం బచ్చోట మఱచివచ్చితిని. అది యెత్తికొని శీఘ్రంబవత్తునంతదనుక మద్విరహంబు సైచియుండుము. అనఁగా నేను వదనంబువాంచి ప్రాణనాయకా! మన లలితాసఖినిపంపి తెప్పించుకొనవచ్చును. మీరుపోవలదు. ఇఁక నిన్నుఁబాసి యొకనిమిషంబైనను ప్రాణంబులు ధరింపజాలను, అని యనేకవిధముల వేఁడికొనఁగా నాశౌర్యుండు ఓచెలీ! యింత భయపడ నేలా? ఈ నిశీథినియందు స్త్రీలనొంటిగాఁ బంపఁగూడదు. ఇదె చూచుచుండు మొకవక్క కొఱుకునంతలో వచ్చెదనని చెప్పి యతిత్వరితగతిం జనియె.

గడియకాలంబయ్యె నాతఁడు రామింజేసి యేను వియోగభరాక్రాంతనై యేమి యుందోఁచక లలితాసఖిం బిలిచి యో ప్రాణసఖీ! మన రోచనుం డిల్లువెడలిపోయి యొకగడియయయ్యె. కాళికాలయం బిక్కడికి సమీపముననే యున్నది. రాజకుమారుండు రామికిం గతంబెద్దియో తెలియదు. అడియునుంగాక నామనంబును తద్విషయం బున ననేకానిష్టశతంబులు చింతించుచున్నయది. ఇంకనిచ్చోటం దడయ శక్తంగాను. ఈ గాఢాంధకారంబున నిన్నొంటిగ నంపుటయును మనంబొల్లదు. కాన పయనంబున కాయత్తనైతి. నాతోఁగూడరమ్ము. అని చెప్పుచు మదనవేదనావిహ్వలంబులగు నంగం బులతో దాని నవలంబంబుగాఁ గొని మెల్లనఁ బానుపుఁదిగితిని, దిగుచుండఁగానే నాకుఁ గుడికన్నదరె. అప్పుడేను మనమున నక్కటా! దైవము మఱొక్కటియును పక్రమించె, ఇఁక నేమిచేయనున్నదో? శ్రీరామునంతవాని నడవులలో దిరుగుచు పరాపహృతకళత్రుఁడై మెలంగున ట్లొనరించెగాదె? అనితలంపుచు లలితాద్వితీయపరి జననై కాళికాలయంబున కేఁగుచుండు నాకు సమారోపితశరాసనుండై బాణసంధా నంబుగావించుకొని కుసుమాయుధుం డనుచరుండయ్యె. చందురుఁడు నడిం చి దూరంబు నకుం దనకరప్రసారణంబుచేసి మత్కారంబుం బట్టికొని తిగుచు వానిపగిదిందోఁచె.

నేను నడుగడుగునకు నేలకుం ద్రెళ్లుదునని యేమెంరాగం బవలంబంబై నిలుచు చుండె. సిగ్గును వెనకకుం ద్రోచికొని హృదయం బింద్రియంబులతో ముందరం బరువు లిడుచుండె. నిక్కువంబుగ నుత్కంఠ నన్నెత్తికొనిపోవుచుండె,

ఇట్లు చని సమీపమునకుఁ జేరవచ్చుడు నాహృదయంబు శంకాసంకులితంబయి చెదరి యేమని యొకయనిష్టంబు నంతరంగంబునకుఁ దెల్పినట్లు మిగుల విషణ్ణంబయి యుండఁగా నేను అలితా! యేమేమీ యిది. యని భయముతోఁ బల్కుచు శరీరంబు వడవడవడంక నతిత్వరితగతింజని కొలఁకు దాపుననుండిన శిలాతలంబుపై శిరంబును వ్రేలై పడి యున్నవానిం గాంచితి. ఇట్లుచూచి ప్రాణంబులు వెడలి దానిచందంబున నేనపయిం బడి మూర్ఛనొంది పాతాళవివరంబునం బడినవనువునం. కొంతతడవు నే నెక్కడ కేఁగితినో? ఏమిచేసితినో? ఏమంటినో? ఎక్కడనుంటినో? ఒక్కటియును తెలియంగ యొకింతసేపునకు దేహము తెలిసి యసహ్యంబగు శోకాగ్నిచే దహ్యమానంబయి భూమి పయిం బొరలు నాకాతనుంబుం గనుగొని లేచి అక్కటా! దైవంబు నన్నిట్టు లాపదంబు నిధిముంచునే? శోకదావాగ్నిచేతం దహియించునే? ఇట్లు వంచించునే? అయ్యో! నా కిట్టి కట్టిడిగతియు కలుగవలసియుండెనే? ఓరి దురాత్మా! ఓరి పాపీ! మన్మథ నిర్ఘృణ! యెంతయకృత్యము చేసితివిరా! ఓరి పాపీ! దుష్కృతకారిణి మదనలేఖా! యెంత నిర్భాగ్యురాలవే ఓరి దుశ్చరిత! ఓరి కఠినచిత్తా! దైవమా! చండాలు! కృతార్థుఁడ వైతివటరా? ఓ ధర్మదేవతా! నీవు చచ్చిపోతివే? ఓ ప్రాణనాథా! యేను నీవెంటవచ్చెదను. తీసికొనిపొమ్ము. నిన్నెడబాసి యొక్కక్షణంబైన నిలువఁజాలను. క్రొత్తవానిపగిది నన్ను త్తలపెట్టి మెత్తవలేని మనంబున నొక్కయడవిలో విసర్జించిపోవుట యుక్తమమా? ఓ దయితా! నీకిట్టి యతినిష్ఠురత యెట్లు సంభవించెనో చెప్పుము.

ఓ నాయకా! నిను వినాగా నెక్కడకుఁబోదు. ఎవని వేఁడికొందు. ఎవని శరణము కైకొందు. కటాకటా! దిక్కులెల్ల శూన్యంబులయ్యె. ఇఁక జీవితంబు నిరర్థకంబు. ఎవనితో బరిభ్రమింతు. ఎవనితో నాలపింతు. నాయకా! లేచి యిట్లు పిలపించుచున్న నాకుం బ్రతివచనం బీఁగూడదా? నీకు నాయెడలనుండు ప్రేమ యేమయ్యె? ఆస్మితపూర్వక భాషణంబులును శృంగారతరంగిత వీక్షణంబులు నిప్పుడెట్లయ్యె. ఈ కాళికాలయంబునం జంద్రహాసంబు గైకొని వచ్చెదనంటివే యామాటను సత్యంబు సేయంజనదా? హా నాథా! జీవితనిబంధనా! యేకాకినిగా నన్ను విడిచి యెందుబోతివి. నీకొఱకు నేననుభవించిన యవస్థల నీలలితాంగినతగుము; నీవెడబాసివచ్చిన ఒకగడియయు యుగసహస్రంబులయి పరిణమించెనే? సుముఖా! నామీఁదఁ గోపము మానుము? ఒకమారైన సంతపింపుము. ప్రణతవాత్సల్యంబుఁ గాన్పింపుము. ఇంచుకయైన విలోకింపుము. మనోరథంబులం బూరింపుము. ఏనార్తనే! అనురక్తనే! అనాథనే! బాలనే! అగతికనే! దుఃఖితనే! అనన్యశరణనే! అతనుపరిభూతనే! ఏల నాయందు కరుణింపవు? నీవంటివాని వదలి బ్రతికియున్నానే! నావంటి కఠోరహృదయ గలదా! ఓ నిర్ఘృణుఁడా! దైవమా! ఇంకనైన గణింపరాదా? భగవతీ! పార్వతీ! నీతో విన్నవించుకొనుచున్నాను. దయితదక్షిణ

యిచ్చి కాపుము లోకమాతా! లలితా! యీతనిం బ్రతికింపలేవటే? అని యిట్లనేక విధంబులం బ్రలపించుచు నాలలితాసఖికంఠంబుం బట్టికొని యొకింతసేపు విలపించితి. ఓ యయ్యా! యిప్పుడు చింతించిన నంతఃకరణంబునకుం దగులవు. అప్పుడట్టి లచింత్యంబులు నశిక్షితంబులు ననుపదిష్టంబులు నదృష్టపూర్వంబులు నతి కృపణంబులు నగు చాటుసహస్రంబులుద్భవించె. ఆసంలాపంబులేల? కటకటా! యతి కరుణంబులా రుదితంబులు. ఆ ప్రకారంబన్యంబు. ప్రళయసముద్రతరంగంబుల వేగంబునం బొంగు నశ్రుజలప్రవాహంబుల జలయంత్రంబులపగిది నానయనంబులు వర్షించుచుండె. ప్రలాపంబులు పయింబయి చిగుర్చుచందంబునం దోఁచుచుండె. దుఃఖశతంబులకు శిఖరంబులు గలిగినట్లయ్యె. మూర్ఛలు సంతానంబులం బడయుచుండురీతిం గాంచుచుండె. ఈ మూఢహృదయం బతికఠినంబగుటచేతనో, ఈ శరీరంబు ననేక దుఃఖసహస్రంబుల సహించునదిగాననో, ఇట్టి దీర్ఘశోకంబు విహితంబగుటనో, లేక జన్మాంతరకృతంబగు దుష్కృతంబునకు భాజనంబగుటచేతనో, ఆ పాడుదైవమురొక్క దుఃఖదాననైపుణ్యవిలాసంబుచేతనో, ఏకారణంబుననో నాప్రాణంబులు నన్నెడబాసి పోఁజాలవయ్యె. ఏను నట్లనేకవిధంబులం బ్రలాపించి తైలనాశంబున నించించుక సంకోచించుచు నిర్వాణోన్ముఖంబులైన దీపంబులతోఁ జూపట్టు దివ్వెకంబంబుల యధఃప్రదేశంబులనుండి యంధకారంబులు కలయం గ్రమ్ముచుండం జేయునదిలేక తత్సమీపంబుననుండు హ్రదంబులోఁబడి ప్రాణంబులు వదల నిశ్చయించుకొని లలితతోఁగూడ నచ్చోటువాసి కదలి దాని యనునయాలాపంబుల నొల్లక పూర్వపరిచితంబగు నాయాలయపు వెనుకవైపుత్రోవం జనుచు తదీయంబగు నుత్తరద్వారంబుం జొచ్చి నిర్గమించునో నతిగాఢంబగు నంధకారంబుచేఁ గన్నుమిన్నెఱుంగక నా వెనువెంట వచ్చుచుండు లలితాసఖి యేమయ్యెనో యనితలంపక కొంతదూరం బందుఁ జనిచని తదీయదారుసమాఘాతవిశీర్ణలలాటపట్టికనై మరలి దైవంబును నిందించుకొనుచు వచ్చుచుండ నొకతట్టు తలుపులు మూయుశబ్దంబు వినంబడెను. ఈ యర్ధరాత్రంబున నాఁడుదాని యెలుంగు వినిరేని యచ్చటచ్చటఁ గృతసంకేతులై డాఁగియుండు విటచేటకవిదూషకచోరప్రాయజనులు నన్నుఁబట్టి బాధింపకమానరనుకొని లలితాసఖింగూడ బిలువక యూరకయ తిరుగుచు నలబ్ధనిర్గమననై గతియెఱుంగక కొంతతడవునకు నొకపేటికలో నుండి మనుష్యసంవాహితనై పోవుచుండుట మనమునకు రాఁగా నిదియు నొకవిధివిపాకం బనితలంచుచుం జేయునదిలేక చింతాసంతానదంతుర హృదంతరంబుతోఁ బంజరంబునం దగులుకొన్న చిలుకవలెఁ బలుగతుల నలయుచునుండ నా పెట్టియ యొక్కచోట నుంచబడుట భూతలసంస్పర్శంబున నెఱింగితి. కొంతతడవునకుం గొందఱు బానిసలా పెట్టియతలుపులు దెఱచి నన్నుంగాంచి నా రూపరేఖావిలాసంబుల కచ్చెరు

వందుచు నొండొరులతో నోసి! యీ కాంతామణిం గాంచిన నీ భూమండలం బేలెడి చక్రవర్తికిం బట్టపురాణియై యుండందగునని తోఁచెడిని. ఈ నాతీశిరోమణిం బట్టి తెచ్చుటకుఁగా నీ ధనలుబ్ధుండు బహుదినంబులనుండి వేచియుండి తుదకు సాధించిన వాఁడయ్యెఁగదా. దీనిపెనిమిటి రోచనుండను రతికి మన్మథునివిధంబునను, శచికి దేవేంద్రునిరీతిని, లక్ష్మికి నారాయణునిభాతిం దగినవాఁడయియుండె. ఈమోసగాఁ డాతని నెట్లు వంచించి తెచ్చెనో యెఱుంగము. బుద్ధిమంతులును ప్రమాదంబు నొందు దురుగాదె? సర్వసౌభాగ్యలక్ష్మికిం బుట్టినిల్లగు నీపల్లవపాణి నిట్టి యతినీచక్రియాలకుం బట్టిత్రోచిన కట్టడిదైవంబు నేమనవచ్చు. అదియునుంగాక.

సీ. చతురతతోఁ బల్కు గతులెఱుంగనికొమ్మ పరపురుషుల నెట్లు బల్కరించు
మగవారిఁ జూచిన మఱుఁగుఁజేరెడు నింతి పరకాంత్రకేగతి వలపుఁగొలుపు
పూవు దాకినఁ గందుపోలతి పై దివిచు విటమర్దనమునకే విధి సహించు
శీలముతో నుండఁబోలు లీలావతి పరరతి కేలాగు బాలుపడును

గీ. భ్రమరమంటని కుసుమంబు పగిదిఁ దోఁచు
దీని నవయౌవనము కులోద్దీపకుఁడగు
రాచకొమరునికిని గాక రహిఁ దొరంగి
కటకటా నష్టకాండ్రచే కానుకయ్యె.

మఱియును.

చ. లలితస్వరూపసంపదల లక్ష్మి యనందగునట్టికన్యకన్
బొలుపుగ సృష్టిచేసి విటపుంజము చేతికిఁ బట్టియిచ్చెయా
జలజభవుండు, రాచిలుక సానికుచేతికొసంగురీతి భూ
తలసుజనాళికిన్ హృదయతాపభరంబు నొనర్చె నక్కటా.

చ. ధరజననాంతరాచరిత దారుణపాపఫలంబుచేత నీ
తరుణి యనిల్లువాసి వెస ధారుణిదేవకుమారుమాయ భూ
ధరసుకుమారు బొందియును దద్విరహంబున స్రుక్కిపొక్కుచున్
శరణము లేక దైవగతిచాలమి నీ ధనలుబ్ధుఁ జేరెఁగా.

క. తలవ్రాఁత తప్పిపోవునె
యిల నెంతటివారికైన నెవ్విధినైనన్,
లలితాంగి ద్రుపదజాసతి
పలువిధములఁ గష్టగతులువడదె తొలుతన్.

అని యిట్లనేకవిధంబులం దమలోఁ దామనుకొనుచు నాదగ్గఱకేతెంచి యిట్లనిరి.

ఓయమ్మా! మనమందఱము సమానదుఃఖులము. ఏమన నీవలె ననేకదేశంబులనుండి కొనితేఁబడిన కన్నియలము. ఇది పాషాకరం బనుపట్టణము. దీనియందుం గొటీల్యుండను రాజు వసించియుండు. "యథారాజా తథాప్రజాః" అన్నట్లు ప్రజలును తదనుగుణు లయి ప్రవర్తిల్లుచుండెదరు. వినుమీ ఈయూరనుండువారి జాతిధర్మంబులు నాచార సంపత్తియుం దెల్పెదము. సాధారణులకు వారికొండొరులకుం గలహంబు కలిగించి వారికి మాఱుగా రాజస్థానంబులం బోయి సత్యం బసత్యంబుగను, అసత్యంబు సత్యం బుగను దమనేర్పుకొలఁదిని స్థాపించి ధనంబులం గడించెడివార లీపట్టణంబునం బెద్ద మనుష్యులు, వారి నెల్లవారును గౌరవింతురు. మఱియును నధికారులన్నను ధనంబును నేర్పును గలవారియెడం గాని సత్యవ్రతులందు సుముఖులుగారు. అపరాధంబునకు మితిమీఱిన ధనదండనంబు విధించి యార్జితంబులుగాక యన్యద్రవ్యంబు లీధరాపతి కోశంబుల లేవు. పరదేశంబులకుం జని మగనాండ్ర ననేకవిధమణిమంత్రౌషధంబులచే వశీకరించుకొని తెచ్చి తదీయ రతిసుఖంబుల ననుభవించువార లీయూరి రసికవతంసులు. మఱియుఁ గంసాల, అగసాల, దూదేకుల, బలిజ, బాపన, పట్టుసాల, జంగము, కుమ్మర కమ్మరి, దొమ్మరి, బోగము, వడ్లంగి, తురక, చాకలి, యెఱుక, కులంబులవారికిని వెలయాండ్రకుం జనించినవార లీ నగరంపువ్యావహారికులు. పరపురుషులం గూడిగాని యీయూరితరుణులు సుఖంబుల ననుభవింపరు. అన్నంబు విక్రయించుట, భక్ష్యంబు లమ్ముటయు నీ నగరపు దేవాలయాధికారులపని. వడ్డిదీసికొనుట సొమ్ములడంచికొనుట యీనగరంబున నింద్యంబుగాదు. యథాశక్తి పరధనాపహరణంబు సేయకుండుట వృథాకాలక్షేపంబు. హరిస్మరణం బప్రయోజకులపని. ఆమశ్రాద్ధంబులకుం దిరుగుట విప్రకార్యము. కర్తృక్రియాపదంబు లెఱుంగక నిస్త్రపులై యుపన్యసించి తమతమ సమూహంబుల గౌరవంబు వడయుట కవిపండితవర్తనము. సద్యోగర్భంబులు దాల్చిన యుద్యద్యౌవనలకుఱంకుటాండ్రఁగలంబు వెలిచి రహస్యపత్త్రంబులకు తదీయధనంబులం బరిగ్రహించుకొని పునీతలని చెప్పుట శాస్త్రజ్ఞవాదులు సేయుపని. మఱియు నిట్టివినఁ గూడనిపనుల కీయూరుపుట్టినిల్లై వెలయు. అది యట్లుండనిమ్ము. నిన్ను దెప్పించినవాఁడు ధనలుబ్ధుండను పేరంబరగు నీయూరనుండెడి పెద్దసెట్టి. వీఁడు తనకుఁ దగినకార్యనియుక్తు లంగొని పథికులగువారిం బిలుచుకొని తెచ్చి వారివారికిం దగినయన్నపానాదుల నమర్చి యందుచే నపరిమితంబులగు ధనంబులం గడించుచున్నవాఁడు. ఆ యాత్రికులు గోరిరేని రాత్రులం దనయింటం గల కనకగాత్రులం గూర్చి యుతిసూత్రంబయిన సొమ్ము సంపా దించి మించియున్నవాఁడు. అందుకై పొంచిపొంచి నేఁచి పెఱదేశపు మించుఁబోఁడుల వంచించి తెచ్చి యంచితంబగు రీతిదక్కి యుక్కివంబున నెక్కొని ద్రవ్యవంతులగు వారలకుం గూర్చుట వానిపనియైయున్నది. ఇందుకు నీవు పాటుపడితివిగదే యని

చింతించుచున్నవారము. అని యా కాంతామణులు సెప్పగా నేనును నావిధి వైప
రీత్యంబుండలంచుకొనుచు నేమియుంబలుకక చేయునదిలేక యాదినం బాకాంతలు
చెప్పినచొప్పున మెలంగుచుఁ గర్తవ్యంబు దోఁచక స్వర్తవ్యునిం దలంచుచు నతి
నిర్బంధమున నభ్యవహారాదికంబులు దీర్చుకొనియుంటి. ఆ కాంతలు నాకు ననవరతం
బును పనులు సేయుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడొకదాని సాయంసమయమున నేతెంచి యోమదలేఖా! ధన
లుబ్ధుండు నీతోఁ జెప్పుచున్నమాట వినుము. ఏమంటివేని, ఈదినము మహాధనికుండగు
నొక రాజకుమారుండు మఱయింట నన్నంబుగుడిచి యన్నుల తలమిన్నయగు నొక
వన్నెలాడిం గలయఁగోరి నాకనేకధనంబులు చెల్లించియున్నవాఁడు. విచ్చలవిడి నీ
వాతనిగూడి పచ్చవిలుకానిపనుల మెప్పించుము. సర్వాలంకారాలంకృతవై గ్రచ్చ
రన నీయింటికిం తూరుపునకుండు మనోహరంబగు పై మేడమీఁదం గట్టంబడిన దారు
మయంబగుపడకటింటికింజేరుము. అని నీకాజ్ఞ యిడినవాఁడని యాదాసి దాఁగొనితెచ్చిన
యనేకాభరణంబులు నచ్చోట నునిచి చనియె. ఏనును నాగతియిట్లాయెఁగా యని నా
విధిదూఱుకొనుచు నంతికంబునకుండు వారినిర్బంధముచే నలంకరించుకొని చంద్రో
దయ సమయమున నాధనలుబ్ధునియింటి తూరుపుమేడపైన నుండు నతివిచిత్రంబగు
దారుమయమయిన పడకటింటికిం జని యచ్చోటనయుంటి. కొంతతడవున కక్కడ
కొక రాజకుమారుండువచ్చె. వచ్చి యారాజకొమరుండు నన్నుంగాంచి మించిన
మోహాతిశయంబునం బంచశరవేదనాక్షుభితహృదయుండై తాళంజాలక తటాలు
నచ్చోనమర్పంబడియున్న పట్టెమంచంబుపై గూరుచుండె. పాప మాతనిగతి నే నే
మందు! కూరుచుండినమాత్రంబుచే తన యామంచంబు పైఁబఱచియుండు ప్రచ్ఛద
పటంబు సురిగి యాతనిం గ్రమ్ముకొని దానినడుమనజారి యారాచకొమరునితో నందు
కథః ప్రదేశంబునకుఁబడు నొకనూతిలోఁబడియె. నేనును వానిగతిం గాంచి రిచ్చపడి
యచ్చటికింజని తొంగిచూచితి. అప్పుడారంధ్రంబునకు సరిపోవునట్లొక దారుఫలకంబు
మూసికొనుచుండె. ఇది యీయింటివారు చేసియుండిన కృత్రిమంబని తలంచుచు
నీ రాకొమరుని గతియేమయ్యెనోయని యెంచుచుండ నాపాతాళవివరంబునం గొంత
తడ వొకయార్తనాదంబు వినంబడుచుండి కొంతతడవున కడియుడంగె. ఏను నందుకు
మహావ్యాకులత నొందుచుండ నొకదాసి యేతెంచి యోమదలేఖా! యింక నీకిక్కడ
పనిలేదు. క్రొత్తదాసవుగాన నుత్తలపడియెద వంతెకాని యిందుకుం జింతింపకుము.
ఇంతకుముంగు ధనవంతులగు రాజకుమారులు పెక్కండ్రు కీబిలంబు సంయమనీద్వారం
బయ్యె. లుబ్ధకుండు దీపకంబుం గానిపించి మృగంబుల వలలందగుల్చురీతి నీ ధనలుబ్ధుం
డును మీవంటివన్నెలాడులం జూపించి యనేకుల వంచించి చంపుచుండు. ఇదియె

వీనికిఁ బనియని చెప్పి నన్నుందోడ్కొనిపోయె. ఇట్టి యకృత్యంబులు దినక్రమంబుగ పెక్కులు జరుగుచుండె. అనేకులకే మృత్యుదేవతనైతిని. ప్రతివాఁడును నన్ను గాంచినంతలో విహ్వస్తధైర్యుఁడయి శయనంబునకుం గడంగి యిట్లు యమలోకంబు నకుం బయనంబగుచుండు నంతియకాని మదనవేదనసహించికొని నాతో మాటలాడిన వాఁడు లేఁడయ్యె. ఇట్లేను శీలంబుఁ గాపాడుకొనుచుంటిని.

కొంతకాలం బిట్లు జరుగుచుండఁగా నొకనాఁడు ధనలుబ్ధునిపంపున నే నా పడకటింటికింజని మృత్యుగృహీతుం డెవ్వండకో? యని చింతించుచుంటిని. అప్పు డక్కడ కొకమహాపురుషుండు సనుదెంచె. అంతదనుక యేను పరపురుషానురాగంబు లేనిదాననయ్యుఁ దద్రూపసంపత్తిఁ గాంచినయంత స్నేహపరవశనై లజ్జయును భయం బును మనంబునం బెనంగ,

సీ. స్ఫురితముఖంబులై పులకించునిబ్బెంపు గబ్బిమచ్చన్నుబ్బు లుబ్బుసూప
మోహాంధకారంబు ముమ్మరించుపిసాళి బెళుకువాల్చూపులు కులుకులీన
నిద్దంపు నును చెక్కుటద్దంబులఁ దోఁచి మురిపెంపుచిఱునవ్వు మొలకలెత్త
కస్తూరితిలకంబుగ అగించుచులలాట పట్టి లేఁజెమట జూపట్టుచుండ

తే. మదినిఁగోరిక లుబ్బఁగ దడికగదుర
పోఁకముడివీడ మోదంబు పొలుపుగూడ
ధైర్యగరిమంబు దిగఁజార ధవునిఁజేరఁ
జూచితలయూచి లేచియా సుముఖుడాని.

కులకన్యకాజనవిరుద్ధంబయ్యు విటసంగమంబునకోయక పంచశరసాయక పీడిత నగుటంజేసి యానవమన్మథుని శరణు వేఁడికొనుదానని యనువునం దత్పురోభాగం బునకుంజని సిగ్గునం గించిదవనతాననపంకజాతనై నిలిచిన నావగకాఁడు నన్నుంగాంచి కొన్నిసంగతులడిగె. ఏనునాతనికుత్తరంబొసంగితి నదివినుము. (ప్రశ్నోత్తరపద్యము)

సీ. రాజు. నిన్నుఁగాంచినరాచ నెలఁత గాఁదో చెడి. మద. ఘనలకలంపులు కల్లలగునె
రా. భ్రమరమౌటనితీవె పగిదినుండెదవేల. మద. సంపంగినంటునే షట్పదంబు
రా. కులపాలికకు చిట్టి కుత్సితగుణమానె. మద. తలవ్రాఁతయేరికిఁ దప్పనయ్య
రా. ఈబచ్చుబారికీవెట్లుపాల్పడితివి. మద. మాయకసాధ్యంబు మహినిఁగలదె

గీ. రాజు. తొయ్యలులకన్యకాలయంబు దోపమతివ
మదలేఖ. సీత ద్రౌపది దమయంతి చెడిరె తొల్లి
రాజు. యబలలకు మానభంగంబు లగుటకలదు
మదలేఖ. సత్పతివ్రతలకు రక్షసచ్చరితము.

ఇట్లాతని ప్రశ్నల కుత్తరంబొసంగిన నన్నుం గాంచి యా కుమారుండు మిగుల వ్యసనాక్రాంతుండై కొంతతడవు చింతించి తలయూచి యా మంచంబుపయిం గూరుచుండంబోయి మత్ప్రతీక్షితుండై నిలిచి కలవృత్తాంతంబు తెలిసికొని తనపయినున్న యుత్తరీయంబుం దీసి యా మంచంబుపయినున్న తలగడకుం జుట్టి తనయొడలిసొమ్ములు గొన్ని దానికిం దగిలించి యామంచమధ్యంబునం బడవేసిన నది యా నాపాతాళ రంధ్రంబునంబడి యడుగుకుంబోయె. ఆ ద్వారాధః ప్రదేశంబున ననేక మృతకళేబరంబులం గ్రంపుగ పొంచుపడియున్న యినుపయంత్రంబులం దగులుకొనియున్న వానిం గాంచుచుండ వారుపఱకం బాద్వారంబద్దగించిన నదిగాంచుబుఁజొని రాచ కొమరుండు:- ఓ సుందరీమణీ! యీదినంబు నిమ్మృతులతో రాచకొమరులకు నేఁడనుచరుండనై పోవలసియుండ నన్ను రక్షించితివిగాన నిందుకే.. నీకేమి ప్రత్యుపకారంబు సేయుదు. ఇది మొదలు నా దేహంబును ప్రాణంబులు నీ యధీనంబులు. నిట్టుల ప్రకారంబున నన్నేలుకొనుమని చెప్పిన నేను నాతనితో నోయయ్యా! యీపట్టణంబున కెట్లు వచ్చితివి. ఇచ్చటి యవ్యవహారంబులు నీ కెట్లు తెలిసెనో తెలియక పోయె నాకివిల యీమాయలమారి కోమటిపాలంబడకుండ తప్పితివి. నీవృత్తాంతంబుం జెప్పుఁడనిన నాతండు నన్నుంగాంచి యిట్లనియె. నావృత్తాంతంబు మొదటినుండి చెప్పుటకిప్పుడు సమయంబుగాదు. బహుశ్రమంబు లనుభవించి యీదినంబున నీయూరికిం జేరితి. ఒక కొలనిగట్టునం గూర్చుండి విభూతిధూసరశరీరుండై సావిత్రి జపియించువాని పగిది వంగుళులు లెక్కించుచుండు నొక విప్రునింగాంచితి. ఈనగరవృత్తాంతం బడుగం గోరి యాజన్నిగట్టుతో నేను 'శ్లో. విప్రాస్మిన్నగరే మహాన్ కథయ కః' (బ్రాహ్మణుఁడా యీ యూరిలో గొప్పవాఁడెవఁడు చెప్పుము.) అనఁగా నాతఁడు 'శ్లో. తాళద్రుమాణాం గణః' (తాటిమ్రాకుల సమూహము ఈ యూరిలో నుండెడువారిలో గొప్పది. అనఁగా పెద్దమనుష్యు లీయూర లేరని తాత్పర్యము.) అని యుత్తరమిచ్చెను. మరల నేను 'శ్లో. కో దాతా' (ఈనగరంబున దాతయెవఁడు) అని యడుగఁగా 'శ్లో. రజకో దదాతి వసనం ప్రాతర్గృహీత్వా నిశి' ఈనగరంబునం జాకలవాఁడే దాత. వాఁడు ప్రొద్దున బట్టలు కొనిపోయి రాత్రికాలంబునం గొనితెచ్చియిచ్చును. వాఁడుగాక యితరుఁడు దాత లేఁడు.) అని యాతఁడు ప్రతిచెప్పెను. అందుకేను 'శ్లో. కో విద్వాన్' (ఈనగరంబునం బండితుఁడెవఁడు అనియడిగిన 'శ్లో. పరదారవిత్తహరణే సర్వేపి విద్వజ్జనాః' (పరులయొక్క భార్యలను పరులధనములను హరించుటయం దందఱును పండితులు. అందుఁ బాండిత్యములేనివాఁడీయూర లేఁడు.) అని యాతఁడుత్తరమిచ్చెను. అదివిని యేనునతనిం జూచి "కః త్వం జీవసి హే సఖే" (ఓమిత్రుఁడా! నీవీనగరంబున నెట్లు జీవించెదవు.) అని పృచ్ఛచేసితిని. అదివిని యాజన్నిగట్టు 'శ్లో. విషక్రిమిన్యాయేన జీవామ్యహం' (అయ్యా!

నేను విషదారువృక్షంబుట్టినపుడుకు దానినే భక్షించుచు జీవించురీతి నీ యాకారంబుట్టిన వాఁడఁగాన పీరికిం దగిన యుపాయంబుతో నిక్కడ బ్రతుకుచున్నాఁడను. అని నా ప్రశ్నకతఁడుత్తరమిచ్చెను. అంత నేను నామనంబున నిట్లని తర్కించితి. ఇదివరకు బహుకాలంబుగ బహుదేశంబులు చుట్టి చూచుచున్నాఁడను. ఇట్టినగరంబు నెక్కడ నైనం గానను. దీనియందుఁ బ్రవేశించి కొన్నిచిత్రంబులు చూడవలయుననియెంచి యేను నా బ్రాహ్మణునిఁ దోడ్కొని యాతనియింటం బనిచేయుట కొప్పించుకొని తత్సమాహూతుండనై యా పట్టణప్రవీథికెంటఁ జనుచు నన్ను మున్నెఱింగిన వారివలె మాటలాడు చేటీవిటవిదూషకాది ప్రాయపౌరనికరంబుల మన్నించుచు నాహారునియింటికిం జనితి. అతిథిజగు నన్నుం జూచి యా విప్రునిభార్య యేమేమొ గణుగుకొనుచు పెనిమిటిం దిట్టుచుఁ గొంతసేపు గృహంబున బిట్టుతిరిగి తుదకొకమూలలో పైటకొంగువేసికొని యిలపయిం బరుండి యెంతసేపటికిని లేవకయుండఁగా పాప మాబ్రాహ్మణుఁడు దాని సమీపంబునకుంజని, 'శ్లో. అః పాకం నకరోషి పాపిని,' (అయ్యయో! మనయింటి కతిథి వచ్చి ప్రాణములుపుచ్చుకొనుచుం బరుండియున్నాఁడే. ఓ పాపిష్ఠురాలా! వంటకము వండవేమే?) అనియనఁగా, నాపాటుత తటాలున లేచి మండిపడుచు 'శ్లో. కథంపాపీ త్వదీయః పితా' (ఎట్టెట్రా నేనాపాపినివి, నీయబ్బరా పాపి, నేను గాను. నన్నా పాపిని యని యనియెదు.) అని బెదిరింపంగా విప్రుఁడు మరల 'శ్లో. రండే+జల్పసి కిం' (ఓముండా! ఏమి విశేషముగా వదరుచున్నావు.) అనియెను. అంతట నది వానిసమీపంబున కేతెంచి చేరలతో బుగ్గలుబొడుచుచు 'శ్లో. త్వదీయజననీ రండా త్వదీయా స్వసా' (ఓరి పెద్దమ్మ పుత్రుఁడా! నేను కాదురా ముండను. మఱి నీతల్లి ముండరా, ఇంక నీతోడఁబుట్టువుముండరా.) అని బిట్టదలింపఁగా నా ధరామరుండు మనంబునం గలంకుచుఁ పైకిధైర్యంబుఁ దెచ్చుకొని యా దుఃఖంగాంచి శ్లో. 'నిర్గచ్ఛస్వ గృహాత్బహిః' (ఓసి! నాయింట నింక నీ వుండఁజనదు. ఇల్లువెడలిపొమ్ము. వెలికిరమ్ము.) అని పల్కఁగా నదివిని యా బ్రాహ్మణియు నట్లయనురా? నేనా యిల్లువిడిచిపోవలయును. అని చెప్పుచు నంతకుమూంద సిద్ధపఱచియున్న జింపిచేటయు మొక్కచీపురుంగొని వేగిరంబవచ్చి పెనుఘాతంబు చండంబున నా భూసురునిం జుట్టువట్టివంచి తగిలి వీపుమీఁద మోదుచుండ మెల్లన నేను వానివిడిపించితి. అంత నది నాబాహుబలంబుకోలఁదని వెనుకకీడ్వంబడి నిలిచి భుజంగినిచండంబున రోజుచు 'శ్లో. భవతి మే నవంత్వదీయం గృహమ్' (ఓరీ! యిది నీ యిల్లుకాదు. నాయిల్లురా. వచ్చినవారికెల్ల దగినట్లు మెలఁగి వారికి మనస్సున కింపు పుట్టించి ధనంబులుగడించి నే సంపాదించిన యిల్లుగాని ప్రార్థనలేచి యెవరుపట్టు కొని మొనమొనలాడుకొనుచుం గూరుచుండు నీమొగముఁజూచి యిచ్చినదటరా యిది.) అనియడుగఁగా నంతనాబ్రాహ్మణుఁడు వాకిటికివచ్చి యనాథునివలె నేడ్చుచు,

'శ్లో. హాహాదేవమమాద్య దేహిమరణమ్' (కటాకటా! ఓ దేవుఁడా! నే నీముండయొద్ద దొరకికొని బాధలఁబడలేను. ఇప్పుడు నాకు మరణము కరుణింపుము. నేను చచ్చిన వెనుక యీ ముండవిధవయై పలువురివలనఁ జీవాట్లుదినును.) అని మొఱలిడఁగా నది విని బ్రాహ్మణి 'శ్లో. శమ్యంమదీమంగళమ్' (నీవుచచ్చిన నాయుధోశోమ మొకటిపోయె. పో. అనిచెప్పి యింటిలోనికింజనియె.

ఏనును వారలచరితంబులుగాంచి బ్రాహ్మణునింజూచి యోయయ్యా! నీకు నా కొఱకు కష్టంబుసంప్రాప్తంబయ్యెంగదా. అని కరుణించి నా వ్రేలనుండు ననర్ఘంబు లగు మణులుచెక్కిన యుంగరమాతనికిం జీవికార్థం బిచ్చి మఱియొండొకచోటి కరుగ వలయునని ప్రయత్నపడుచు నాయింటికిం బోయిన నేమేమి యనర్థంబులు సంభవించునో యని చింతించుచుండఁ గొందఱు చనుదెంచి నాకుం బ్రణామంబులుచేసి కరములు ముకుళించి యిట్లనిరి. స్వామీ! మాయధికారి యీ యూరికిం బెద్దసెట్టి. అతఁడనుదినంబును తమభోటియతిథులకు సర్వోపచార పూర్వకంబుగా షడ్రసోపేతంబగు నన్నంబిడిగాని భుజియింపఁడు. అతిథులకుగా మూఁడుజాములవఱకు వేచియుండి వారు లభించని నాఁడు సంతసంబుదక్కి శరీరధారణంబునకుగా నించుక భుజియించు నంతియు కాని యింపుతో నారగింపఁడు. ఈదినము మీ రీయూరికి వచ్చుటవిని బహుసంతోష భరితుండై పిలువనంపి మీరాకకు వేచియున్నవాఁడు. వేగిరంబ యేతెంచి యాతని మందిరంబుఁ బావనంబుసేయుఁడు, అని విన్నవింప నేనును క్షుధాతురుండనై యున్న వాఁడఁగాన వారిమాటలకు లోఁబడి యాసెట్టియింటికివచ్చి సర్వోపచారంబులువడసి మధ్యాహ్నమంతయు వాదంబులాడుచు నాతనితోఁ బ్రొద్దుగడపి రాత్రి భోజనంబుఁ జేసి పాణిపాదప్రక్షాళనంబుం జేసికొంటిని. ఒకదాసి యేతెంచి యయ్యా! తమరు పథశ్రమంబున మిగులఁ బడలియున్నవారుగాన వేగిరంబ యీయింటి పైమిద్దెపైనున్న చంద్రశాలకేఁగి యందు శీతలవాతపోతంబులువీవ సుఖశయనంబునం బరుండుఁడు. అవధీరితరంభారామణీయకయగు నొకరంభోరువు నిన్ను సంభోగాదులం దేల్చు. అని విన్నవించిన నేనును మిగులఁగౌతుకాక్రాంతుండనై వల్లెయని తదుపదిష్టమార్గంబున నిచ్చోటి కేఁగుదెంచితిని. ఇదియు నా వృత్తాంతంబని యా రాజకుమారుఁడు సెప్పెను.

అదియంతయు విని యేను నతనితో నిట్లంటిని. ఓ కుమారకా! యా బ్రాహ్మణుఁడును బ్రాహ్మణియును నీయొద్దనుండి కొంత ద్రవ్యము గడించుటకుగా నట్లు ప్రవర్తించి యుండుదు రంతియకాని యీయూర సజ్జనుండన్నవాఁడు లేఁడు. అందఱును మోసగాండ్రేయనిచెప్పి యింక మనమిచ్చటనుండుట యుత్తమంబుగాదు. ఎవ్విధంబుననైనఁ దప్పించుకొని యీ యూరువెడలిపోవుట యరవు. మనము బయలుపడి యనేకులం జంపి తెంపున ననేక కష్టంబు లనుభవించుటకంటె రంపులేక యితరుల కెఱుకపడకుండ రహస్యమార్గంబున నిర్గమించుట మంచిదియని యే విన్నవింప నందుకొడంబడి

రాకొమరుండు నన్నుం దనవెనువెంటం దీసికొని యాయిల్లు నిర్గమించి నన్ను నిలువంబెట్టి
నా భుజంబుల పైకెక్కి యాయింటి ప్రహరికిం బ్రాకి నాచేతులు పట్టితిగిచి దానిపై
కెక్కించి యనువుతోం దాను వెలికిదుమికి నాహస్తంబులు పట్టుకొని వెలుపలికిందించెను.
అంత మేమిరువురము కదలి వీథివెంటవచ్చుచుండం గొందఱు రాజభటులు మమ్ముం
బొదివిపట్టుకొనవచ్చిరి. వారి నతినైపుణ్యంబున నొక్కనినైన మిగిలింపక యమసద
నంబునకంపి యా రాజచంద్రుండు నన్నుందోడ్కొని దత్సమీపంబుననున్న యతిగహ
నంబగు నరణ్యంబునం బ్రవేశించెను. సూర్యోదయసమయంబయ్యె. కుమారుని మొగం
బుం గాంచితిని. తొల్లి యేను జెప్పిన రోచనుండె యా రాజకుమారుండని తోంచె.
అయినను మరణంబు నొందినవాండు మరలజీవించుట యప్రసిద్ధంబుగదా యనితలం
చుచు నాభావంబుం బోంగొట్టుకొని యాతనిం బూర్వపరిచితుని తెఱంగునం జూచు
చుండ నాతండు నన్ను సమీపించిచూచి నీవు మదలేఖవుగావా? యని యడిగిన నేను
నౌనని చెప్పితిని. అంత నతండు రోచనుండనురాజకుమారుండు నీకు విదితపూర్వుండు
గాండే? అతం డెక్కడనున్నాండు. ఉదయాదిత్యుని నగరంబున నాతండును నేనును
మిత్రులమైయుంటిమి. ఆతనియింట నిన్నుంగాంచినట్లు తోంచెడిని. అని యడుగంగా
నేనును తత్స్మరణంబునంజేసి దుఃఖవేగంబున వెక్కివెక్కియేడుచుచు శోకభారంబు
సైరింపంజాలక మూర్ఛనొంది యిలపయింబడి పొరలి దేహం బెఱింగి యతండు దెచ్చి
యిచ్చిన నీటం గన్నులు గడిగికొని,వసనోపాంతంబున మొగంబు దుడిచికొన్నదాననై,
నిట్టూరుపు నిగుడ్చుచు మెల్లన నిట్లంటిని. రాజపుత్ర!యతినిర్ఘృణహృదయయయి పరుల
పాలంబడి పలువిధంబుల పడరానిపాట్లుపడిన యీపాపిష్ఠియొక్కవృత్తాంతంబు చెప్పి
యేమి? వినియు నేమి? నాకై యనేకదినంబులువేచియుండిన రోచనునిపై కొన్నిదినం
బులకు మరలుకొన్న నన్ను చెప్పరానియిడుముల బడద్రోయందలంచి విధి యాతనిం
దలద్రుంచివైచె. ఏమిసేయుదు. నేను చిన్ననాటనుండియుం గన్నెతికంబు చెడక
యున్నదానను. ఏకారణంబుననో యెఱుంగ నీయందు మిగులయిష్టంబు గలిగియున్నది.
ఇంతకుం జన్మాంతరకృతంబు హేతువై యుండనోపు. అని చెప్పంగా నా పుడమిఱేం
డును తలయూచి యో చిన్నదానా! విధికృతంబుం దప్పింప నేరికైనం దరంబగునే?
గతంబుంజింతించి యేమిప్రయోజనంబు. ప్రాప్తియుండెనేని మృతులయినవారును
సంప్రాప్తులగుదురు. అన్నిటికిని గాలంబు మూలంబు. ఇప్పుడు వగచుటవలన నేమియు
లేదు. కొన్నిదినంబులు దేహయాత్ర జరుపుచుండవలయుంగదా? మన మీతరుశాలకు
సమీపముగాం బోవుమార్గమునం బోయి యేదియో యొకనగరమునంజేరి రోచనకుమా
రునివృత్తాంత మరయుదము. దైవ మెల్లకాలము నాపదలంబొరయనీదు.అని యాతండు
పల్కంగా నందుకు సమ్మతించి యేను నతనివెనువెంటం జనుచునుంటి. కొంతదూరం

బఱిగిన పూఁదీర వికసించిన పద్మములవాసనలు నలుదిక్కుల వెదచల్లుచుఁ జల్లని నీటి తుంపురులతో మందమారుతము వీవఁగా బడ్డశ్రమంబు శాంతమై యా గాలివచ్చు నట్టి కొలనుం గాంచ నిచ్ఛ జనించెను. కౌతూహలాకృష్టస్వాంతుల మగుటవలన దూర దేశ గమనాయాసంబు తోఁపకయపోవుచు నొకరమణీయమగు కేళోద్యానమును జూచి తిమి. దానియందలి ఫలభరభరితంబులై నేలకుం వంగియుండు గుజ్జుతేమావులును ఆ చెట్లక్రింద సమర్పంబడియున్న విశాల చంద్రకాంత శిలాఫలకంబులును రసికజన హృదయంబుల కతులానందదాయకంబులై యుండకమానవు. ఓకుమారుఁడా! యేమి చెప్పుదు నా యుద్యానవనముయొక్క నీటు.

అది గాంచినదిమొదలు నామనంబు కేవలము మన్మథాయత్తంబై యిట్టి కేళో ద్యానంబునం దమతమనాయకులతోఁ గూడ క్రీడించు చేడియలు చేసినదిగదా పున్ని యము. ఏనెంతనిర్భాగ్యురాలనో! ఇట్టిసుఖంబు స్వప్నమునందైనం గాంచినదానఁగాను. అని యిట్టివి యనేకవిధంబులగు వ్యర్థమనోరథంబులం దలంచుచుండ నా రాజకుమా రుండును నన్నుంగాంచి మందహాససుందరవదనారవిందుండగుచు నిట్లనియె, ఓ కామినీతిలకమా! చూచితి వే! ఈరమణీయంబగువనంబును. ఇందుంగలతియ్యనిక్రొమ్మావి తోఁటయును, ఈ విశాలంబులగు చంద్రకాంత శిలాఫలకంబులును మన్మథుండు మన యెడఁగరుణించి నిర్జనస్థలంబున సమకూర్చినట్లుండలేదా? మనమిప్పుడు కామదేవధరణీ పాలునివిభూతిం దలంచి యాతనియకుంఠిత శౌర్యంబునకుం దలంకి తదీయోపచారం బుల సల్పకొనకుండుటంబట్టి కాదె యీమామిడిగున్నలెక్క మనపై కోవెలలు కన్ను లెఱ్ఱచేయుచున్నవి. అంతియకాదు. ఈ శుకపికశారికానికరంబులు మనలంగాంచి తమరాజగు మన్మథునికి "ఈ యురుతర భవద్బాణవిభిన్నహృదయులం జేసి యత్యంత నిర్వాణపారీణతఁ గలిపింప నిదియ యదనని విన్నవించువిధంబున మధురతరనినాదంబుల మందలించుచున్నయవి. ఓ తరుణీ! మనమెట్లు తప్పించుకొనగలము. అని యిట్లాచతు రుండు పల్కుచుఁ దనమనోగతంబు బయలుపఱచెను. అయ్యో! ఏమనిచెప్పవచ్చు.

సీ. అనుపమనవయౌవనారంభమబలల కరయ మహానర్థకరముగాదె
కంటికింపగువగకాని సాన్నిధ్యంబుసతులకు వ్రతహానిసల్పఁగాదె
కేళీవనాంతర లీలావిహారంబు లలనలరతికినూల్కొలుపఁగాదె
శుకపికశారికానికరవిరావముల్ కామజతంత్రముల్ గఱపఁగాదె

గీ. మగువకొంటిగమగవానిఁ దగిలియుంట, ధైర్యహానికిహేతువై తనరుఁగాదె
విషమబాణకిరాతుండు వివిధవిరహి, జనులవేఁటాడఁదఱివేచి మొనయుఁగాదె.

ఏనుసంచలితధైర్యనయ్యుఁ గులపాలికాత్వంబు తొలంగునను వెఱపుచేఁ గుందుచు నేమియు మందలింపక తలవంచుకొని వెనువెంటంజనుచుంటిని. నాతో మఱియుఁ

గొన్ని వచనములు చెప్పుచుఁ దనమనంబుననుండు తమకంబు వెల్లడిసేయుచు నా రాజకుమారుండు ముందట మండలాకారంబుగ నుండుతమాలవృక్షంబుల చాలుపుంగాంచి దానిలోఁజొచ్చి హెచ్చినయుల్లాసముతోఁ దిరిగిచూడక యతిత్వరితగతిం జనుచుండె. ఏమి యిట్లీ కుమారుండు నన్నుఁ బల్కరించక యతివేగంబునం జనుటకు నిదానంబని యోచించుచు వెనువెంటంబోవుచుంటి. ఓ యయ్యా! ఆ నా విధివైపరీత్యంబు నేమని చెప్పుదు. నాకొకించుకసహాయపడవచ్చినను వారికొకవిపత్తు సంభవింపకమానదు. కటకటా! యా కఠినంపువృత్తాంతంబు నెట్లు చెప్పుదు. అప్పుడు కన్నులారఁజూచి సహించియున్న పట్రాతినైనను నేనిప్పుడు వాచా వర్ణించి చెప్పఁజాలకయున్నాను. దేహంబు నిల్వలేక భూమిపయిఁ దొరంగునట్లున్నది. మనస్సు కొఱ్ఱచిచ్చులోఁ బగిలి దగ్ధమగు విధంబుగఁ దపించుచున్నది. అక్కటా! యేమందునని చెప్పుచు నా కాంతామణి మూర్ఛపోయి భూమిపయిఁ బడిన మంత్రికుమారుండూరార్చి సేదదీర్చిన లేచి కన్నీరు కాలువలై కుచతటంబుపైఁ బ్రవహింపఁ బయింటఁజక్కనొత్తుకొని యామంత్రికుమారుని వచనంబులఁ గొంచెము ధైర్యము దెచ్చుకొని యిట్లనియె. అట్లా రాజకుమారుండతిత్వరితగతింజని యొకకొలనిం జేరి దానినవరత్నమయమగు నవతరణమార్గమున డిగ్గి "అపరిచితస్థలంబున నిట్లు సాహసించి ప్రవేశింపంజనదు." అని నేను చెప్పుచున్న యనునయవచనంబులం జెడచెవినిఁబెట్టి జలంబులోనం బ్రవేశించి దానిమధ్యంబున కుంజని యచ్చట మనోహరమగు నొక్క స్త్రీరూపంబును జూచి మెచ్చుకొనుచు దాని పాదముల సోపానమునందు రత్నమయమగు తిన్నెపై కెక్కి మోహంబతిశయించి యా స్త్రీరూపముయొక్క మొగమును తనమొగమునంజేర్చి ముద్దులుగొని యధరంబు నొక్కి దోర్మూలముల గిలిగింతలు సేయుచు నున్మత్తంబగుతమిం దాళలేక దానికుచంబులు తనకరంబులంబట్టి యున్మత్తాలాపంబులు కొన్నివల్కుచు గాఢాలింగనంబు చేసికొనియె. తత్క్షణంబునన యా కాంతారూపంబు రెండుభాగంబులై హస్తంబులుచాపి యా రాజకుమారుని లోఁగొని నీటమునింగిపోయె. అదిగాంచి యేను దుఃఖాకులమయిన హృదయముతో భూమిపయింబడి మూర్ఛపోయి లేచి యాతనివిరహంబు సైరింపఁజాలక యా కొలనిలో దూకి ప్రాణంబులు వాయుదు ననుకొని దానిలోడిగిన నదియొంతటమోకాలిబంటిలోతై కనుపట్టెఁగా నిదౌర్భాగ్యశాలి కింక నెన్నికష్టంబు లనుభవింపవలసియున్నవోయని యనుకొనుచు, దుఃఖవేగంబు సహింపంజాలక పేరెలుంగున నేడ్చుచువచ్చుచుంటి. ఇక్కడనిన్నుంగాంచితి. ఇదియు నా వృత్తాంతంబని చెప్పి యా కన్యక యూరకుండెను.

ప్రథమతరంగము సమాప్తము.

---

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః

# చమత్కారకథాకల్లోలిని

## ద్వితీయతరంగము



రామాఘనతరకుచ
కోరకకాశ్మీరరుచిరగురుతరవక్షా!
నారాయణ! గోపీజన
జారా! కరుణించి వినుము జలజాతాక్షా!

### సుందరీమందిరవృత్తాంతము

ఇట్లు మదలేఖ యనురాచకన్యక సెప్పఁగా కృతబుద్ధియను మంత్రికుమారుండు విని తనమనమునకేమియుఁదోఁచక యీమదలేఖవిషయమునందు నికఁజేయునదియేమని యాలోచించుచుండెను. ఇంతకుమున్న యక్కడనున్న యొక్కపొన్నచెట్టుపైఁగూరుచుండి యీ మదలేఖావృత్తాంతంబువినుచున్న యొకరాజకీరంబిట్లనియె. ఓమదలేఖా! నీ వృత్తాంతంబు వినువారికి మిగుల దుఃఖదాయకంబై యున్నయది. నాచేయుపని యొకటి నీకు మిగులసహాయకరంబు గాఁగలదు. ఎద్దియనఁగా? ఇంతకు సమీపంబుననుండు నీ చిన్నపర్వతమున కుత్తరపుగట్టున నతిరమణీయంబగు సుందరీమందిరంబను నగరంబుగలదు. దానియందు మందారమాలయను నొకరాకన్నియ యున్నది. ఆ పట్టణంబున ననేక కన్నియ లున్నవారుగాని యీ మందారమాలతో నొక్కతెయు రూపరేఖావిలాసంబుల సరిపోలదు. అంతేగాదు. వారందఱు నారమణీరత్నంబునకు సఖీప్రాయలై యనువర్తించుచుందురు. ఆ కన్యకామణియు గురుజననియుక్తులయిన యాచార్యుల వలన ననేకశాస్త్రంబు లభ్యసించి సంగీతరత్నాకరపారంగతయై యనల్పశిల్పనైపుణి గలిగి వెలయుచున్నయది. దానికి వృద్ధకాపాలికి యొకతె మిగుల విశ్వాసంబుగల్గి యెల్లకాలము దానిసరసన యుండు. సుగుణములమరియుండు వారింగాంచిన నాకాపాలికికిని యీ మందారమాలకును ప్రీతిగలిగి విశేషము వారలగారవింతురు. నీయొక్క రూపరేఖావిలాసంబులు గాంచిరేని తమప్రాణంబులు నీకు నొప్పగించి యుందురు. విశేషముగఁ బల్కనక్కరలేదు. నే నామందారమాలయొక్క క్రీడాశుకంబను. నా

పేరు మధురరవము. ఈదినముదయమున నన్నుందనచేతిమీఁదనుంచుకొని ముద్దుకొనిన నేను ఓమందారమాలా! నన్నుఁగట్టిగాఁబట్టుకొని ముద్దుకొంటివిగాన నాముక్కు నొచ్చెను. నాచెక్కిలులు మిగులకలఁత నొందెను. నాయలంకారంబెల్ల మాసిపోయె. నేనింక నీదగ్గఱకురాను. అనిచెప్పి మిథ్యాకోపంబు దెచ్చుకొని యాకన్యాంతఃపురపు మేడపై కెగిరి వ్రాలియుండిన నాముగ్ధయు నన్నెన్నోయనునయాలాపంబులు పల్కుచు సమాధానపఱచుచుండ నంతలో దానిపెనిమిటి యచ్చటకు వచ్చిన నన్నాడఁబాసి తన యింటిలోనికింజనియె. ఆకన్నియ కింకను ౧౮ వత్సరంబులు నిండినవికావు. భర్తయు నన్నిసంవత్సరములవాఁడె. నేను నచ్చోటనుండి యొక్కొక యుద్యానమునఁ జూచుచు నిచ్చటకువచ్చితిని. నీకథవినుచు నింతకాలము విడిచిపోలేక నిలిచితిని. నన్నుంగానకున్న నామందారమాల యాహారంబుఁగూడఁ గైకొనదు. ఏఁబోయి నీవృత్తాంతంబంతయు నాకన్నియకు విన్నవించి యావన్నెలాడి నిన్నుఁ దనయొద్దకు రప్పించుకొనున ట్లొనరింతును. ఈకుమారుండును ఆనగరంబునకు రాఁగలండు. ఈపట్టణమునకుఁ దూరుపు తట్టున నొక్కబూరుగుచెట్టుకు సమీపమున చతురశ్రమగు నొకరాయి భూమిపయిఁ బఱచియుండు. ఆరాయి పైకెత్తినయెడల నొకగుహాముఖంబు గనంబడు. ఆగవిలోఁ బ్రవేశించి కొంతదూరంబు చనిన నొకరమణీయమార్గంబు గనుపట్టు. అది యా సుందరీ మందిరంబులోనికిం జనుత్రోవ. ఆమార్గమధ్యంబుననుండు తామరకొలనిగట్టున నుండి వేచి మందారమాలయొక్కదాసి నిన్నుఁబిలుచును. తత్క్షణంబ బయలుదేరవమ్ము. అనిచెప్పి యారాజకీర మెగిరిపోయెను. మంత్రికుమారుఁడు నదివిని యోరాజపుత్ర! "మొలబంటిదుఃఖమున మోకాలబంటి సంతోషము" అన్నట్లు ఈమహావిపత్తునందు నీచిలుక పలుకులు కొంత యాహ్లాదకరములు. కాన మనము నాచిల్క చెప్పినయట్లు పోయి యాసుందరీమందిరంబుం జొత్తము. దేవుఁ డెయ్యెడ వేళల నెట్టివిపత్సంపదల నీయనున్నాఁడో యెఱుంగము గదా. అనిపల్కిన నాసుదతి గతియొండులేమి నట్లకానిమ్మని యనిన మంత్రికుమారుండును కదలి యాచిల్కపల్కిన రీతింజని యాశిలాఫలకంబు నెత్తి లోనికింబ్రవేశించి మదలేఖయుఁ బ్రవేశించిన యనంతరము దానిని యథాపూర్వంబుగ నమర్చి గుహలోనం బ్రవేశించి తన్మధ్యమార్గంబునంజని సూర్యాస్తమయ సమయమునకుఁ దామరకొలను దరిసి యచ్చోఁ బథశ్రమంబు బోవ దానితీరభూమి యందుం గూరుచుండెను. మదలేఖయు నట్లయుండెను.

అప్పు డచ్చటికొకమచ్చకంటి యేతెంచి యామదలేఖం గాంచి యోయమ్మా! మా రాజకన్యక నిన్నుఁదోడ్కొనిరమ్మన్నది. ఆకన్నియ నీయందుఁగల యనురాగభరంబున నొకింత తామసించితివేని తానెయిక్కడకు వచ్చునట్లుతోఁచుచున్నయది యనిన మదలేఖయు నిదెవచ్చెదనని చెప్పుచు మంత్రికుమారుని పీడ్కొనిచనియె. కన్యకాంతః

పురంబు దరియంబోవునప్పుడు మందారమాలయు మదలేఖం గాంచి యిది దేవతా కన్యయో? లేక మోహినీదేవతయో? లేక మన్మథునింబాసి సంచరించు రతిదేవియో? లేక లక్ష్మియొ కాకుండిన మనుష్యమాత్రుల కిట్టి యనవద్య రూపరేఖావిలాసంబు లచ్చుపడి యుండునే? యని తనసఖీజనంబుతోఁ దెల్పుచు సౌధంబుడిగ్గి యేతెంచి సమీపమునకు వచ్చి యామదలేఖహస్తంబు తనహస్తంబునం బెనవైచి యోయక్కా! నీచరిత్రంబు మధురరసంబు సెప్పఁగా వింటి. ఇన్నిదినము లనుభవించిన కష్టంబులు మఱచి నాయింట నుండుము. నీభర్తృవృత్తాంతంబు నీకొఱకై విచారించి క్రమక్రమంబుగ నీకుం దెలుపఁ గలదు. నీవిల్లుగా నే నాయింటి నిభావింపుము, అని చెప్పుచుఁ గైదండ యిచ్చి తోడ్కొని పోయి తనతో సమస్తాభ్యవహారములు నిర్వర్తింపఁ జేయుచుఁ దనకుఁ బ్రాణసఖీమణిగా నెంచుకొని సర్వవిషయంబులందు నామదలేఖను నమ్మి బహిశ్చరంబగు ప్రాణంబని తలంచి ప్రవర్తించుచుండెను. మదలేఖయుఁ దనభర్తృవియోగవ్యథ గాక యొం డేదియు నెఱుంగక యామందారమాలతో నిష్టగోష్ఠులం బరితృప్తి నొందుచుండెను. మంత్రికుమారుండగు కృతబుద్ధియు మదలేఖను రాజకన్య యొక్కెడాది వెంటఁ బెట్టు కొనిపోఁగా ననంతరము తానొంటిగఁ గొంతతడవు వచ్చోటనుండి లేచి నగరసమీప మునకుం జనుచో నంతకుసమీపమున నుండు నొక యుద్యానవనమున నిద్దఱు కాంతా మణులు రహస్యము మాటలాడుటఁ గాంచి యానగరవృత్తాంతం బరయఁగోరి యున్న వాఁడు గాన నెవ్వరికి నెఱుకపడకుండ నావనంబునందలి బండిగురుగింజపందిరి మాటున నుండి వారిమాటలు వినవలయునని యెంచి యతండు నట్లి యొనర్చెను. చీకటికాలము గాన నతఁ డచ్చోటనుండుట మఱియెవ్వరికి నెఱుకపడదయ్యెను. అప్పు డావనమున నుండుకాంత లిట్లు మాటలాడుకొనిరి. ॥ఒకతె॥ ఓప్రాణసఖీ! కళావతీ నిన్నుం గాంచి యనేకదినంబులయ్యె. ప్రతిదినమును భగవతియగు సాంఖ్యాయని యొక్కదేవతార్చ నకై యేఁగోసి యుంచిన పూలను చిగుళ్లను ఫలముల నెత్తుకొని పో వచ్చుచుంటివి. ఇప్పుడు కొన్నిదినములనుండి రాకయున్నావు. ఇదియేలా?

మఱియొకతె॥ ఓకమలవతీ! సుందరీమందిరంబునఁ గాపురముండెడుదాసివలె నడుగుచున్నావు. ఔరా! నినంగనాచితనమున కేమనవచ్చునే? మనసాంఖ్యాయని చేయుమంత్రమునకు నీవునొక నిర్వాహకురాలవు గావటే? ఆసన్యాసిని నాకొక రహస్య కార్యము చేయుమని తెల్పి కొన్నిదినములకుముందు నీనగరమునకు సమీపమున నుండు మహారణ్యములోని శీతాసారమను కమలసరస్సునకు గూఢమార్గమున నంపియుండుట మఱచితివే?

కళావతి॥ (కొంచెము లోచించి జ్ఞాపకము తెచ్చుకొని,) ఓప్రియసఖీ! ఔనౌను. నేనును నీవలె నితరకార్యనియుక్తురాలనై పోయి యాపనులు సరిపఱుచుకొనుట

కైన యలసటచే నితరవృత్తాంతంబు మఱచియున్నదానఁగాన నిన్నడిగితిని. మంచిది. నీవు పోయిన కార్యగతి చెప్పుము. అది యేవిధమునఁ జరిగినదో సకలవృత్తాంతంబు నాకుఁ జెప్పుము.

కముద్వతి॥ ఓసి చెలియా! వినుము. సాంఖ్యాయని నన్నుఁ బిలిచి "నీవు శీతాసారమను సరస్సునకు ఈ నగరమునుండి భూమిలోపలంగా నమర్చియున్న సురంగము వెంబడిఁబోయి ఆ కొలనియందు మనఁ బ్రతిమాకారముగ చెక్కించియున్న యా సురంగము యొక్క వాకిటఁ గొన్ని దినములు కాచియుండవలయు. ఆ ప్రతిమాకారమును గాంచి మోహించి యెవ్వఁడు ముద్దిడుకొని యాలింగనము చేసికొనునో ఆతని నమ్మతో మన నగరంబునకుఁ బాలోద్యానమందలి సితచంద్రంబనియెడి సౌధమునకు దీసికొని రావలయు. ఇది యితరు లెఱుంగకుండిన యనేకార్థంబులు సంభవింపక మానవు. ఆతని నక్కడకుఁ జేర్చుటయు నా కొఱకు గతి ప్రతిపాలించుటయు సమకాలికంబై యుండునేని మిగుల శ్రేయము'' అని యాజ్ఞ చేసి పంపిన నేను నా పరివ్రాజిక నూరి నట్టి మార్గముననే బోయి యా సురంగము ద్వారముననె కొన్ని దినములు వేచియుండ నిన్న మధ్యాహ్నమున నొక రాజకుమారుఁడు వచ్చి మన మందారమాల యాకారముతో నమర్చఁబడియున్న ప్రతిమను ముద్దాడి తమకంబున నాలింగనము చేసికొని దాని గుబ్బలు పట్టికొని చూచుకంబుల నంటెను. ఆ ప్రతిమకు ముందుభాగము నొకతలుపు వెనుకటి భాగము ఒకతలుపుగా చేర్చి దానిని తెఱచుటకు చూచుకస్థానంబున తాళముగా నిర్మించియుండుటచేత నట్లు స్పృశించినమాత్రాననే తలుపు తెఱచుకొనెను. తత్సమీపమున నున్న నేను మందారమాలిక వేషంబు ధరించియుండుటంబట్టి కామాతురుండై నిరూపింపలేక యా రాకొమరుండు తటాలున నాయొద్దకు వచ్చి మదనబాధ కోర్వనివాని వలె మిక్కిల ననునయింపసాగిన నేనును ఓ రాజ! నీ మనోరథంబు సఫలమ్మ సిద్ధముగ నున్నాను. నీకై యనేక దినములనుండి వేచియున్నదానను. ఈ సంకటస్థలంబు మనకు సుఖకరము గాదు. ఇంతకు సమీపముననుండు మా యుద్యానమునందలి సౌధమునకే తెంచెదవేని మన మిరువురము సుఖమ్ముల బడయవచ్చు. అని చెప్పిన నట్లె యని యా రాకొమరుండు నా వెనువెంటం జనుదెంచెను. సితచంద్రంబను సౌధంబుం జేరితిమి. మూఁడవజాము గడచె. అచ్చోటనుండి ద్వారపాలిక చేత సాంఖ్యాయనికి వృత్తాంతంబు చెప్పి పంపి మృష్టమృష్టాన్నాదుల నా రాకొమరునిం బరితృప్తునింగావించి యింతలోన నచ్చోటికి భగవతి వచ్చుటం గాంచి నా గృహంబున కఱిగితిని. సాంఖ్యాయని సిత చంద్రసౌధంబునుండి యిప్పుడతని యింటికి వచ్చి కపాలిపూజకల్పతీర్థోదకస్నానము చేయుచున్నది. ఆ పూజకై పూర్ణపుష్టికం గొనిపోవ నేనిటు వచ్చియున్నదానను. ఇదియె వృత్తాంతంబు. ఏలనే నీ బెంగముఖంబుంచుకొని కొంచెమున వ్యాదవు.

కళావతి॥ ప్రియసఖీ! మఱేమిలేదు. కలవృత్తాంతంబుసంతయుఁ జెప్పితిని. అందులో శోకించుకపోయితివే. ఏమి నీచమత్కారం బవినవ్వెదను.

కమలవతి॥ ప్రాణసఖీ నే నేమియు దాచుకొనలేదే ?

కళావతి॥ ఓసీ! ఆ రాకొమరునితో మనమిరువురము రతిసుఖంబులంబడయ వచ్చునన్నదానవు. అబద్ధము సేయుదువా?

కమలవతి॥ (చిఱునవ్వునవ్వి) ఓసీ! యిట్లుపరిహాసముచేయుటయేగదే నీకు నైజము. ఉండనిమ్మది. నీకు భగవతి యాజ్ఞయిడిన కార్యంబేద్ది. అది యెట్లయ్యె. తెల్పుము.

కళావతి॥ ఓప్రియసఖీమణీ! వినుము. సాంఖ్యాయని నన్నుంజూచి "యోకళావతీ! మననగరంబున నుత్తరపు కోటగోడలోఁ విఘ్నేశ్వరాకారము మలిచియుండు రాయి యొకటిగలదు. అది పైనఁ గాలితో ద్రొక్కిన లోపలికిఁబోవును. ఆగోడలో నొకదారి బహుదూరముపోవునట్లగపడును. నీవు భయపడక యందుఁ బ్రవేశించిపోవ గొంతదూరమున నొకమామిడిచెట్టు నీకుఁదెలియును. అదినిర్మానుష్యస్థలము. అచ్చోటం గొన్నిదినములుండెదవేని యొకరాజపుత్రుని ప్రతిబింబము వ్రాసియుండు పటముఁగొని యొకరాచకన్నియ యేతెంచును. దానికి సంరక్షకులుగా నిరువురు కిరాతులు వచ్చుచుందురు. వారినివంచించి నీ సామర్థ్యంబుమెరయ నాకొంతం దోడ్కొనిరమ్ము, పొమ్ము." అని యాజ్ఞచేసిన నేనబలనయ్యు భగవతియొక్క వాక్యగౌరవంబున వల్లెయని యామెయానతిచ్చినరీతిని యాకోటదారిలోగుండబోయి యామామిడిచెట్టు క్రిందం గొన్నాళ్లువసియించియుంటిని. ఒకమనుష్యుఁడైన నాదారికవచ్చినవాఁడుకాఁడు. ఇట్లుండ నొకనాఁడు అచ్చోటికి సమీపముననుండు మఱ్ఱిపైనెక్కి చూచుచుండఁగా సాంఖ్యాయని చెప్పినచొప్పున నిరువురు కిరాతులును ఒకరాచకన్నెయు నాకగపడిరి. వారలిక్కడికే వత్తురనియెంచి యేనావృక్షముయొక్క యాకులసందున మఱిగియుంటిని. ఆ మువ్వురునువచ్చి యా చెట్టుక్రింద నారేయి విడియుటకుం బ్రయత్నపడి కూర్చుండి యాకిరాతు లొకరితోనొక రిట్లనుకొనిరి. ఓరీ! యీరాచకన్యకయొక్క సౌందర్యముఁ గాంచినదిమొదలు మనకు మనస్సు నిలువకయున్నది. దీనివిషయంబున నేదేని యొకయకృత్యంబు జరిగించితిమేని దీనిపైమరులుకొని యెన్నెన్నో విధములగు కష్టము లనుభవించుచు నిలిచినచోటనిలువక యల్లాడుచున్న మనయధికారి మనల బ్రతుకనివ్వఁడు. ఈ పిల్లను గొనిపోయి మనఱేనికిఁ గానుక యర్పింతుమేని మన కభిమతములగు భూషణము లిచ్చును. అందఱిలో మిగుల గౌరవించును. అని యనుకొని మరల నాకొంతామణింగాంచి మోహంబు తలకెక్కి,

సీ. నిండుచందురుఁబోలు నెలఁతముద్దుమొగంబు గాంచుచు మైదలబ్జగంధికురులు
మీలనేలఁగఁజాలు బాలకన్నుంగవ సింగంబుతో సరిచెలియకౌను
నల్లత్రాఁచనవచ్చు నాతికీల్జడ కోవి యనఁటెకఁబంబుఁలీయలివతొడలు
నాఁచుతీవియకుద్దినళినాక్షినూఁగారు మాలూరఫలము లీమగువచనులు

గీ. కంబుసుందరమీ సుమగంధిగళము, తప్తహాటకసదృశమీ తరుణి మేను
పక్వబింబంబనఁదగు పడఁతి మోవి, సింగిణులఁ బోల్చు మాదసెలిచెలియబొమలు.

చ. అనుపమరూపయౌవనకళాతిశయంబున మీఱుజవ్వనిన్
మనమున మోహముప్పతిలమాటికిమాటికి మోవినొక్కుచున్
ఘనకుచకుంభముల్ కరయుగంబునఁబట్టికళల్ గరంచుచున్
పనివడిగూడుటల్ మనకుభావ్యములిత్తఱినిత్తలోదరిన్.

అని యిట్లాయిరువురు ననుకొనుచుం గొంతతడవుండిరి. సూర్యుండు నస్తమించి రెండుగడియలకాలమై గాఢాంధకారంబు గమ్మియుండె. ఆ మగువయుం జేయునదిలేక విషణ్ణహృదయయై బావురుఁబిల్లులపడుమఁజిక్కికొన్న చిన్ని చిలుకచందంబున నుమ్మలికంబుఁ జెందుచుండ నందులో నొకండుడగ్గఱి యోచిన్నదానా యింక నీవేమి యాలోచించెదవు. పులులకాళ్లక్రిందంబడిన యాఁడుజింకచందంబున నైతివి. ఇంక మమ్మిరువుర మన్మథోపచారంబులఁ బరితృప్తులం జేయక నీకుఁదీఱదు. పోనమురమ్ము. ఈ చెట్టుక్రింద మనమిరువురము బరుందమని యాకన్నియ చేయిపట్టి తిగియఁబోవుడు నేను నామనమునందు ఈ సమయమున నుపేక్షించినఁ గార్యహానికలుగునని తలంచి యనువూహించి ఆ సమయంబున నొక పేరెలుంగెత్తి యతివికృతధ్వని ఆకసంబునిండ నఱచితిని. వారును భయభ్రాంతులై ప్రాణభీతిచేఁ బరువులిడుచు నేలం ద్రెళ్లుచు లేచుచు వ్రాలుచు అయ్యయో పిశాచంబు మనలమ్రింగనుంకించుచున్నయది యనియార్చుచు నతివేగమున వెళ్లిరి. ఆకాంతయుం మూర్ఛాక్రాంతయై యిలాతలంబునంబడియె. వారలు మరల వత్తురేమో యను భీతిచే నప్పుడప్పుడు నఱచుచుంటిని.

వారు బహుదూరం బఱిగినపడి యెఱింగి చెట్టుదిగి యాకాంతామణి సమీపమునకువచ్చి యా చిన్నదాని నెత్తికొని తొడలపైనిడుకొని చల్లనినీటం గన్నీరుదుడిచి సేదదేర్చి కొంతకాలము శైత్యోపచారములుసల్పి భయసంభ్రమములు వాపి యవ్వామాక్షియొద్ద నొకరాజపుత్రుని చిత్రపటంబుండుటంగాంచి మఱునాఁడు సూర్యోదయంబగుటకుమున్నె పూర్వపుమార్గముగుండ గొనితెచ్చి మందారమాలవసియించు మేడకు సమీపమునం గట్టంబడియుండు సాగరధవళంబను సౌధంబులోనుంచి సాంఖ్యాయనికి సంగతి విన్నవించిన నామె యాయింటికిం జనియె. యాతాయాతశ్రమంబును, పరదేశవాసవైక్లబ్యంబును విశేషించియుండుటం జేసియుం నాయధికారములోనున్న యా

యుద్యానము పైపరామరిక లేక బాగుచెడి యుండుటంబట్టి దానిం బనివారలం గొని చక్క పఱచుట నాకు ముఖ్యమై యుండుటవలనను రెండుదినములుగా నేనక్కడకుం బోలేను అని యిట్లు మాటలాడుచుండంగా నొకవనగజము మదముచే నొడలెఱుంగక యనేకవృక్షంబుల నున్మూలనంబు సేయుచుం బూంబొదరిండ్లం దొండంబునం జుట్టి మట్టుపెట్టుచుం గేళీసరోవరములం దిగి కలంచుచుం దామరల సమూలధ్వంసంబు సేయుచు మయూరశుకపికనిరంకరంబులగు వృక్షశాలలవిఱిచి కుప్పలువెట్టుచు మహాభయంకరంబుగా నకాలమృత్యువు చందంబున నచ్చటికి వచ్చినం గాంచి యీ యిరువురును భయంబు పెచ్చు పెఱిగి కాళ్లుతడబడం బరువులిడుటయుం నామదపుటేనుంగు తొండంబు విసరుచు మోరయెత్తుకొని యాకాంతామణుల వెంటనంటి తరుమనుపక్రమింప రక్షకుండు లేక యా యిరువురు కొంతవడిబరుపిడి శక్తిచాలక భూమిపయింబడిన నాకరీంద్రము తనతొండమున నందొకర్తెం బట్టుకొని పైకెగరవేయంగా మంత్రికుమారుండును ససంభ్రమంబుగ నచ్చోటికింజని భూమిపయిం బడక ముందె యాకాంతను లాఘవంబునం దనచేతులతో నందుకొని యిలపయిం బెట్టి బెట్టిదంపు ధైర్యంబున నాయేనుంగుకు కుంభస్థలంబు పగుల వజ్రముష్టిం బొడిచిన నది దిక్కులు పిక్కటిల్లునట్లు ఘీంకారంబు సలుపుచు నిలపయిం బడి ప్రాణంబులు వదలెను.

భయంబు పైకొని మూర్ఛాక్రాంతరై యున్న యాకన్నియ కొంతతడవునకు ధైర్యంబుం దెచ్చుకొని లేచి కనువిచ్చి నలుగడలుం బరికించి చూచి మఱియొకతె చే సంగతుల నన్నింటిని విని యామంత్రికుమారునొద్దకువచ్చి చేతులుజోడించుకొని ప్రణామంబులు చేసి యో యయ్యా మీ రెవరో యెఱుంగము నిష్కారణవత్సలతం బ్రవర్తించు మీవంటి ధన్యాత్ములు ఎక్కడనో గాని తఱచుగనుండరు. గొప్పవంశంబునం బుట్టి యనేక వత్సరంబులు గురుకులవాసంబు చేసియున్న వారికేంగాని యిట్టి యార్తరక్షణగుణ మనువుపడియుండదు. వేయేల! ప్రాణంబులిచ్చి కాపాడిన నీకునే నివ్వనిదేమున్నది. ఇదిమొదలు మా యిరువుర శరీరములు ప్రాణములును నీయధీనములు నీవీ యూరికిం గ్రొత్తగాం దోంచుచున్నాండవు. నీకీయూరం గాంగల కార్యంబులకెల్ల ప్రాణంబులిచ్చియైన మేమునీకు సహాయభూతమయ్యెదము. ఈ యూరనుండువారలకుంగాక యితరులకిది దుష్ప్రవేశంబు. నీ వెట్టీనగరంబుం జొచ్చితివో యెఱుంగము. మీవంటి మహాత్ములకలంఘ్యంబైనది యేదియును లేదు. కాన నిదియుం మాకత్యాశ్చర్యావహంబై యుండదు. అనిచెప్పిన వారలతో మంత్రికుమారుండు నిట్లనియె.

ఓయబలలారా సర్వజనంబులను రక్షించువాండు భగవంతుడు. వానికి వినాంగా నెవ్వనికైనం దరంబుగాదు. ఉండనిమ్మా విషయంబు. నే నొకదేశపు మంత్రికుమారుండను. దేశంబులం జూచుచు నీనగరమునకు వచ్చియున్నవాండను. ఇంకం గొన్ని

దినంబు లిచ్చోటవసియించియుండు. నాయందుఁ బ్రీతికలిగి మీరు నాకనుకూలురై ప్రవర్తించుచుండవలయు. అనఁగానే వారును వల్లెయని యామంత్రికుమారునిం దమ యింటికిం దోడ్కొనిపోయి సమస్తోపచారంబులుఁ జేసి యిష్టమృష్టాన్న పరితృప్తునిం గావించిరి. ఇట్లాకమలవతీకళావతులచేత సత్కృతుండగుచు దన్నుంగాంచినవారలు "ఈమహాబలుండేకదా కమలవతీకళావతుల నతిసాహసమున రక్షించినవాఁడు. ఈసింహపరాక్రముని నయ్యబలలఁ రక్షింప ననుకూలవిధి యచ్చటకుం జేర్చెఁ గాబోలు" అనియిట్టి బహుమానవాక్యంబు లనుకొనుచు మిగుల గౌరవంబుదోఁచఁ బ్రవర్తిం చుచు రా నామంత్రికుమారుండు నానగరమున వసియించుచు నెల్లకాలము నతఁడు చింతాసంతాపసంతప్తమానసుండగుచు విన్ననగు మొగంబుతో నుండుగాని యభినవ తారుణ్యలక్ష్మీ కనుగుణంబులగు చందనకుసుమ తాంబూలంబుల నంగీకరింపఁడు. స్త్రీకథాలాపంబుల వినఁడు. తన కుపభోగార్హలయి యుండియు నేకతంబున నత్యను రాగముతో నూరుసంవాహనాదు లొనరించుచుండినను గమలవతి కళావతులయెడ మనసున నించుకేనియుఁ జంచలత్వము వహింపక జితేంద్రియుండై ప్రవర్తించుచుండు. ఇట్లుండుటఁగాంచి యాకామినీతిలకంబు లొకనాటిరాత్రి యాతని కుపచారంబులు చేసి పాదంబు లొత్తుచు ఓమంత్రికుమారుఁడా మేము నీమనస్సున కెక్కవలయు నని యెన్నెన్నోయుపచారము లొనరించుచున్నారము. అవియన్నియు నించుకేనియుఁ బాటింపక వ్యసనపడుచున్నావు. నీవ్యసనకారణంబు తెల్పితివేని మాశక్తికొలందిఁ బ్రవర్తించి చూతుమని వేఁడుకొనిరి.

అప్పుడు మంత్రికుమారుండు వారలతో నిట్లనియె. ఓతరుణులారా మీరలెన్ని యుపచారంబు లొనరించిననేమి? శీతాసారమునుండి కమలవతి వెంటబెట్టుకొనివచ్చిన రాజకుమారునిం గాంచవలయునను నుత్కంఠ నన్ను బాధింపుచున్నయది. ఏమిసేయనగు. మఱియు నింకగొన్నిదినంబు లాతనింగానకయున్న నాశరీరంబు నిల్వదని తోఁచెడిని. ఇందుకుపాయం బేమియెఱుంగను. అనిచెప్పిన నా కమలవతీకళావతు లొకరి మొగం బొకరుచూచుకొని "యిది యతిదుర్ఘటంబగువిషయంబు. దీనిమన మెట్లు సాధింప నగును. సాంఖ్యాయని చేసినమంత్రంబు భేదింపఁ జాణత్యుఁడైనను శక్తుండుగాఁడు. అట్లుండ మనమెంతవారము." అని యనుకొని యందుఁ గమలవతితో నారాజకుమా రుండు వచ్చినదాదిగా సాంఖ్యాయని తద్విషయంబున నేమి యొనరించుచున్నదియొ తెల్పుమని కళావతి యడిగినఁ గమలవతి యిట్లనియె. ఓకళావతీ యేమనవచ్చునే యాభగవతియొక్క మంత్రాలోచనంబు. శీతాసారమునుండి కొనితెచ్చిన యారాజ కుమారు నచ్చోటన వసియించియుండనిచ్చి మనమందారమాలయొక్క సౌధము దగ్గఱ బహువిచిత్రమగు నొకహర్మ్యమును అద్భుత శిల్పకల్పనానల్ప చతురంబుగ

నిర్మించి సితచంద్రంబను సౌధంబునకును ఆహార్యమునకును భూమిలోసన సురంగముం గల్పించి యారెండుస్థలంబులకును పోకరాకలు గూఢముగానే జరిగించునట్లేర్పఱచి యున్నది. ఆ మిద్దెటింటిపేరు మధుమంతము. దానిసమీపముననె నీవు వెంటఁబెట్టుకొని వచ్చిన రాచకన్నియకు నొకరమణీయగృహము నిర్మింపఁబడినది. అందాసుందరాంగిని ననేకచేటీజనంబులతో సమస్తోపచారపరితృప్తగా నుండునట్లు ఏర్పాటుసలిపి ప్రతి దినము మాతృజనము వలె నాకాంతను విచారించుచున్నయది.

బృహస్పతిబుద్ధియైనను సాంఖ్యాయని పన్నిన తంత్రంబున సారాంశము గ్రహింపఁ జాలదు. అదియట్లుండనిమ్ము. నిన్న మధ్యాహ్నము సాంఖ్యాయని యారాజకుమారునిం గాంచి యిట్లనియె. కుమారకా నీ వేకారణముననో స్వస్థచిత్తత లేక యించుక తెల్లఁ బాఱి చిక్కిన సుందరశరీరంబుతో రతిసెడబాసిన మన్మథునివలె దోఁచుచున్నాఁ డవు. చైత్రాకరమను పేరంబరగు నొకలీలోద్యానము ఈనగరమునకు సమీపమున నున్నది. అచ్చోటికిం జని యందుంగల విచిత్రంబులు కొన్నిటిం గాంచుచు నీమనస్సు వినోదపఱచుకొని యస్తమయమునకు కీమేడకుం జేరుము. నీవెనువెంట నీకమలవతిరాఁ గలదు అని యిట్లాజ్ఞ చేసెను. ఈయుదయమున నేనాతనివెంటంజనుటకై యచ్చటికేఁగ వలసియున్నది. నీవును మంత్రికుమారుని నచ్చటికిఁ దీసికొనిరమ్ము. అనంతర వృత్తాం తము నాలోచింతము. అనిచెప్పి కమలవతియుఁ గళావతితో సితరశయనంబునకుంజని శయనించి నిద్రించి మేల్కాంచి యుదయకాలమునం గళావతికి హెచ్చరికచేసి సిత చంద్రంబునకుం జనియెను. ఆనాఁడుదయమున మంత్రికుమారుండు లేచి కాల్యకృ త్యంబులు నెఱవేర్చి దివ్యాంబరాదుల నలంకరించి భోజనముచేసి మధ్యాహ్న సమయ మునం గళావతితోఁ గదలి చైత్రాకరమునకుంజనియె. తోఁటవాకిటనుండు నొక రసాలపాదపంబు సమీపమున నిలుచుండి యౌవనముయొక్క సౌభాగ్యమును జూచు చుండునంతలో లోపలనుండి యొకతె యతివేగంబునఁ దనచేతులతో నురంబు మోఁదు కొనుచు భూమిపయింబడుచు లేచుచు నేడ్చుచు వచ్చుచుండఁగాఁ గాంచి యద్దాని కడ్డంబుచనిన నదియు నోయయ్యా నన్నురక్షింపుము. వేగిరంబరమ్ము. ఖడ్గంబు నొఱ వెలికి చేతికందికొనుము. అని తనపాదంబుల పయింబడి యేడువఁగా నోకాంతా! కొంచెముధైర్యముఁదెచ్చుకొని సంగతివిశదపఱుపుము. తగిన యుపాయంబుం జింతిం తము. అనిచెప్పిన నాసుదతి యిట్లనియె. ఓయయ్యా భగవతియగు సాంఖ్యాయ నికిఁ బుత్రప్రాయుండగు రాజకుమారుండు తనపరిచారికయగు కమలవతి వెనువెంట రాఁగాఁ జిత్తవినోదార్థంబుగ నీయుపవనమునకువచ్చి కేళీసరోవరములను వృక్షవాటి కలను లతానివహంబులను గాంచుచు నొక్కచోట నొకలవలీలత నతిమనోహర మగు దానింగాంచి దానియొద్దకుంజని మృదులంబులగుతన యంగుళులచేనంటుచు దాని

రామణీయకంబునకు మనస్సున మెచ్చుకొనుచుండఁగాఁ దత్సమీపముననున్న కొండ చఱియలోనుండి దొంగలు కొందఱువచ్చి కమలవతి నెత్తుకొనిపోవఁ దటాలున లేచి యావీరుండును కోపారుణితలోచనుండై ఖడ్గఖేటకంబులు ధరియించి వారిం దఱుముకొనిపోయి కొందఱిం జిందఱవందఱ చేసి తఱుము చుండఁగా నందుఁ గొందఱు తప్పించుకొని పోయి తమయధిపతిం బిలుచుకొనివచ్చిరి. వేలకొలఁది శూరులు చుట్టు ముట్టియున్నారు. అతస్కారులు వేయుం బాణజాలములచేనొచ్చి రాకొమరుండు బహుకాలము యుద్ధముచేసి బడలియున్నవాఁడుగాన సొమ్మసిలి భూమిపై బడియె. వారు నయ్యుర్యుపురనుబట్టి యెత్తుకొనిపోవుచున్నారు. వేగిరంబవచ్చి వారలవిడిపింపుము. తొల్లి మదమత్తంబగు వనగజంబును జంపి కమలవతీ కళావతులం గాపాడిన మహాశూరుం డవుగావా? నీవు. తామసించితి వేని కార్యంబుచెడును అని చెప్పఁగా నాపమాడుం డును యుద్ధసన్నద్ధుండై కత్తియొఱదీసి ఝళిపించుచు నోసీ దొంగలు పోయినత్రోవఁ జూపుమనిన నదియట్లసేయుండు నతిత్వరితగతిం జని రాజకుమారునెత్తుకొనిపోవు వారలందఱికి శిరంబులు ఖండించి యాయాఁడుదాసిం గాంచి యోసీ యీసమీపమున నుండు సెలయేటినీట నీతనికిశైత్యోపచారంబులు సేయుచుండుము. కమలవతింగని పెట్టి తీసికొనివచ్చెదనని చెప్పి యతివేగంబునం జని యడుగులజాడలం గాంచుచు నొక గుహాలోఁబ్రవేశించియచ్చటనుండు నాదొంగలజేనితో మహాయుద్ధంబుసలుపుచుండె. ఇచ్చట రాజకుమారుండు సేదదేరి యాకాంతంజూచి కమలవతియెక్కడదనని యడిగి యద్దానిగుండ వృత్తాంతంబువిని యాదొంగలుపోయిన జాడలరయుచుఁజనిచని యా గుహాలోనఁబ్రవేశించిన నిప్పుడు వాయువుసహాయుపడినట్లు వారలసమూలముగా నిద్దఱును పరస్పరసహాయముగా ధ్వంసముఁజేసి యంతటంగలయవెతకి యొకదుర్గమస్థలంబున నుంచంబడియుండు నాకమలవతిం దీసికొని మహాసంతోషముతో నగరమునకు వచ్చుటకుమరలి దొల్లింటి యాయుద్యానముగుండ రాఁగా నింతకుముంద, పూర్వము మంత్రికుమారునికిఁ గమలవతిని దొంగలు తీసికొని పోవుచున్నారని చెప్పి తోడ్కొని వచ్చినవనపాలిక పోయిచెప్పఁగా నావృత్తాంతంబువిని మహావ్యసనాక్రాంతయై యచ్చోటికివచ్చియున్న సాంఖ్యాయనింగాంచి ప్రణామంబులు చేసిన నాభగవతియుఁ సంతసంబంది యారాజమంత్రికుమారుల నౌదలమూర్కొని యిఱుదొడలపయిం గూరుచుండంబెట్టుకొని వెన్నునిమురుచు నిట్లనియె. ఓయన్నలారా నేనిచ్చోటనుండుటం జేసి యీనగరమునఁజుట్టుపట్టునఁ గ్రోశపుదూరమున నుండుసమస్తప్రాణులును నాతపంబునకు మంత్రంబునకును భయపడుచు నీపట్టణంబు ప్రక్కఁగన్నెత్తియైనను జూడరు. ఇప్పుడుమీచేఁ జచ్చినవారుమాత్రము వైకిభయములేనట్లు ప్రవర్తింతురు. వీరియెడల నేనును జంకుచునేయుందు. మీరలిప్పుడు వారలంజంపి నిష్కంటకంబుఁ గావించితిరి.

ఇఁకనాతపోప్రయంబు సేయనక్కఱలేదు. మేలయ్యెను. నామంత్రశక్తిచేత నంతయు నాకు వశీకృతంబె? మీ రిదిమొదలు పరస్పరమైత్రి గలిగి యొండొరుల కుపకారంబు లొనరించుకొనుచు నిందుండవలయునని చెప్పెదను. అనిన వారునట్లయని యాలింగనము నొనరించుకొని యొండొరుల కరంబులం బట్టికొని యుల్లసించిరి.

అదిచూచి కమలవతీకళావతులును సంతసించిరి. మఱియుంగొంతసేపు ఆవనమునందుండి తమతమ యిండ్లకుం జనిరి. మంత్రికుమారుండు నారాజకుమారున కదిమొదలు నర్మసఖుండై శయనాసన క్రీడావిహారంబుల యందెడబాయక యాతనికి బహిశ్చరంబయిన ప్రాణంబనందగి ప్రవర్తిల్లుచుండెను. ఇట్లు కొన్నిదినములు జరుగుచుండఁగా నొకనాఁడు మంత్రికుమారునితో మాట్లాడుచుండు నారాకొమరుని పాదములకుం బ్రణామంబుచేసి యొకతె స్వామీ భగవతియగుసాంఖ్యాయని మీకాజ్ఞ యిచ్చుచున్నయది. ఏమనిన "మీరు బహుదినములనుండి నన్నడుగుచుంటిరికదా? ఇప్పుడు మీయందనుగ్రహించి యుత్తర్వుచేయుచున్నాను. ఈనాఁడు సాయంసమయమున మీరిరువురును మనోహర వేషాలంకృతులై యిల్లుబయలువెడలి పట్టణంబును నలుప్రక్కలం గలయం గనుంగొని వేగిరంబ మీనెలవులకుం జేరునది అనియాయమ చెప్పిపంపె ననఁగా వారిరువురును వల్లెయని దానినంపి యాసంధ్యాసమయంబున సితచంద్రంబువెలువడి రాజవీథిం బ్రవేశించి దానిమధ్యప్రదేశమున నుండుమందారమాలాసౌధముయొక్క సమీపమునకు వచ్చుచుండిరి. అప్పుడామందారమాల కొందఱుచెలికత్తెలతోఁ గూడి పైమేడమీఁద నిలువంబడియుండి తనకెదురఁ బూబంతులాడుప్రణయసఖులం జూచుచుండెను. రాజకుమారుండును దూరమునుండి యాకాంతామణిం గాంచి సంచలితస్వాంతుండై తద్గతంబగు చూపు మరలింపలేక చెమర్చిన యొడలితోఁ బయిపయిఁ గ్రమ్ముపులకలతో వైకొను బడలికతోఁ బ్రబలమగు డగ్గుత్తికతో మంత్రికుమారునికిం జూపి యోచెలికాఁడా చూచితివే యీకామినీమణిని, లోకమున నెందెందలో యందగత్తెలుగలరుగాని యీసర్వానవద్యరూపరేఖావిలాసం బితరులకుంగలదా? చూడుము. ఈసుందరీతిలకముయొక్క ముఖారవిందము పున్నమనాటి చందమామవలెఁ గన్నులకానందజనకంబై పరిపూర్ణకళావిలాసములచేత నెంతజూచినను దృప్తికలుగనీయకున్నది. మఱియు దీనివాలారుచుఱుకుచూపులు మిగులభయపడిన యొకసంవత్సరపు లేడికొదమకన్నులవలె నతిచంచలములును కలువపూలమాలికలవలె నల్లఁదనముమీఱినవియునై మన్మథుఁడు తన బాహుబలంబుకొలఁది యెఱింగింపం దిగిచియేసిన క్రూరనారాచములవలె హృదయమును భేదించుచున్నయవి, ఇంక నీకలకంఠియొక్క చిన్నారినును లేనగవు నూతనమగునమృతప్రవాహమువలె నతిధవళంబును జగన్మోహనంబునై వెలుఁగుచున్నయది. అదియునుంగాక నీచంద్రముఖియొక్క చెక్కిళులు కొంచెముకొంచె

మంకురించి లోనయడంగు మందహాసమును సూచింపం జేయుచుం దుడిచియుంచిన మణిదర్పణముల కాంతిని గొల్లగొనుచున్నవి. అధరంబును పండిన దొండపండునకు సాటియై పగటుమీఱి తరుణజనుల హృదయంబుల రక్తంబులు సేయుచున్నది. మణిమయ తాటంకంబు లలంకరించియుండు దీని శ్రవణయుగళంబు యువజనుల హృదయమృగంబు లం బట్టుకొననొడ్డిన మదనకిరాతుని పాశంబులో యనంజరగుచున్నవి. గళంబును సుందర రేఖాత్రయమంగళంబై యంగజుని చేతనుండు విజయశంఖంబనందగి రంగారు చున్నయది. ఓరి చెలికాడా ఇది యిట్లుండనిమ్ము. ఈకాంతయొక్క యభినవతారుణ్య విలాసంబు రసికజనహృదయహారియై లావణ్యవిశేషంబుల వెల్లిగొలుపుచున్నయది. కొంచెము సావధానమతివై వినుము.

శ్లో. జిఘ్రత్యాననమిందుకాంతిరధరం బింబప్రభా చుంబతి
స్ప్రష్టుం వాంఛతి చారుపద్మముకుళచ్ఛాయావిశేషస్తనౌ
లక్ష్మీశ్శోకనదస్య ఖేలతి కరౌ పాలంబ్య కించాదరా
దేతస్యాస్సుకృశేకరోతి పదయోస్సేవాం ప్రవాళద్యుతిః.

[శ్లోకమునకవతారిక. ఈకామినీతిలకమునకు బాల్యమువీడి క్రొత్తగా యౌవనము అంకురించునప్పుడు ఒక్కొకవస్తువు దీనికొక్కొక్కపని సేయుచున్నది. తెల్పెదను వినుము. అని చెప్పుచున్నాడు. టీ. ఇందుకాంతిః = చంద్రునియొక్క కాంతి, ఆననం= దీనిముద్దుమొగమును, జిఘ్రతి = ఆఘ్రాణము చేయుచున్నది. బింబప్రభా = దొండపండుయొక్క కాంతి, అధరం = నును మోవిని, చుంబతి = తాంకుచున్నయది. లోకమునందు మిగుల నందగత్తెలగు కూతులంగాంచి వారితల్లులును దాదులును ప్రేమయతిశయించి మొగంబు ముద్దిడుకొని మోవియంటుచు సంతసింతురో యట్లే ఈభామినియొక్క మొగమునుజూచి చంద్రకాంతియును, అధరమునుజూచి బింబప్రభయును జేయుచున్నవి. అనంగా యౌవనము వచ్చునప్పటికి మొగము చంద్రబింబమువలెను అధరము పండినదొండపండువలెను మనోహరములై వెలుంగుచున్నవి యని తాత్పర్యము. చారుపద్మముకుళచ్ఛాయావిశేషః = సుందరములైన తామరమొగ్గలకుదరికలేంగల విశేషము, స్తనౌ=చన్నులను, స్ప్రష్టుం = తాంకుటకు, వాంఛతి = కోరుచున్నయది. కామిగానుండెడివాండు తనసమీపమునను న్న కాంతయొక్క కుచములను గాంచి మోహమతిశయించి యౌవన్నెలాడి చిన్నిచన్నులంబట్టంబోయి యితరులు జూచిననేమి యనర్థకము సంభవించునోయని భయపడి విరమించుకొని మఱియుం దమి హెచ్చి చేతులసంటియైనం జాతమాయని కోరి సమీపించెడురీతిం బద్మకోరకచ్ఛాయా విశేషమీయతివయొక్క కుచంబులందాంకిపట్ట గమకించుచున్నయది. అనంగా నీ బాలామణి చిన్ని చన్నులు మొట్టమొదట నురస్థలంబునందలచూపి మెల్లమెల్లగ

మొలకలై యనంతరము బంగారపుబిళ్లలవలెఁ దళతళమెఱయుచు ప్రక్కల వ్యాపించుచుండి కొంతతడవునకుఁ గెలకట్టుకొనుచువచ్చి పోకలంతలై చూచువారలకు వింతలై దోఁచుచునుండి మఱికొన్ని నాళ్లకు నిగనిగలాడుచు బిగువుమీఱి యామలకమాత్రంబులుగ ప్రకాశించుచు నింతలోపలఁ గొంచెము గురుత్వముం గనుపట్టిన నింతకు ముందు నిమ్మపండ్లకు దీటులై యున్నయవి? ఇప్పుడు యౌవన ప్రాదుర్భావమువలనఁ గొనలుబ్బసాగి తామరమొగ్గలయొక్క కుదిరికగలిగి సంభోగ యోగ్యంబులు కాఁబోవుచున్నవి యని తాత్పర్యము. కోకనదస్య = ఎఱ్ఱదామరయొక్క, లక్ష్మీః=కాంతి, కరౌ ఆలంబ్య = దీనిహస్తములు పట్టుకొని, ఖేలతి=విహరించుచున్నది. చెలికత్తెయొకతె తనప్రియసఖియొక్క హస్తములు పట్టుకొని యాటలాడుచున్నట్లు ఎఱ్ఱదామరల కాంతి దీనిచేతులుపట్టుకొని పరిభ్రమియించుచున్నది. అనఁగా దీని చేతులు ఎఱ్ఱదామరలవలె మిగుల నెఱ్ఱనగుచున్నవి యనిభావము. కించ = అదియునుంగాక, ఏతస్యాస్సుదృశః=ఈకాంతకు, ప్రవాళద్యుతిః = పవడంపుఁగాంతి, పదయోస్సేవాం=పాదసేవను, ఆదరాత్ = ఆదరముచేత, కరోతి = చేయుచున్నది. ఒకదాసి పాదసేవసేసినట్లు పవడపుఁగాంతియును దీనికి పాదసేవఁ జేయుచున్నయది. అనఁగా పాదములయందు పవడపుఁదీగెవలె నెఱ్ఱనికాంతి ప్రసరించుచున్నదియని భావము.

తల్లియుం దాదియుఁబలెను నిందుకాంతియుం బింబప్రభయును మొగంబాఘ్రాణించి యధరముముద్దుగొనుటయుఁ, పద్మముకుళచ్ఛాయా విశేషము కామినవలెఁగుచయుగము నంటం గమకించుటయుం, కోకనదలక్ష్మి ప్రియవలెఁ జేతులుపట్టుకొని పరిభ్రమించుటయుఁ, ప్రవాళద్యుతి పరిచారికవలె పాదసేవసేయుటయుం ననునీవ్యంగ్యార్థములు మిగుల చమత్కారావహములుగాఁ దెలియనగును.]

అని యిట్లా రాజకుమారుండు తననర్మసఖునితో దానివర్ణించి చెప్పుచుండఁగా మందారమాలయుం నాతనింగాంచి పరపురుష వీక్షణభయముచేత నింటిలోనికిం జనియె. రాజకుమారుఁడు తనకన్నులకు భాగ్యాధిదేవత కనఁబడి యస్తమించినట్లైన మిగుల వ్యాకులచిత్తంబుతో మంత్రికుమారునింగాంచి యిట్లనియెః ఓచెలికాఁడా పూర్వము నేనొక సరోమధ్యంబున నిట్టికాంతాకారమును గాంచితిని. ఈకన్యక పరిపూర్ణ యౌవనయగునేని యాయాకారమే యనవచ్చు. దానింగాంచినప్పుడు నామనస్సు కరఁగినవిధముగ నిప్పుడును గరఁగుచున్నయది అయిననేమి లోకోత్తరమైన స్త్రీరూపంబునుజూచి యట్లే శిల్పసమర్థులు చేయలేరా. అని చెప్పుకొనుచు మరలి "ఇచ్చటనున్నాఁడననియుఁ, నిట్లుచనుచున్నాఁడననియుం, ఇది సెప్పుచున్నాఁడననియుం, నెఱుంగక కేవలము మంత్రికుమారుని ప్రయత్నముచేతనే తనయిల్లుసేరెను. ఇట్లు రాజకుమారుఁడు సిత

చంద్రమును జేరి మందారమాలయందు యాసక్తచిత్తుండై యున్మత్తునివిధమునఁ బరిభ్రమి యించుచుండ నీకనీతనిమనోరథంబు సమకూర్పకయుండుట మిత్రభావంబునకుఁదగినది గాదనియెంచి మంత్రియేమియునాలోచన పాలువోక కొంతతడవుచింతించి జ్ఞప్తికిఁ దెచ్చుకొని మున్నొకనాఁడు కమలవతివలన నీసితచంద్రంబునకును మధుమంతంబునకును గూఢమార్గమున్నట్లు విని యున్నాను. దాని వరయుట మంచిది. అని నిశ్చయించుకొని యా పాతాళమార్గంబు వెదకి కనిపెట్టి మధుమంతంబునకు దానిగుండఁ దాఁజని యచ్చటి సన్నివేశంబుం గని మన రాజకుమారునికి మందారమాలాబాధ మతిదుష్కరంబె యగు. అయినను చేతనైనంతవఱకుఁ గార్యప్రవర్తన ముచితముగదా యని తలంచి మరలివచ్చి రాజకుమారునితో నిట్లనియె.

ఓమిత్రరత్నమా నాయొక్కమాటలు సావధానమతివై యాకర్ణించి యట్లు ప్రవర్తించితివేని క్రమక్రమంబుగ నామందారమాల నీకొకప్పుడైన దొరకును. లేని యెడల యదిలేదని యనుకొనుము. అనియనఁగా రాజకుమారుండు నవ్వి చెలికాఁడా యీవిషయమునందు మాత్రమేకాదు తక్కిన యన్నిటియందు నిన్నతిక్రమించి యెప్పటి కిని బ్రవర్తింపను. ఇది నీవు తిరముగనమ్ముమనఁగా మంత్రి యిట్లనియె. ఇప్పుడు నీవు కోరరానివస్తువును గోరియున్నావు.

సీ. చేటీతతికిమంచిచీరలాదిగనిచ్చివశముచేసి కొనంగవలయు మొదట
చెలికత్తెలకునాత్మబలరూప సాహసములఁజూపి యింపుగా మెలఁగవలయు
భావగర్భంబులౌ పనులచేఁజతురతఁ గనఁగన భావమెఱుఁగవలయు
నత్తమామలయెడ నాఁడుబిడ్డలయందు వంచనతోఁ బ్రవర్తించవలయు
గీ. నిరుగుపొరుగులవారల నెఱుఁగవలయుఁ
బ్రాణసమమైనదూతికఁ బడయవలయుఁ
గానఁబరదారరతియెల్లకాలమధిక
కష్టతరమౌబయల్పడఁగలుగుఁ గాని.

కాననీవు సాహసంబుమాని యుపాయముతో నీ కార్యంబునఁ బ్రవర్తింప వలయు. ఈసితచంద్రమునుండి పోవునట్టి పాతాళమార్గముగుండఁబోయి యామధుమం తంబునందుఁ గొంతసేపు వసియించుచు మరలివచ్చుచుండుము. నీమీఁద దానికభిప్రా యంబు క్రమంబుగఁగలిగెనేని యెట్టైనను గార్యమనుకూలమగు. అనిచెప్పి యాద్వారము గుండఁదీసికొనిపోయి మఱలదీసికొనివచ్చెను. అదిమొదలు రాజకుమారుండప్పుడ ప్పుడు మధుమంతంబునకుఁ బోకరాకలు సేయుచునుండె. ఇట్లుండ నేకతంబున మంత్రి యొకనాఁడు కమలవతినిజూచి యోకాంతా! తొల్లి నీవుప్రాణంబులచేతనైన నుప

కారంబు చేసెదనంటివి. ఇప్పుడట్టి కార్యంబొక్కటి ప్రసక్తంబైయున్నది. అదియే మంటివేని ? నాప్రాణసఖుండు రాజకుమారుండు మందారమాలయందాసక్తిఁజెంది పడ రాని యిడుమలఁ బడుచున్నవాఁడు. నీవు మందారమాలకు సమీపమున నుండు చేటివి గాన నిది నీవలన నెవ్విధినైన సమకూరును. ఇద్దినంబుననుంచి ప్రవర్తింపుము. సిత చంద్రముచుండి గూఢమార్గముగ రాకొమరుండు మధుమంతమునకుఁ బోవుచువచ్చు చున్నవాఁడు. అనిచెప్పిన నదియుం గొంచెమాలోచించి స్వామీ యేమైననుసరే మీ మాటకడ్డముగఁ బ్రవర్తింపను. అనిచెప్పి యాతనివీడ్కొని తనయింటికిం జనియె. అది మొదలు కమలవతి మందారమాలయొద్ద నొకత్రుటికాలమైన నెడబాయకయుండు. ఎవ్వరును లేనికాలమున శాకుంతలాదులగునితిహాసములం జదివించి వానియర్థంబులు వెల్లడిసేయు. సంగీతాదులయందు విశేషరక్తిఁగల్పించి వినిపించు. ఇట్లు కొంతకాలము ప్రవర్తించుచుండె. ఇతర చేటీజనంబులకంటెఁ దనయందు మిగుల విశ్వాసమును ప్రీతి యును స్నేహమును గలుగునట్లు మందారమాలతో మెలఁగుచుండె. తనకష్టసుఖములు చెప్పుకొనుట కనుకూలయగు సఖియని తోఁపించుచుండె. ఏమిచెప్పవచ్చును. తుదకు తనమాటజవదాటక యుండునట్లు రాకన్నియను వశముచేసికొనియె. ఇట్లుండి యొక నాఁడు రాజపుత్త్రింగాంచి యోయమ్మ నీ సౌధమునకు సమీపముననుండు మధుమంత మును గాశీదేశమునుండివచ్చినయొక శిల్పి తననైపుణ్యమంతయుంజూపి యతివిచిత్ర ముగ నిర్మించియున్నవాఁడనివిందుము. నీకు దానిఁజూడఁ గోరికయున్నను బోయి కను గొందము. అనిచెప్పిన నారాకన్నియ యత్యుత్సాహంబుతో యోసీ సేమను మధు మంతము విచిత్రశిల్పచాతుర్యసీమయనివిందు. దానింగాంచుట కభిలాషముఁగనియుండు. ఐన భగవతియేమనునోయని భయంబునొందియున్నదానను. అనియిట్లువినిపింపఁగాఁ జేటి యోయమ్మ యిదిసాంఖ్యాయని చెవికెక్కవలయునా ? ఆ మధుమంతమునకును నీ సౌధమునకును గూఢమార్గముగలదు. మనమిరువుర మితరులకెఱుకపడక బోకరాకలు చేయుచుందము. అనిచెప్పఁగా రాజపుత్త్రియు వల్లెయని కమలవతితో గూఢమార్గమున నరిగి యామధుమంతమునుజూచి దానియందుం జంద్రుండు గురుభార్య యగుతారను కూలపఱచుకొనుటయును, ఇంద్రుం డహల్యాదేవినివంచించి పంచశరసుఖములం బడ యుంటయును, దారుకావనకాంతలను హరుండు వంచించి తనయందు వలపుఁ గొలిపి సంచలితధైర్యలం జేసిన విలాసములును, శ్రీకృష్ణుండు గోపకాంతలయొక్క యంబ రంబు లపహరించి వారిమానములు గొల్లలాడిన విశేషంబులును గోడలపైన వ్రాసియుం డుటం గాంచి కమలవతి మొగంబుంగని మందహాసంబు సేయుచు నొకరహస్యస్థలం బుగా నేర్పఱచియుండు చంద్రశాల కెక్కి యందుం దూఁగుటుయ్యాలపయిం గూరు చుండి మణిపాదుకలం బాదంబు లిడికొని చిత్రపటం బొకటి వ్రాయుచు నుయ్యాల

నూఁగు మనోహరాంగునింగాంచి యొడలు ఝల్లుమని వెనుక కడుగులిడి కమలవతి చాటునకుంబోయి యోసీ పరపురుషుఁడు వసియించు నేకాంత స్థలంబునకు మనవంటి వారమొంటిగ రావచ్చునా? కేవలము బాల్యసులభమగు చాపలముచేత నిట్టికార్య మొనర్చితిమే ఇది యితరులెఱింగిరేని యేమందురే? శీఘ్రముగఁ బోవుదమమ్మ. అని చేయి పట్టియీడ్చెనఁ గమలవతియుం దానిరెండుచేతులుపట్టుకొని యోయమ్మ భయపడకుము. పెరవారలెవ్వరును లేరు. మనసాంఖ్యాయనికి రెండవహృదయ మనఁదగినయట్టి రాజకుమారుండితండు. నీవునన్ను వెలుపలిప్రాణమవని చెప్పుచుందువుగదా. అట్లె యీతఁడు నాయెడం బ్రవర్తించుచుండు. "ఆకారసదృశప్రజ్ఞః" అనువచనప్రకారముగ నీతనిరూపము గంభీరమై ప్రకాశించునట్లె హృదయమును గంభీరమైయుండును. ఈమహాపురుషుం డిచ్చటికివచ్చుట యెవ్వరు నెఱుంగరు. మనము నట్లె వచ్చుచుం బోవుచుందము. మనయిష్టమున కవిరోధముగ నీ సౌఖ్యమునంతయుం గలయంగనుంగొని పోదము. అని యిట్లుచెప్పఁగా నామందారమాలయుం నందుకుసమ్మతించక పరపురుషుఁ డొంటరిగనుండుచోట మనముండుట యెంతమాత్రము నుచితముగాదని తనచేతులు విడదీసికొని పోవనుద్యుక్తురాలైనంగాంచి యోసీ నీవీసౌఖ్యమును గలయంగాంచకపోతివేని నాపైయానయున్నది యనిచెప్పి యొట్టుపెట్టినం బోవుచున్నట్టిది నిలిచి ప్రాణసఖీ యట్లు క్రూరముగఁబల్కకుము. ఇదిగో నీయిష్టప్రకారము నిలిచితిని. అనఁగాఁ గమలవతియుం దగ్గఱికిబోయి యాకాంతయొక్క చేయి తనచేతంబట్టుకొని యాగృహమునందలి విచిత్రములను జూతము రా యని పిలుచుకొని పోవుచు నక్కడ గోడలపైన నొకచో రాజహంసాదులు తమపడఁతులతోఁ గలయనుంకించుచునుండువిధంబు వ్రాయబడియున్నంజూపి యిట్లనియె.

సీ. రాజహంసముజూడు రాజహంసీయాన తమ్మిమొగ్గలనంటఁదమకమొందు
రాజకీరముఁజూడు రాజముఖీమణి బింబంబుదొరయఁగా బ్రీతినొందు
యువచకోరముఁజూడుమారుతరసుశ్రోణి ఘనతజందురు ముద్దుగొనఁగదివురు
భ్రమరరాజముఁజూడుభద్రేభవరయాన లతలతోనిత్యసంగతులువెదకు

గీ. మదగజంబొక్కటియ్యెడమంజువాణి
పద్మినినిగాంచితనకరప్రసరణమున
నంటగమకించుఁదుమ్మెదల్వెంటరేఁగి
కరచునేమోయటంచులోఁగాంచుభయము.

ఆదివిని యామందారమాలయుఁ దనమనంబుతో "నీచతురయగుకమలవతి నాపై యీరాకొమరుండు మరులుగొనియున్న వాఁడను నర్థంబుం గనుపఱుప నీరాజహంసాది

దృష్టాంతములను జెప్పుచున్నయది" అనియాలోచించి యిందుకుం దగినయుత్తరం బొసంగకున్న సరికాదనియెంచి యిట్లనియె. ఓసఖీ కమలవతీ వినుము.

చ. క్రమముగఁ జైత్రురాజ్ఞ నను రక్తివరించియుఁ బ్రీతిబాలభా
వము మొదలాత్మభోగసుఖవాంఛలఁ గోకిలమాసముండఁగా
రమణిరొ మావిటీ వెసరిరానివయస్సు నసుండఁదాఁకితో
భిరుకరమా సంగతునె సలుపుపద్ధతిఁ గోరుట న్యాయమార్గమే.

అనిచెప్పిన నాకమలవతియుం "సీకన్నియ తనకుపభోగార్హమగు వయస్సురా కను గాంక్షించుచుఁ బిన్నతనమునం దనగురుజనమియ్యగా వివాహముచేసికొనియున్న భర్త వేచియుండఁగా ఆస్త్రీని నితరపురుషుఁడు పరువమునిండక పొందునప్పుడే కూఁడం దివురుట న్యాయమా? యని నన్నడుగుచున్నయది. ఇందుకుం దగినయుత్తరం బొసంగుదును" అనితలంచి మఱియు నిట్లనియె.

ఉ. కోమలియీపదుచ్ఛ్వసితకోరక చారుగుళుచ్ఛలక్ష్మితో
వేమరుసౌరభస్ఫురణవిశ్వము మోహమునందఁ జేయునా
కామునిమావితోఁటఁగలకమ్మనికొమ్మను గాంచిషట్పదం
బామని రాకఁదాళఁగలదానుచు తేనియఁ గ్రోలకేడ్తెఱన్.

అని చమత్కారంబుగాఁ బల్కినవిని మందారమాల తనమనంబున "మన్మథుని యెలమావితోఁటలోనికమ్మని కొమ్మవలె నందునీవు మనోహర మగునభినవతారుణ్యలక్ష్మీ విలాసాలంకృతవై పొటమరించిన చిన్నిపూఁపచన్నులచే సకల రసికజనహృదయాహ్లాద మొనరించుచు నెదుటంగనంబడిన నీయొక్క సొగసుఁగాంచి విలాసియగు నీరాజ కుమారుండు నిన్ను ముద్దుగొని మోవితేనియలానక విడుచునా? అట్లుచేయఁడేని యాతఁడు తమిఁదాళలేఁడు అనుభావము కమలవతి తెలిపినయది. కానిమ్ము దీనికిం బ్రతివచనం బొండొసంగుదును." అనితలంచి యిట్లనియె.

ఉ. తేనెలు గ్రోలితావలపుఁదీర్చుకొనంగమకించుఁగానియు
ద్యానలతాసఖుల్ కుసుమహాసరుచిందనునవ్వునంచునో
చానయెఱుంగదేలనె? రసాలపులేమనుదీవెకూటముల్
మానుటగందుతుమ్మెదకుమాన్యము మాన్యములబ్బినీరతుల్.

అనిచెప్పిన మందారమాలయొక్క పల్కులకుఁ గమలవతి తనహృదయమునందు "వీఁడుతనమనస్సునఁ గలిగినమరులు తీర్చుకొన నామధురమగు నధరమునునొక్కి తేనెలానవలయునని యున్నవాఁడంతియకాని సమీపమున నిరుగుపొరుగువారలు పిమ్మట నన్నుం గాంచిగాని తన్నుం గాంచిగాని నవ్వుదురని యెఱుంగఁడుకాబోలు. అది యట్లుండనిమ్ము. ఇఁకను బరువమునిండని నాతోఁ జేరుటకుఁ బ్రయత్నపడుటకంటెఁ

బరువమునిండిన యండజరాజమానవలంగలయుంట మేలుగదా, అనుతాత్పర్యమీబాల కనఁబఱచె. కానిమ్మెందువిధముగ దీనికి సమాధానమువచింతు” అంచుఁదలంచి యిట్లనియె.

చ. ఇతరులుఁ నవ్వరే ? యనుచునెంచుచునువ్విళులూరుచుండఁగా
వెతలుఁ దొలంగునేతనకు వేడుకతోనిచుఁబోలుదంతిరా
ద్గతులను గూడిసమ్మదముఁగాంచుచు లేసును మోవినొక్కుచున్
మతిదయఁబూనఁగానుబతిమాలకయీసరసాగ్రయాయికిన్.

అని చెప్పినవిని మందారమాల మందస్మితసుందరవదనారవిందయై తలవంచు కొని సిగ్గుతోఁజెలికత్తెంజూచి యోసీ నీకెల్లకాలము నిట్లుసరసంబులాడుచున్న దానవైన నితరపురుషుని సమీపమున నిట్లుచెప్పంజనదు. నేను బాల్యముచేత మీఁదెఱుంగక యుత్తరప్రత్యుత్తరములను జెప్పుకొనుచువచ్చితిని. ఇంకఁజాలును. పోదమురమ్ము అని తాను ముందరుగఁగా గమలవతియుం దానివెంటనె యింటికిం జనియెను. ఇంటికి వచ్చిన దాదిగా నామందారమాలకు మధుమంతంబునం గాంచినకుమారునిం జూడ మననేకాని యితరపంగతియొక్కటియును మదిశిష్టము కాకయుండుటఁ గమలవతి యాత్మలోనెఱింగి యప్పుడప్పుడును తత్ప్రస్తాపంబులం జెప్పుచుండును. మందార మాలయుం వినుచుండు సంతియుకాని యతిగంభీరస్వభావయగుటచేతను ఇది యితరుల కెఱుకపడునో యనుభయంబుచేతను ఏమియుఁజెప్పక యూరకుండు, ఇట్లుండ నొక నాఁడు కమలవతి యతిచింతాక్రాంతయై చిన్నబోయియున్న మొగముతోవచ్చి యొంటిస్సురుమంచుంగూరుచుండి తలవంచుకొని యేమేమియో యాలోచించుచందంబున నూరకయుండఁగా మందారమాలచూచి యోసఖీ నీవిట్లేల దుఃఖాక్రాంతవై యుండెదవు. ఒకనాఁడైన నింతకుముందు నీవిట్లుండలేదే. నీకిట్టి చింతకుం గారణమేమి ? తెల్పుము అని యనేకవిధముల బతిమాలినను ఏమియుఁ జెప్పకయుండఁగా రాజపుత్రి దుఃఖాక్రాంతయై కన్నులబాష్పంబులుగాఱ నోచెలీ యెన్నివిధములనడిగిన జెప్పవు. తోడి సఖులకు ననివార్యమగు కష్టముకలిగినప్పుడు వాస్తవమగు సఖియైనం దానింజూచి యోర్వలేదు. నేనిక బ్రాణములువదలి నీకష్టంబుగానకయుందు. అని యతికరుణంబుగాఁ బల్కనఁ గమలవతియుఁ గొంచెమాశ్వాసముఁదెచ్చుకొని నిట్టూరుపువిడిచి యోమం దారమాలా! మనమందఱమును బ్రాణత్యాగము చేసికొనవలసినకాలము సమీపించి నప్పుడు చింతపడవలసినదేమున్నది. అయినం బ్రాణసఖివిగాన నీకునుచెల్పి యనంతర మాపని కొడిగట్టఁదలఁచినాను. ఈ కష్టముదీర్ప శక్తులింకెవ్వరును లేరుగదా ! హా దైవమా ! నీ కొంకింతయైనం గరుణలేదటరా ? అనినఁ గమలవతింగాంచి రాజపుత్రి యో ప్రాణసఖీ నీకిట్టికష్టం బేవిధముగ సంభవించెనే? దానిప్రకారంబేమే ? దానిం దీర్పు

వారలు ఎవ్వరును లేరటే? అట్టితీర్పరాసివైన మనమిరువుర మేకకాలమునం బ్రాణములఁ బాయుఁదము. ఆవిఘ్నమొకింత నాకుం దెల్పుము. కూడునేని ప్రతివిధానంబు నాచేనైనంతవఱకును జేయనగును. అని యిట్లనేకవిధముల ననునయించి యడుగఁగాఁ గమలవతి కొంచెము ధైర్యముఁదెచ్చుకొన్న దానివలె నభినయించి యో ప్రాణసఖి నీవల్లనైనంత సహాయముచేయుట నిజమేనటే? అట్లైన నాచేతిలోఁ జేయివేసి ప్రతిజ్ఞ చేసి యిమ్ము. అనిన నామందారమాలయు నట్లుచేసినఁ గమలవతి యిట్లనియె. ఓ యమ్మా మందారమాలా యేమనిచెప్పుదునే? మున్నొకనాఁడు మనము మధువంతమునకుబోయి దానియొక్క చంద్రశాలయం దొకరాజకుమారునిం జూచితిమిగదే?

మందారమాల ససంభ్రమముగ. ఔను. చూచితిమి. ఆ జగన్మోహనునికి ఏమి దురవస్థ సంభవించెనే యిప్పుడు.

కమల. ఏమనిచెప్పుదునే మందారమాలా? ఆ మనోహరాంగుం డిప్పుడు తన ప్రాణములం దెగించి విడిపింపం బ్రయత్నపడియున్నవాఁడు. ఇంకేమిఁజావలయునే?.

మందార. ప్రియసఖి యట్టిమహాగంభీరపురుషులు కేవలమొకింత కారణముచేత నిట్టి క్రూరపుఁబనికొడిగట్టరు. ఇందుకుం గారణం బేమియో తెల్పంగదే?

కమల. కారణ మేమని చెప్పుదును. ఆవేళ మన మా యేకాంతస్థలమునకుఁ బోవుటయే కాని మఱియొండుగాదు.

మందా. అచ్చటికి మనము పోవుటంబట్టి యాతనిరాకయెఱింగి రాఁగూడని చోటికివచ్చినందున కేమైన నాతనియందు భగవతి సాంఖ్యాయని కోపగించుకొన్నదా? లేక మఱి యెవ్వరైన విప్రియంబుఁ జేయయత్నించిరా?

కమల. లేదులేదు. వారికందఱకు నితనికి విప్రియంబుఁ జేయవలెననియేమి క్రోధమా.? అప్పుడు మన మాతనింగాంచిన వేళ.

గీ. విరహిజనులఁగన్న వేఁటాడుమదనుండు
సుదతినీదువాలుచూపుగముల
బాణములుగఁ జేసిపటుధైర్యమున డాసి
యేసె రాజమృగము నేపుమిగుల.

అదిమొదలు.

సీ. సఖులతో మాట్లాడఁజాలఁడొక్కొక వేళ నన్నంబుభుజియింపఁ డాదరమున
జలకంబులాడఁడు జలజాకరములందు మలయజగంధంబు మూనినాఁడు
పువ్వులఁ జేనంటఁబోఁడు మత్తాళులఝంకారములకులిక్కి సంభ్రమించు
తనలోనఁదానే మోతలఁచుచుఁ జింతించునూరకతలయూచియుత్తలపడు

గీ. చిత్రఫలకాననీవంటిచేడెవ్రాయ
వ్రాసిచూచుచుబొమ్మయుల్లసగట్టి
వరదవరదాయటంచునవ్వన్నెకాఁడు
వెన్నునీఁదలంచుచుండునోకన్నెవినుము.

మందార. లజ్జాసంభ్రమశోకంబులతో ఓప్రియసఖి యిట్టికష్టంబున కేలా కారణమైతివి? అనంతరవృత్తాంతము వచియింపుము.

కమలవతి. ప్రియసఖీ! సకలభువనైక మోహనలీలావిలాససుందరమందిరాంగుం డగునాకందర్పతుల్యుండు.

సీ. మలయమారుతమనుమదదంతి కొప్పించుచాత్మాంగకంబులనాశమాని
పల్లవశయ్యలఁబలుమాఱుఁబొరలాడుదవదహనంబనితలఁచితలఁచి
పద్మరజఃపాళిఁబైపోసికొనుఁగుసుమాలానలంబని దానినాత్మనెంచి
గొజ్జంగినీటిలోఁగోరిమజ్జనమాడఁదప్తతైలంబిదితనువుఁదొలఁచు.

గీ. ననుచు నారాచకోమరుండు ననుదినంబు
పరితపింపంగఁజూచెదఁబద్మ నేత్ర
యంతయే కానియేమిసేయంగఁగలను
రాజతనుజుండుహృదయాంతరంబునాకు.

ఆతండీదినమునం దుదయమున సితచంద్రంబులలో నొకయెడ నేకతంబున నీపద్యం బొకపత్రంబుపై వ్రాసియుంచి యెక్కడకోపోయియున్నవాఁడు. అదిగాంచినది మొదలు నాకుమిగుల దిగులుకలిగియున్నది. ఆపద్యంబిదె చదువుము. అనియొకకమ్మ మందారమాల చేతికిచ్చిన.

మందా. అందుకొనిచదువుచున్నది.

సీ. కన్నులఁగట్టినట్లున్నది యారామ గాంచఁగాఁదివిరినఁగానఁబడదు
కౌఁగిలిచ్చినయట్లు కనఁబడునాయింతి బాహువులకులోనఁబట్టుబడదు
పల్కులుదానేమొ పల్కినట్లైయున్నఁజెవియొగ్గివినినను జెప్ప దేమి
మోడిగానాతోడఁగూడనట్లైయున్న బతిమాలువంతలోపల మొఱఁగు

గీ. నిట్టిమాయావధూటిఁజేపట్టనాకు
వశముగాఁదోఁచదంగజువాఁడిములుకు
లాత్మనుగలంపసాగెనుహాయిఁకెట్టు
లేమహామాంసవిక్రయంబిపుడుసేతు.

అని చదివిన.

కమల. చూచితివటే యితఁడు * మహామాంసవిక్రయంబు సేయఁ దెంపుఁజేసి యున్నాఁడు. సకలజననయనోత్సవంబులగు నాకనియంగంబు లిట్టి క్రూరదశలం జెంది కత్తిచేఁ గోఁతపడి శ్మశానభూతముల కెరగాఁబోవుచున్నవి. ఇట్టియమంగళము వినఁగా నెట్టికఠినహృదయమైనను గరంగదటే. అది యటుండగాక నాకత్యంతమిత్రుఁడు. ఏమి చెప్పుదును. అతఁడు శ్మశానమునకేపోయెనో మఱియెక్కడకైనం బోయెనో యెఱుఁగను. ఇంతవఱకు నాతనిశరీరంబు నిలిచియున్నదో! లేక భూతభేతాళశాకినీఢాకినీ ప్రముఖముల దంష్ట్రలసందున నమలఁబడుచున్నదో. ఓమందారమాలా తలఁచుకొన గుండెతల్లడమునొందుచున్నదే యని మూర్ఛిల్లి పుడమిపయిం బడిన మందారమాలయు నేదదేర్చి కమలవతీ యిందుకు మనమేమియుఁ జేయలేము. కార్యంబతిక్రాంతంబయినట్లు తోఁచుచున్నయది. ఇఁక మనకు శరణంబు మరణంబ. లెమ్ము పోదము. మనయుద్యానవనమున నుండు నగాధంబగు హ్రదంబులో మాకి ప్రాణంబులుమాని యామహనీయుని కనుంగొనఁ జెలికత్తెల మయ్యెదము.

కమల. ప్రియసఖీ యేనాతనికిఁ జెలికత్తెఁగాన నట్లు ప్రాణములు తొఱఁగుట యుచితమె? నీవేల యీవట్టిపని కొడిగట్టెదవు.

చ. మదనునికిన్సమానుఁడగు మానధనుండు మగండు నీకున
న్మదవతు లెందఱో సఖులు మానని ప్రేమఁ జెలంగుచుందురీ,
యదనున నాపయిన్హృదయమానిన ప్రేమశరీరముజ్జగిం
పఁదగదు నిల్వు మేఁజనెదఁ బ్రాణములన్విడ నాఁడనిప్పుడున్.

మందార. ప్రియసఖి! కమలవతి! యిదియే నాస్నేహధర్మము. నీ నెచ్చెలియొక్క వియోగమునకుఁ దాళలేక నీవు ప్రాణములు విడువఁబోవుచున్నావు నేను పరమార్థ ప్రియసఖినిగాన నియేమొ నన్ను నీతోడఁ గొనిపోవనిష్టంబు లేక నిషేధించుచున్నావు. నన్నుంగూడఁ గొనిపోవుటకు నిష్టంబు లేనియెడలఁ బ్రకారాంతరముననైనను బ్రాణములు వదలి నీ యుండుచోటునకుం జేరుచున్నాను.

కమల. ఓమందారమాలా! ప్రియసఖివన్న నీవుగదా! పోవుదమురమ్ము. అని లేచి. ఓప్రాణసఖీ ముందా మహాసుకుమారుం డున్నచోటుఁ గాంచి యామధుమంతము యొక్క యుద్యానభూమిలోనుండు కొలనిలోఁ గలయుదము. నీ సౌధసమీపమున నయ్యేనేని యితరులు తెలియుచుగా నుండుదురు.

మందార. సఖి యట్లకానిమ్ము.

---

* శ్మశానమునను౦డు భూతములకు తనశరీరముఁగోసి వేయుట మహామాంస విక్రయమనఁబడు.

ఇద్దఱును గూఢమార్గమున మధుమంతమునకుం బోయిరి. అచ్చట నొక చోటు చూపి యాకమలవతి యిట్లనియె. ఓమందారమాలా యొకనాఁడా రాజకుమారుఁడు నే నెత్తుకొనివచ్చిన నీదాసిబిడ్డను వేడుకకై తానెత్తికొని నినుంగాంచుచుం గాంచుచు ముద్దాడి నీ మందహాసంబునకుం దాఁ గృతార్థునిఁగాఁ దలంచుచు నాబిడ్డ నందివ్వఁబోగా నేనును గార్యవ్యాపృతనై యుండి నిన్నుఁ దీసికొనుమన్న నీవు భయమును లజ్జయును బైకొన సఖిమాట యతిక్రమింపం జాలక చేతులొడ్డునప్పుడు ఆపరమండు శిశువు నొసంగునెపంబున నంగుళులతో నీ మిటారిపూప చన్నులు తాఁకిన నీవునవ్వుచు నేమి యుం బలుకలేక తొలంగి పోతివే ఆచోటిదియకదా ?

మందార. లజ్జాకరుణంబులతో. ఓసి యిట్టివి యుగ్గడింప నిదియేనా సమయము.

కమల. ఏమిసేయఁదునే? ఆయాస్థలంబులం గాంచి నప్పు డాయాచెయ్వులు తలంపునకు వచ్చి తపియింపంజేయుచున్నవి. ఓసీ యీసౌధంబున నొకనాఁ డా కుమారుండు వసియించి యుండ మనము ఒంటరిగా వచ్చితిమి. అప్పు డాతనితో నేను గొన్ని సంగతులు మాటలాడుకొనుచు నిలువంబడి యుండఁగా నీవును సిగ్గుచే నెదుట నిల్వ నోపక నావెంబడిన యుండి విచిత్ర చిత్ర రచన నేసియుండు నీయిఱుకటపుం జోటున నిలువంబడి పైన వినోదము చూచునప్పుడు ఏదే నొకపనిగా నక్కడి కా సర సుండు వచ్చి చిత్రముం గాంచుచు మఱియొకదిక్కునకు మరలిన దానవై తప్పుంజూడక యున్న నిన్ను నితంబబింబమునఁ దనచేతం దట్టెను, అప్పు డులిక్కిపడి యావలికిం జన యత్నించియు నెదుటనుండు నీమార్గముకం బోయిన నొంటరినై యితనిచేతఁ జిక్కు కొందు నేమోయని తలంచి నిలిచి గోడకొదిగిన నీనితంబబింబంబులు తనతొడలు సోక నావలికి నేఁగుచో నతఁడొకచేత నీ మద్దు మొగంబు నివురంబోయె. అప్పుడు నీవు తప్పించుకొని నాయొద్దకు వచ్చి చేరలేదా. ఆచోటిదేకదా ?.

మందార. కమలవతీ నీ వాయాచోటులు చూపించునెపంబున మనస్సునైనఁ దలఁచఁ గూడని పనుల నుపన్యసించుచున్నావు. ఇవి యితరులచెవికెక్క నేని ప్రమాదంబు సంఘటించును. ఊరకయ రమ్ము.

కమల. మందారమాలా యిక్కడ మనమిరువురమఁ దప్ప యితరమైన ప్రాణి చీమకూడ కనఁబడలేదు. ఏల భయపడియెదవు "అనుసంతతాల తనమాట తానే యాక్షే పించుకొని" నీవుచెప్పిన మాటకూడ వాస్తవమే. ? ఎయ్యేచోట నెవ్వరెవ్వ రుం దురో ఎవరెఱుంగుదురు. ఆలోచింగిన బాధ కలుగకమానదు. పోని మావృత్తాంతంబు. ప్రియసఖి నాకు నీవు పరమార్థ ప్రియసఖివైతి వేని నాకెన్నండును విప్రియంబు సేయవుగదా. ?

మందార. ఔను.

కమల. అట్లు నాకు విప్రియంబు సేయనిదానవేని యాకుమారునికిని విప్రియంబు సేయనిదానవే యగుదువు.

మందార. ఔను. స్నేహధర్మమట్టిదియేకదా.?

గీ. భావమొక్కటియైయుండునుబరఁగఁగష్ట
సుఖములొక్కటియైయుండుఁ జూడఁజగతి
స్నేహమార్గప్రవృత్తితోఁ జెలఁగువారి
కొడలుమాత్రము భిన్నమైయొప్పుఁగాన.

కమల. మందారమాలా నాకువిప్రియం బెప్పుడును సేయనన్నమాట యెప్పటికిని మఱవకుము. ఏవేని సమయము వచ్చినప్పు డీమాట తలంపునకుం దెచ్చుకొనుము. ఆరాకొమరునికి విప్రియంబొనర్చిన నాకొనరించినట్లని నీవచనంబుచేతనే యర్థమగుచున్నయది. ఏమనియెదవు.?

మందార. తనమనంబున. అహా యీ కమలవతియొక్క చతురములగు మాటలనువలలలోఁ రసాంతరాకృష్టనై యేన తగులుకొంటి. ఎవ్విధముగనైన మిత్రవచనం బతిక్రమణీయంబు. ప్రకాశముగ కమలవతీ నీవచనంబు మేరకు నాతనికిని విప్రియంబు సేయను. నమ్ముము.

కమల. సఖీ ప్రాణములు విడువంబోవు మిత్రుల వచన మత్యాదరణీయము. కాననిది నాకుం బ్రమాణపూర్వకంబుగాఁ దెల్పుము. పరలోకమున నీవెక్కడనో? ఏనెక్కడనో? ప్రాణములు పోయినను భావస్థిరములై మిత్రభావంబులు జన్మాంతరమునందుంగూడఁ బ్రాణులకు ననువర్తించుచుండునట్లు నఱకొఱలును మానకయుండు. కాన నిన్నింత వేఁడికొనియెద.

మందార. సఖీ నీవుచెప్పినది సరే, ఇదె ప్రమాణపూర్వకంబుగాఁ దెల్పెద.

క. దినమణిచంద్రగ్రహములు, ఘనతరసాక్షులుగ నేనుగడు బ్రీతిమెయిన్,
వినిపింతువిప్రియంబా, యనఘునికిం జేయఁగోరనాత్మ నెఱుఁగుమీ.

కమల ఇఁక నేన ఱకొఱలేక ప్రాణములు విడువంగలను. పోవుదము రమ్ము ద్యానభూమిగుండా మహాప్రాపం బున్నచోటికి. అనియామందారమాలను వెనువెంటం దీసికొని యుద్యాన వనికింజనియె.

ఇట్లుద్యానవనిలోఁ గొంతదూరమరిగి యాకాంతామణులు మనోహరమగు నొక బండి గురిగింజపందిరిప్రక్కం బోవుచుండిరి. కమలవతి దానిసొంపువర్ణించి చెప్పుచుఁ గొన్నికొన్ని పువ్వులు గోసికొనుచు నాలతాగృహము దండ వదలి పోవుచుండఁగా నప్పుడు

మందారమాల యొక పూలగుత్తిం గాంచి దానిం గోయఁదలంచి కొంచెము నిక్కి తన చేతుల నాగుచ్ఛంబును గదలించిన నందుంగల తుమ్మెదలు జేరి యామందారమాల యొక్క మొగంబుం జుట్టుకొని ఝంకారము సేయఁగా నది భయసంభ్రమంబులతోఁ దన పైఁటచెఱంగున మొగంబుఁ గప్పుకొని యోకమలవతీ యేనిట్లు బాధపడుచున్నను నన్ను విడిచిపోతివే.? ఇదేనా నీస్నేహము. అవి దగ్గఱికతోఁ బల్కిననదియుం నాకుం గూడ నడ్డిమొనరుచున్నవి. ముసుఁగు దీయవలదు. నీ మొగముందు గండుతుమ్మెదయొకటి చుట్టుకొనియున్నది అని చెప్పుచుండ మందారమాల సీత్కారము సేయుచు నోసీ నేను పయిఁటకొంగు ముసుఁగు వేసికొనుటకుఁ జేతులెత్తఁగా నాదోర్మూలంబులం గిలిగింతలు వలిపినట్లున్నయది. మనంబును ఝల్లుమనుచున్నది. తుమ్మెదలభయమువలన ముసుఁగు దీసి చూచుటకును లేను. అని చెప్పఁగాఁ గమలవతియు మఱేమి లేదు. ఆ పూఁబందిరిలో నుండు మామిడిచెట్టుయొక్క కొమ్మ యొక్కటి యట్లు నిన్నంటి యుండవచ్చును భయపడకుము. గండుతుమ్మెద నిన్నింక వదలదు గాఁబోలు? మరల వచ్చుచున్నది. యని చెప్పుచుండగాఁ దనపూప చన్నులొక్కండు తనకరంబున నంటినట్లుండ నదియును మామిడిచెట్టు శాఖలసంపర్కంబుగాఁ దలంచి బాహువులచేఁ బరిహరించుకొనుచుం గొంతదూరం బట్టియఱిగి తాఁగట్టుకొన్న వలిపెంపుచీరచెఱంగును బొటనవ్రేలం బట్టి యీడ్చినట్లైన నచ్చటి చెట్టుకుం దగులుకొన్నదియని తలంచి మెల్లన విడదీసికొనం బోవుచు నఱుగుచుండం గొంతసేపటికిఁ బోఁకముడివీడి చీరయుం నేలపయింబడిన నప్పుడు తనపిఱుందులపయిన నొకపురుషుని కరంబు స్వేదయుక్తంబయి పులకలు గ్రమ్ముచు భయసంభ్రమంబులతో నొలయుంటం జేసి ఇవి యీకొమ్మల పనులుగావని సంభ్రమించుచు కమలవతిం బిలిచిన నదియుం సమీపంబున లేమి నేమియుం జేయలేక తనచీరయంతయు నాతనిచేత నుండంగా నదియడుఁగలేక తన చేతి చెఱఁగున మొలకుం గట్టుకొని కొంచెము వనతయై యొక చేతఁ బోకముడి దృఢంబుగాఁ బట్టుకొని వేఱొండు కరంబునఁ జిన్నిచన్నులం గప్పుకొని మరలియుండె. అప్పుడు రాజకుమారుండును దాని సమీపమున కేఁగి యో విన్నదానా! నిన్ను నిట్లొనరించినది వృక్షము గాదు. నేను నీ మీఁది మక్కువ నిట్లొనరించితి ననిన నామందారమాలయుఁ గొంచెము కోపంబుఁ దెచ్చుకొని మీవంటి వారి కిది మేరలేనా? కులకన్యకయని తలంపరైతిరిగా? యనిన నతండు మందహాసంబు సేయుచు మందారమాలా మన్మథుండు మేర మీఱినయెడ నెంతటి ధైర్యవంతులు నేమిసేయంగలరు. నీవు కులకన్యక వైన నేమి నిన్నెవరైనఁ గులంబులో వెలియందురే? యనిన మందారమాల రోషంబుతో నింకనిచట నుండఁగరాదు. నివృత్తంబగు కార్యమును గుఱించి యేమియుఁ జేయరాదు. నాచీరవదలుము. నేనింటికిం

బోవతె. ఇఁక నేమైనఁ జేయ నుంకించెదరేని కమలవతిం బిలుతు ననఁగాఁ గుమారుం డును నీవు కమలవతికిం బ్రాణసఖివిగదా? దానికస్మత్సమాగమంబిష్టంబయి కాదె కను మొఱింగిపోయినది. ఇప్పుడు నన్నతిక్రమించి పోదువేని దాని కప్రియంబు చేసిన దానవయ్యెదవు. కులకన్యక వయ్యెదవేని ప్రతినవప్పకుండుదువు గాదె యనిన మం దారమాలయుం దనమనంబున నాహా యీకమలవతి ప్రియసఖివలెనుండి యెంత చేసెను. దీనికపటవచనంబుల కేమి యిచ్చటికి వచ్చి యీతనిచేతం జిక్కుకొంటి. ఇఁక నీతనివలనం దప్పించుకొను మార్గంబుఁ గానము. ఒకవేళ కోపగించుకొని పోయిన నతిచతురయగు కమలవతి యేమేమి సంకటంబులు దెచ్చిపెట్టి మరల నీతని చేతఁ జిక్కుకొనునట్లు చేయునో? ఈతఁడును తనమనోరథంబు దీర్చుకొనక విడువఁడు, ఇప్పు డీతనితో మెండొడ్డిన పెరవారలకుం దెలియకమానదు. అభిమానం బింకనలయించు చున్నయది. యని చింతించుచుండ రాజకుమారుండును దానికేలుతన కేలంగీలించి.

సీ. పైకెత్తఁగాఁగసిబాహుమూలములందుఁగిల్గింతఁజేసితిఁ గేళి మెఱయ
చేలంబుపీఁచిసింగారపునితంబబింబమంటితినిరాగంబుతోడ
ననుపతోనీరెపిమునువీడ్చిరంభోరుకాండ కాంతులఁగంటిఁగౌతుకమున
నెదురైనచోనీదుకుదురుచన్గుబ్బలఁబట్టితిఁగరములబాళియెసఁగ
గీ. కీలుజడవట్టినును మోవిలీలనొక్కి, నిన్నుఁగౌగిటఁ జేరిచి నేర్పుమీఱ
రతులఁదేలించుటొక్కటేరమణిమిగిలి, యున్నదదియుంచు దీర్పుమీకన్నెయిపుడు.

అని వంచుకొనియున్నఁ ముద్దుమొగంబునిమిరి దనచేతంజుబుకంబువట్టి యెత్తిన నేమియు ననకయుండఁగా సంతసించి.

సీ. ముద్దాడుటకుఁబలె మోముమోమునఁజేర్పఁ దిప్పరమొగంబుఁగాఁద్రిప్పికొనుచు
కులుకుగుబ్బలఁబట్టఁగోరిహస్తమువైనఁజేర్పఁగా బాహులఁజేర్చుకొనుచు
తొడలనంటఁగఁబోవవడిమీఱఁ గూర్చుండి యనువుదోపకయుండునట్లు మెలఁగు
తమిచేజనీవివదల్పఁగాఁజెయిదార్పదనచేతఁబట్టియాతంకపడుచు.
గీ. కౌఁసరిబిగికౌగిటికిఁ జేర్పఁగోరినపుడు, వెనుక ప్రక్కకుమరలితాఁదనువుఁదాఁచు
ముగుదగావున పతిమోహమునకునాత్మ, నలరుచలరింపఁజేసెనాయకునివగల.

ఇట్లొకింత నేపాకాంతాతిలకంబు సిగ్గరితనంబు మీఱియుండు కన్నెగావున నాతని చేయలంతికనువుపడక పాదరసంబుగతిం బరిభ్రమింపనావన్నెకాఁడు దానిచిన్నె లెల్లం గాంచి మించిన మోహాతిశయంబుతో సంగనను దప్పించుకొనిపోనీక చేరంబట్టితిగిచి వలపుతలకెక్కి యొకింతగాఢోపభోగంబునలుప నుపక్రమించినను రక్తయయ్యుఁ గన్నె గానఁ దాళంజాలక తప్పించుకొననువేది యప్పుడు.

సీ. మోవిచుఱుక్కన మొనపంట నొక్కఁగా నోర్వక సీత్కృతు లొలిసలుపు
కుచకోరకంబులఁ గోర్కెఁ గట్టిగఁ బట్టఁ దాళలేననుచు మెత్తఁబడి పలుక
బిగికౌఁగిటికిఁ దార్చి సొగయింప శ్రమమయ్యె విడుమని మెల్లఁగా విభుని వేఁడు
తొడలతోఁ దొడలను దొరయ నొత్తఁగ దాళఁగలనె యింతకు నంచు గాంతుఁ గొసరు
రాగమున జేయు బాహ్యోపభోగమునకు, తాళఁగాలేనిదై ననువరుణి యపుడు
జారరతి గానమున ముకమారు కేళి, కువ్విళులు జెందుచుండె నాపువ్వుబోఁడి.

ఇట్లు కొంతతడవు కాంతుఁడును బాహ్యోపచారంబులఁ దనివిసనక యామందార మాలకరంబుఁ బట్టి యోవగలాడీ! నీవు మిగుదవ్వుగ వ్రుస మిగులఁ బడలితివి. ఇఁక నిచ్చోట నుండు తలిరులశయ్యపయిం గూరుచుండి కొంచెము శ్రమపరిహారము చేసికొనుము. నేను నీకు శీతోపచారంబులు సేయుదు; అని యంతకు సమీపమున నుండు పూసెజ్జకుం దార్పఁబోవ మందారమాల తనమనమున నింకవలు కీశంబు నాతో బాహ్యరతింగలఁగి మోహమతిశయించి మదనకేళిం గూడుట కీయుక్తి బన్నియున్నవాఁడు. కన్నెనైన నాతో నీ కార్యంబు తగునా యని తలంపఁడు ఏమి సేయవచ్చు. ఒకవేళ నేనిందుకొడంబడనివాఁడు ప్రాణములనైన బాయునేమో? చేతనైనంతవరకు జెప్పిచూచెద. మించిన నొప్పుకొనవలయునుగదా? అని తలంచుచుండ నాతఁడు మందారమాలా యేల పూసెజ్జకురావు. అనియడుగఁగా నామందారమాలయు మందహాససుందర వదనారవిందయగుచుఁ బ్రాణనాథా నామనవి నంగీకరింపుఁడు. వినుకన్నెనుగదా? ఇఁకఁ గొంతకాలమున కెపరువము నిండఁగలదు. ఇది యిఁకమీఁద మీ వస్తువుగాని యన్యులది గాదు. అప్పుడు యథాసుఖముగ ననుభవింపఁజనును. కరుణించి యిప్పుడు నన్నంపివేయుఁడు. అని వేఁడికొనఁగా నాసరసుండును ఓమందారమాలా భయపడకుము. నేనట్టి కార్యములకుఁ బాల్పడను. నీకిష్టము కానిపనికిం జేరను. కొంతసేపు వేడుకగా మనమిరువురము నీతలిరులశయ్యపై వసియించి మనయిండ్లకేఁగుదము అని చెప్పుచు నామందారమాలను తలిరులశయ్యకుం దారిచి యొకింతసేపు వినోదంబుసలిపి యామగువయు మనమున మదనకేళిం గోరుచుం బైకి సిగ్గుచేఁ బలువిధముల నలయించుచుండుట యెఱింగి యిట్లనియె. ఓనాయికా బహు దినములనుండి మనమిరువురము పరస్పరప్రాప్తికై యువ్విళులూరుచుండఁగా నేఁటికి దేవుఁడు మనపైఁ గరుణించి యింతటి మేలు సమకూర్చె. మనంబు తృప్తినొందక యున్నది. ఇంక నెన్నఁడు మనమిరువురము చేరంగలమో తెలియదు. ఒకింతకొలంతయుఁ దీర్చితివేని నన్నుఁ బ్రతికించినదాన వౌదువు. అని యనునయించిన నేమియు మాఱుపల్కలేక యామగువ చిఱునవ్వుదోప తలవంచుకొని మెల్లన నిట్లనియె. ప్రాణనాయకా పరువము నిండక యుండు నన్ను నిప్పుడీపనులకుం దార్చక విడుచుట మేలు.

సీ. చిన్నారినును లేఁతచన్నులింకను నాకు మొనలు దేరవు పైకి మోహనాంగి
తలిరుటాకెనయనఁ దనరెడు మోవికి జిగి సిందదింతకుఁ జెలిమి కాఁడ
ఇంచుకించుక జిగిమించునదైపై మేనుపైడక యున్నది వేడ్కఁ గాఁడ
తనుభావమెడబాసి దనరెడుజఘనంబు ఘనతఁ బైకొనదింక వినుతచరిత
గీ. నిగనిగలు ముద్దుచెక్కుల్ నెఱయవింకఁ, బొడలు రుటమయి మిసిమిసులు దొడరవింక
వదనమిందాక సువిలాసపదము గాదు, కానవలదాచపనులకుఁ బూనవలదు.

అనిచెప్పిన ముద్దరాలి వచనములకుఁ దద్దయుమనంబునఁ గరఁగుచు నా కుమారుండు ఓసుందరాంగీ నీ చెప్పినమాటలు సరియే. నామనవియొకటి యంగీకరింపుము.

సీ. కులుకుమిటారంపుఁగొమరుసిచన్నులు మగ్నచూచుకములే మంజువాణి
పుంస్కోకిలముచుపభోగోత్సుకముఁ జేయుం జూవి లేఁజిగు నీ మోవిబాల
తారుణ్యభూపతి చేతితోల్తను వెల్చి వెలిఁగఁడారము నీ మకులుకుఁ బిఱుఁదు
బాల్యవిభావరి వాయవికాసలక్ష్మీ చుంబితాబ్జంబు చెలియ మోము
గీ. కలికి నీ మేను నానభాగ్యస్థలమునందుఁ, గొలుపు వీరెను వలరాజుకోర్కి నిపుడె
వానిపను లెల్ల సలుపంగవలయుఁ గానఁ, దగదు మారాడ నీకు నుద్దండుఁ డతఁడు.

అనిచెప్పిన నాతని సరసంపుఁబలుకులకు మనంబునం గరంగుచు గొంచెముగ మొగమెత్తి లజ్జారంజితంబులగు కటాక్షవీక్షణములచేఁ జూచినవ్వుచు మరలవంచుకొనిన నపరిమితానురాగంబుతో నాసుందరుండు సుందరిం దనపైకిఁ దీసికొని పూలపానుపునం జేర్చి పేర్చినతమి నోడలెఱుంగక యాచిన్నారికన్నె కనుపునఁ గళల యిక్కువలంటి యుల్లాసంబు గల్పించి, యప్పటికంత్రముల కెమరెక్కి యొడలి బంగారము చూరలిచ్చి తమిహెచ్చి పచ్చవిలుకానిపనులకు విచ్చలవిడిఁ దచ్చనలు లేక తత్తరించు నమ్మత్తకాశినిం గూడి యాసరసుండును.

సీ. కీలుకొప్పూవక చేతఁ గీలించినను మోవిపల్గంటు లేర్పడఁ బాళినొక్కి
కంచుకం బెడలించి ఘనకుచంబుల పైనఁ గరజక్షతంబులు గల్గంబట్టి,
మొగమెత్తి చెక్కుల్ దగుపత్త్రములు మాయ మోహంబుమీఱంగ ముద్దులాడి
చేలంబుఁ దొలఁగించి చిన్నారి తొడలపై గిల్లులేర్పడఁగఁ గిల్గింత చేసి
మించునూనూఁగుచూఁ గారుగాంచి మలరి, చిన్ని లేఁ గౌనుదీవియఁ జేతఁబట్టి
వళులయందముఁ జూచి భావమున గరఁగి, నీవిడిగఁ జార్పఁగాఁ జేయు నెమ్మిఁ దార్చె.

అప్పుడా సీమంతవతీమణియు లజ్జయతిశయించి కాంతునికరం బొకచేతం బట్టుకొని ప్రాణనాథా యిది నీకుఁదగదు. కొంచెము నిలువుము అనిచెప్పిన నాకుమారుండును దానికరముఁ బట్టికొని కాలిబొటనవ్రేల నాయింతి చీరచెఱుంగు వట్టి తిగిచిన నీవియుఁ

దిగజాఱి నందుకు మందారమాల సిగ్గుతోఁ గాంచి నాయకునికన్నులు మూసెను. అప్పటి యాతరుణుల తమకంబు నేమనిచెప్పంగలను.

క. తారుణ్యమునిండమిచే, నారమణీమణికి కొంకతయఁ సటయైనన్
జారసురతంబుగావున, కోరికలనుమానివెన్నెకొలుపుచునుండెన్.

ఇట్లుండ నప్పుడు వారల కొక శ్లోకము వినఁబడియె.

శ్లో. అన్యాసు తావ దుపమర్దసహాసు భృంగ, లోలం వినోదయ మనస్సుమనోలతాసు
బాలామజాతరజసం కలికామకాలే, వ్యర్థం కదర్థయసి కిం నవమల్లికాయాః.

[ టీ. భృంగ=ఓతుమ్మెదా ? అన్యాసు తావత్=ఇతరములయిన; సుమనోలతా సు=పూఁదీగెలు, ఉపమర్దసహాసు = నీయొక్క యుపభోగమున కోర్చుకొనంజగినవి ; యుండఁగా, (వానియందు) లోలం=చంచలమగు, మనః=మనస్సును, వినోదయ=వినో దింపఁజేయుము. బాలాం=లేఁతదియును, అజాతరజసం = పుష్పాడినిండిపక్వనిదియుం నగు, నవమల్లికాయాః=బండిగురుగింజతీవె యొక్క, కలికాం=మొగ్గను, అకాలే=సమ యముకానిసమయమున, వ్యర్థం = నిష్ప్రయోజనముగ, కదర్థయసి = బాధపఱచు చున్నావు, కిం=ఏల

ఓతుమ్మెదా నీకుపభోగార్హములగుపూఁదీగెయలుండఁగా నీచంచలమగు మన స్సును వానియందు వినోదపఱచుకొనఁగూడదా ? అట్లుచేయక మిగులపసిదియై పుష్పా దులుగ్రమ్ముకొననినవమల్లికయొక్క మొగ్గను బట్టుకొని విశేషముగ బాధించుచున్నా విదియేలా. అట్లు చేయుంట కిదిసమయముకాదే. అనితాత్పర్యము.

ఇందుకు వ్యంగ్యార్థము. ఓ సరసుఁడా నీకుఁగలమోహంబుదీఱున ట్లెన్నివిధముల భోగించినను నీయుపభోగమున కోర్చుకొని మనమున ననురాగము వృద్ధికాఁగా నీతోఁ బెనంగందగిన కాంతామణులెందఱోయుండఁగా స్త్రీయన్న మాత్రముననే గరంగివారి సంభోగాదులకు తహతహపడు నీహృదయంబును వారలయందు సంతోషపఱచుకొనం గూడదా ? ఈమందారమాలయో మిక్కిలిపసిది. సమర్తాడినదియుఁగాదు. ఇంకను పైఁదీగెవీడినదికాదు. అట్టిదీనిని సురతాదులఁ దొందార్చుచున్నావు. ఇందువలన దీనికి శ్రమముగలుగునుగాని యనురాగంబు గలుగదే? దానికనురాగములేనిచో నీకును సుఖంబు లేదుగదా ? ఉత్తమమైన రాజసంతతిలోఁబుట్టిన మత్తకాశిని గాన యౌవనావిర్భా వమునంగలుగు లావణ్యమాత్రంబునన వలపుఁగొలిపింప నీవిట్లేలచేసెదవు.]

అనిచెప్పఁగా మందారమాలయుం రాజపుత్రుండునువిని యదిరిపడి యొడలు ఝల్లు మన నతిత్వరతో బాతలిరులశయ్యపైనుండిలేచిరి. రాజకుమారుండును మధుమంతంబు నకుంజనియె. మందారమాల ముగుదగాన నేయునదియెఱుంగక సంభ్రమించుచుండఁ

కమలవతివచ్చినప్పుడు ఓసఖీ! యేలయీతత్తఱపాటు? భయపడకుము. నేను సమీప
మున నున్నదానను. ముందు నిన్నుఁజుట్టుకొనియలయించుచువచ్చిన గండుతుమ్మెద నిన్ను
వదలించనిగదా అనిచెప్పిన మందారమాల యేమియుఁబల్కలేక తనతప్పు బయలుగని
పెట్టిరిగదాయని చింతించుచు నెంతయనునయించినను మాటలాడనొల్లకున్న నాచిన్నారి
కన్నియను వెన్నుచఱచి నేనుండఁగనీవు నితరులకు వెఱవవలసినదిలేదు. అనిచెప్పుచు
నొడలుఁదుడిచి చీరసవరించి కైకదొడిగి యాభరణజాలంబులు చిక్కులెడలించి యామం
దారమాలయొక్క సౌధమునకుం దోడ్కొనిపోయెను.

ఇట్లు మందారమాల తనయింటికఱిగి తాఁజేసినతప్పు మనసునఁదలంచుకొని యిది
యితరులకు దెలియఁబడియున్నది. ఇందున నేమికీడు మూడునో? భగవతి సాంఖ్యా
యనినాయందు మిగులగౌరవముతో మెలంగుచుండునది.ఆమెకిదివిదితమగునేని నామొగ
మైనఁ జూడనొల్లదుగదా. పెనిమిటికిది యెట్లు తెలియకపోను. తెలిసిన నతనిమనం
బునఁ గ్రోధమతిశయించి చంపంజూచుఁగదా? పెద్దలకు నిది నలుగురిలోఁదలవంపులై
బాధించు. ఉత్తమమగుకులమునంజెఱప నిట్టి జారిణినగు నేనేల పుట్టవలె. అప్పు డారాజ
కుమారుండు బతిమాలుకొనఁ ద్రోఁచివైచి యేలరాకపోతిని. బుద్ధి వెడతలఁబట్టెఁగదా.
నలుగురు చెలులు గూడినప్పుడు నన్నుంగాంచి భావముల నర్థంబుంచుకొని యొం
డొరుల మొగములు గాంచుచున్న వ్యాపదేశముగదూఱరా? ఇదియిప్పుడె మగవారిమాట
ములకు సమ్మతింప నీకనెట్టికులటయగునోయని యాడఱువాడుకొందురు. ఏమనుకొన్న
నేమి యున్నది. నిందకొడిగట్టియేకదా నాసుందరునిపొందుకు సమ్మతిఁజెందితి. ఏమి
సేతు సఖులమొగములుగాంచి మాటలాడ నిష్టంబు గాదు. సఖీజనములు నన్నుంగాంచి
యీమోవిపై పలునొక్కు లేమి? ఈగుబ్బలపై నఖక్షతంబులేమి ఈతొడలపై గిల్లులేమి
యని యడిగినయందుకేమి యుత్తరం బొసఁగఁగలను. అని యిట్టనేక విధములం దలంచు
కొనుచు, గురుజనభీతిచేఁ జింతాసాగరమునమునింగి దరిగానలేక పరితపించుచుఁ
జెక్కిటంజేయిచేర్చి యీకమలవతివలనఁ గదా నాకిట్టికష్టంబు సంభవించె దీనిస్నేహంబు
కపటంబని యెఱుంగక చెడిపోతిని. ఇప్పుడు దాని నుశాసించినను గార్యహానియుం
బ్రమాదముఁ జేకూఱకమానదు. దానికి మనోవిరోధములేక ప్రవర్తింప వలసి
యున్నది. అని కొంత తడవనుకొని చీమచిటుక్కుమన్నను భయపడుచు మనమున
నూరటజెందక యుండఁగాఁ గమలవతి దానికినమీపించి యోచిన్నదానా యేల
యిట్లుచింతించెదవు. నీకునేను బహిశ్చరమగు ప్రాణమునుగాని యన్యురాలఁగాను.
మీర లన్యోన్యసంగతులు చేయుచుండఁగా నంతకుఁజెంతలనున్న యితరకాంత
లెఱింగినందున నెట్టికీడు వాటిల్లునోయని యులుకుచున్నావు. నానేరుపు మెరయఁ
గొన్నిదినములలో దానినట్లచేసి నీకుంజూపుదు సంతపింపకుము. అనియూరార్చిన

నూరడిల్లి ప్రియసఖి యట్లొనరించెదవేని నాహృదయమునకసుఖము వాయు. ఇది యనలికాలమునఁ జేయవలయు. దీర్ఘకాల మగునేని దానిచే నిది ప్రకాశింపఁ బడకమానదు. తంత్రమున జాగరూకవై ప్రవర్తింపుము, అనిచెప్పుచు నాకమలవతి గాక యితరసఖుల సమీపమునకు రానీయక భోజనాది కృత్యంబు లామెగువవలనన ముగించుకొని యాపాటిరాత్రి శయనంబున నొంటిగాఁ బవ్వళించి రాజకుమారుని చెయ్వులు మనమునఁ దలంచికొనుచు, మంచియుద్ధమున నస్త్రత్రాణము తెగిన పోటరిబంటు విధంబుగనైన తనకొఱంతఁ దీర్చుకొన ననువులేదనియెంచుచు బంచశరబాణ భగ్నంబగు హృదయముతో నిదురరాక శయ్యపైఁబొరలుచు.

సీ. కౌఁగిటనాథుండుగదియించిసొగయింపనెదుగొత్తులివ్వకయేలయుంటి
నును మోవినాథుండునొక్కుచోఁదమిమీఱనెదురప్పళింపకేనేలయుంటి
కంచుకంబెడలించికాంతుఁడుకళలంటఁగుబ్బలమరమేలఁగ్రుమ్మకుంటి
నీవిసడల్చియానీటుకాఁడురమింపనొడలితోనొడలేలయరయనైతి.

గీ. మదనతంత్రమునకు వేడమదిఁగరంగి
యెలమితోహత్తిపైకొనకేలయుంటి
బాలఁగావునధైర్యంబుచాలకునికి
జేర్చిఁబతినేలుకొనలేక చేలనైతి.

అని యిట్లనేకవిధముల మనసునందలంచుచుఁ గొంతసేపటికి నిదురఁగూరె. ఇట్లా మందారమాల యారాజకుమారుని పయిఁగల ప్రేమాతిశయంబున గలుగుబాళిం దాళలేక యుండియుం నితరుల కెఱుక పడకుండఁ బ్రవర్తించుచుండె. మేడపయికిఁ గూడ నొకనాఁడైనను దలచూపదు. ఉద్యానవనమునకు సఖులెన్నివిధముల వేడికొన్నఁ బోవనమ్మతింపదు. కేవలము తనయందు కన్యాంతఃపురమునంద యితరులతో విశేషముగ మాటలాడక యేకతంబయుండు.

ఇట్లుండ నొకనాఁ డొకపంజరముఁగొని కళావతి మంత్రికుమారుఁడుండు చోటికివచ్చిన నందలి ముద్దుచిల్కనుగాంచి దానిందనచేతిపై కెక్కించుకొని దువ్వుచుం జిఱునగవు మొగంబునఁ దుఱంగలింప నాకీరముతోఁ గొన్నిమాటలాడి దానిచాతుర్యంబు నకు మెచ్చుకొనుచు నోపచ్చవిలుకాని తేజీ యొక్కకథఁ జెప్పఁగలవాయనిన నదియుఁ గానిమ్మని యిట్లనియె. మంత్రికుమారుఁడా వినుము. ఏను మధుమంతశాసక సౌధ మునకుఁ బ్రక్కఁ గట్టియుండు సాగరధవళంబను మేడలో వసియించియున్న మదనమాల యనుకన్యకకుఁ గ్రీడాశుకంబను. నన్నది యతిప్రీతితోఁ బెంచుచు నాముద్దుమాటలకు సంతసించుచుఁ దనకుఁ బ్రాణపదముగా నుంచుకొనియున్నది. ఆచుగువ కొన్నిదినములకు

ముందొకనాఁడు తనసౌధముయొక్క గవాక్షమార్గమునకు సమీపమునం గూరుచుండి నాముద్దుమాటలకుఁ దద్దయుసంతసించుచుఁ దన చేతిమీఁది కెక్కించుకొని వినోదముగా జూచుచు నాత్మసౌధమునకు సమీపముననుండు మధుమంతపు నుద్యానవనమునందలి యొకబండి గురువిందపొదకుసమీపమున నొక ప్రష్పిణికాని కన్నియను మదనలీలలనల యించు నించువిల్కానికిసమానుఁడగు విలాసిపురుషునింగాంచి కొంతసేపు వారిచెయ్వులు కన్నులారంజూచి యువ్విళులూరుచు ఆ మోహనాంగుండు దాని సతిచతురతతో పూసెజ్జకుందార్చి మిగుదగావున వలరాచపనుల కోర్వఁజాలదని యెఱింగియుఁ దమి హెచ్చి కొన్ని కామోపచారంబులుసలిపి రతికేళిఁగూడనుంకించి నూతయతివపోఁక ముడివీడ్చి తమితలకెక్కఁగూడఁ బోవుసమయమున వారిచెయ్వులంగాంచి యత్యాతురనై యోచిలుకా యిప్పుడొక సమయోచితపద్యంబు వచింపవేయన నేనును "అన్యాసుతావదుపమర్దసహాసుభృంగ" అనుపద్యంబు వచియించితిని. అదివిని యాకాంతయుం కాంతుండును భయభ్రాంతులై తమయిండ్లకుంజనిరి. ఆ కాంతునింగాంచినది మొదలు మదనమాల మన్మథబాణ విభిన్నహృదయయై యాహారంబుఁగొనక సఖియలతో మాటాడనొల్లక కేవలము బాష్పాయమానేక్షణములతో నెల్లపుడు కేలుకపోలమునఁ గీలించుకొనియుండ నచ్చటి దాసీజనాధికారము వహించి ప్రతిపదమువచ్చుచుం బోవుచున్న యీకళావతిచూచి యేకతంబ యనేకవిధముల ననునయించియుఁ దనభావంబు బయల్పఱుపకయుండ నేకతముని నన్నడిగి కలవృత్తాంతంబు దెలిసికొని యోచిన్నదానా నిన్ను దొంగలగు కిరాతులయొక్క బారికిం దప్పించుకొని తెచ్చిననాయందునీకు నమ్మిక లేదా? సిగ్గుచే నీవు చెప్పకపోయినను చిలుకవలన నంతయు నెఱింగితి. ఇందుకుం దగిన మార్గంబు నేను వెతకఁగలను. కొంచెమోర్చుకొనియుండుమనిన నదిసిగ్గుచే మొగంబు వంచుకొనియుండఁగాఁ దానిపీడ్కొని కళావతి నన్నుందీసికొని సితచంద్రమునకుఁబోయి యచ్చట నొకయెడ నొంటరిగఁబరుండి చింతాక్రాంత హృదయయైయున్న కమలవతింగాంచి ప్రియసఖీ యిప్పుడేలయిట్లు చింతఁగూరుచున్నావు. ఏమైన రహస్యంబులున్ననవి బయల్పడనీయక సమరసపెట్టుదము. అని చెప్పఁగాఁ గమలవతి కళావతింగాంచి యో ప్రాణసఖీ నీవుచెప్పినంతపని చేయంగలదానవు. కానచెప్పెదను. మనరాజకుమారునితో మదనమాల నెవ్విధినైనఁ జేర్చవలయుం. ఇందునీచాతుర్యంబుం జూపవలయుఁ. ఈ యర్థమతిగూఢంబై యుండునటయని మందలింపనందుకాయింతియలరి. శ్లో. తా మేవ ధ్యాయతేతస్మై విసృష్టాసైవదూతికా" (అది యెప్పుడెప్పుడు వచ్చునాయని ధ్యానించుచుండు నాయకునియొద్దకు నదియేదూతిగాఁ బంపఁబడె.) అన్నట్లు నేను నిప్పుడందుకై వచ్చియుండ నీవు నదియె మందలించితివి. మంచిదయ్యె. అనేకదినములనుండి మందార

మాలాసక్త మయియుండు నీరాజపుత్రుని హృదయంబితరానురాగంబుఁ జెందునట్లొనర్చుట యిప్పు డవశ్యకర్తవ్యం బై యున్నది. అనిన వారిమాటలకడ్డంబుగానే నిట్లంటిని ఒకనాఁ డీవిలాసియగు రాజకుమారుండు తనచెలికానితోఁగూడి మదనమాలాసౌధసమీపమునఁ బోవుచుండి యతిమనోహరమగు నొకపాటవిని యొకింతసేపు నిలిచియుండెను.

అప్పుడచ్చటి చెలికత్తెలు రాజకుమారుని సౌందర్యవిలాసంబుల కచ్చెరువుపడి యొకరితోనొకరు సల్లాపించుకొనుచుండఁగా మదనమాల వీణెవాయించుటనిలిపి జాలమార్గసమీపమునకువచ్చి రాజకుమారునింగాంచెను. రాజకుమారుండును మదనమాల సౌందర్యమును విలాసములుంగాంచి తనచెలికాని కిట్లనియె.

శ్లో. మాందూరాదరవిందసుందరదరస్మేరాననా సంప్రతి. ద్రాగుత్తుంగఘనస్తనాంగణగళచ్చారూత్తరీయాంచలా, ప్రత్యాసన్న జనప్రతారణపరా పాణింప్రసార్యాంతికే, నేత్రాంతస్య కురంగనయనా సాకూతమాలోకతే.

[టీ. కురంగనయనా = లేడి కన్నులవంటి కన్నులుగల యీకాంత, సంప్రతి = ఇప్పుడు, అరవిందసుందర = కమలమువలె మనోహరమగునదియును, దరస్మేర = చిఱునవ్వుతో నొప్పునదియునగు, ఆననా = మొగముగలదిగాను, ద్రాక్ = వేగముగ, ఉత్తుంగ = ఉన్నతములును, ఘన = గొప్పవియునగు, స్తన = చన్నులయొక్క, అంగణ = పై ప్రదేశములనుండి, గళత్ = జాఱుచున్న, చారు = మనోహరమగు, ఉత్తరీయాంచలా = పయిఁటకొంగుగలదిగాను, ప్రత్యాసన్నజన = సమీపించియుండు వారిని, ప్రతారణ = వంచించుటయందు, పరా = ఆసక్తిగలదియునై, నేత్రాంతస్య = కనుగొనయొక్క, అంతికే = సమీపమున, పాణిం = హస్తమును, ప్రసార్య = ప్రసరింపఁజేసి, మాం = నన్ను, సాకూతం = అభిప్రాయగర్భముగ, దూరాత్ = దవ్వులనుండి, ఆలోకతే = చూచుచున్నది.

తా. ఈలేడికన్నులవంటి కన్నులుగలకాంతామణి కమలమువలె మనోహరమైన తనమొగమునం జిఱునవ్వొలయ, ప్రతిక్షణమునకును తారుణ్యమదముచేతఁ బైకినుబ్బి గబ్బితనముతో నొప్పుగుబ్బచన్నులపైనుండి వలిపెంపుఁపయిఁటజాఱఁగా నది చక్కనొత్తుకొనక యె తనసమీపముననుండు వారల కెఱుకపడకుండఁ దననేత్రాంచలమునొద్ద హస్తముంచుకొని కొన్నియభిప్రాయములు నాకుందెలుపునట్లు నన్నుంగాంచుచున్నయది.]

అనిచెప్పి యంతలోనిటునటు సంచరించువారలంగాంచి తొలంగిచనియె. అవద్యం జేసువింటేఁగాన నాతనిభావంబు మదనమాలయందును లగ్నంబై యున్నదని యెఱుంగుడు, గంభీరహృదయుండుగాన వెలియిడకయున్నాఁడు. ఒక్కింతసూచింపఁ జేయ నది మరలతలంపునకురాఁగలదు. ఆసంగతినిగుఱించి యేనుమందలించెద. మీరును సమీపమున

నుండి వినుండు. అనిచెప్పిన వల్లెయనిరి. అంతనక్కడనుండి యోగిరిపోయి రాజకుమారుని కరంబుపై వ్రాలితిని. అతండు నన్నుంగారవించి చక్కెరలువెట్టి నీవు పెంపుడు చిల్కగా నున్నావు. నీకనేకనాయికానాయకులసంగతులు తెలిసియుండుఁగాన రమణీయమగు నొకపద్యంబు వచియింపుమన నిట్లంటిని.

శ్లో. తన్వీసాయదిగాయతి శ్రుతికటుర్వీణాధ్వనిర్జాయతే
యద్యావిష్కురుతేస్మితానిమలినై వాలక్ష్యతేచంద్రికా
ఆస్తేమ్లానమివోత్పలంనవమపి స్యాచ్చేత్పురోనేత్రయో
త స్యాశ్శ్రీరవలోక్యతేయదితటిద్వల్లీ వివర్ణైవసా.

టీ. సాతన్వీ = అప్పుడు నీవుచూచిన కృశాంగి, యదిగాయతి = కంఠముతోఁ బాడునేని, వీణాధ్వనిః = వీణియయొక్కధ్వని, శ్రుతికటుః = చెవులకుఁ గఠోరముగా, జాయతే = అగుచున్నయది. ఆ కాంతయొక్క కంఠధ్వని విన్నయెడల వీణాధ్వనికర్ణకఠోరమైయుండునసుట, స్మితాని = చిఱునగవును, యద్యావిష్కురుతే = బయలువెడల నిచ్చెనేని, చంద్రికా = వెన్నెల, మలినైవ = మంటికిగానె, అలక్ష్యతే = కనఁబడును, దానియొక్కచిఱునగవు పెదవిదాఁటిరాదు. ఒకవేళ పెదవిపైకిందోఁచెనేని దాని తెల్లందనమునకు వెన్నెల నల్లగానే కనఁబడునసుట, నవమపి = క్రొత్తదైనను, ఉత్పలం = నల్ల కలువ, తస్యాః నేత్రయోఃపురోయది = దానికన్నులయెదుటనున్నట్టయిన, మ్లానమివ = వాడినదానివలె నుండును, దీనికాటుకకన్నులయొక్క నల్లందనమునకు సరిరాక క్రొత్త కలువపూవయినను వాడినదానివలెఁ గనంబడును, తస్యాః = దానియొక్క, శ్రీః = దేహకాంతి, అవలోక్యతేయది = చూడఁబడినదాయెనా, సాతటిద్వల్లీ = ఆమెఱుపుఁ దీఁగె, వివర్ణైవ = కాంతిలేనిదిగానేయగును. దానిశరీరకాంతిఁగనుకొన్నవారికి మెఱుపుఁ దీఁగెయందు కాంతిపున్నట్లుతోఁచదు అనితాత్పర్యము.

అనివిని వీణవాయించుచునిలిపి తన్నుఁగానవచ్చినగాంతామణియొక్క పందు చిల్కయిదియని యెంచి యారాజకుమారుండు దానియాకారరూపరేఖావిలాసములును మనంబునకురాఁగా నాచిలుకతో నిట్లనియె. ఓచిలుకా ఆకాంతామణియొక్క సౌంద ర్యాదులెట్టివేయనుటకు సందియములేదు. ఏనునొకించుక దానింగుఱించి చెప్పెదవిను మని యిట్లనియె.

శ్లో. కర్ణారుంతుదమేవకోకిలరుతంత స్యాశ్రుతేభాషితే
చంద్రోలోకరుచిస్తదాననరుచేః ప్రాగేవసందర్శనాత్
చక్షుర్మీలన మేవతన్న యనయోరగ్రే మృగీణాంవరం
హైమీవల్లరపితావదేవలలితాయావన్న సాలక్ష్యతే.

[టీ. తస్యాఃభాషితే = ఆకాంతయొక్క పలుకు, శ్రుతేసతి = వినఁబడునేని, కోకిలరుతం = కోకిలలధ్వని, కర్ణారుంతుదమేవ = కర్ణకఠోరమే, తదాననరుచేః = దానియొక్క ముఖకాంతిని, సందర్శనాత్ప్రాగేవ = చూచుటకుమునుపే, చంద్రే = చందమామయందు, లోకరుచిః = జనులకభిలాషయుండును. దానిముఖముఁజూచెనేని చంద్రునియందెవ్వరికి నభిలాషజనింపదనిభావము. తన్నయనయోరగ్రే = దానికన్నుల యెదుట, మృగీణాం = లేళ్లకు, చక్షుర్మీలనమేవవరం=కన్నులఁమూసికొనుటయే మేలు. దానికన్నులయెదుటఁ దమకును గన్నుల సౌందర్యముగలదని తిరుగుటకంటె, దమకుఁ గన్నులే లేవని లేళ్లు కన్నులఁమూసికొనుటయే మేలు. యావత్ సానఃష్యతే = ఎంత వఱకు కాకాంతకనఁబడక యుండునో, తావదేవ = అంతపర్యంతమే, హైమీఃల్ల్యపి = బంగారుతీఁగెయును, లలితా=మనోజ్ఞమైయుండును. దానిని గాంచిన వెనుక బంగారు తీఁగె మనోజ్ఞమైతోఁచదనుట.]

అని చెప్పిన నేను నాతనిరసజ్ఞతకు మెచ్చుకొని యారాజకుమారునితోనిట్లంటిని,

శ్లో. యాచంద్రస్యకళంకినోజనయతిస్మేరాననేనత్రపాం
వాచామందిరకీరసుందరగిరో యాసర్వదానిందతి
నిశ్వాసేనతిరస్కరోతి కమలామోదాన్వితా న్యానిలాన్
సాతైరేవరహస్త్వయా విరహితా కాంచిద్దశాంనీయతే.

[టీ. యా = ఏకాంత, స్మేరాననేన=చిఱునగ వొలయుముద్దు మొగముచేత, కళంకినఃచంద్రస్య = కళంకముగలవాఁడగు చందరునికి, త్రపాం = సిగ్గును, జనయతి = కలిగించుచున్నదో? అనఁగాఁ గాంత తన నగుమొగముచేతఁ గళంకముతో నొప్పుచుండు చందురునికి సిగ్గుకలుగునట్లు చేయుచున్నదియనుట, మొగముకళంకము లేక యున్నదిగాన కళంకి యగుచందరుని మీఱుచున్నదియనిభావము. యా = ఏకాంత, వాచా = తనపల్కులచేత, మందిరకీర = ఇంటిపెంపుడుచిల్కలయొక్క, సుందరగిరః = మనోహరములగుమాటలను, సర్వదా = ఎల్లపుడును, నిందతి = దూఱుచున్నయదియో? అనఁగా చిల్కపల్కులకంటె దానిపల్కులు మిగులరసావహములనుట. యా=ఏకాంత, నిశ్వాసేన = ఊర్పులచేత, కమలామోదాన్వితాన్ = తామరలవాసనతోఁగలసియుండు, అనిలాన్ = వాయువులను, తిరస్కరోతి = తిరస్కరించుచున్నదో? అనఁగా దానియూరుపులలో సొగసైనవాసనయున్నది గాన కమలగంధముతోఁ గలసినమలయమారుతములను తిరస్కరించుననుట, సా = ఆకాంత, త్వయావిరహితా = నీచేతవిరహముకలిగింపఁబడినదై, రహః = ఏకాంతమందు, తైరేవ = ఆ చంద్ర శుక వచన మలయమారుతములచేతనే, కాంచిద్దశాం = ఒకయవస్థను, నీయతే = అనుభవింపఁబడుచున్నది. ముందు కమ్ము

నవమతించిన యారమణిని సమయము వేఁచియుండి యిప్పుడు భవద్విరహము చేత నించుక తాపంబునొందుటం గాంచి చంద్రుఁడు శుకములుఁగను కమలగంధపువాయువును దాని నెవ్వరులేక యొంటినుండఁగాఁ జూచి యధికముగ బాధించెదరు. ఇవియన్నియుం విరహుల కుద్దీపకములనుట.]

ఇట్లు నేనువచియింపఁగా విని యాకుమారుండొకయింతయాలోచించి తలయూఁచి యోచిన్నిచిలుకా యాకులుకులాడి కొకదశ కలిగి యున్నదని యంటివి. అదియెట్టిదో తెల్పుమనఁగా నేను మరల నిట్లంటిని. ఏమిచెప్పంగలను ఆరమణీమణియొక్క విరహ వేదనను, వినుము.

శ్లో. నైష్ఠుర్యంకలకంఠకోమలగిరాంపూర్ణస్యశీతద్యుతే
స్తిగ్మత్వంబతదక్షిణస్యమరుతోదాక్షిణ్యహానిశ్చతాం
స్మర్తవ్యాకృతిమేవకర్తుమబలాంసన్నాహమాతన్వతే
తద్విఘ్నఃక్రియతేతృణాదిచలనోద్భూతైఃత్వదాప్తిభ్రమైః.

[టీ. కలకంఠకోమలగిరాం = మనోహరములగు కోవెలలధ్వనులయొక్క, నైష్ఠుర్యం = పరుసఁదనమును, పూర్ణస్యశీతద్యుతేః = పరిపూర్ణచంద్రునికి, తిగ్మత్వం = కఠోరత్వమును, దక్షిణస్యమరుతః = మలయమారుతమునకు, దాక్షిణ్యహానిశ్చ = ప్రీతిలేకపోవుటయును, తాంఅబలాం = ఆపసిగోలను, స్మర్తవ్యాకృతిమేవ = స్మరణమునకుఁదగిన యాకారముగలదానిఁగానే, (అనఁగా జీవించియుండు నేని చూడవచ్చును; అనంతరము మనస్సునందుమాత్రమేకదా తలంపవచ్చుననుట) కర్తుం= చేయుటకు, సన్నాహమాతన్వతే = సన్నాహమును చేయుచున్నవి. తృణాదిచలనోద్భూతైః = తృణము మొదలగునవి చలించుటవలనఁ గలిగినవియగు, త్వదాప్తిభ్రమైః = నీయొక్క పొందుగలుగునను భ్రమల చేత, తద్విఘ్నః = ఆ సాహసపుఁబనికివిరోధము, క్రియతే = చేయఁబడుచున్నయది. అనఁగాఁ గోవెలపలుకు లింపయినను తనకు మహాపరుషములగుటవలనను, చల్లఁదనమునకిరవులగుచంద్రునికిరణములు తనకు మిగుల కఠోరములగుటచేతను, మలయమారుతము దాక్షిణ్యముమాని విసరుటచేతను, ఆకాంతప్రాణములఁబాయ యత్నించియుం తృణములు మొదలగునవి చలింపఁగా నీవువత్తువేమోయని తలఁచి మానుకొనుచున్నదని భావము.]

అనఁగా నతండును ననుం గాంచి సంతసించి నీచమత్కారవచనములకు నాకు సంతోషమును ఆకాంతయొక్క యవస్థఁ దలంచిన భయమును గలుగుచున్నది. ఏమి చెప్పుదు. కాముకులయొక్క శరీరమును ప్రాణములును సౌఖ్యములును దూతికలచేత నున్నవి. అనఁగా నేను దూతికలును మీకుహితంబుఁగోరుచునే ప్రవర్తింతురనిచెప్పి

యాంకనిపిడ్డొక్కని కళావలి కమలవతులంగాంచి వింటిరా రాజకుమారుని వృత్తాంతంబని వారును సంతసించిరి. మీఁదటికార్యమునకనువూహించి నన్నుం జేసికొని కళావతిమదన మాలయింటికింజనియె. ఓ మంత్రికుమారుఁడా యిట్లువచ్చి యాకళావతి మదనమాలకుఁ బన్నీటఁజలకంబాడించి జిలుఁగునలువలుధరింపఁజేసి యస్తమయమున నోమదనమాలా మనమిరువురము వేడుకగా మధుమంతముయొక్క యంద్యానవనమునకుంబోయి యచ్చటిపూఁబొదరిండ్లసొంపుగాంచి పువ్వులంగోసికొని మరలవత్తమురా యని యందు కొడంబడిన యామదనమాలందోడ్కొని యొకరహస్యమార్గమున సౌగరధవళమును నిర్గ మించి యాతోఁటకుంజనియె. ఏనును వారివెనువెంటఁబోతిని. అట్టుల జేకములగు పూఁబొదరిండ్ల నామదనమాలకుంజూపుచుంగొని చని యొకచోట మదనునిచలువపందిరి యోయనందగి యతిమనోహరమై తమాలవృక్షంబులనీడలచేతఁ జీకటులుఁగప్పుచు సూర్యకిరణములు చొచ్చుటకనువుపడని యొకపొదరింటింగాంచి దానిలోనం బ్రవేశిం చిన నప్పుడే నచ్చోటికిం బోయి యెదురనొకగజ్జులేమావికొమ్మపైనుండఁగాఁ గళావతి నన్నుంబట్టుకొనునట్లువచ్చి యెగయఁదోలిననేను నాచోటువదలి పొదరింటి వెలికిరాఁగాఁ గళావతియం నామదనమాలంగాంచి యోసఖీ మనకేళీశుకము బెగిరిపోవుచున్నది, పట్టుకొనివచ్చెద. నీవు బహుదూరము సంచరించి బడలియున్నదానవు. నాతోరాఁజా లవు అనిచెప్పి యామెసెపంబున వెలుపలికేగి కమలవతిచేఁ గృతసంకేతుండై వచ్చియున్న రాజకుమారునికిం గనుసైగసేయఁ దటాలున నతండును ఆపొదరింటి కడ్డంబుగా వచ్చి నిలువంబడెను ఆవిలాసం బేమనివర్ణింతు!

శ్లో. కాంతేదృష్టిపథం గతేనయనయో రాసీద్వికాసోమహా
న్ప్రాప్తేనిర్జనమాలయంపులకితా జాతాతనుస్సుభ్రువః
వక్షోజగ్రహణోత్సుకేసమభవత్సర్వాంగకంపోదయః
కంఠాలింగనతత్పరేచగళితానీవీపృథాపిస్వయమ్.

[టీ. కాంతే=పెనిమిటి, దృష్టిపథం = నయనమార్గమును, గతే = పొందఁగా, నయనయోః = కన్నులయందు, మహాన్ వికాసః = గొప్పవికాసము, ఆసీత్=కలిగెను, నిర్జనమాలయం = జనశూన్యమగునింటిని, ప్రాప్తేసతి = పొందఁగా, సుభ్రువః=కాంత యొక్క, తనుః = శరీరము, పులకితా = గగుర్పాటుఁజెందినదిగా, జాతా = అయ్యెను, వక్షోజగ్రహణోత్సుకే సతి = బిగిచన్నులఁబట్ట నుంకింపఁగా, సర్వాంగకంపోదయః = సమస్తావయవములయందు వణఁకుగలుగుట. సమభవత్ = సంభవించెను. కంఠాలింగనతత్ప రేచ = కంఠము నాలింగనము చేసికొనంబోయినపుడు. నీవీ=పోఁకముడి, పృథాపి=ఇంతకు ముందు గట్టిగాఁగట్టుకొనంబడినదైనను, స్వయం=తానే, గళితా = జాఱిపోయెను.]

ఆకాంతకునాయకుఁడు అగపడినప్పుడే కన్నులయందొకవికాసంబుగలిగె. ఇంత లోపల నతం డావిర్జనమగు సౌధరింటఁ బ్రవేశింప దేహమెల్లఁ బులకాంకురములచే నిండిన దయ్యెను. అదిగాంచి యాతండు సమీపించి మందహాసముతో దానికేలు తనహస్తమునం బట్టుకొని మెల్ల మెల్లన బిగువుగబ్బిగుబ్బలంటం జేయుదార్వ నొడలెల్లఝల్లుమని యొకకంపముజనియించె. మెల్లమెల్లగా వెన్నుచఱచి యాకాంతుండు దానియొక్క కంఠము నాలింగనము చేసికొనంబోవుడు ముందుగట్టిగాఁ గట్టుకొని యున్నదియయినను తమి విశేషించినందున పోకముడి తనంతటతానె దిగజాఱిపోయెను. అట్లు జాఱిపడినచీరె నెత్తికొనంబోయిన నాకాంతామణి కందనీయక యాసరసుండు దానిచేలమును బోటన వ్రేల నాపలికిం జిమ్మినం జేయునదిలేకయున్న యాపన్నెలాడిం దనకరంబునం బట్టి తలిరులశయ్యపైం జేర్చిన నాయింతి సిగ్గుచే నన్నుంగనుఁగొనిన నింక నేనచ్చట నుండఁ గూడదని యెంచి యాసౌధరింటి వెలుపలికిఁ బోతిని. అట్లు వెలుపలనుండు నాకు;

సీ. కేళిమైపలి సేయుంగిల్లింతలకుఁదానునాతియులంతి గానవ్వుటయును
తమి జుఱుక్కున మోవిధవుఁడునొక్కినవోర్వఁజాలకసీత్కృతుల్సల్పుటయును
రతిఁగూడునప్పుడు సతిగళంబునఁ బుట్టుపావురాపల్కులపంతములును
చాలుపీడుమువద్దుసఖివచ్చునోయేమొ యనిమెల్లగాఁగాంతయనుపలుకులు.

గీ. చేతులు విదిర్పఁగడియాలచిన్నిమువ్వు
సగములొండొంటినొరసెడిసరసరవము
కలసినాకర్ణ యింగళికిఘనసుధార
సంబొలుకుచుండెఁ నంతఃసవిధభూమి.

మందారమాలయుఁగమలవతియుంబొదలమాటునఁ బొంచి పొంచి చప్పుడు సేయక యడుగులిడుకొనుచు వచ్చుచుండఁగాఁగాంచి ఆహా! సమయముతప్పివచ్చినదని యెంచి యామదనమాలారాజకుమారుల కెచ్చరిక సేయఁదలంచి యేకకుంజంబులోనికిం బోతి. అప్పుడు సమరతిఁజాలించి మగచెయ్వులకుంగడంగిన నాసరసు లన్యంబేమియుం నెఱుంగకుండ నిప్పుడు రసభంగంబుసేయంజనదు. వారు కేవలము సమీపమునకు వచ్చినప్పుడు దెల్పెదనుగాకయనియెంచి యానికుంజముందలి తమాలవృక్షపుఁబత్రముల చాటున నుండి మందారమాలాకమలవతులను మదనమాలారాజకుమారులను గని పెట్టియుంటిని.

అనిచిలుకచెప్పగా మంత్రికుమారుండువిని సంతసించుచు ననంతరవృత్తాంతంబు విననత్యుత్సుకుండై యుండెను.

ద్వితీయతరంగము సమాప్తము.

శ్రీ రాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

# చమత్కారకథాకల్లోలిని

## తృతీయ తరంగము



నారదమునిసన్నుత
సూనవతీపంచబాణ మధుదైత్యహరా
సూనశరజనక సత్వ
జ్ఞానానందస్వరూప జలజాతాక్షా.

అవధరింపు మట్లు తదనంతర వృత్తాంతం బెఱయం గోరి యున్న మంత్రి కుమారునితోఁ జిలుక యిట్లనియె. అప్పుడా మదనమాలయును,

సీ. చెలి పేరురముపైకి బాళిమీఱఁగ నెక్కి కులుకుచన్గుబ్బలఁ గ్రుమ్మిగ్రుమ్మి
సాధుమోమున మోము నర్తిలిఁగదియించినను మోవి మొనపంట నొక్కినొక్కి
పెనిమిటియూరులఁ జిక్కతోఁ గదియించి యుంచపుఁదొడలచే నదిమియదిమి
మోహనాంగునియంగములయందుఁ గలయంగఁ జెలువున మైదీఁగెఁ జేర్చిచేర్చి

గీ. సుందరాంగుని చెయ్యుల సోఁకిసోఁకి కాంతుఁడింపొందులీలలఁ గాంచికాంచి
సురతచాతుర్యముల వేడ్కఁ జూపిచూపి సలిపె మగలీల లాబాల సరసలీల.
ఇట్లొకింతతడవు వినోదంబుసలిపి తద్రతాంతంబునందు.

చ. పులకలు గ్రమ్మఁగా మెయినిఁ బువ్వులు వేనలినుండి రాలఁగాఁ
బలుమఱు నూర్పుగాడుపులు బర్వఁగ లేఁజెమటల్ దొరంగఁగాఁ
గలికియు లేఁతన వ్వొలయఁ గాంతునికన్నులు మూసి సిగ్గునన్
సొలుపులు బైకొనంగఁ బతి సొక్కఁగ వక్షముపైన వ్రాలినన్.

సరసుండును దాని బిగ్గకవుంగలించి మోవితేనియ లానెతలిచ్చుచుండె. అట్టి సమయమున మందారమాలమాత్రము లతానికుంజమునకుం దరిసి వచ్చుచుండెను. మదనమాల రతి చతురతఁ గనుచు నన్యం బొకింతసేపు మఱచియున్న దానంగానఁ గనులవతి మందార మాల నెడబాసియానికుంజపు ద్వారమునకు వచ్చుచుండుట యెఱుంగదైతి అట్లు

సమీపమునకు వచ్చుమందారమాలం గాంచి నేను దాని రాక మదనమాల కెఱింగింపం బోంచి 'యోమందారమాలా నీవీసమయమున నిక్కడికేలవచ్చితివే' యని యడిగితిని. యామదనమాల భయసంభ్రమంబులతోఁ దలిరులశయ్యాడిగ్గి యంతకుం జెంతలనున్న తన చీరె దాని క్రిందనుండు తీయలేక యడుగులం గొని కొప్పువ విడదీసికొనుటకు రాకుండఁగా సంభ్రమంబునందిగిచి కొత్తుకొని ఎడప్రక్కగా కుంజద్వారమునకు వచ్చుమందార మాల నాకెదురగుటకుముందె కుడిప్రక్కగాఁజని యొచ్చటివేఱు పొదరిండ్లలో దాఁగుదును అని యనుకొని యతివేగముగ వచ్చుచుండెను. అప్పుడు తటాలున గమలవతి యెదురై యామందారమాలను పేరిరంభ రమ్మని యదియును నట్లురాఁగా సాకస్మికంబుగ తనరాకకు నివ్వెఱపోయి యేమిచేయుందోచకయుండు మదనమాలం జూపి యిట్లనియె.

శ్లో. బిభ్రాణా కరపల్లవేన కబరీ మేకేన పర్యాకులా
మన్యేన స్తనమండలే నిదధతీ స్రస్తం దుకూలాంచలం,
ఏషా చందనలేశలాంఛితవపు స్తాంబూలరక్తాధరా
నిర్యాతి ప్రియమందిరా ద్రతిపతే స్సాక్షా జ్జయశ్రీరివ.

[టీ. ఏకేన = ఒక, కరపల్లవేన = చిగురటాకువంటి తనచేత, పర్యాకులాం=వీడినట్టి కబరీం = కొప్పును, బిభ్రాణా = పట్టుకొన్నదియై, అన్యేన = మరియొక చేత, స్రస్తం = జారిన, దుకూలాంచలం = పట్టుచీరె చెఱఁగును, స్తనమండలే = కుచస్థలమునందు, నిదధతీ = ఉంచుకొన్నదియై. చందనలేశలాంఛితవపుః = అచ్చటచ్చట గంధపుఁబూత రేఖలుమాత్రముకలిగియుండు శరీరముగలదియును, తాంబూలరక్తాధరా=విడెమువలన నెఱుపుగదిరిన మోవిగలదియునైన, ఏషా = ఈకాంత, ప్రియమందిరాత్ = నాయకుఁడుండుసంకేతగృహమునుండి, రతిపతేః = మన్మథునియొక్క, సాక్షాత్ = ప్రత్యక్షమయిన, జయశ్రీరివ=విజయలక్ష్మివలె, నిర్యాతి=వెడలివచ్చుచున్నది.]

ప్రియసఖీ మందారమాలా? ఈ కాంతారత్నముంగాంచితివే! ఇది తానుపరతింబలిగూడునప్పుడు వీడిన కబరీభారము నొక కరమునం బట్టుకొని, మఱియొకచేత జాఱిపోయిన పట్టుచీరెచెఱంగుచే గుబ్బలకొనలు మూసికొని, గాఢాలింగనములందు నాయకుని మేనంటి మాసిపోయిన మంచిగందపుఁబూత యొక్కొకచోటఁ గన్పడఁ దాంబూలముచే నెఱ్ఱనగు నధరంబుతో నిదె వచ్చుచున్నయది. ఇప్పుడీకాంతారత్నము తన కాంతునితో మగచెయ్యులఁ సలిపి నాదససంగరమున జయముంబంది వెడలుచున్నది. దీనిం జూడ నా మన్మథుని విజయలక్ష్మి మనకు ప్రత్యక్షమైనట్లుండలేదా? అనఁగా మందారమాలయుఁ జెఱునగవంకురింపఁ దలపంచుకొని ప్రియసఖీ యిప్పుడు మనమియ్యెడకువచ్చుట సరికాదు పోదముఁరమ్మని కమలవతిం దీసికొని తనయింటికిఁబోవుచు దానిం

గాంచి యోయమ్మా నీ వెంతపని యొనరించితివే? సఖియయన్న నీవే సఖివి? దూతికవన్న నీవే దూతికవు. అనియగ్గించి తన ముక్తాహారమును దానికి బహుమానంబుచేసి యింక నీ ప్రక్కింటివిదానివలన నాకు భయంబులేకుండఁజేసి నన్నుఁగాపాడిన నీకు నీకోరిన ధనంబులెల్ల నొసంగెదను అని తీసికొనిపోయి యపరిమితములగు ధనములొసంగి విశేషముగ దాని మన్నించుచు నిది నాకుం బ్రియసఖియైనందున నెంతపనినైన సాధింపం గలదు. ఇప్పుడీ రాజకుమారునికి నన్నప్పగించి కపటముగ స్వాధీనపడు నట్లొనరించిన విధముగ మఱియొక్కనికిం బట్టియిచ్చునేమో యనుభయము మాత్రము నాకుదీనియెడలఁ బాయదు. అని యనుకొనుచు మరల నారాజకుమారునిపొందు కువ్విళులూరుచుండెను. అక్కడ పొదరింటిలో మదనమాల కమలవతిని జూచినంతమాత్రమున నివ్వెఱపోయి పుత్తడిబొమ్మరీతి నొకెంతసేపు స్తబ్ధయైయుండి; కమలవతి సెప్పిన యెత్తిపొడుపు మాటలకు బదులుసెప్పలేక వారు పోయిన వెనుక చింతాక్రాంతయై బొటనవ్రేల నేల వ్రాయుచు మానంబుకోలుపోయినందుకు వగచుచు తాను మందారమాలచేసిన తప్పు కనిపెట్టి తుమ్మెదమైఁబెట్టి యన్యాపదేశముగా నీ చిలుకచేతం జెప్పించినందుకుఁ గమలవతి యిట్టిసమయమునవచ్చి నా సౌందర్యమును నుతియించురీతిగ నాతప్పు చేతఁబట్టుకొని చెప్పి చూపుచుంబోయెను! దీనివలన నే నేమి సంకటములు సంభవింపనున్నవో? ఎన్ని కల్గినను ఓర్చుకొనుటకుంగదా యీ పువనసూలను భూమిపయి దేవుఁడు సృజియించె. అని యనుకొనుచు నింకను గళావతి రాకున్నది యిదియేమో? కేళీశుకమునుబట్టి తెచ్చెదనని చెప్పిపోయినది. ఇదివరకు దానిపోబడియే యగపడదు? చిలుకయును నిక్కడనె యున్నది? అయినఁ గొంతదూర మరిగి సమీపమున నెక్కడనైననున్నదో చూచెదను? అని యానికుంజమును దాటి రానుద్యుక్తురాలుకాఁగాఁ గమలవతీ మందారమాలలరాకకు వెఱచి యాపొదరింటం డాగియుండు రాజపుత్రుఁడు తటాలున దాని సమీపమునకువచ్చి దాని హస్తంబు పట్టుకొని మదనమాలా యిప్పుడు నీవు సాహసించి యింటిపైఁ బోఁగూడదు. కళావతి మన యిరువురకును అనుకూలములయిన భోగోపకరణములును గొనివచ్చుటకింటికిఁ బోయియున్నది. మరలి రాఁ గొంతతడవుపట్టు. చందురుం డుదయించి వెన్నెలలు కలయంబర్వునంతవరకు మనమిచ్చటనయుందము. అని చెప్పఁగా మదనమాల ప్రాణనాథా యొకింతసేపిచ్చటనుండి కమలవతీ మందారమాలల కంటంబడితి. మరియొకింత సేపుంటినేని యెవ్వరెవ్వరు నన్నుం గాంచి యేమేమందురో “ఎవరే రీతిననుకొన్న నేమి? సమాధానపెట్టుకొందును.” యని యనుకొన్నను జారిణి యని నలుగురికిఁ దెలిసిన వెనుక జీవించియుండుటయంత రోఁతపనేమియు లేదు. అది యట్లుండనిమ్ము. ఇది కమలవతిగుండ సాంఖ్యాయని చెవికెక్కకమానదు. ఇది మొదలా

భగవతి నామొగంబైన జూడనొల్లదుకదా. ఆమహాత్మురాలి కప్రియమై బ్రతుకుట కంటె ప్రాణములు పరిత్యజించుట మేలు. అనియనిన రాజకుమారుండు దానితో మదన మాలా కమలవతుల నట్టి విప్రియురాండ్రని యెంచకుము; మందారమాల మగువగావు నను తాను జెట్టిదియగానను నీకు విప్రియం బొకప్పుడైనఁ జేయనొల్లదు; ఇది సాంఖ్యా యని చెవికెక్కుటకు విధంబులేదు; కమలవతి నాకు రెండవ హృదయంబుగాని యన్యు రాలుగాదు. మదనమాల తప్పు కనిపట్టినందుకై నీతప్పు నీయెడిం గట్టి చూపిపోవచ్చినది. అంతేకాని విప్రియంబొనరింప వచ్చినదికాదు. కమలవతీ కళావతులకును నాకునుదప్ప నితరుల కీయుద్యానవనమునకువచ్చెడు మార్గము సయితము తెలియదు కాన నితరులు వత్తురేమో యనుభయము మానుము. మనమిరువురమీరాత్రి యిచ్చట వసియించుట ముందె కమలవతి నావలన నెఱింగియున్నది. అందుకై చింతింపకుము. అని యిట్లనేక విధముల సరసాలాపములు సలుపుచు దానిమనోగతంబగుపంతం గొంతదొలగించి చిఱు నగవుతో ప్రాణవల్లభ! శుకంబు మందారమాలరాక యెఱింగింప నీవు భయసంభ్రమంబు లతోఁ దలిరుటశయ్యఁడిగిన విలాసం బిప్పటికిని మనంబు నెడబాయదు.

సీ. గురుతరకుచకుంభగౌరకాగ్రంబుల నొకహస్తమున నంద మొప్పమూసి
కరఁగినకనకంపుకాంతులీనెడునూరుమూలంబు పెరచేత లీలఁగప్పి
పీఁడియంసంబుపై వ్రేలాడు కచభార మదవడ మీఱంగ గుదురుపఱిచి
సంత్రస్తహాయనసారంగశిశులీల బెలుకువాలూఁపులఁ బెదరిచూచి.

గీ. వీడుమని నన్నుఁ గనుసైగ సేడుకొనచు, నాదుకొసరుల నును లేఁతనవ్వుదోప
సైగ యంపరతిఁ జాలించి విరులశయ్యఁ, దిగిననీనటు తమి మఱి దీటుకొలిపె.

చ. కలికి పునారతంబునను గబ్బిచనంగవ యుబ్బుసూపఁగాఁ
గులుకుమిటారిలేనడుము కొంచముగా నసియాడ లజ్జయుం
వలపును బైకొనంగ పరకర్షిని ప్రేమ నెలంగ నన్నుఁగా
వలసి యొకింత నీకులుకువైఖరులన్ మగపాడిఁ జూపవే.

చ. వరతరవీరసంగరము వర్ధిలిమున్ముర మైచెలంగఁగా
సరగునవింటినారి తెగుచాడ్పుననయ్యెనుమున్ వ్రతంబు ఘ
స్మరుఁడవుయచెడిన్మరుఁడుచారువిలాసిని వేగవచ్చియా
దరమునఁ గంతులీలల ముదం బొనగూర్పుము నేర్పు పెంపునన్.

క. రమ్మా విరిశయ్యకుఁ గర, మిమ్మా పట్టుకొన నొక్క నిమ్మా యనరం
బిమ్మా బిగికౌఁగిలి గయి, కొమ్మా మగపాడిఁ గూడుకోరిక మరలన్.

అని యిట్లు తమిందాళలేక యారాకొమరుండు తనచేతఁ దానికరంబు పట్టికొనం బోయిన నామదనమాల చుఱుకుమిటారిచూపులం జూచి జంకించుచు నొందుచోటికిం

బోయిన నానరసుండు దానివెన్నంటి యడుగులు ద్రొక్కుకొనుచుఁబోవుఁడు నాని కుంజంబులో నలుప్రక్కలందిరిగి యొదిగియుం నతండు ననుసరించుచుంబోవ నింక నితండు విడువండనియెంచి యొకచోట నిలువంబడి చీరెగట్టుకొనంబోయి యాతనిచే నాకృష్టచేలయై యాలీలావతి రాజకొమారుంజూచి యిట్లనియెం.

ఉ. వంచనతోడ నన్ను వెఱవారలు సూడఁగ మానహానిఁగా
వించఁదలంచియే యిటకు వేడ్కఁ గళావతిచేత మున్ను ర
ప్పించి రహస్యభూమి మదిభీతిలి చేయునదేమిలేక యొ
క్కించుక సంభ్రమించునను నీవు గ్రహించి హసించు చాత్మలోన్.

క. తప్పించుకొనుసుపాయం, బొప్పమిచే మిన్నకున్న నిఁక విదను వలపుతో
జొప్పడ శయ్యకుఁదారిచి, మెప్పుగ రతికేళిగూడి మించెదుతమిచేన్.

క. పలుమరు విడుమని వేడఁగ, వలయించుచు నుపరతంబు నాశలుప న
న్వలపునఁబైకొని వలదనఁ, గళలంటుచుఁ మారుకేళిఁ గలఁచితివి వెసన్.

వ. అప్పుడు.

క. వెఱవారిజాడ లారసి, బిఱబిఱ లేవఁగఁ దలఁచి బీతు గదుర వెం
దుఱు మసియాడఁగ శయ్యకు, నొఱఁగఁబడంబోయి నేను నుపరతి వీఁడన్.

క. వదలక బిగికౌఁగిట సీ, వదయత నను జేర్చిపట్టి యదుముకొనఁగ నె
మ్మదిఁ గపురుభయము దోపఁగ, విదితంబుగ వేడుకొనుచు విన్నదనమునన్.

క. వెనుకకు నీడిగిలంబడి, యనువున బిగికౌఁగిటికిని నంతట వెలియై
తనహస్తమునం బట్టిన, నినుఁ జేత విదిర్చి లేచి నేర్పుచెలంగన్.

ఉ. ఇంతకుమున్ను చీరె యొకయించుక దవ్వులఁ ద్రోచియుండు టొ
క్కింత యెఱింగి తత్తరము నేడ్తెఱ సిగ్గును మేరమీఱఁగాఁ
జెంతలఁ జూచి చేలమును చేతుల నంటెడునంతలోన న
భ్యంతరసీమ కాచెలువ యల్లన నవ్వుచు వచ్చెఁ జెచ్చెఱన్.

క. నన్ననవలసినమాటల, నన్నింటిని బల్కెఁ జెలియ యనుకూలముగాఁ
జిన్నతనంబున మేలగు, కన్నెఱికంబునకు హానిగలిగెను నాకున్.

క. ఇంతటితో విడువక నిశ్చింతగతిఁ బునారతంబు సేయఁగ మదిలో
సంతసపడిచెదు మోహాక్రాంతుఁడవై తగవు మాలి కౌతుకమొప్పన్.

క. నను నిర్బంధమొనర్చెదు, వినుమ నీచే జిక్కికొన్న వెఱ్ఱినయితి నే
యనువున దప్పించుకొన, న్ననఁ జాలదటంచు నన్ను నలపఁదలఁచితో.

గీ. ఏమిసేయఁగలను సామి నీ యిష్టంబు, చెడకయుండునట్లు చేసికొనుము
చిన్నదాన నీకుఁ జేతికిఁజిక్కితి, నేకతంబు కొంచె మేఁగుటెలిమి.

గీ. ఇంక నీవు నేను నేకమై రతులలో, వెనఁగులాడువిధముఁ జేర్మితోడ
మగువలకును జూపి మానంబు హరియింపఁ,గోర్కియున్నదే మొ కోడెకాఁడ.

క. ఊరక యడిగెద వింతయొ, నేరవొ మోసంపురతుల నేర్చిన గూడన్
జేరుట కేరాకుండిన, దాఁచికొని గాఢ హులఁ దనియఁగ లేవో.

క. జారులు తమకార్యములకు, గారడములు చేసి కన్యకలఁ గలఁచి సహో
క్రూరమదనార్తి యడఁగం, జేరరె యాచేడెగతులు చింతిలక మదిన్.

క. సమరతి సేయఁగ జూడం, దమకించుకొ లేక యుపరతం బాచెలి యం
త్తమముగఁ గాంచునొ రతిబంధములం జూడంగ మదిని తత్తరపడునో.

క. నీతో సమరతి యుపరతి, బాతిగ సలుపంగ లేనిభామామణికిం
జాతుర్యము నేర్పెదనుసం,కేతమునను నలిపితివి నిక్కృతి నీచెయుంపుల్.

అని యివ్విధముగా నడిగిన నారాజకుమారుండు తనమనంబున నిట్లు వితర్కించె. ఈమదనమాల తన తప్పుఁ గనిపెట్టుటకు కమలవతి నికుంజము లోనికి వచ్చుటవలనను, ఈరేయి యానికుంజమునందునునని యాకమలవతి యొతిఁగియుండునట్లు నేనిప్పుడు సెప్పుటవలనను వీరందఱు కృతసంకేతులై తనకిట్లు మానహానిఁగావించిరి. అని తన మనము నందు కోపభారమువహించి యున్నది. మంచిని చతురములగు వచనముల దీనికోపం బడంచెదను అని నిశ్చయించికొని యిట్లనియె.

ఉ. వంచననేయనీకగునె వల్లభ యంటివి నిక్కమేసుమీ
పంచశరార్తి పెల్లగయ బాళి మనంబుననే యడంచి యొ
క్కించుకతోపనీక మదిసెక్కుడుసిగ్గున గుందుకన్నెలన్
వంచనలేనిచోఁ గలయవచ్చునె నూనశరుండు మెచ్చునే.

అది యట్లుండ నిమ్ము. వెలిచేడియలు వచ్చుచున్న జాడ లరసికౌఁగిలి నీడుమన్న నీడకపోతివనియంటివి. అందుకుఁ బ్రత్యుత్తరంబు వినుము.

క. నను దొలుతఁ జూచి సంభ్రమమును సిగ్గును గదుర నీవు మొఱఁగిచనఁగ నో
య్యనఁ జేరవచ్చి నేసొంపున నీకరముం గ్రహింపఁ బూనినయపుడున్.

ఉ. పాదరసంబురీతి బహుభంగులఁ జేతికిఁ జిక్క కొత్త సం
హ్లాదము మీరఁగాఁ దెలుగు మోహనగాత్రిని నిన్నుఁజూచినే
నాదటఁబట్టి మోవిఁ దమినప్పు చుఱుక్కున నొక్క నాభికిం
మీఁదుగఁ జేయిఁ దార్పఁగను మీనవిలోచన కేళి నప్పుడున్.

చ. ఘనమగులజ్జ నీవు సముఖంబున నిల్వక నే తొలంగ నే
ననువునఁ జేయిపట్టి తమి నప్పుడు కౌఁగిటఁ జేర్చి యంస్తత
స్తనయుగళంబు చేత సరసంబుగ నంటుచు నేర్పుమీఱ నీ
విని వడి బిడ్చి యూరులకు వేడ్కఁ గరంబుఁ దెమల్చునప్పుడున్.

చ. స్తనములఁ బైటఁ జార్చ గను జక్కఁగ నీవును నొత్తుకొంచు నుం
డిన వడిఁ బీవిఁ జార్పఁగ మది న్ననుసిగ్గదయింపఁగాఁ దొలం
గనుగమకించి చేలమును గట్టిగఁ బట్టికొనంగ జార్చి నే
ననువునఁ జేయిపట్టుకొని యప్పుడు కౌగిటఁజేర్పఁ బోవుదున్.

ఉ. చేలము నేహరించుకొనఁ జేడియ నీవు వివస్త్రవైన నేఁ
దాళఁగలేక సెజ్జకును దారిచి వల్దని నీవు పల్కఁగా
లాలితరీతి మన్మథవిలాసరసైకవిముగ్ధచిత్తవై
మేలిమితో రతిక్రియకు మెల్లన ని న్బతిమాలునప్పుడున్.

చ. అదె యిదె వచ్చె నెచ్చెలి యటంచును వంచనచేతఁ బల్కి నే
మదిభయమంది తత్తరిలి మానుచు నవ్వలికేగ నీవు స
స్మదమున మోము వంచుకొని మాటికి లేనగ వంకరింప నా
యదనున నీవు నన్ను పరిహాసమొనర్పఁగలేదె? నెచ్చెలీ.

చ. పలుమరు కేళిమై నిటు లబద్ధపుమాటల బేలుపోతినీ
వలన నొయారి యట్టియని వైళమ నమ్మిక యూరకుంటి యా
చెలువయు వచ్చె మం న్నవిదచెప్పినవన్నియుఁ దప్పులైనచో
నలనిజమైన నమ్ముదురె యాత్మల బావగలాడివాక్యముల్.

అదియునుఁగాక యొంపరతిఁగూడునప్పుడు పెఱచేడియలజాడలారసి నీవు తద్రతంబు పాలించి శయ్యకు నోటఁగినను వలని యపరాధంబు బొక్కటి గలది. అది సైరింపుము.

సీ. ముద్దులుగుల్కు నెమ్మోముదామరయందుఁ గులుకులేనవ్వులు మొలకలెత్త
బటువుచన్గుబ్బలభార మోర్వఁగలేక యలంతి లేనడు మసియాడుచుండ
లజ్జాతిరేక విలాసభాసురము లౌకన్నుల సరసొక్కు వన్నెగుల్క
విరులమాలికలతో వీడి పెందురుము నాయురముపై వ్రేలాడు చొప్పుమిగుల.

గీ. తమిని మగబాడి సల్పునీతమనివాస, మప్పుడొకక్రొత్తయైన నే నాశఁ జూడ
కున్నఁ బ్రాణముపోవునట్లున్న నిన్ను విడువలేనైతి నీవు నన్వేడికొనిన.

ఇది తప్పుగాఁ గ్రహించినను సరే లేక సూక్ష్మంబారసి తప్పుగాదని యెంచినను సరే.

చ. కలికి రతాంతమందు వలిగుబ్బచనుంగవ యొత్తుఁ గ్రుమ్ముచున్
వెలపున నొక్క మోవి బలవంతముగాఁగ నొసంగి నాకు నీ
వలఁతిగ నవ్వుచుం బయిన నందము మీరఁగ వ్రాలి నాథ నీ
వలసితివేమొ వీడవలదంచు వచింపుచు నుంటి వల్లనన్.

అది యలంతిగానుండియును నాకు బలువింతయగుచు గురూపదేశమువలె నపరిత్యాజ్యమైయుండె. అనిచెప్పిన మదనమాల యాతనిచతురవచనంబుల కలరి యావగకానింబైకొని కమ్మనిమోవి పానకమ్ములిచ్చి ప్రాణనాథా జరిగిన సందర్భవిశేషముఁబట్టి యాలోచింపక నిన్నిట్లు విడనాడితిని. స్త్రీబుద్ధి యెల్లప్పుడు మీఁదటివిషయంబుల నెఱుంగక తత్కాల సంప్రాప్తములగు శోకమోహక్రోధాదుల బయలుపఱచి తుదకు యథార్థంబు దెలిసిన యనంతరము తాఁజేసినవానిం దలంచుకొని యనుతపించుచుండునది గదా? ఏఁజెప్పిన వచనములకు మనస్సున సంతపింపకుము. నీయిచ్చవచ్చినట్లు నాతో సుఖంబుగు పడయుము. అని వేడుకొనుచుం బలికిన నారాజకుమారుండు సంతసించుచు నావన్నెలాడితో ననేకవిధసరసాలాపంబులు సేయుచుఁ బునారతి సలుపఁ గడంగి యాబాలికామణిని శయ్యకుందార్చి తత్కాలసముచితం బగుసిగ్గుచే చీరసవరించుకొనం బోయిన యాచారుహాసిని కటీతటంబున నుండువలిపెంపుదుకూలము నుపాయంబునిఱ నపనయించి దానియనవద్య సౌందర్యలక్ష్మీవిలాసభాసురంబు లగుమనోహరాంగంబులం గని మెచ్చుచుం బచ్చవిలుకానిపనులకుం గొన్ని తచ్చనలు సేయుచుండె. ఆమదనమాలయును రాజపుత్రుండు నిట్లన్యోన్యానురాగంబులెచ్చి యనేక సురతోపచారంబుల నానందమహాంబుధిం దేలుచుండుటం గాంచి యిట్టి సౌఖ్యము మన కిదివరకు లేక పోయెఁ గదా యని యెంచుచు నాప్రాణవల్లభుం దలంచుకొని విరహవేదన కోర్వంజాలక సంతపించుచు నాతమాలవృక్షపుఁ గొమ్మలనడుమ నొకయెడ నాకులు దట్టమై గుబురులు గొనియుండుచోట వసియించి వారల విలాసంబులు గాంచుచు నలుదిక్కులును గలయఁ బరికించుచుంటి.

అట్టి సమయంబున నొక యాఁడుచిలుక యాచెట్టు కొమ్మకు వచ్చి చేరెను. మంత్రికుమారుఁడా! ఆచిలుక ముద్దుపల్కులును, దాని సింగారంబును, దానిమేని నిగనిగలును, దానినీటును గాంచిన నారతీదేవి ముద్దుచిల్కయేయని చెప్పవచ్చు. నేయి మాటలేల? దానిం గాంచినదిమొదలు నాహృదయంబు మోహసాగరమున మునింగి దరిగానకయుండె. అప్పుడు నేను తిర్యగ్జాతిసులభం బగునతిచాపలంబుచేత దానిసమీప

మునకుంబోయి యా చిలుకముక్కుతో ముక్కుం జేర్చి ముద్దుగొనంబోతిని. అప్పుడా యాఁడుచిలుక మొగమియ్యక యొదిగినిలచి నన్నుం గాంచి యో రాచిలుకా నేను బహు దూరమునుండి యాకాశమార్గమున వచ్చుటంబట్టి నా ఱెక్కలు నొప్పిఁగొనియున్నవి. అంగములన్నియుం బిగిలిపోవునట్లు సలుపుచున్నవి ; దప్పియధికమై నాలుక లోనికీడుచు కొనిపోవుచున్నది; ఇంక నాలుగైదు మాట లధికముగా మాటలాడుటకుఁగూడ శక్తిలేదు. నేను బహుదేశములు చుట్టిచూచుచు నస్తమయమగుచోట నితరపక్షులసంచారము లేని స్థలమును గనిపట్టి యచ్చట రాత్రులు వసించుచు మఱునాఁడు బయలుదేఱిపోవుట నియతము. అట్లే జరుపుకొనివచ్చుచు నీదినము ఈ నగరమున ననేకస్థలములు వెదకి చూచియుం నట్టిచోటుదొరకక తిరిగితిరిగి యలసి యీ పొదరిటికి వచ్చితిని. ఇచ్చట నీ వతికామాతురుండవై ననుఁగూడ వచ్చుచున్నావు. లోకమునందు మార్గాయాసముచే బడలివచ్చువారికి నింటివారు ఫలమూలాదుల నాతిథ్యము సేయుదురు గాని రాఁగానే యిట్టిపనులకు బలవంతము సేయరు. అదియునుంగాక బహుదినములనుండి శరీరసౌఖ్యములు మాని విరక్తిచే దేహధారణకుమాత్రమె యాహారాదులు భుజియించుచు దినమున కొక యూరుగాఁ దిరుగుచు దుఃఖవేగమున నుల్లాసములేక పరులతో మాటలాడుట కిష్టపడక యుండునట్టి నాతో సుఖము లనుభవింపవచ్చుచున్నావు! నీవతి రాజాంతఃపురమునందు రసికలగు నృపకాంతామణుల కరకమలములచే లాలింపఁబడుచు వారలు చేయుం పోషణములచే సుఖముగఁ బెరిఁగి వారుచెప్పిన చమత్కార పద్యాదులను నేరుచుకొని యితరుల కాహ్లాదావహముగఁ గులుకు పలుకులుపలుకు నాఁడు చిలుకలతో గదా నీవు పొందుచేయవలసినవాఁడవు. నన్నుఁ గోరుట నీకుం దగునా? అనిచెప్పఁగా దాని మాటల కాశ్చర్యపడి నేను నతిత్వరితముగఁబోయి కొన్ని దొండపండ్లును కొన్ని మాదుఁ బండినమాదీఫలములును సమీపవృక్షములనుండి వానిని గొనివచ్చి యాచిలుకకిచ్చి యవి భుజియించిన యనంతరము జంబూఫలంబులం గొన్నిటి నొసంగి తద్రసం బాయాఁడుచిలుక యాస్వాదించి మార్గశ్రమను బరిహరించుకొని యాచెట్టు కొమ్మపైఁ గూరుచుండఁగా నేను దానిసమీపమునకుంబోయి ఓ చిలుకా నిన్నుంగాంచినం దొల్లి రాజకుమారికలయొద్దఁ బెరిఁగినదానివిగాఁ దోఁచుచున్నది ; లేనియెడల నిట్టి వాక్చాతుర్యమును మనుష్యవచనములును బట్టుపడవు. అట్టినీకిట్టి దుఃఖకరమగు దశ సంభవించుటకుం గారణంబేమియొ ? తెల్పుము. నిన్నుంగాంచినది మొదలు నాహృదయంబు మిగుల ప్రేమార్ద్రంబై యున్నది అని యడుగుచుంటిని. మా సల్లాపములు రాజపుత్రుండును మదనమాలయును విని యీ చిలుకలు పరస్పర మేమో మాటలాడుకొనఁ బోవుచున్నవి; ఈకథ వింతము అని జాకరూకతతో నాలకించుచుండిరి. అప్పుడు చిలుక నన్నుం గాంచి యో రాచిలుకా! నాకు నీవు సకలోపచారములను జేసి సేదదేర్చి బహుదినముల స్నేహి

తునివలె నా కష్టసుఖములకు ఖేదమోదము లొందుచున్నావు. నీకుఁజెప్పక నా వృత్తాంతంబు మఱియెవ్వరికిం జెప్పఁబోదు? అయినను విన్నవారలకు విశేషసంతాపకరమగు నా చరిత్రంబు మీవంటివారికిం దెల్పి యాయాసముఁ గల్పించుటంజేసి యేమియుపయోగ మని తలంచి యూరకుండుటకు నావాఃని తలఁచుచున్నను నీ నిర్బంధము నన్నిప్పుడు చెప్పఁజేయుచున్నది.

## మదనమాల చరిత్రము

ఇంతకు బహుదూరమునఁ బాంచాలదేశమునందు ధరావంతం బనునగర మొక్కటి గలదు. ఆ నగరమును శూరబాహువనువాఁడు సంరక్షణముసేయుచు నాదేశమునకంతకు నధిపతియగు కాంపిల్యనగరాధిపతికి నేటేటం గప్పంబుగట్టుచు జనులను విశేషాదరముతోఁ బోషించుచుండును. అతనికి జయచంద్రుండును, ప్రతాపచంద్రుండు నను నిరువురుకుమారులును మదనమాల యను కూఁతునుగలిగిరి. ఆ కుమారు లిరువురును దగు వయస్సున నుపనీతులై సాంగవేదాధ్యయనంబు చేసి ధనుర్విద్యయందు రామలక్ష్మణులవలె నొప్పుచు బాహువీర్యముచేత శత్రుభయంకరులైయుండిరి. మదనమాలయుం గురువుల యొద్ద వినయంబుతో సంగీతసాహిత్యములును ధర్మశాస్త్రార్థంబులునెఱింగి నాటకాలంకారాదులయందు శారదయేయనియుం రూపమునందు నిందిరాదేవియే యనియుం నా దేశమునందు బ్రసిద్ధికెక్కెను.

ఉ. పల్కులు చిల్కపల్కు లలబంగరుబొమ్మయొయారి చూపులా
చిల్కలఱేని తత్తడిపజీరునిముల్కులు మేనికాంతు లా
కళ్కుపసిండితళ్కులు నిగారపుఁబున్నమ చందమామ యా
కుల్కుమిటారిబోఁటి తెలిగోము మొగంబు నిజంబు సెప్పెదన్.

సీ. కనులెత్తిచూచెనా కలశపయోనిధియల లటు వీచినయట్టులుండు
రక్తిమైబల్కెనా రాజకీరావళుల్ చెలఁగి పల్కినయట్లు వెలయుచుండు
సరసతనవ్వెనా శారదచంద్రికావళులు పర్వినయట్లు వన్నెగుల్కు
లీలమైనడిచెనా బాలమరాళంబు లనురక్తిఁ దిరిగినయట్టులుండు.

గీ. నంగకాంతులుపర్విన నచటనచట, హాటకద్రవములుసల్లినట్టు లుండు
కన్నెసింగారమెన్న నాకమలగర్భునకును శక్యంబుగాదని నమ్మవచ్చు.

మఱియుం నాకన్నియ యష్టాదశవర్షీయయయి యనన్యసామాన్య రూపరేఖా విలాసంబుచే జూపరుల కత్యాశ్చర్యంబుఁ గల్పించుచు నఖిలములగు నలంకారభేదము

లందును ఛందశ్శాస్త్రమునందును, నాటకములయందును, రసవిభేదములలోను, తనతో సాటి భూలోకమున లేరని సకలవిద్వజ్జనులు స్తుతియింపఁ జతుస్సముద్రముద్రితధరామండలంబునందుఁ బ్రసిద్ధికెక్కెను.

అదియునుంగాక తనభక్తివిశ్వాసములకు వశగతలై పెక్కండ్రు పెక్కు దేశములనుండియేతెంచి కాపాలిక, బౌద్ధ, క్షపణక కాంతలు మిగుల వృద్ధలగు వారును పరివ్రాజికలును తనసరసన వసించుచు నప్పుడప్పుడు సమయోచితకథాలాపములు సెప్పుచుండ నందుఁ దత్తద్దేశరాజకుమారుల వీర్యౌదార్య గాంభీర్య ధైర్య సాహసవిద్యావైపుణ్యాదుల నడిగి తెలిసికొనుచుండు.

ఇట్లుండ నొక్కనాఁడు మధ్యాహ్నసమయమునఁ దనయింటి కేతెంచిన యొక్క కాపాలికకాంతం గాంచి భక్తిపురస్సరంబుగ నమస్కరించి తగువిధులంబూజించి యన్నపానాదులఁ బరితృప్తం జేసి సుఖశయనంబునం బరుండియుండు నాయమపాదంబులు తనతొడలపై నిడికొనియొత్తుచు నామదనమాల వినయముతో నిట్లనియె. ఓయమ్మా మీరు సకలదేశములఁ సంచరించుచు నచ్చటచ్చటనుండు భూపాలకుమారకులను శౌర్యధైర్యాది సంపన్నులను గాంచియున్నారుగదా! వారలలో నత్యధికుండును సాహిత్యవిద్యాపారంగతుండునునగు రాజకుమారుండు గలఁడేని యెఱింగింపుఁడు అని ప్రార్థించిన నాకాపాలికి యిట్లనియె. ఓమదనమాలా నీవడిగిన ప్రశ్నమునకు మనంబున చాలసంతసించితిని. నీ చేయుపరిచర్యకు మిక్కిలి ప్రియంబంది నేను భవదీయరూపలావణ్యాదులకుం దగిన యొకరాజకుమారుని నీకుం దెల్పఁగోరి నోరెత్తఁబోతిని. ఇంతలోన నీవె నన్నడిగితివి. మంచిదయ్యె. ఇదిగో యీచిత్రఫలకంబుం జూడుము. ఇదియె యారాజకుమారుని యాకారరూపరేఖాదులను నద్దంబయియున్నది. అని తనయోగపట్టికలో నంతర్హితంబై యున్న యొకచిత్రఫలకంబుం దీసి చూపెను.

సీ. తరుణాబ్జపత్రనేత్రప్రభామోహనమందహాసాననసుందరుండు
ఆపీనవిపులబాహాంతరప్రలంబినవరత్నహారఘనప్రభుండు
పరిపీనకరికరపరిఘాద్వయోపమబాహుచుంబితజానుభాగయుతుఁడు
తప్తహాటకకాంతిధళధళత్తారుణ్యలక్ష్మీశుభాంగవిలాసతనుఁడు

గీ. లలితసౌభాగ్యరేఖావిలాసరాశి, ధైర్యగాంభీర్యశౌర్యవిద్యాఘనుండు
నభినవోద్భూతమన్మథనిభుఁడునైన, భూపతికుమారుఁడొకఁ డందుఁబొలుచుచుండె.

అట్టిమనోహరంబైనరాజకుమారునియాకారంబుం గాంచి యామదనమాలయుం దనహృదయంబున నచ్చెరువందుచు నాచిత్రఫలకంబుఁ దన చేతికందుకొని యోభగవతీ యితండేదేశపు రాజకుమారుండు? ఈతని యాకారాదులంగాంచినం జతుస్సముద్ర

మిత్రితంబగు ధరామండలము నేలంగలఁడనితోఁచెడిని; సవిస్తరముగ నాకుం దెల్పుమన నాకాపాలికయు నోమదనమాలా యితఁడు చిత్రకేతననగరమునకు రాజైన శత్రుంజయుని కుమారుఁడు. మదనమోహనుఁడని యితనికిఁ బేరు. ఈతని గుణగణంబులు వర్ణింప సహస్రముఖుండగు నాదిశేషుండైనను శక్తుండుగాఁడు "ఆకారసదృశప్రజ్ఞః" అన్నట్లు బుద్ధిచాతుర్యమునుగూడ నాకారమున కనుగుణమైయుండును. అవియన్నియునట్లుండ నఖిలవిద్యాపారంగతుండైయుండు నితనికి సాహిత్యకళారహస్యంబు ముంగొంగు బంగారము. నిన్నుం గాంచిన యప్పుడె యారాజకుమారుండును నాకు హృదయసన్నిహితుండయ్యె. నేను దేశములు పెక్కులు చుట్టి చూచుకొనుచుఁబోవుచుండి యానగరమునకేగి యానాగరికులవలన నతని సౌందర్యాదులు విని యొకనాడు తద్గృహంబునకుం జని సత్కృతులఁబడసి యాతనియెడం గలిగిన ప్రీతిచేత నీపటంబున నారాజకొమరునియాకారంబు వ్రాసియుంచుకొని యప్పుడప్పుడు గాంచుచున్నాను. అనిచెప్పిన మందారమాల యేమియు ననక కుచకుంభంబులపయిం బులకలు గ్రమ్మ నానందబాష్పంబులు కన్నుల నిండి పర్వఁ మైదీవె, జెమటలుగలుగ నూరకచూచుచుండఁగా నాకాపాలికి తనలో నీరాజపుత్రి యీ కుమారునియం దాసక్తిఁ జెందియున్నట్లు తోఁచెడిని; దీనియొద్దనీపటంబుంచిపోవుటయే మంచిది; యని యాలోచించి యామదనమాలతో నిట్లనియె. ఓకన్యకామణీ నీవు కనుఱెప్ప వేయక యారాజకుమారునాకారంబుం గాంచుచుండుటంబట్టి యీతనియందు నీకనురాగంబు విశేషించినట్లు లవగతంబైనయది. ఇది యెల్లశ్రేయంబులకు మూలంబు. ఈఫలకంబు నీయొద్దనయుండనిమ్ము. ఇది నేను నీయెడలనచ్చియిచ్చినది; గానఁ గైకొనుము; నిషేధింపకుము. అనిచెప్పి యాకాపాలికి మదనమాలకుఁ దాఁగొని తెచ్చిన చిత్రఫలకంబిచ్చి యారాజపుత్రిచేతఁ బ్రార్థింపబడి యానగరంబున వసించుచు ననుదినమును గన్యకాంతఃపురమునకు రాకపోకలు సేయుచుండె.

ఇట్లుండనొకనాఁడు శూరబాహువు సమస్త సామంత మంత్రి పురోహిత పౌరవర్గంబుతోడఁ గొలువుకూటమునం బేరోలగంబున్నయవసరమున నచ్చటికిం బ్రతీహారి వచ్చి జోహారుచేసి దేవా! కాంపిల్యనగరాధిపతి యగుజయవర్మమహారాజుగారియొద్దనుండి తత్పురోహితుం డగుబ్రాహ్మణవరుండువచ్చి తమదర్శనంబుకొఱకు మొసలయందుఁ గాచియున్నవాఁడు. ఆజ్ఞానుసారముగఁ బ్రవర్తింతుననఁగా శూరబాహువును మిగుల భయభక్తులతో నాసనంబువిడిచి లేచి నిలువంబడి సమీపమునకుం డెడి విప్రవర్యునిం జూచి అయ్యా! మీర లేగి యాజయవర్మమహారాజుగారిపురోహితునిం దగువిధంబున సత్కరించి సభాస్థలంబునకుం గొనిరండు అనిన శూరబాహుని పురోహితుండును వల్లె యనిలేచి యాప్రతీహారితోఁ జని యగ్నివలెం బ్రజ్వలించుచుండు బ్రహ్మతేజంబున

నొప్పుచున్న పాంచాలాధిపతిపురోహితునిం గాంచి నమస్కరించి యాతిథ్యమిచ్చి గోవు నొసంగి కైదండ యిచ్చి తోడుకొనివచ్చి తనికిసమీపమున సమర్పింపబడియున్న మణిమయాసనంబుపైఁ గూరుచుండనునిచిన రాజు నమస్కరించి తదాజ్ఞచే నుపవిష్టుండయ్యె. అనంతరము మంత్రిమొదలగువారును తత్తదుచితస్థలంబులం గూరుచుండిరి. ఇట్టులొకింత తడవు జరిగిన యనంతరము శూరబాహుం డాపురోహితునింగాంచి యిట్లనియె. ఓవిప్రవర్యా కాంపిల్య నగరాధిపతియగు జయవర్మమహారాజు సేమంబుగనున్నవాఁడే? అతండు మాయెడల దయాదరసంబుతోఁ బ్రవర్తించుచున్నాఁడుగదా? సకలసామంత రాజులు నాయనకుఁ బ్రతిసంవత్సరము నంపవలసిన కప్పములు సమయము తప్పక పంపుచున్నారే? దేశమునం బ్రజలు నిరుపద్రవంబుగ సుఖించుచుండుదురుగదా? ఇప్పుడు నాయొద్దకుం దమరి నంపుటకుం గారణం బేమియో? తేటపడ నెఱింగించిన నవ్విధానంబు నం బ్రవర్తింపఁగలవాఁడను. అని చెప్పఁగా నాపురోహితుండును సంతసంబుతో నోరాజా జయవర్మ క్షేమంబుతోడ నున్నవాఁడు! సామంతరాజు లాయన పేరుదలఁచినయంత మాత్రమున నులికి తమ తమ కప్పముల మున్మున్న పంపుచున్నవారు. తదీయబాహుసాలంబున మహాగుప్తినొంది జనులు నిత్యసంతోషమున నొప్పుచున్నవారు. ఆజయవర్మ మహారాజు నీతో బహుదినముల నుండి సఖ్యంబుపాటించుచు నిప్పుడు సంబంధమును బాటింపఁగోరి యున్నవాఁడు. మీయిరువురసంబంధము సర్వజనశ్లాఘనీయంబై యుండు ననుటకు మీమీయభిజనంబులును సుగుణసంపత్తియును శౌర్యధైర్యాదిగుణగణనీయతలు నొండొరులకు సమానంబులై సాధుజనశ్లాఘనీయంబులుగనుండుటయె నిదర్శనంబు. సంపద యన్ననో యఖిలదేశ విభులసంపద కధికమయి కుబేరునికి సాటియయి యొప్పుచున్నయది. అదియునుంగాక మీయింటికివచ్చి యతిథిసత్కారంబులువడసి యప్పుడప్పుడు కాంపిల్యనగరమునకే తెంచిన విప్రవర్యులవలన నీతనూజాత యగుమదనమాలరూప రేఖాతిశయములు విని తనకు నా కన్యారత్నమును సర్వాంతఃపురప్రధానమహిషిఁగా జేసికొనందలంచియున్న వాఁడు. ఈ సంబంధమునుగుఱించి మేము మీకు విశేషముగ నుగ్గడించవలసినదేమియు లేదు. సర్వంబు నీవయెఱుంగుదువు. చక్రవర్తియగు నాతనితో సంబంధముసల్పిన నీకు పాంచాలదేశపు రాజులందఱును వశగతులయి ప్రవర్తింతురు. నీవును స్వతంత్రరాజవగుటయేగాక యాచక్రవర్తికి సమానుఁడవుకాఁగలవు. శ్లో. కన్యా కామయతేరూపంమాతావిత్తంపితాశ్రుతం బాంధవాఃకులమిచ్ఛంతి" యన్నట్లు కన్యకచూచి కామించందగిన నవయౌవనమనోహర మగురూపసంపత్తియుం; తమకూఁతురు సౌఖ్యపడవలయునను కోరికతో మాతృజనము మనోరథించెడి ధనసంపదయుఁ; తనకంటె నధికునితో సంబంధముచేసితిమి గదా యనునభిమానము పాటింపందలంపు

కలవాఁడగుటవలన తండ్రి కోరెడి గొప్ప ప్రసిద్ధియుఁ; బంధుజనములు శయనాసన భోజన
లీలాసరసాలాప ప్రముఖములు తమకంటెఁ దక్కువయగువానితోఁ సలిపిన నవమానంబు
దప్పక కలుగునని యభిజనంబును ముఖ్యముగఁ గోరుచుండుట సిద్ధముగదా? అట్టిమహో
త్కులప్రసూతియగు నాజయవర్మకు గలవనువిషయంబు నేనుపన్యసించి నీకుఁ జెప్పనక్కర
లేదు. అయిన నిప్పుడు "శ్లో. వృత్తిస్థాన్నమితరే జనాః" అన్నట్లు మీరునువారును సం
బంధముచేసికొని యపరిమితానందాంబుధిం దేలుచునుండఁ దత్పాణిగ్రహణ మహో
త్సవంబుం గాంచనేతెంచి మీయిడినభక్ష్యభోజ్యాదిసంపన్నంబగుమృష్టాన్నంబు భుజి
యింప మావంటివారగునితరులెల్ల మిక్కిలిమక్కువ గల్గియున్నవారనువిషయంబె
యిప్పుడు మీతో మందలించవలసియున్నది. అని చెప్పఁగా విని శూరబాహుండు పురో
హితునిం గాంచి యోవిప్రవర్యా మీరలుపన్యసింపవలసినవన్నియు నుపన్యసించితిరి.
జయవర్మకును మాకును సంబంధముకలిగెనేనియది సకల జనశ్లాఘనీయంబైయుండునను
టకు సందియంబులేదు. లోకమునఁ గొందఱు తమతమ కన్యకలు పసితనంబున నుండఁ
గానే యభిజనరూపవిద్యాసంపదలుగలిగియుండు కుమారులకిచ్చి వివాహము చేయు
చున్నారు. అటుగాక కన్యకలు బుద్ధియెఱిఁగి యుక్తాయుక్తపరిజ్ఞానముతో నొప్పుచుఁ
దారుణ్యమునిండారి యయ్యాజానపదులవలన నాయా రాజకుమారుల శౌర్యధైర్యాది
గుణములెఱింగి ప్రమాణాంతరంబులచేత వానినిక్కువంబు తెలిసికొని తామెవరించి
రేని పిదప వివాహంబుచేసియిచ్చుట మాకుం గులక్రమాగతంబు. కాన నాకూఁతు నభి
ప్రాయం బెఱుంగక జయవర్మకిచ్చెదనని యేను దృఢముగఁ జెప్పంజాలను. అతనియందు
నాకొమార్తె కభిప్రాయంబుగలిగెనేని మిగులసంతోషము. లేనియెడల నిందు మమ్ము
నిర్బంధించుటవలన నుపయోగము లేదు. ఆమెయభిప్రాయం బెట్టిదియో? మీరు
నాతోఁ గన్యాంతఃపురమునకే తెంచెదరేని వెల్లడియగు. అని చెప్పి సభచాలించి యా
పురోహితునిం దోడ్కొని కన్యకాంతఃపురంబునకుం జనియె. అంతనుముందు చేటీజనసమా
హూతయైవచ్చియున్న యాశూరబాహుని పట్టమహిషి యగుజయమాలిని యెదురేగు
దెంచి భక్తిపురస్సరంబుగ నాపురోహితునికి నమస్కరించి యాతిథ్యంబొసంగి ప్రాణ
నాథునిం గైదండయిచ్చికొనిచని యిరువుర నర్హాసనాసీనులంగావించి యొకచేటిక నా
బ్రాహ్మణునికి వట్టివేరువీవనచే విసరునట్లొనరించి తానును దనపెనిమిటిసమీపమున నిల్చి
నవరత్నములుచెక్కియుండుకాడగల యొకసురటిఁగొని విసరుచుండెను. అప్పుడు
మదనమాలయుఁ సర్వాభరణభూషితయై తనకుం బ్రాణపదం బగునన్నుం దన చేలిపై
కెక్కించుకొని యక్కడకువచ్చి భక్తిపురస్సరంబుగ బ్రాహ్మణునికి తండ్రికిని నమస్క
రించినిలచె. అప్పుడు శూరబాహువు తనకూఁతుతో నిట్లనియె. ఓకుమారీరత్నమా మన

పాంచాలదేశపు చక్రవర్తియగు జయవర్మమహారాజు నీగుణగణంబులువిని నిశ్చయం బరిణయుంబు చేసికొనందలంచి తనపురోహితుని రాయబారముగాఁ బంపియున్నాఁడు; ఇందు నీ యభిప్రాయంబేమియో యెఱుకపఱుపుమన నా కన్యారత్నము నీగ్గుచేఁ డలవంచుగొని అయ్యా! తమతమ కన్యాజనమునకు జననీజనకులు ప్రభువులు గదా ?. శ్లో. పితారక్షతి కౌమారే భర్తారక్షతియౌవనే, రక్షంతివార్ధకేపుత్రాః నస్త్రీస్వాతంత్ర్యమర్హతి. అను నీతిశాస్త్రము స్త్రీలను తారుణ్యమువచ్చునఱకుఁ దండ్రియు, తారుణ్యము సంప్రాప్తమయిన యనంతరము భర్తయుఁ, దారుణ్యము గడచిన యనంతరము పుత్రులును రక్షింపవలసియుండునని తెల్పుచున్నది. మఱియు స్త్రీలకు స్వాతంత్ర్య మొకప్పుడును లేదుగదా. అట్టుండ నన్నడగవలసిన దేమున్నది. అని యనుచుండగా నాయమ మాటల నాక్షేపించి నడుమ నే నిట్లంటిని. ఓరాజా! నామనవి వినుము.

సీ. బాల్యంబువీడి సంప్రాప్తయౌవన యగునబలామణికి లజ్జ యధికమందు
రందు పెండిలికథ లడిగిన తమభావ మించుకయైన సూచింపరంద్రు
తనమనోవర్తి యానవు చెన్నివిధముల నడిగిన పరులతో నాడరండ్రు
శౌర్యగాంభీర్యాదిసంపన్నుపై నాస నంతరంగంబున నందురందు.

గీ. రదియకాలక్రమంబుగనంగకముల, సుభగతరమార వేదనావిభవసూచి
తస్రభాపాండురత్వాదివిప్రలంభ, ములఁ జతురలైన సఖులకుఁ దెలియుఁనండ్రు.

వ. కాన నిప్పుడీ తన్వంగియభిప్రాయంబెఱుంగుట దుర్లభంబు. మఱియును.

క. తరుణులభావ మెఱుంగక, వరునొక్కనిఁ గూర్చిరేని వనితలు లోనం
గర ముమ్మలించుకొందురు, ధర కన్యకభావ మెఱుఁగఁ దగు జనకునికిన్.

వ. అదియునుంగాక.

గీ. తానుగోరినట్టిధవుని కియ్యక యన్య, వరునికిచ్చెనేని వనిత వెతలఁ
దగులు ; నట్టితల్లిదండ్రులు తనకూఁతు, కపరివార్యులైనయరులు గారె.

వ. అంతియకాదు లోకసాధారణం బగువిషయం బొకటిమందలించెదవినుము

సీ. రమణికిఁ గుచకోరకము లఱరంబునఁ దోపఁ బతివాంఛ తోడనె పైకిఁదోఁచు
వెలఁదికి మైదీఁగె విస్తరిల్లుచు రాఁగ కోరికల్ తోడనె గోలుకొనును
సతి కవలగ్నంబు సన్నగిల్లుచుఁనుండ సరగున ధైర్యంబు సన్నగిల్లు
బాలకుఁ బిఱుఁదులు బటువులైకనుపట్ట రతివిభేదజ్ఞానరక్తి ప్రబలు.

గీ. నభినవోద్భూతయౌవన లైనకన్నె, లకు మనోభవతాపంబు ప్రకటమగును
నదియు లజ్జాయవనికాభ్యంతరంబుఁ, బాయఁగా లేకక్రన్నన బయలుపడవు.

కావున నీ సుతారత్నంబునకు నంతరంగంబునం గాంతవిషయానురాగంబు పదం బడియున్నయది. అభిజనవిద్యావిశేషవినయగాంభీర్యాది గుణయుక్తగావున నీయువతియను రాగం బేకాలంబునఁబైయుండును. అయాలంబనంబైన పురుషుండు నతిమనోహరుం డును రూపయౌవనలక్ష్మీ విభాసురుండును గులీనుండునై యుండునని తలంపుము. విను మీయింతికి,

సీ. రాగంబు హృదయాంతరంబునఁ జూపట్టఁ గండపాళుల హెచ్చెఁ బాండిమంబు
మది మనోరథము లమందమై పర్విడ నడలఁగ మాంద్యంబు గడలుకొనియె
మగనిపై వాంఛలు తగురీతిఁ బెంపొందఁ గార్శ్యంబు దేహానఁ గ్రమ్ముకొనియె
సంకల్పములయందు సరసునిరతిగల్గ విషయాంతరంబుల విరతి గల్గె.

గీ. నభినవాగతతారుణ్యవిభవధూత, గళితధైర్యహృదంతరగహ్వరమున
నళినబాణుండు దాఁచియున్నాఁడు దాఁచ, కొమరు నొక్కని గాంభీర్యగుణవిభూషు.

చ. జనకుఁడు సూపునట్టిపతి సారసబాణుఁడు సూపినట్టియా
ఘనుఁడగుభర్తకంటె నధికత్వముఁ జెందఁడు గానఁ దండ్రియుక్
సునిశితబుద్ధియే యయిన సూనశరుం డెఱిఁగించినట్టి యా
నినిఁ గొనితెచ్చి పెండిలి వినిశ్చితరీతినిఁ జేయ మేలగున్.

అని యిట్లుసెప్పిన నన్నుం గాంచి నావచనముల కచ్చెరువందుచు నాశూర బాహువు మందహాసంబుతో నోచిల్కా నీవు సెప్పినమాట లన్నియు యుక్తియుక్తంబు లయి వెలయుచున్నవి. ఇంతవరకు నుపన్యసించినరీతి నింకొక్క విషయంబును నిస్సంశ యంబుగ నుడివెదవేని చాల మేలుచేసినదాన వౌదువు. అదియేమంటివేని మన మదనమాల హృదయాంతర్వర్తి యగుకుమారుం డెవ్వరుండో యెఱుంగుదువేని తేటపఱుచునది. అని యడిగిన నేను నారాజచంద్రునితో నిట్లంటిని. ఓ మహారాజా నన్నింతదూరం బడిగెదవు. తెలిసినంతదనుక విన్నవించెదను. మన మదనమాల యొకకాపాలికి యిచ్చిన చిత్రఫల కంబుఁ గాంచుచుండుటవలనం జిత్రకేతన నగరాధిపతికిం గుమారుండైన మదనమోహ నునిపై ఆశఁగొనియున్నది యని సూచితంబైయుండెడిని. ఆ కాపాలికి యిచ్చిన చిత్రఫలకంబును ఆ రాజకుమారుని రూపమమరియుండుదాని నొక నిమిషంబైన నెడ బాయదు. అది యీమె చేతికందినది మొదలు,

గీ. చెలులతో మాటలాడదు కలువకంటి, చిలుకలకుఁ బద్యములు సెప్పఁ జేర రాదు,
రాజహంసములకు నడల్ ర క్తిఁ గఱప, దెంత యడిగిన నుత్తర మిడదు మాకు.

వ. అదియునుంగాక.

సీ. ఒకవేళఁ గుచకుంభ యుగముపై నిడుకొను నొకవేళ మోమున నొత్తుకొనును
ఒకవేళ ననిమేషయుక్తిమైఁ గనుగొను నొకవేళఁ గౌఁగిట నుంచుకొనును

ఒకవేళఁ బ్రణతయై యాలిఁ బ్రార్థనసేయు నొకవేళ రతికేళి కురవడించు-
నొకవేళ నునుమోవి నొగి నొక్కఁగమకించు నొకవేళ విరహార్తి నొల్లఁబోవు
గీ. మఱియు నొకవేళ నేకాంతమందిరమున, సరసహాసము నేస్తకాఁడురకయున్న
మోడితోఁ జూచు నీరీతి మోహనాంగి, చిత్రకాంతునితోఁ లీలఁ జెలఁగుచుండు.

అని చెప్పినవిని రాజును మనంబున సంతసించుచుఁ దనదేవింగాంచి యోజయమాలినీ యీచిలుక తెలిపెడివియన్నియును యథార్థంబులయి యుండునవియే? యని యడిగిన నారాణియు మందహాసముతో నట్లుకాదేని యీచిలుక యిట్టేల యుపన్యసించునని పల్కఁగా సిగ్గుచేతఁదలయెత్తలేక తనవిషయములన్నియుం బట్టబయలు సేయుచిలుకపై కోపగించుకొని గురుజనసవిధంబుగాన నేమియుంజేయనేరక యూరకయు దనలోఁ దానుమ్మలికముపడుచునకూఁతు నేమియు ననుగలేక రాజును పురోహితునింగాంచి యోయయ్యా విషయమంతయు మీహృదయమునకువచ్చిన యదియే? జయవర్మకు వృత్తాంతము విన్నవించి మాయందుఁ గరుణారసము గలిగియుండునట్లు సేయుండు అని చెప్పి యావిప్రునికి జాంబూనదాంబరాభరణాదులు బహుమానంబుగానొసంగి యంపివేసెను. ఇవ్విధముగ నాపురోహితునింబనిచి రాజు ఆనాఁడు జయమాలిని యుండునంతఃపురంబునకుంజని యందునాహ్నికకార్యములు జరిగించుకొనుచుండె. మదనమాలయు తనగురుజనంబు తననగరుబాసి చనినతోడనె నాయొద్దకువచ్చి నన్నుంజూచుచుఁజూచిన నేనును ప్రియసఖీ నాపైఁ గోపగించుకొనకుము. మీతండ్రియడిగినప్పుడు నీవేమియుం ననలేక సిగ్గుపడుచు మనోగతంబు సెప్పలేకయుంటివి. ఇట్టిసమయముల సమీపమున నుండు ప్రియసఖి కన్యకామణికిం గలసాధకంబులు పరిశీలించుచు సమయోచితంబుగ నాయమయభిప్రాయంబు వెల్లడిసేయవలయు; అట్లుసేయనినాడు దానికిం గలుగు బాధలు సూచి సంతపించు. ఇప్పుడు నీయభిప్రాయంబు వివరింపనైతివేని యీపాంచాల దేశపుచక్రవర్తికిచ్చి పరిణయంబుసేయ నీజనకుండుయత్నింపకమానఁడు. ఇదినీకనిష్టంబుగాన నిట్లుచేసితి. ఇందేదైన నీకనిష్టంబుగలదేని నన్ను శిక్షింపుము. అనిచెప్పిన నామదనమాలయు నాయందు మిగుల సంతసపడుచు నోచిలుకా నీవుసమాచారముగురుజనసన్నిధియందు విన్నవించుటచేఁ గొన్ని కార్యముల కనుకూలతయుఁ గొన్నికార్యములకుఁ బ్రతికూలతయు సంభవించుచు. నేను మదనమోహనునియందు అనురక్తనైయున్నదాననట విని పాంచాలదేశపుచక్రవర్తి మనకప్రియంబుసేయకమానఁడు. ఇది ప్రతికూలము. నాతండ్రియు శీఘ్రముగ నన్నామదనమోహనునికిచ్చి వివాహంబుసేయఁబ్రయత్నించు. ఇదియనుకూలంబు. నన్నుఁ బాంచాలాధిపతి కియ్యం బ్రతిజ్ఞ చేయకమునుపె నాతండ్రికిని యోచింపించుట మేలని యిట్లుచేసితివి. రాఁబోవునసర్థకంబుం జింతింపవైతివి. ఇంక

నీవిషయంబునం దామసించినఁ గార్యంబుచెడును. శత్రుంజయునికుమారుం డగుమదన
మోహనుని కీవృత్తాంతము విన్నవించి గాఢతిత్వరితగతి నాతని నీనగరమునకుం దోడ్కొని
రావలయును. ఇందుకుం దగినవారలెవ్వరో? మనంబునకు రాలేదు. ఏమిసేయుదును
అనిచెప్పఁగా నప్పుడు నేనిట్లంటిని. ఓ వనమాలా భవదీయప్రాణనాయకునిందోడ్కొని
వచ్చుటకు నన్నుఁబంపుము. వేగిరంబ చని యతనికి నీవృత్తాంతంబెఱింగించి తోడితెత్తును.
అనఁగా నారాజకూఁతురు చిలుకా నీవు మదనమోహనునికిం దగినసమయోచితాలాప
ములు పచించి యాతనికి నాయెడలఁ గరుణజనియింపం జేసి యిచ్చటకుం గొనివచ్చుటకు
సమర్థురాలవే? అయినను ఒంటరిగా నిన్నింతదూరము పంపుటకు నామనంబొల్లదు. సకల
జననయనవిలోభనీయంబగునీయాకృతిం గాంచిన నెల్లవారును నిన్ను పట్టికొని బంధింపఁ
దలంపక మానరు. నీ విల్లువిడిచి పోయినదిమొదలుకొని నురల నాచేతికి దొరకువరకును
ప్రాణంబులు తల్లడపడుచుండును. అనఁగానందుకు నేను రాజపుత్రీ నీవుచెప్పినదిసత్యమే?
అయినను నేను నాచాతుర్యముమెఱయ నెవ్వరికి నగపడకుండంజని యాతనికి వృత్తాం
తము విన్నవించి వేగిరంబవచ్చెద. అనిచెప్పిన నందుకొడంబడి యారాజకొమారిక "మం
చిది నీవితరులచేతఁ జిక్కకుండఁ దప్పించుకొనిరాఁగలదాన వనుటకుసందియంబులేదు.
అయినను స్త్రీజాతి యొంటరిగాఁ జనకూడదుగాన బహుదినములనుండి నీకు భర్తఁగాఁ
జేయవలయునని నేనత్యాదరముతోఁ బ్రాణపదంబుగఁ బెంచుచు వచ్చుచున్న కల
కూజితం బనురాజకీరమును నీకుసహాయముగాఁ బంపెదను. దానితోఁగూడనేగి నీవి
కార్యంబును నెరవేర్చుకొనిరమ్ము. అనిచెప్పిన నేనుసిగ్గుచే నేమియుననక యూరకుం
డఁగా నామదనమాల ప్రాణసఖి యగుమకరికయనునది యామెతో నిట్లనియె. ఓ ప్రియ
సఖీ నీవాకించుకయైన నాలోచింపక పల్కుచున్నావు. మనకలకూజితము ఈచతురిక
చక్కందనమును చాతుర్యంబును మనముగ్గడింపఁగావిని దీనియందుమరులుగొనియున్నది.
అంతియకాదు! దీనినెప్పుడెప్పుడు కనుగొందునాయని దినమొక్క యుగముగాఁ గడపు
చున్నయది. అదియిట్లుండ నీవు కొన్ని దినములకుముందొకనాఁడు సాయంసమయమునఁ
గలకూజిత యుండుపంజరమునకు సమీపించి యనేకవిధము లగుచమత్కారవచనములు
సెప్పినను అదియేమియుఁబలుకక కేవలము చింతాక్రాంతంబై యుండుటఁగాంచి
సమీపమున నుండునావలన నీకీరమాహారాదులయందిచ్ఛమానియుండుటయెఱింగి విరహ
పాండురం బగునారాజకీరముశరీరమును గాంచి నాతో ఓమకరికా ఈశుకము చతురి
కయం దత్యంతానురాగంబుజెంది మదనవేదనఁదాళంజాలకయున్నట్లుతోఁచెడిని. మన్మ
థునికి బాణంబులు మాత్రమే విషమంబులుకావు, చర్యలును విషమంబులేకాన నుపే
క్షింపందగదు. ఈకీరంబులకుం బరస్పరానురాగంబు కలుగుటకైకదా మనము కలకూజి

తముగుణములు చతురికయొద్దను చతురికగుణములు కలకూజితమునొద్దను బ్రతిదినము
నుపన్యసించుచుంటిమి. ఇదివరకవి యొండొరులముఖంబులు గాంచుకొన్నవిగావు. ఒక
మంచిముహూర్తంబు విచారించి యీరెంటికిం బరిణయమహోత్సవంబు బహువిచిత్ర
ముగ జరిగింపవలయును; ఇంక నాలస్యముచేయంగూడదు. అని చెప్పియుంటివిగదా?
అట్టికలకూజితమును ఈచతురికతో బంపితివేని నీకార్యమయిన యట్లే తలంచవలయును.
ఒకవేళ యిది యొకించుక నీమీఁదిమక్కువచేతఁ గొంతదూరం బరిగినను కలకూజితంబు
మనోహరము లగునుద్యానములను త్రోవలోఁ గాంచి వానియందు నీచిలుక నడ్డగించి
యడ్డగించి వలరాచపనులఁ గాలంబుఁగడపుచు శరీరంబెఱుంగక విహరించుచుండును.
ఇంతియకాక మదనమోహానునికి ఈ వృత్తాంతంబు సెప్పుట కింతదూరంబు ననవు. అని
చెప్పఁగా మకరికావచనంబులు విని మదనమాల కొంచమాలోచించి మకరికంగాంచి
యోసఖీ నీవుచెప్పినదిసరే; ఇందుకొక యుక్తిచేయవలయును. అది యిప్పుడ నీకుం
జెప్పెదను. కలకూజిత ముండుపంజరముం గొనిరమ్ము అనిన నామకరిక యట్లుచేయ
మదనమాలయుం నన్ను నాకలకూజితమును గాంచి యోశుకములారా మీరిరువురు
నెచ్చోటను నిల్వకచని చిత్రకేతనపట్టణమున నా రాజకుమారునింగాంచి నా వృత్తము
విన్నవించి యాతనిం దోడ్కొనివత్తురేని మీ యిరువురకును నవరత్నహారములు మొద
లగు నాభరణముల నలంకరించి వచ్చిననాఁడె మహోల్లాసకరంబుగ బరిణయమహోత్స
వంబుఁ జరిగింతును. నాకు బహిశ్చరంబు లగుప్రాణంబులుగాఁ దలంతును. నా కాంతుని
గొనితెచ్చియియ్యక మీ రిరువురును నొకవేళఁ బరస్పర మనురాగానుకూలముగఁ బ్రవ
ర్తింతురేని మీ మొగంబైనఁ గాంచను. అట్లు మీరు ప్రవర్తించితిరేని నామీఁద ఆన
యున్నది. నాప్రాణములచేత శపియింపంబడుదురుగాక. మీరిరువురును పంజరములో
నున్నవానిఁగాఁ దలంచుకొని రాత్రులయందు వేర్వేఱుస్థలములం బరుండుచు నొకటితో
నొకటి విశేషముగఁ జేరి సరసాలాపాదులు సలుపక పోయి కార్యము సాధించుకొని
రావలయును. అనిచెప్పి మకరిక తెచ్చియిచ్చు శర్కరలును పండ్లును భుజియింపం జేసి
పంజరములు దెఱచి యాశుకమును నన్ను వదలిపెట్టెను. మదనమాల యడిగిన యాజ్ఞకు
భంగంబుగలుగకుండ మేమిరువురమును చిత్రకేతనపట్టణపుమార్గముం బట్టితిమి. దానితోఁ
గూడ నేనును నాతోఁగూడ నదియును పోవుచున్నార మని యంతమాత్రమెఱుంగుదు
మంతేకాని యొండొరులం గన్నులెత్తియైనం జూచుకొన్నవారముగాము. ఇట్లు చని కతి
పయదినముల కానగరమునకు సమీపమునందు నుద్యానవనంబుం జేరి కొన్నిఫలములు
భుజియించి పథశ్రమంబు నపనయించుకొనుచుండఁగా నచ్చోటికి సమీపమునఁ
బెక్కండ్రు కాంతామణులు చేరనాటలాడుట వినంబడిన మే మక్కడకుం జని యొక

చోట నొకకొలనికెదుట నతిమనోహరముగఁ గట్టంబడియుండు దేవాలయంబుం గాంచి యద్దాని వాకిటను సువర్ణఘటంబులం దత్సరోవరనీరంబులు గొనితెచ్చువారును పుష్పఫల పత్రసముదయంబులు గొనియందిచ్చువారును మఱియు ననేకవస్తుసంభారములు మోచుకొని వచ్చువారునై తిరుగుచున్నకన్యకామణులం గాంచుచు నాగుడిలోనం బ్రవేశించితిమి.

అచ్చోట నొకరాజమహిషి నిందుధరసుందరికిం బురోభాగంబునం గూరుచుండి బ్రహ్మాసనస్థితయై నేత్రములు ముకుళించి స్ఫటికాక్షమాలికను హస్తంబునం బూని జపియించుదాని నొక్కతెం గాంచితిమి. కొంతసేపటికి ఆయమ నేత్రములు దెఱచి గౌరీదేవికిమ్రొక్కి యితరకాంతాకరానీతము లగుసువర్ణఘటోదకముల నాభవానికి మజ్జనంబుసేసి ధౌతవస్త్రములచేఁ దడియొత్తి జాంబూనదాంబరాభరణాదుల నలంకరించి ఫలపుష్పాక్షతాదుల నర్చించి కర్పూరనీరాజనాదులు సమర్పించి ప్రదక్షిణనమస్కారము లొనరించి భక్తిపురస్సరంబుగ నంజలిబంధంబుఁ గావించుకొని యనేకవిధములఁ బ్రార్థించె. ఓ హైమవతీ నాయందుఁ గరుణించి యనేకదేశవిలోకనోత్కంఠచే నగరంబుం బాసి పోయిన కృతబుద్ధిసహితుం డగు నాకుమారునికి నెవ్వరివలనను భయంబులేకుండునట్లును సర్వకార్యంబు లనుకూలమగునట్లును శరీరారోగ్యంబు తప్పకయుండునట్లును భ్రమప్రమాదంబులు సంభవింపక యుండునట్లును శాకినీఢాకినీప్రముఖపిశాచంబులవలనను భయంబులేకుండునట్లును అనుగ్రహింపుము. అని మఱియు ననేకవిధముల వేడికొనియె. ఇట్లు ప్రార్థించెడియాయమ మదనమోహనుని తల్లియగుమణిమాల యనియు నాకుమారుండు నీపోయినరేయియె యిల్లువెడలిపోయె ననియు నచ్చటి వారిపరస్పరసంభాషణాదుల నెఱింగి వచ్చినకార్యంబునకు విఘాతంబు సంభవించె నని తలంచి చేయునదిలేక చింతాక్రాంతహృదయులమై కుమారునిం దీసికొనకపోతిమేని మదనమాల మనమొగంబైనం గాంచనొల్లదు; రాజపుత్త్రుఁ డూరలేఁ డని తెలియుచున్నది; అనేకదేశములు కనుంగొనం దలంచి పోయియున్నవాఁడు ఏయూరనుండునని యెక్కడెక్కడ నెదుకవచ్చును. ఇది యసాధ్యమగు పనిగాని సుకరంబుగాదు. మనరాక కెదురుసూచుచుండి యామదనమాల తుదకు మనల సఖిద్రోహులనుగాఁ దలంచి తనకింక నెవ్వరు నేకాంతసఖులును దూరదేశగమనసమర్థులును లేమి నేమియుం దోఁచక చింతాసముద్రమున మునింగి దరిగానలేక యుత్తలపడఁగలదు. రాజపుత్త్రునిం దీసికొనక మనముమాత్రము పోయినను దానివలవంతఁ దొలంగింపంగలమా? దానిపడుపాట్లు గాంచుచు మనమును బహువిధములఁ బరితపింపవలసియుండును. పోకపోతిమేని మనము రాజపుత్త్రునిం దోడ్కొనివత్తుమను ప్రత్యాశతోఁ గొన్నిదినములు బ్రతికియుండును. మనముమాత్రము

పోతిమేని నిరాశచేఁ దత్క్షణంబున మృతిఁజెందినను జెందుదుఁ. కాన మగధరాజకుమారుని శక్తికలకొలఁది వెతకుటయే కర్తవ్యము. అందుకు సకలదేశములందు గలయఁగ సంగొనుటయె యిప్పుడు మనకుం బనియైయున్నది. కార్యభారము దేవునియందుంచి శక్తివంచనలేక ప్రవర్తించువారికి సేమంబుచేసేతం గలుగకమానదు. అని నిశ్చయించుకొని మేమచ్చోటు వదలి కదలియనేకపట్టణములు నుపవనంబులను గడిచి యొకానొకనాఁడు సూర్యోదయసమయమున నొకమహారణ్యమధ్యముం జేరితిమి. అట్లుచేరి తదీయమధ్యంబున నుండునొక సరోవరముగట్టున మొలిచియున్న ఘనవృక్షబృందములం గలమధురఫలంబులు మెక్కి క్షుద్బాధ నడంచుకొని యాకొలనికిం గొంచెముదూరమున నుండునొక మఱ్ఱిపైనం గూర్చుండి మార్గాయాసముఁ దీర్చుకొనుచుండఁగా నక్కడికి ఇరువురుకుమారులు రూపయౌవన వినయశౌర్యధైర్యగాంభీర్యాదిగుణోపేతులు శ్రాంతవాహనులై వచ్చుచుండుటం గాంచి వీరలెవరో తెలిసికొనవలయునని తలంచుచుండ నాకుమారులును మేముండువటవృక్షము క్రిందం దిగిరి అందొక్కరుండు తృషార్తుడై యుండుటంబట్టి దప్పులనున్న కొలనిలో నుండి జలములు గొనితెచ్చుటకు మఱియొక్కనిం బంపె. అప్పుడేను తొల్లి నీపాలికి తెచ్చియిచ్చిన చిత్రఫలకములోని కుమారునియాకారమును ఆచెట్టుక్రింద నుండుకుమారునియాకారమును సరిగా నుండుటవలన నితఁడె మదనమోహనుం డని నిశ్చయించి సమీపమున నుండునొకదానిమ్మచెట్టుననుండి కొరికి యొకమంచిపండు ముక్కునఁ గఱచుకొనిపోయి యాకుమారునిచేత నిడి కుమారకా నీవుదప్పికొనియున్నావు గాన నీపండు పిసికి రసాస్వాదనం బొనరించిన నది యడంగును; వేగిరం బట్టుమనవచ్చెదవేని నీకొక్క రసావహమగుకథ సెప్పెదనని నామాట కాకుమారుం డచ్చెరువందుచు నాఫలము భుజియించి గతతృష్ణుండై యోచిలుకా రసావహమగునొకకథ సెప్పెదనంటివే యది యెయ్యది యనిన, నేను నారాజకుమారునితో నిట్లంటిని. ఓయయ్యా భవదీయగాంభీర్యాదిగుణములును జగన్మోహనమగునాకారమును నిన్ను మదనమోహనుం డని యెఱింగించుచున్నయది. అయినను నిశ్చయార్థము శత్రుంజయుంసికుమారుఁడవా కావా యని నిన్నడుగవలసియున్నది. అదియెఱిఁగిగాని వృత్తాంతము విశదీకరింపఁగూడదు. అనిచెప్పిన నాతండు నేనె మదనమోహనుండనని చెప్పఁగా సంతసించియే నిట్లంటిని. పాంచాలదేశాధిపతికూఁతురు మదనమాలయనుకన్యక నీగుణగణములు కర్ణాకర్ణికగావిని నీయందనురాగము జెంది యావిషయము నీకెఱిఁగించి తోడ్కొనిరమ్మని నన్నును నాతోఁగూడ నీకీరమును బంపియున్నది. నీపై మనము నిలిపి యాకులుకులాఁడి యనుభవించుదురవస్థల నీతోవిన్నవించుచుం దడసితినేని యామందయానను కందర్పుఁడు చరమదశకుం గొనిరాకమానఁడు. అయిన నొకింత నీకు విశదీకరింతు వినుము.

శ్లో. *అధివసతివసంతేమర్తుకామాదురంతే నవకిసలయతల్పంపుంజితాంగారకల్పం,
విరహమసహమానాచక్రవాకీసమానా చకితవనకురంగీలోచనా కోమలాంగీ.

[టీ. *చకితవనకురంగీ లోచనా = భయపడినదియు నరణ్యమునందునదియు నగు నాఁడుజింకయొక్క కన్నులవంటికన్నులుగల, కోమలాంగీ = కాంత, చక్రవాకీసమానా = ఆఁడుజక్కవపులుఁగువలె నాయకునియందుఁ బ్రేమయతిశయించినదియు, అందువలన, విరహమసహమానా = విరహవేదనను సహించనిదియునై, దురంతే = మలయానిల కోకిలాలాపాది కామోద్దీపనములు కలిగియుండు నదియగుటచే విరహిజనులకు దుస్తరమయియున్న, వసంతే = వసంతఋతువునందు, మర్తుకామాసతీ = చచ్చుటకిచ్చగించినదియై, పుంజితాంగారకల్పం=గుంపుగాఁ జేయఁబడిన నిప్పుతో నొప్పుగు. నవకిసలయతల్పం = క్రొత్తచిగురుటాకులపానుపును, అధివసతి=ఆశ్రయించుచున్నయది. మనుష్యులతోఁ బరిచయము లేమిచే బెదరుగల యడవిలేడికన్నులవంటికన్నులుగల యా సుకుమారాంగి ఆఁడ జక్కవపులుఁగువలె ప్రియానురాగముగలదియై నాయకుఁడు సమీపమున లేమిచే కనుపించయుంచి మలయానిలకోకిలాలాపచంద్రాతపాదికామోద్దీపకములచే వియోగిజనులకు దుస్తరమయియున్న వసంతకాలమునందు మన్మథావస్థలను తొమ్మిదియు ననుభవించి తాళఁజాలక ప్రాణపరిత్యాగము సేయుటకు యత్నపడుచు విరహిజనులకు నుద్దీపనమగుటచేత రాశిగాఁజేయబడిన నిప్పుకణికల యొప్పయినట్టుతోఁచెడి లేఁజిగురుటాకులపానుపునందుఁ బరుండుచున్నయది.]

ఓ రాజకుమారుఁడా ఆ కన్యక విరహతాపము నే నేమనివిన్నవింపఁగలను. అని నేను చెప్పుచుండఁగా నాతోఁగూడ వచ్చియున్నకలకూజిత మనుకీరము తటాలున మా సమీపమునకువచ్చి యిట్లనియె. ఓ కుమారుఁడా!

శ్లో. †నవకిసలయతల్పంకల్పితంతాపశాంత్యై, కరసరసిజసంగాత్కేవలంమ్లాపయంత్యాః,
కుసుమశరకృశానుప్రాపితాంగారతాయా, శ్శివశివపరితాపంకోవదేత్కోమలాంగ్యాః.

టీ †[తాపశాంత్యై=దేహతాపనివృత్తికొఱకు, కల్పితం=సఖులచేఁ గల్పింపఁబడిన నవకిసలయతల్పం = లేఁజివురుటాకుపానుపును, కేవలం=కేవలము, కరసరసిజసంగాత్ = పాణిపద్మముయొక్క సంబంధముచేత, మ్లాపయంత్యాః=మ్లానమగునట్లుచేయు నదియు, కుసుమశరకృశాను=మన్మథాగ్నిచేత, ప్రాపితాంగారతాయాః = దేహమున సెగలెగయుచున్నదియునగు, కోమలాంగ్యాః = సుకుమారాంగియొక్క, పరితాపం=విశేషమగు దేహతాపమును, కోవదేత్=ఎవఁడు ఉపన్యసింపఁజాలును. శివశివ=కటకటా! ఆకాంతామణికి విరహతాపము శమించుటకొఱకు సఖులు నూతనములగు లేఁజివురుటాకులుగొని తెచ్చి పడకవేయఁగా నది దానిహస్తపద్మము సోకినంతమాత్రన యాపానుపు వాడిపోవు

చున్నది అదియునుంగాక వానిదేహమున మన్మథాగ్ని జ్వలించుచుండుటంబట్టి సెగలెగ యుచున్నవి అకాంతయో బహుసుకుమారగాత్రి. దానితాపము నేమని నుడువవచ్చును.?]

అనిచెప్పఁగా రాజకుమారుఁడునిని యట్టి యబలామణినిగదా రక్షింపవలసినది యని మనంబునందలంచి శుకంబులంగాంచి నాప్రియమిత్రుఁడు కృతబుద్ధి నాకు నీళ్లు దెచ్చుటకు బోయియున్నాఁడు. అతఁడు వచ్చినయనంతరము వాఁడును నేనును వచ్చెదము. కొంచెము విళంబమునసహించుకొనుఁడు. అనఁగా నేను మనమున మంత్రికుమారుండు సమీపించెనేని యొకవేళ యిందుకొడంబడకుండఁజేయునేమో యనితలంచి యా కుమారునితో నిట్లంటిని.

సీ. యుద్ధసన్నద్ధుడై యుండుశత్రువుబిల్వఁ దామసించునె బాహుదర్పయుతుఁడు
అన్నంబు భుజియింప నాసతో బిల్చిన ననుగంతగాఁడె క్షుధాతురుండు
ఆపన్నుఁడనునన్ను నాశ్రయించితినన నూరకయుండునే యురుయశుండు
పాత్రుండు తనకు సంప్రాప్తుఁడై యుండఁగా దాఁ దామసించునే దానఘనుఁడు

గీ. అట్లు మదనశరోద్దామహతివిమూర్ఛ, తాత్మయైయుండుజవ్వని యాత్మఁగరఁగి
వేడుకొనజాగుసేయునే వేడ్కకాఁడు, వడివి గానంగ నిప్పుడే బయనమగుము.

అనిచెప్పిన నన్నుంగాంచి యా రాజకుమారుండు నోచిలుకా నీవు చెప్పినది సత్యమె కొలనికేగియున్న మంత్రికుమారుండు మరలవచ్చి నన్నుగానక యత్యంత దుఃఖితుండై నేను జీవించియున్న విషయంబునందుగూడ నమ్మికజెందక యతం డేమేమికష్టదశల ననుభవించునో? లేక యొకవేళ తనశరీరంబును వదల యత్నించునో! సాధారణముగ బుట్టిననాటినుండి శయనాసనభోజనవిహారాదుల నొకప్పుడైన నించుక యెడఁబాయని నాప్రియమిత్రుఁడు నాకై కష్టదశలఁ జెందవలసిన ట్లయ్యెనేని నాకిట్టి సుఖము సంప్రాప్తమయిన నేమియుపయోగము! అదియును నాకు సుఖకరంబుగాదు.

అని యిట్లుచెప్పిన నేను కుమారునింగాంచి యోయయ్యా యాతనిఁ గుఱించి నీవు చింతింపవలదు. రాజపుత్రికం గాన వేగిరపడుము. మంత్రికుమారుని కీవిషయంబు సూచనఁగాఁదెల్పి మేమును నీవెనువెంట వచ్చెదము. అని చెప్పఁగా నందుకు సమ్మతించి యాకుమారుండు శీఘ్రముగ నశ్వవరంబు నధిరోహించి మేము చెప్పినమార్గమున జన సమకట్టె. వాయువేగంబునం బోవునదిగాన నాయశ్వంబును రాజకుమారుం డారోహించుటయెతడవుగా మేము మాచుచుండ నామహారణ్యంబుఁగడచెను మే మొకింతసేపు మంత్రికుమారునిరాకఁ గాంక్షించుచుండి రాజకుమారునితోఁగూడిఁ గలిసిపోవలయుననుత్వర మమ్ముండనీయక యలయింప నామంత్రిపోయినమార్గమునం జని యనతిదూరమున నాతఁడు వచ్చుచుండుటం గాంచి యొక బూరుగుచెట్టుకొమ్మమైఁ గూరుచుండి మేమిరు

పురము పరస్పరసంభాషణము సేయువిధముగ మదనమోహనుండు మనకుం బ్రాప్త ప్రాయుఁడే. ఇఁక మనరాజకుమారికకు నితనికిని జరుగుచిత్రంబులం గాంచుటకు మనము పోవుదము అని చెప్పికొనుచు నాచెట్టునుండి యెగిరి రాజకుమారుండు చనినత్రోవం బట్టి యతివేగముగ నంబోలిమి. బహుదూర మరిగియు నారాజకుమారునిఁ గానక సూర్యుం డస్తమించు సమయంబున మార్గాయాసంబు పైకొనఁగా విక్లబంబు లగు నవయవములతో నొకింతయుకయైనఁ గదలలేక మనము రాజపుత్రి యొద్దఁగాని మదనమోహనునిఁ గాంచ లేము అని యనుకొని రేపు తక్కినత్రోవ నడచిపోవచ్చునని నిశ్చయించుకొన్నవారమై యొకయరణ్యమధ్యంబున నుండు రమణీయమగుసరోవరసమీపమునఁ బూవులు పిందెలు కాయలు నిండియుండు రెండుమామిడిచెట్లు వికసించిన పుష్పకుంజరులపరిమళము నలు గడల వెదచల్లుచుండ వానిం గాంచి వానిమనోహరత్వమున కచ్చెరువునొందుచు జేరి యొక వృక్షముపై కెక్కి యతివిశాలము లగుదానికొమ్మల యందలి కోటరములలో నారాత్రి వసించియుండ నిశ్చయించుకొని తత్సమీపమున నుండు వృక్షఫలములు భుజియించి యాఁకలి యడఁచుకొనుచు గొంతసేపు తత్సరోవరనీరంబు లాస్వాదించి దప్పియడఁ గించుకొనుచు గొంతసేపును ఆమామిడిచెట్లకొమ్మలపై సుఖంబుగా వసించుచుఁ గొంతసేపును బరస్పరప్రాప్తి మనోరథంబులఁ గొంతసేపును జరుగ నర్ధరాత్రిసమయమునకు మే మాతరు కోటరములయందు శయనించి నిద్రఁ గూరితిమి.

ఇట్లు నిదురించి తెల్లవారుటకు నాలుగుగడియలు మిగిలియుండఁగా మేలుకొని యొకు. నామనంబున నీదినము మనరాజపుత్రి యొద్దకుం బోయి నానాయకునితోఁ గూడఁ చేరఁగలను. తోడనె న్నుం గాంచి తనభర్తం దోడ్కొనివచ్చినదని యతిప్రేమతో నన్ను మన్నించి ముద్దిడుకొని మార్గాయాసంబు నోవనుపచరించి తాను ప్రతిజ్ఞ చేసియున్న యాభరణంబులచే నన్నలంకరించి యీ కలకూజితంబునకు నన్నుఁ బల్లిఁగాఁ జేయును. ఆయుత్సవంబుసూచు వారలకును నాకును మనోహరంబయియుండంగలదు. రాజపుత్రుండు నింత నా మదనమాలయొద్దకుం జేరియుండవచ్చును. రాజపుత్రి మారాక కెదురు సూచు చుండును. ఎప్పుడెప్పుడు తెల్లవారును. ఎప్పుడెప్పుడు నామనోహరునింగాంతును. ఎప్పు డెప్పుడు మదనమాలచే నాయకునితోఁ గూర్పఁబడి సుఖంబులఁబడయుదును. అని యివ్విధం బున ననేకవిధము లగు మనోరథంబులఁ దలంచుకొనుచు నాకోటద్వారమునకువచ్చి నా నాయకుఁడు వసియించు మామిడిచెట్టువలనికి దృష్టులు నిగుడించితిని. ప్రతిదినము నాకంటె ముందు నిద్ర మేల్కాంచి నాయుండుచోటికిరాను భయపడుచు పట్టఁజాలని ప్రేమమున నాతో లీలావిలాసంబులుసల్ప యత్నించియు మదనమాల యిడిన యొట్టునకు బిట్టదరుచు మదీయముఖవీక్షణంబునకు వేచియుండునట్టి నాప్రాణనాయకుండుసూర్యో

దయసమయంబయ్యెను గనంబడకుండుటచే నా మనంబున నొకవేళ యీకలకూజితంబు నాయెడంగలుగు ననురాగంబుచే నన్నుం గలయం గోరి తన్ను వెదకవచ్చు నన్నుం బట్టి భోగింపందలంచి తనకోటరంబందునకుం దగినచోటని యచ్చోటువిడిచి రాకయున్నదేమో? కామాతురులు కాంతల నెవ్విధమైన వశపఱచుకొని కలయందివురుట సహజమేకదా? అని యనుకొని మదనమాలవచనమ్ముం దలంచి యచ్చటికిం బోవనొల్లక కొంతసేపు నాయుంమతావునన యుండి తదాగమనంబు నిరీక్షించుచుండ నా యాశలు బూరుగుకాయ కాలించివేచినట్లయ్యె. బహుకాలమయ్యెం గలకూజితము కనంబడకపోవుటచే నేను సంతోషంబులేక తద్విషయమున ననేకములగు ననిష్టశంకలు చింతించుచు నదియున్న చోటికిం బోయి యాకోటరంబునం బ్రవేశించి యంతయుం గలయం గాంచి నాథుండు బొడగానమికి వగచుచుం బైపై భర్తృవియోగతాపంబు నంతరంగంబు దహింపం జింతాసాగరంబున మునింగి దిక్కుతెలియక పెక్కుతెఱంగుల విలపించుచు ఓ ప్రాణనాథా నన్నిట్లొంటిగా నీనిర్జనంబున విడిచిపోవుట నీకుచితంబగునా? నీయందను రక్తురాలననియైన నాలోచింపకపోతివే? ఓనాథా నేనప్పుడప్పుడు చుంబనాదుల నుద్యుక్తుండవగు నీ కనుకూలముగం బ్రవర్తింపకపోతినని కోపగించుకొని యిప్పుడు నన్ను వదలిపోతివో? లేక నామనంబుననుండు ననురాగంబుం బరీక్షింప నెంచి యెచ్చటనైన దాగియున్నాఁడవో? కాక మదనమోహనుని వృత్తాంతంబు నాకంటెముందుగ రాజపుత్రికెఱింగించి తత్ప్రవర్తంబులగు బహుమతులం బడసి నన్నుదుర్గ్రానం దలంచి ముందుగ ధరావంతంబున కేగితివో? అట్లుగాక పాపిష్ఠులగు బోయలచేతంబడి ప్రాణములు గోలుపోతివో? ఎక్కడ నున్నాఁడవో? ఏవిధముగనున్నాఁడవో? మదనమాలయానవిూఁద నీతో నేను మొగమిచ్చిమాట్లాడకుండితిగాని నేను నాహృదయమున నెప్పుడెప్పుడు రాజపుత్రిక కార్యము నెఱవేఱు? ఎప్పుడు భవత్సంగమసౌఖ్యము సమకూరు అని తలంచుకొనుచు నన్న్యాసక్తమగు మోహాతిశయము వడంచుకొని భవన్మయమైన మనముతోం బ్రవర్తించుచుండుదును. దయితా! కాముకుల మన మతిచంచలమగుటచేం బ్రతిజ్ఞాహానికలుగునని నీకు నామనోగతము ప్రకటింపనైతిని. మనకు రక్షకురాలగు రాజపుత్రికయభీష్టంబు సమకూర్చి సుఖసాగరంబు నీదంగలవనియుంటిని. ఇంక భవద్విరహంబు సైరింపంజాలను. తొల్లింటి నాయపరాధంబులు మన్నింపుము. నీ కభీష్టంబగునేని నాతో సురతసుఖంబు లనుభవింపుము. నామనస్తాపంబపనయింపుము. నీ ముద్దుమొగంబుంగానిపింపుము. నీమనోరథంబువగింం బ్రవర్తింపుము. ఇంక నిట్లొకింతతడవు నన్నుం గరుణింపవేని యేనుదేహంబు నిలుపుకొనంజాలను. ఎన్నివిధంబుల వేడికొనినను నీకుం గరుణలేకయున్నది. ఇట్టి కఠినగుణం బెప్పుడు నీకుం బట్టువడియె. నీమీఁదివక్కువచేత

నింతదనుక నాహారంబు కసిగాట్లుగాఁ దినుచుంటిని. ఇంక నదియును మాని ప్రాణంబులు విడువనిదె ప్రయత్నపడుచున్నాను. ఆర్తత్రాణంబుత్తములకత్యంత కీర్తిప్రదంబుగాదె? అని యిట్లనేకవిధంబులుగ దుఃఖించుచు:

సీ. మగనితోఁ గూడనిమానవతీమణికిలలోన సుఖలాభ మేమిలేదు
సరసునికౌఁగిట సమ్మదమందనిపడతికి జన్మసాఫల్య మేమి
రమణుతో సౌఖ్యసామ్రాజ్యమేలనియట్టి కాంతకు లావణ్యగరిమ యేల
నాథుతో రతులనానందంబుఁ జెందని నళినాక్షి జాణతనమ్ము వమ్ము.

గీ. సరసుఁడౌ ప్రాణనాథుండు సమ్మతించి, యెంచి మోహంబునను గారవించ మించి
యుంగముత్పులిగాఁగఁ గడపనియువిద బ్రతుకు విశ్వగర్హితమగునని విందుఁగాదె.

అనితలపోయుచు నాదురవస్థం దలంచి పరితపించుచు; మగనిజాడ యెఱుంగమికి వెఱగందుచు నేను గొంతతడవు మామిడిచెట్టుకొమ్మలయందంతట వెదకుచును, గొంత కాల మాకోటరపువాకిట నిలువంబడి ప్రలపించుచును, గొంతసేపు ప్రాణనాయకుని విరహాగ్నికి సహింపలేక వెచ్చనూర్పుచును, గొంతవడియితరకీరంబులఁ గాంచి నానాయకుండని భ్రమించుచు నయ్యెడకుంజని చూచుచుఁ; గొంతసేపటికి నామనస్సునందు నేను నాయకుని నెడఁబాసి రాజపుత్రి దగ్గఱకుంబోయిన నన్నుంగాంచి కలకూజితంబెక్కడనని యడిగిన నేమి సెప్పంగలను; తనప్రాణంబులకు సమానముగఁ బెంచిన యాపంచశరునివాహనం బును గాంచనినాఁడు రాజపుత్రి నన్నుం దూఱుచుఁ దనప్రాణంబులువదలునేమొ? భర్తృ విరహశోకంబొకప్రక్క దేహంబుదహియింపనలుగుకిలోనిది మగనిఁబోఁగొట్టుకొన్న మాన హీనయని దూఱువడుచు రాజపుత్రికకు నసూయాపాత్రంబై చెలికత్తెలు సేయునిందలకుఁ గొందలంబందుచు ధరావలంబునకుంబోయి విధవనై జీవించుటకంటె నీయరణ్యమధ్యంబు నందిరుగుచుఁ బ్రాణధారణంబునకుం గించిన్మాత్రాహారంబుఁ గైకొనుచుం గొంతకాలం బున నీశరీరంబువాయుట యుత్తమముగాఁ దోఁచుచున్నయది. ఒకవేళ ధరావలంబు నకుం బోతినేని నాభర్తృవియోగవ్యథఁ గాంచి యందఱును జేరి మఱియొకకీరంబునకు నన్నుఁ గూర్తురేమొ? అట్లు నేయుదురేనియేమియుం జేయలేనుగదా? నాకుం గలకూజితంబు పయింగాక యితరంబుపై నించుకేనియు నాసజనించినదికాదు. ఎన్నివిధముల నాలో చించినను పట్టణంబునకేగుట సరికాదు అనినిశ్చయించుకొని యచ్చటనదిరుగుచు నిలు చున్నచోట నిలుకడగాఁ బండుకొన్నచోటుపడకగా నాయకుని ధ్యానించుచు బహు దినంబులు సంచరించుచుంటిని ఇట్లు చూచువారలకు దైన్యాధిదేవతవలెఁ దోఁచుచు ననేకారణ్యముల సంచరించుచుండి యొక్కనాఁడొకయరణ్యమునకుంబోయి దాని యందుం గొన్నిపండులుభుజించి క్షుధయడంచుకొని మహావ్యసనాక్రాంతనగుటచేత నా యరణ్యంబంతయుం గాంచం గుతూహలంబుఁ గొనక యాయారామమునందున్నట్టి యొక

కొండచఱియలోఁ గనంబడుచున్న గుహాముఖంబుం గాంచి యాచోటు ఏకాంతస్థలంబుగనుండునుగాన నొకింతసేపువిశ్రమించి మార్గాయాసముఁ బోఁగొట్టుకొందును అని తలంచి యాగవివాకిటి కరిగితిని. అచ్చట విషమస్థలంబున నాఁడుదియొకతె భూమి పయింబడియుండఁగాఁ గాంచి సమీపించి యాకాంత నా రాజపుత్రిక ప్రాణసఖి యగుమకరికగా నిశ్చయించి సమీపించి యాచేడియకుం గలిగినదుర్దశకు విశేషమునకు దుఃఖించుచు నక్కన్నియహస్తంబుపట్టి వ్రాలి మృతప్రాయయైయుండు నామకరిక గాఢమూర్ఛాక్రాంతయని నిశ్వాసాదులనెఱిఁగి యేమియుందోఁచక యుండుతఱి సమీపమునందు నొక కొలనికరిగి యా సరోవరజలంబులచే నాఱెక్కలు తడుపుకొని వచ్చి యాచేడియపైన నీటితుంపురులు విదిలించితిని. కొంచెము మూర్ఛదేరి యామకరిక యొక్కప్రక్కకుం బొరలిన నేను మఱియుం బూర్వోక్తప్రకారంబుగ శైత్యోపచారంబు సేయుం గనువిచ్చిచూచి యోమదనమాలా శూరబాహుఁడును జటామాలినియుం నిన్ను భూమిపై నడుగుపెట్టనిచ్చినం గందిపోదువేమోయని యతిగారాబమునం బెంచుచుండిరే? అట్టినీకిట్టికట్టిఁడిదశ సంభవించెనే. కటకటా! విధివిపర్యాసంబు నేమందు. ప్రాణసఖీ తొల్లి యొక్కత్రుటికాలంబైనను నన్ను నెడఁబాసియుండఁజాలవే? ఇప్పుడు నన్నుఁ బాసిపోవలసివచ్చెఁగదే? అక్కటా నిన్ను మదనమోహనునితోఁ జేర్చి నీసుఖంబులం జూచి సంతసించవలయునని యెన్నెన్నోమనోరథంబులు మనోరథించుచుంటిమే? అవి యన్నియుం నొక్క గడియలోపల నశించిపోయెనుగదే? అయ్యయో! శృంగారరసాధిదేవత యస్తమించిపోయినట్లయ్యెనే? కటకటా! సౌందర్యసారములసంకేతనికేతనంబు అడవిపాలై పోయెఁగదే? హా! రామణీయకనిధి రాళ్లం గలసిపోయెనుమా! యని ప్రలపించుచు మూర్ఛపోయెను. ఏనుమరల నాసరోవరజలంబులు ఱెక్కలచేఁ గొనివచ్చి పూర్వపువిధమునం జల్లితిని. మరల సేదదేరి యామకరిక కనువిచ్చిచూచి యోభగవతీమందపాలకీ నీకు రెండవప్రాణంబనందగియుండు నీమదనమాలకెట్టియాపద సంభవించెనే? హాదైవమా ఈ సుకుమారాంగిని నెట్టిబెట్టిదంపుబాధలు పెట్టితివి. ఇందున నీకైనఫలమేమిరా? అయ్యో? నీయంతనిర్ఘృణుఁడు లేఁడురా? ఓమదనమోహనుఁడా! రాజపుత్ర! నీ వెక్కడ నెవ్విధంబుగ బాములబడుచున్నావురా? నిన్నుఁదలంచినమాత్రముననె యామదనమాలచందురు నింగనుగొన్న చకోరకాంతయనువున నుప్పొంగుచుండును. రాకుమారా! ఓకలకూజితమా! ఓచతురికా! మీరెప్పుడువత్తురోయని ప్రతీక్షించుచుండి గడియ యొక్కయుగంబుగాఁ గడపుచుండెనే? మదనమాలవిషయమందు మీరలెంత క్రూరత్వముఁ జూపితిరే? పిన్ననాటనుండి ప్రాణపదంబుగ మిమ్ముం బోషించినవిషయంబైన మనసంబున నుంచుకొనకపోతిరిగదే? అని యిట్లు ప్రలపించు నామకరికతో నేను ప్రియసఖి అతిదౌర్భాగ్యశాలినినగు నన్నేల దలంచెదవు. అనిన చక్కఁగాఁ గనులెత్తిచూచి యామకరిక ఓచతురికా యని మరలమూర్ఛ

పోయెను. నేనును దానిమాటలవలన నామనంబునందు మదనమాలకు మహావిపత్తు సంభవించియున్నదని నిశ్చయించుకొని సంతసించుచు మకరికకు ననేకవిధములగు శైత్యోపచారంబులు సేయుచు బాష్పాయమానంబు లగునక్షణములతో డగ్గుత్తికపడు నెలుంగుతో నూరార్చి మూర్ఛదెలిపి కూరుచుండంబెట్టిన నామకరిక నన్నుంగాంచి వెక్కి వెక్కి యేడుచుచు మనమదనమాలగతి యిట్లయ్యెంగదా చతురికా! యని యెలుంగెత్తి పెద్దపెట్టున నేడిచెను. నేనును దానింగాంచి శోకంబుపట్టంజాలక ప్రముక్తకంఠంబుగ నేడిచి కొంతసేపటికి దుఃఖవేగంబు నణంచుకొని కొన్నివచనంబులు చెప్పి దానినూరార్చిన నామకరికయుం బైటకొంగుతోఁ గన్నులుదుడుచుకొని వెక్కుచుఁ జతురికా నిన్ను మనసమోహనుని బిలుచుకొని రానంపి యెన్నిదినంబులయ్యె? ఇన్నిదివసంబు లెచ్చోటనుంటివి? నీసహచరుడు కలకూజితం బెక్కడ అని యడిగిన నావృత్తాంతంబు నంతయుఁ జెప్పితిని. అందువలన నాయమకు శోకంబగ్గలంబై పెదవు లదరుచుఁ గన్నులఁగాలువకై బాష్పంబులు ప్రవహించుచు హృదయంబు తటతటంగొట్టుకొనుచుఁ దేహంబునఁ గంపంబువొడమం దత్తరింపఁగా నేనును మకరికతో లోకంబున గర్మపరిపాకంబున కభిముఖం బగుజంతువునకు సంప్రాప్తములగు కష్టసుఖంబుల సడ్డగించుటకు సమర్థుండుగలఁడా? ఏలయింతవంతంగుందెదవు? కొంచెమాశ్వాసమునొంది మదనమాలవృత్తాంతంబు నాకుం దెల్పుము. శోకవేగం బధికంబగునప్పుడు సమానసుఖదుఃఖులగువారికిం దెలిపిన నది విభాగించుకొనంబడినరీతిని గొంచెము సహ్యవేదనంబై యుండునుగాదె? అని చెప్పిన నామకరిక యాశ్వాసమునొంది కన్నులనీళ్లు దుడుచుకొని ఓ చతురికా మనమదనమాల వృత్తాంతంబుచెప్ప నానోరాడదే? ఏమిసేయుదునని యిట్లనియె. అప్పుడు రాజకుమారునిం బిలుచుకొని రా నిన్నంపి యా మదనమాల నీరాకపుమార్గంబుఁ గనుంగొనుచుం గొంతతడవుండి నీవు దృష్టిపథంబతిక్రమించినయనంతరము భవద్విరహంబుఁదాళలేకననుంగాంచి యోమకరికా యీచతురికను నేనేలపంపితినే? దీనిమాటలునమ్మి యారాజకుమారుండు వచ్చునటే? రాకున్నఁ జేయవలసినపనియేమి? ఆరాజకుమారునినగరం బిక్కడకతిదూరంబుగాన మాటియం నెవ్వరును బోఁజాలరుగదా? అని యిట్లనేకవిధములగు తద్విషయాలాపములం బ్రొద్దులు పుచ్చుచు;

సీ. ఎప్పుడు నాచిల్క యేకిమీనికడ కేగు? నెప్పుడుఁ దాగతుల్ జెప్పఁ బతికి
నెప్పుడు నానాథు నింపుతోఁ దోడ్తెచ్చు? నెప్పుడు బహుమతు లియ్యఁగాంచు
నెప్పుడు నాతోడ నెలమిముచ్చటలాడు? నెప్పుడు దనసాథు నేలుకొనును
ఎపుడు నా పాలయల్క లీకొని తాఁ దీర్చు? నెప్పుడు సఖియల నెచ్చరించు

గీ. నెపుడు నా చేతిపైకెక్కి నృపకుమారు, గన్నవృత్తాంతమంతయుఁ గ్రమముగాఁగ
పలుకుచును గర్జయింగళికిఁ బండువులను, సల్పు నని కోరుచుండె నాసారసాక్షి.

మఱియును.

సీ. శుకము పచ్చొడుజాడ జూపట్ట దిదిగాక మదిలోన నాచెల్మి మఱచెనొక్కొ
నృపకుమారుఁడు దాని నేర్పుమాటలఁ జూచి పలుమరు వేడి తా నిలిపెనొక్కొ
త్రోవఁ బోవుచునుండ దుష్టకిరాతుల చేఁ జిక్కి కష్టముల్ చెందెనొక్కొ
నానావిధోపవనవిలోకనోత్కంఠ భూమిపైఁ దిఱుగంగఁ బూనెనొక్కొ

గీ. కాకసుమబాణబాణనిర్ఘాతదీర్ణ, హృదయుఁడై యున్నతనభర్త యెలమి నేయం
ప్రబలనిర్బంధములఁ జిక్కి పరికిఁదక్కి, తాను సుఖవార్ధిఁ దేలంగఁదలఁచెనొక్కొ.

అని యిట్లు చింతించుచుం గొన్నిదినంబులు యుగంబులపగిదిం గడపుచుండి యొక నాఁడుదయమునఁ దనకన్యకాంతఃపురపుసౌధంబునం బై మేడమీఁది కెక్కి నాతోఁగూడ చతురికరాకం గాంక్షించుచు నలుదిక్కులుం బరికించుచుండి యాహార్యముదిగువ ననేకయోధ వీరులు మహాజవంబు లగునశ్వవరంబుల నెక్కి కవచంబులుం దొడిగి యొఱవెఱికిన కత్తులును ఖేటకంబులును ధరించి మించిన శౌర్యంబున మాయుండు నంతిపురంబు నాక్రమించుటకుం గడంగుచుండం జూచి వారల చేతికత్తులఁ దళతళలు వియత్తలంబుఁ బొత్తుగొనం గాంచి యుత్తలపడుచు నేమియో? ఈయసమయంబున నిందఱు యోధవీరులు వచ్చి కన్యాంతఃపురంబు నిరోధించుటకుం గారణంబని చింతించుచు నేమియుం దోఁచక కొంతతడవు నివ్వెఱపడి తత్తఱించుచుంటిమి. అప్పుడా రాజగృహంబున నొకచోట మహాకలకలంబు వినంబడుచుండె. మేమది వినుచు భయభ్రాంతలమై యేమి యిది యకాలంబున నిట్టియొడరు సంభవించినది! కటకటాయనుకొనుచుండ నక్కడకుం గొందఱు దాసికలువచ్చి యిట్లనిరి. ఓమదనమాలా పాంచాలదేశాధిపతి యగు జయవర్మ నీతండ్రి యగు శూరబాహు వుండు గృహంబులోనం జొచ్చి దేవీసహితుఁడై నయాతనిం జెఱవట్టి నీయన్నలగు జయచంద్ర ప్రతాపచంద్రులతో నొక గడియకాలమున క్రూరయుద్ధంబు సలిపి యేమరుపాటున యుద్ధమునం బ్రాప్తమైనందున నాయుధంబులు లేక కేవలము బాహుబలంబున ననేక యోధవీరులం జంపుచుండు నా రాజకుమారుల ననేకవిధమాయోపాయంబులం బట్టి నిగళ బద్ధులం జేసి విజయలక్ష్మీవిలాసభాసురుండై నీవుండు కన్యకాంతఃపురంబున కేగుదెంచు చున్నవాఁడు. తొల్లి పురోహితునితో నిన్నుం దనకు వివాహంబు చేసియియ్యనని నీజనకుండు చెప్పిపంపినందున నాతండు కోపగించుకొని మనపట్టణంబుపై దండెత్తుటకు నిశ్చయించి చతురంగబలసమేతుండై వచ్చి నీయన్న లగుజయచంద్రప్రతాపచంద్రుల బాహువీర్యం బునకు లికి యేమరుపాటునఁ దనమనోరథంబుఁ దీర్చుకొనందలంచి ధర్మయుద్ధంబు మాని నిద్రావిశ్రాంతజనంబై యున్న రాజవీధిం జొచ్చి యీవేళవ నగరుచుట్టుముట్టడించి కావలివారలం బట్టి వధియించి యతివేగంబున రాజగృహంబుం బ్రవేశించెను. అతర్కి తోపనతం బగునీమహాసంకటంబునం జేయునది లేక నీతండ్రి పట్టువడెను. యుద్ధసన్నా

హంబు సేయుటకనువు లేక సేనానాయకులున్నవారు. అనిచెప్పుచుండఁగాఁ గొందఱు యోధవీరులు కన్యాంతఃపురంబుం జొచ్చిరి. ఓచిలుకా అప్పుడు మాహృదయంబు లెవ్విధి వ్యాకులత నొందెనో యెట్లుచెప్పంగలను? వారలకుఁ బ్రధానుఁడగు నొకవీరుండు మాసమీపమునకుఁ జనుదెంచి సౌందర్యగాంభీర్యాదుల నిరూపించి మదనమాలను రాజపుత్రికఁగా నెఱింగి లోకోత్తరంబు లగు దానిరూపరేఖావిలాసంబులకు మదిలోన మెచ్చుకొనుచు ఓ మదనమాలా నేను పాంచాలదేశాధిపతియగు జయవర్మయను రాజకుమారుఁడను. నిన్నుం బరిణయంబు సేసికొనంగోరి వచ్చియున్నాఁడను. నిజసకుటుంబు అన్నలును నాచేఁబట్టువడిరి. ఇఁకనీవు తాహసించిన సుపయోగంబులేదు. ఈనీవాకిటంగొని తెచ్చియుంచిన చతురంతయానంబునం గూర్చుంటివేని తీక్ష్ణంవాహానసమర్థులగు కాంపులు నాయంతఃపురమునకు నిన్ను భూషణంబుగాఁ గావింతురు. ఇట్లు నీయంతటరాను సమ్మతింపవేని బలాత్కారంబుగ నైనం గొనిపోవుట నిస్సందేహంబు. వేగిరంబ మీఁదటికార్యంబు జింతించి ప్రవర్తింపుము. అనియిట్లు శృంగారవీరరసంబులు దోఁపం బలికిన మదనమాలయుం సమయంబు తప్పి వచ్చినది. ఇప్పుడితని చేతినుండి తప్పించుకొనుటకుపాయంబు లేదు. జలప్రాంత ప్రకారంబు జరుగకమానదు. ఇప్పుడిందుకు నేనొప్పనేని క్రోధంబు పెచ్చుపెఱిగి నన్ను నానావిధముల మానహాని సేయుటమాత్రమే గాక నాజననీజనకులను సహోదరులను బట్టి వధించి ననువధించును. కాన నిప్పుడితనియిష్టానుసారంబుగఁ బ్రవర్తించుట మేలు. అనిమనంబునం దలంచి రాజపుత్రియుఁ గపటవికాసంబు ముఖకమలంబునం గనుపట్ట నో రాజపుత్రా మీరు మాయింటికరుదెంచి మాయిచ్చవాతథ్యంబులు గైకొనక యిట్లుప్రవర్తించుట న్యాయమా? ఈనాదేహంబిఁక మీసొమ్ముగాని యన్యులదిగాదు. తమయిష్టానుసారంబుగఁ బ్రవర్తించి నన్నుం దోడ్కొనిపోయి పరిణయముచేసికొనవచ్చును. అభిజనరూపవయోవిలాసంబుల నీజగతీతలంబున నుండు రాజకుమారులకంటె నధికు లగుమిమ్ము వివాహంబు చేసికొనుట నావంటి కన్యలకుఁ దొలిపుట్టువునం జేసిన పున్నియంపుం బంట కాదా? అమృతరసంబుఁద్రావ నందఱు నిర్బంధించవలెనా? యని మృదుమధురోక్తులమందలించిన నా జయవర్మయుం మనమున సంతసం బందుచు నో దేవీ నీసుగుణంబులకు మెచ్చితిని. కేసరసాలాపాదులవలన నాకాతిథ్యంబు సంప్రాప్తంబయినట్లయ్యె. నామనంబు భవత్పాణిగ్రహణంబునకుం ద్వరపడుచున్నది గావ శీఘ్రంబ చతురంతయానంబు నలంకరింపుము. ఈనీచెలికత్తెలును మఱియొండు పల్లకీల నారోహించి నీవెనువెంట మననగరంబునకు రాఁగలరు. అనతిచిరకాలంబునన కాంపిల్యంబునకుం జేరనగు. అనిచెప్పిన వల్లెయని మదనమాలయుం దదుపదిష్టమార్గంబునం జని పల్లకియెక్కెను. అవ్విధముగ నాతని నిదేశమునం జేసి యేనును మఱియుం గొంద ఱనుంగుం జెలికత్తియలును బల్లకీల నెక్కితిమి. కొన్నిదినములు గడచిన నొకనాఁడు మధ్యాహ్నసమయమునకుఁ గాంపిల్యంబుఁ జేరితిమి. అచ్చటి

రాజగృహమున నుండెడుమూడిగంప్రుంగత్తెలు మమ్మునెదుర్కొని సబహుమానంబుగం
బిలుచుకొని పోయి యతిమనోహర మగుహర్మ్యంబున విడియించిరి. మదనమాలకు
సమస్తోపచారంబులు సేయ ననేకదాసీజనులు నియమింపంబడి భ్రుకుటీభటులై తదాజ్ఞా
పాలనంబు సేయుచుండిరి. అప్పుడు మదనమాల ప్రవర్తించెడి విధంబుం గాంచి నేను
నా హృదయంబున నీ కుమారిక సమయమునై మన్యంబుం దలంచి యీ పాంచాలాధిపతిం
బెండ్లియాడుటకు నిశ్చయించుకొన్నదని యెంచియుంటినిగాని మనమున మదనమోహ
నునిపైఁ బ్రబలమగు ననురాగంబు నెడబాయకుండుట యెఱుంగనైతిని. ఆకాంపిల్య నగ
రాధిపతి సకలగృహకార్యములను మందపాలికి యనునొక కాపాలికి చెప్పినచొప్పున
జరుగవలసినవియై యుండెను. ఎవరైన నాయమ యాజ్ఞ నుల్లంఘించిరేని రాజదండనంబు
సిద్ధంబై యుండును. రాజు నాయమయందు దేవతాబుద్ధిం జేసి తదాజ్ఞ జవదాటక యుండు
వాఁడుగాన నాకాపాలికి వచనంబుచే మదనమాలాపాణిగ్రహణమునకుం ద్వరపడక కొన్ని
దినములు గడపుచుండె. సఖీజనమువలన నారాజకుమారుండు మదనమాలాసంగమోత్సు
కుండై యనుభవించు వియోగవ్యథలు మాకప్పుడప్పుడుఁ దెలియవచ్చుచుండును. ఇట్లుండ
నొకనాఁడు మదనమాలకు సైరంధ్రియై యుండునట్లు లేర్పాటు చేయఁబడిన రతిమాలిని
యనునది మదనమాలతో నిట్లనియె. ఓరాజపుత్త్రి యేనీదినమున జయవర్మ దగ్గఱనుంటిని.
అప్పుడు రాజభటు లొకచిత్రపటంబుం దెచ్చి రాజు నెదుటనునిచి స్వామీ యీపటంబు
మన రాజవీధియం గల్లుయొద్ద నొకతె తనచేతం బట్టుకొని చూచుచుండి యాదృచ్ఛికముగ
నచ్చోటికేగిన మమ్ముం గాంచి తటాలున దానిం దాచుకొనఁగా మాహృదయంబున సంది
యంబుగలిగి దానిసమీపమునకుం జని యోసీ నీవు దాచుకొనియుండు వస్తువుం జూపుమని
నిర్బంధించితిమి. బహుదూరమట్లు బలాత్కరింపఁగా విధిలేక యాయాఁడుది తన స్తనాం
శుకంబునం దాచికొనియుండు నీపటంబు మాచేతి కిచ్చెను. మేము నాయతివం దోడ్కొని
వచ్చి నగరివాకిటం గావలివారియొద్ద నొప్పగించి క్రొత్తవస్తువుం గాంచితిరేని తత్క్షణంబ
రాజసముఖమునకుం గొనిరావలయును; అని మీరు చేసియుండు నేర్పాటునకు బద్ధులగు
వారుగాన నిది యిచ్చుటకుం దీసికొనివచ్చితిమి. అని మనవి సేయ రాజును వారలం గాంచి
యిప్పు డభినవవస్తుపరీక్షాధికారంబు భగవతిమందపాలకి వహియించియున్నదిగాన నామె
యొద్దకుం గొనిపోవలయును. ఇది యీరతిమాలిని చేతికిచ్చి యీపటంబుం దెచ్చిన యాఁడు
దానిం గూర్చి యాభగవతికడకుం బంపి మీమీపనులయందు జాగరూకతతోఁ బ్రవర్తిం
పుఁడు పొండనిన వారును రాజాజ్ఞ చొప్పున నాపటంబు నాచేతికిచ్చి యాయాఁడుదానిం
గూర్చి మందపాలకినుండు పర్ణశాలకుం బంపిరి. నేను నామందపాలకిసమీపమునకుం జని
యీపటంబు నామె చేతికిచ్చితిని. ఆభగవతి యాపటంబుననుండు రాజపుత్త్రుని యాకా
రంబుం గాంచి ప్రాణంబులు మరలవచ్చిన శరీరంబు చందంబున సల్లసించుచుఁ గన్నుల

నానందబాష్పంబులు నిండ నాయాఁడుదానిం బిలిచి యోసీ నీకీపటం బిప్పుడియ్యంజనదు.
కొన్ని దినములు నాయొద్దనుండునటేని యనంతరమాలోచింతము. నీకిచ్చుట నన్నపానాదు
లకు మఱేమియుం దక్కువయుండదని చెప్పిన నామె వచన మతిక్రమింప ననువులేక
యావంగనయుం దీనమానసవదనముతో నర్ధాంగీకారము చేసినయది. అంత నేను నామంద
పాలికతో నో భగవతి మదనమాలకు స్నానసమయంబు సమీపించినయది. దానికంగ
సంస్కారంబు సేయ నతిత్వరితముగ నేనక్కడ కేగవలసినదానను గాన నాకుత్తరువు దయ
సేయుమని వేడికొన నందుకామె సమ్మతించి పంపించిన నచ్చోటు వాసి వచ్చుచు సమీప
మార్గమని యీనగరమధ్యమున నుండు మహోద్యానపు నడిత్రోవన వచ్చుచు నచ్చట నొక
మామిడిచెట్టు క్రింద గూరుచుండినవాని నొక్క రాజకుమారునిం గంటిని. ఆతని రూప
రేఖావిలాసంబులు గాంచిన నావసంతుండె మూర్తిధరియించి యిట్లు పొడసూపుచున్న
వాఁడనియుం, నీశ్వరానుగ్రహంబు కలిమి నభినవమనోహరాకారంబు వడసిన మన్మథుఁడు
రతిదేవిని వెదకుకొనుచుం దిరుగుచు నిచ్చోటకుఁ జనుదెంచియున్నవాఁడనియుం, రంభకంటె
నతిసుందరాకారయగు కాంతామణిం బడయంగోరి నలకూబరుండు తపంబు సేయ నీయిల
కవతరించియున్నవాఁడేమో యని తోఁచెను. అంతకుముం దాచిత్రపటంబున
నుండు నాకారంబుఁ గాంచి యిది యనల్పశిల్పనైపుణంబున నూహించి వ్రాసినదే కాని
యిట్టి జగన్మోహన మగు నాకారంబు ఏరాజకుమారులయందుఁ గాని యేదేవతాకుమారుల
యందుఁ గాని యుండదనియే తలంచియుంటిని. ఆపురుషోత్తముని యాకారంబుఁ గాంచినది
మొదలు ఈయుత్తముని రూపంబుం జూచి యతిసమర్థుండగు శిల్పి తన సామర్థ్యమంత
యును వినియోగించియు నించించుక తదీయలావణ్యలేశంబు మాత్రమైన ననుషక్తంబు
సేయలేకపోయెనని యనుకొనుచుంటిని. అయిన నాకుమారునిరూపంబె యాచిత్రపటం
బున వ్రాయంబడియున్నదియనుట నిక్కంబు. అభినవయౌవనప్రాదుర్భావంబుం
గాంచిన నిరువదిసంవత్సరములవాఁడని తెలియుచున్నది. ఆనవయౌవనునిం గాంచి యిట్టి
యభినవమన్మథునికిం దగినరతి నెక్కడ విధి సృష్టిచేసియున్నాఁడో యని తలంచుచుం
డగా మనోరథడోలికావిహారంబు నీవొక్కతవె కొంచెము సేపు సలిపితివి. పాంచాలాధి
పతి చెట్టపట్టంబోవు నిన్ను నితరరీతిగఁ దలంపంగూడదని యెంచి యాతని శరీరలావణ్యాపం
కంబునం బడి విడి వెడలించుకొనలేక మునుంగుచుండు నామనంబున భవదీయదాస్యత్వర
చేయూఁతయయ్యె నతికష్టంబున నుద్ధరించుకొని వచ్చితిని; అని యిట్లు రతిమాలిసి చెప్పఁగా
విని మదనమాల యోసీ యితరపురుషప్రసంగంబు మనకేలయనిన నౌనౌనని యాసైరం
ధ్రియుఁ దత్కాలోచిత క్రియాకలాపంబులు జరిపించెను. ఓచతురికా యొకత్రుటికాల
మయిన నారాజనియు కలగుకాంతలు మదనమాల నేమరియుండరుగాన మేమిరువురము

మాటలాడకొన నను పడకయుండె. రతిమాలిని యీసంగతిఁ దెలిపిన దైనకొలఁదిదినం బులకుఁ బెండ్లిపనులు రాచనగరునఁ జరుగుచుండెను. ఎంతెంత త్వరగా నవి జరుగు చుండునో యంతంత త్వరగా మదనమాలకు ముఖమున వైవర్ణ్యంబును మనంబున జింతయు నంగంబున విహ్వలత్వంబును మించుచుండె. పరిజనులతో నేమియుం బలుకదు. సఖులకు సంగతులేమియుం విశదీకరింపదు. కసిగాట్టుగా నాహారంబు భుజియించు. మంచి సొమ్ము లలంకరింపదు, జిలుఁగువలువలు గట్టఁబోదు. కేవలము కరకలితకపోలతలయై చింతించి చింతించి నిట్టూరుపులు నిగుడ్చుచుండు. ఇట్లుండఁగా నాదాసీజనులు దాని విధంబు గాంచి తమపనులయం దేమైన గొఱంతయుండి యది సెప్పలేక యిట్టు లుమ్మలికంబుం జెందుచున్న దేమో యని యెంచి భయంబునొంది యొకనాఁడు నన్నడిగిరి. అందుకు నేను నీమదనమాల తనలీలాశుకము తన్నుఁ బాసిపోయి యున్నదిగాన నిట్టు పరితపించుచున్నది యంతెకాని యొండేమియు లేదని చెప్పితిని. వారలందుకు సమ్మతించిరి. ఒకనాఁడు ప్రియమున నారాజపురోహితునిభార్య యగు నొకవిప్రకాంత వచ్చి మాచేయుంగారవంబునకు సంతసించుచు నుచితాసనాసీనయై మదనమాలం గాంచి యిట్లనియె. ఓ కన్యకారత్నమా యీ దినమురాత్రి మూఁడవయామము జరుగుచుండు నప్పుడు ఈ నగరాధిపతియగు జయవర్మమహారాజు మహాబ్రాహ్మణులు నిర్ణయించి యుండు శుభలగ్నమున నిన్నుం బాణిగ్రహణంబు సేసికొనం బోవుచున్నాఁడు. నీ వీ యుదయమున మంగళస్నానంబుఁ జేసి ధవళాంబరంబులు ధరియించి మంగళసూత్ర భూషణంబు లలంకరించికొని యుపవసించుచు నీదినంబంతయుం దేవతాసన్నిధియం దుండవలయు; పట్టమహిషీపదంబునకు వచ్చునట్టికన్యకలు పరిణయదినమున నిట్టు లనుష్ఠించుట యీరాజకులాచారము; నీవు నట్లొనర్పవలయును. అని చెప్పఁగా నారాజకన్యక తన హృదయంబుననుండు దుఃఖసాగరంబు పొంగి వేలాతిక్రమణంబు సేయం బూనిన నది యడంచుకొని యా బ్రాహ్మణివాక్యంబులకు సమ్మతించిన నప్పుడు తదాజ్ఞచేతఁ బరికత్తెలు మంగళస్నానంబు సేయించి యమృతఫేనధవళంబులగు దుకూలంబులు గట్టనిచ్చి కొన్ని యాభరణంబు లలంకరించి యాకన్యకను మణిమయమగు చతురంతయానమున నెక్కించి సమీపమున నుండు మహాలక్ష్మీసన్నిధానంబునకుం గొనిపోయిరి. నేను దానితోఁ గూడం బోయితిని. పల్లకిఁ దిగి యాపల్లవపాణియు నుల్లంబున నుడుకుచు నచ్చటి కావలివారల దాసీజనుల నవ్వలనుండ నియమించి భక్తివినయంబున నాహరివల్లభకు మ్రొక్కి ప్రదక్షిణంబులు చేసి యనేకవిధంబుల నుతియించి యా యాలయంబున నుపవసించియుండెను. మేమును రమణీయములగు వివాహకథాలాపములఁ బ్రొద్దులు పుచ్చుచుంటిమి. మదనమాల యనుభవించుమనస్తాపంబులం జూచి సహించలేకయేమొ సూర్యుండును పడమటిసముద్రంబునం దూఁకె. పాంచాలాధిపతిమన్మథాగ్నిపొగలో యనందగి కటికిచీఁకటులు లోకం

బునం గలయం బర్వె. గాఢాంధకారమదదంతిదంతకుంతంబులకాంతిలతాంకురంబులనం దగి తారకలు నభంబున వెలింగెను. వికచాపాండురంబగుచు విలాసవిధురంబయి పొలుపొందు మదనమాల మొగంబుతో నిపుణమైన సరి పోలఁగలనాయని పరీక్షింపనెంచి యేమొ చందురుండు నుదయించెను. అనేకవీరభటావృతంబై యుండు నామహాత్మీమందిరంబునందు మదనమాలయు నేనునుమాత్రము దేవీసన్నిధానంబున నుంటిమి. పరిజనంబులెల్లఁ బరిణయ కార్యతత్పరతం బ్రవర్తించుచుండిరి. కన్యాజనరక్షణంబున నియుక్తలగు కొందఱు మందయానలు కొంతదూరంబున నచ్చటచ్చటం గుంపులుగూడి యాయాచరిత్రంబులు మాటలాడుకొనుచుండిరి. అప్పుడు మదనమాల నన్నుం గాంచి 'యోమకరికా పంజరంబు నందగులుకొన్న చిలుక చందంబున నేమియుం జేయ నేరకయున్న దానను; వివాహలగ్నంబును సమీపించుచున్నయది; ఈజయవర్మను బెండ్లాడ నించుకేనియుం నాకు సమ్మతి లేదు; తప్పించుకొనిపోవుటకు మార్గంబును గనంబడదు; ఇన్నిదినములుగ నీతో నీసంగతి మందలించుట కొంకించుకయైన నవకాశంబు దొరకినదికాదు. కేవలము మందభాగ్యనగు నన్నుం గన్నందున నాతల్లిదండ్రులకుఁ గష్టదశ సంప్రాప్తంబయ్యె; నన్ను వివాహంబు చేసికొనినయనంతరమునఁగాని జయవర్మ నాజననీజనకులఁ గారాగారవిముక్తులం జేయఁడని తోఁచెడిని. విషంబుఁదిని ప్రాణంబులు విడుతునా యని యన్ననో యది గొనితెచ్చి యిచ్చువారలును లేరు. కటకటా! దైవంబు నాయెడల నింత క్రూరతరంబై యుండుట నాజన్మాంతరకృతపాపఫలంబుగాదె? ఇందు కేమందు? లోకమునం గలకష్టంబులకెల్ల యునికిపట్టు లేదనియేమొ యీ మదనమాలను చతుర్ముఖుండు సృజియించె? నీవు నాకుం బరమార్థసఖివై తివేని నాప్రార్థనంబొకటి యంగీకరింపుము. ఇతరదాసీజనంబులు రాక ముందె కార్యంబున కనుకూలింపుము. నాఖేదం బపనయింపుము. ప్రియసఖీధర్మంబుఁ బాటింపుము. వేగిరంబ నామనవి యంగీకరింపుము.' అని యిట్టనేకవిధములుగ బతిమాలు కొనఁగా నేనును దానిపరితాపంబుం గాంచి మనంబున దుఃఖించుచు, 'నోమదనమాలా నీ యిష్టంబేమి' యని యడిగితిని. అప్పుడు రాజపుత్రియుఁ బ్రియసఖి యీ నా శరీరము మదనమోహనునికి మన్మథునిచే నివేదితంబై యున్నది. ఇట్టిదీని నితరవినియోగంబుం జేసి యామహాభాగునికి విప్రియంబు సేయుటకంటెఁ దత్క్షణంబున నుజ్జగించి యాతనితోఁ గల యుంటమేలు. నేను శరీరంబుం దొరంగిన నాపంచభూతములయందుఁ బృథివి యాతని మార్గసంచారభూమియందును, జలం బామోహనాంగుండు స్నానముచేయు వాపికా జలంబులందును, తేజంబు మదనమోహనునియందరంబునందును వాయు వామహాబాహుని నిశ్వాసంబులందును ఆకాశం బానవమన్మథుని మందిరాంగణమునందును గలయునట్లు లీకరుణామయి యగు దేవినింగూర్చి ప్రార్థించి ప్రాణంబులు వదలుదును. ఇందుకు నీ వొడంబడుదు వని నమ్మి నీతోఁజెప్పితిని. ఇప్పుడు నాకుమరణంబుగాని వేఱుశరణంబు

లేదు. ఇతరులు వచ్చిరేని యదియు దుర్లభంబు. ఇట్టిసమయంబునఁగదా ప్రియసఖు లుపకరింపవలసియుండు.’ అని యిట్లనేకవిధముల నాచుబుకంబుఁ బట్టికొని వేడికొనియె. ఇఁక నిన్నుఁ గౌఁగిలించుకొనుట లేదుగదా యని యాలింగనముఁ జేసికొనియె. నీమధురము లగువచనములను వినఁబోనుగదా యని మొగంబు ముద్దిడుకొనియె. ఈ మదనమాల యందుఁ బ్రీతిఁబాయకు మని కేలుకేలం గీలించె; మద్విరహంబున కోర్చుకొనుమని తన పయింటచేఁ గన్నీరు దుడిచె. నామనవిగా మదనమోహనునికిం దెల్పుమని ప్రార్థించె. నా జననీజనకులకు తీరనిదుఃఖదాయిని నైతినే యని వగచె. ఏమి నామాట కుత్తరమియ్యవే యని యూసడించుకొనియె. ఇదియే నా స్నేహధర్మ మని దూఱె. నన్ను బాములఁ బెట్టి నీకిష్టమా యని యడిగె. ఇట్టివారటే ప్రియసఖులు అని ఎసికికొనియె. నాయందుం గరుణించి తనువుఁ దొరంగనియ్యవే యని పాదంబులు పట్టుకొనియె. నేను నామదనమాల పరితాపంబుఁ గాంచి యేమియుం జెప్పలేక కేవలబాష్పాయమాననేత్రనై యంతర్గాఢం బగుశోకవేగంబు నడంచుకొనలేక పయింటకొంగున మొగంబు మూసికొని యేడుచు చుంటిఁగాని యాసలో నేమియుఁ జెప్పఁజాలకయుంటిని. మదనమాలయు నన్ను బహువిధ ముల వేడుకొనుచుండె. ఇట్లు కొంతసేపు జరుగఁగా నేను మదనమాలతో "ఓ ప్రియ సఖీ నీవు పరితపించువిధముం గాంచిన నీయభీష్టంబు నెరవేఱనియ్యకయుండుట యుక్తంబు గాదని తోఁచెడిని. నీమరణానంతర మొకనిమిషంబైన నేను జీవించియుండలేను. మన మిరువుర మొక్కటిగాఁ బ్రాణత్యాగంబుఁ జేసికొందము. ఇది నీకు సమ్మతమేని నీ యభీష్టము నెఱవేర్చుటకు నాకును సమ్మతమే" అనిన రాజపుత్రియుం గొంచెము కోప గించుకొనుచు 'ఓసీ నాయభీష్టము సమకూరదన్నమాట ప్రకారాంతరముగఁ జెప్పితివం తియుకాదటే? నేను శరీరము నుజ్జగించుట యిప్పటికి భావ్యమగుఁగాని మీకిట్టియమంగళం బేలనే? హరిహరీ! మీతో నేను చెలిమిఁ జేసినందుకు మీ ప్రాణములు వోగొట్టుటయే నా ఫలంబు? కడుపుచెడం బుట్టినందుకుఁ గన్నవారికిఁ గారాగృహప్రాప్తిఁ జేసితిని. చెలిమిఁ జేసినందుకుం జెలికత్తెలకుఁ బ్రాణపరిత్యాగంబుం జేయింపవలయునా? చాలుం జాలు. మదనమాల నీకుఁ బ్రాణసమానయగుసఖియయ్యేనేని దానిబాధలు దప్పించుట యుంచి తము.’ అని యిట్లు బహుకరుణంబుగఁ బలుకుచుండఁగా నంతిదూరంబున నొక సన్యాసి మఱియొకసర్వానవద్యాతిసుందరియగు సుందరీమణిని తనవెనువెంటం దీసికొనివచ్చుచుం డెను. అది గాంచి రాజపుత్రి మహావ్యసనాక్రాంతయై యీమదనమాల మరణనిర్యాణం బునకుం గూడ నోచుకొనలేదుగదే యనిచెప్పి 'యీయమ నూచి యేమిది యనియడిగిన నుత్తరమేమి చెప్పంగల" నని కన్నులబాష్పములు దుడుచుకొనుచుండెను. ఆ యమయుం నతిశీఘ్రముగ సమీపించి మదనమాలా యేమనీకన్నులఁ బాష్పచ్ఛన్నములైనట్లు తోఁచుచున్నవి; కపోలములయందుఁ గన్నీటిధారలు గారుటవలన మకరికాపత్రంబులు

మాసిపోయినవి; సౌభాగ్యసదనమగు నీ మొగంబు విన్నబాటుఁజెందినయది; వెగచుటం జేసి కుచతటంబు కంపంబునొందుచున్న యది; అని యడిగిన నాకాంత భయంబుతోప నేమియుఁ లేదనిన నాసన్యాసినియుఁ సమీపముననుండువారల నవ్వలికంపి యాయాల యపుఁదలుపులుమూసి వేసి నిర్జనంబగునాగుడి కలయఁజూచివచ్చి మదనమాలనుడగ్గఱి దానిచుబుకంబుంబట్టి యెత్తిముద్దిడి తొడపయింగూరుచుండంబెట్టుకొని కురులు చక్క నొత్తుచు నిట్లనియె. ఓ మదనమాలా యే నెవ్వతెనైనదియుఁ నీ వెఱుంగవుగదా? తొల్లి నీకు మదనమోహనుని చిత్రపటంబిచ్చిన మందపాలకినిగానాయేను? నీవునన్ను నిరూపించి చూడుమనిన వేమిసుపురమును చక్కఁగాఁజూచి లేచి ప్రణామంబుచేసి భగవతియనవధా నంబునవైన యపరాధంబుసైరింపుము; నిష్కారణవత్సలత నియ్యెడకు మీరలేతెంచుటం బట్టి మాకు మహాప్రమోదంబయినయది; ఈ మహాదేవియనుగ్రహంబునం జేసికాదె మీ సన్నిధానంబుమాకయ్యె; మీరలిప్పుడియ్యెడకు విజయముచేయుటకుం గతంబేమి? కల వృత్తాంతంబువినిపించి మమ్ముం గాపాడుము. అని ప్రార్థించిన నాయమ యిట్లనియె. ఓ రాజపుత్రి నేను నాతపశ్శక్తిచేత భూతభవిష్యద్వర్తమానంబులు బాగుగ నెఱుంగుదును. నేను సంసారంబుం బరిత్యజించి బాల్యము మొదలుకొని యాకలంబులుభుజించి శరీరధార ణంబుసేయుచు వీథులయందుం బడియుండు చింపిపేలికలు ధరింపుకొనుచు చంద్ర చూడచరణకమలధ్యానానందంబున నన్యంబులు మఱచియుండు హృదయంబుతోఁ దపంబుసలుపుచుండి యాపార్వతీకాంతుండు కాంతాసమేతుండై వెలసియుండు శ్రీపర్వ తాదిపుణ్యక్షేత్రంబులదర్శింపనెంచి గురుజనానుమతి వడసి పెక్కుదేశములుతిరిగి చూచు చు మదనమోహనుని సౌందర్యంబును నీరూపాతిశయంబునుగాంచి మీయిరువురసమాగ మంబు రసావహంబై యుండునని యెంచి సంసారపాశబద్ధమానసనై యారాజపుత్రుని యాకారంబుతోనొప్పు చిత్రఫలకంబుఁ గానిపించి నీకుఁ దదనురాగంబుం గల్పించి మీఁద నీకుంగలుగ ననర్థంబులు చింతించి యీకాంపిల్యనగరమునుం జేరి యీరాజచంద్రుని వశ గతునింజేసికొని యీయూరనుండువారికి నాసద్బోధువువిధంబున గురుజనమురీతిని పరమమిత్రురాలివలెను బ్రవర్తించుచున్నదానను. ఈపౌరులు నన్నడుగక యేపను లైనఁజేయఁజాలరు. గురుభక్తి నాయెడల వారుచేయుచున్నారు. అదియట్లుండ నీకాం పిల్యనగరాధిపతి జయవర్మయుఁ నాకు శిష్యప్రాయుండై తననగరునందు జరుగంగల సమస్తకార్యములు నాయనుమతిలేక చేయఁగూడదని యుత్తర్వుచేసియున్నవాఁడు. ఇచ్చట నామాటకుం బ్రతిగా నెవ్వరును నడవరు. నీకీసమయంబున ఆనుకూల్యంబు సేయుటకే యేను నీనగరంబున వసముచేయుచు వీరినివశగతులుగఁ జేసికొనియున్న దానను ఇప్పుడీకాంపిల్యనగరాధిపతి యగుజయవర్మ నిన్నుం బరిణయంబు చేసికొనం గోరి మహూర్తికులవలన నీరాత్రి మూఁడుజాములకు మంచిలగ్నంబున్నదని నిశ్చయించి

దేవతాసన్నిధానమున నుపవసించియుండు పెండ్లికూఁతు బ్రాహ్మణముత్తైదువ లగ్ని సన్నిధికిం దోడితెచ్చుట యీరాజకులాచారంబుగాన నట్టువారలచేఁ జేయింప నన్నుం బ్రార్థించి యిచ్చుటకంపియున్నవాఁడు. ముత్తైదువలును ఇంకొకగడియ కిచ్చటికి రాఁబోయెదరు. అగ్నిసన్నిధికిం గొనిపోఁబడినయనంతరము నీవు జయవర్మకు భార్య వగుటతప్పదు. ఇప్పుడిందుకొకయుక్తి చేసెద వినుము. ఇదిగో యీకాంతం జూచితివే? ఇది నీ జనకుం డగుశూరబాహువు మిగులఁ బ్రీతితో వివాహంబు జేసికొనిన యాతని మాతులునితనూజ యగుకళావతికిఁ జనియించి యతిగారాబముగాఁ బెరుఁగుచున్న మోహనవతి. ఇదియాకారముచేతను రూపముచేతను వయస్సుచేతను కళాకుశలత్వంబుచేతను నీకు సమానయైయున్నది. విశేషపరిచయముగలవారలు గాని మీయిరువురకు భేదంబుగని పట్టఁజాలరు. అనిన మదనమాలయుం లేచి యత్యాదరంబుతో మోహనవతి నాలింగనంబుం జేసికొని యాదలమూర్కొని ఓచిన్ని చెలియలా యెన్ని దినములకునిన్నుఁ గాంచితిని. అని యానందబాష్పంబుల నామోహనవతియావలఁ దడపుచు మందపాలకిం గాంచి యోభగవతీ యీచిన్నది యిక్కడ కెట్లువచ్చెనో యెఱింగింపుమని వేడికొనగా నాయమ యిట్లనియె. ఈ చిన్నదిమాత్రమే కాదు! నీప్రాణనాయకుండు మదనమోహనుండును వచ్చియున్నవాఁడు. వీరి రాకకుంగారణంబు వివరింతు వినుము. నీవు పంపించినచిలుకలు మదనమోహనుని నగరంబునకుం జని యచ్చట నతండు లేమి ననేక వనంబుల వెదకుచు నొకచోటం గనిపట్టి స్మరసందేశంబుం జెప్పిన నతఁడును మంత్రికుమారునికిం దనదూరదేశ ప్రయాణంబుసూచింప నాచిలుకల నొకింతసేపు నిలిచియుండం బనిచి తాను ముందర బయలువెడలి ధరాపంతంబుఁ జేరెను. అవి సప్తభర్త్రి యగునంగనవిధంబున నుండుట తన మనంబునకు రాఁగాఁ గొందఱవలన నీజనకునికి కాంపిల్యనగరాధిపతి చేనైన కారాగృహప్రాప్తియుం జయవర్మ నిన్నుఁ దనయంతఃపురకాంతఁగా జేసికొనుటయుం విని దుఃఖాకులుండై చేయునదిలేక యాయూరిబయటిదేవాలయంబులోఁ బరుండి కేవలము చింతాక్రాంతుండైయుండఁగా మధురిక యనునీ చెలికత్తెలలో నొకతె యాదృచ్ఛికంబుగ నచ్చటకేగి యాతనింగాంచి వృత్తాంతంబు విచారించి తెలిసికొని యిట్లనియె. ఓరాజకుమారుఁడా యేను మదనమాలకుం బ్రియసఖిని. నాపేరుమధురిక. ఆమదనమాల నున్నట్టుండి కాంపిల్యాధిపతి పట్టుకొనిపోఁగా నారాజపుత్రిక తన ప్రాణపదమగు నొకచిత్రపటంబును తద్గృహాంతరంబున నునిచియుండుటం జేసి తీసికొనిపోవనువుపడక పోయెను. ఈపటంబుం గానకయుండెనేని యారాజపుత్రిక యాహారంబునైనఁ గూడ ఆశమానును. దీనినెవ్విధినైన నాకన్నియయొద్దకుం జేర్చుట ప్రియసఖినైన నాకు ముఖ్యకర్తవ్యంబు. ఆరాకన్నియ కనుంగుం జెలియలు మోహనవతి యనుకన్యక తనజననీజనకులఁ బట్టుకొను నట్టి జయవర్మ చేతికిం జిక్కక యొకరహస్యప్రదేశమున డాగియుండి దిక్కులేక

యిప్పుడు పరితపించుచున్నయది. శూరబాహుండు రాజగృహంబును పెక్కుచోటు లాక్రమించుకొనియుండుటం జేసి యీ మోహనవతి ప్రచ్ఛన్న వేషయయి తిరుగుచున్నయది. కాంపిల్యనగరముం జేరనేని యెవ్విధమునైనను దనయక్కదగ్గఱికేగి సుఖపడును. ఆర్తసంరక్షణంబు రాజకుమారులకుం గర్తవ్యంబుగాన నిందుకు నీవొడంబడవలయునని యనేకవిధముల వేడికొనెను. అప్పు డా రాజకుమారుండును దానిం గాంచి యోమధురికా యిప్పు డా మోహనవతి యెక్కడనున్నది? ఇక్కడకుం బిలుచుకొనిరా నను నృపసూను యడిగిన నామధురిక యిదె పిలుచుకొనివత్తునని చెప్పి మాసినచీరె ధరించి యొకభిక్షుకి చందంబుననున్న కన్నియను బిలుచుకొనివచ్చి రాజకుమారునకుం జూపి యోయయ్యా యిదియె మోహనవతి; ఎవ్వరెఱుంగుదురే మోయని యీ వేషంబుతోఁ దిరుగుచున్నయది యని యవకుంఠనంబు విప్పిచూపిన నతఁడు సౌభాగ్యాధిదేవతవలె నుండు నాకన్నియం గాంచి దానిరూపరేఖాతిశయంబుల కచ్చెరువందుచు నిట్టిశుభలక్షణంబు లమరియుండు నీకన్నియకుం గూడ నీ వ్రాఁత వ్రాసియున్న వాఁడుగదా విధాతయని తలయూఁచి మధురికా నీవువేడికొనినవిధంబుగ నిమ్మిరువురను గాంపిల్యనగరంబుం జేర్చెద నని చెప్పి యానాఁడు మధ్యాహ్నమంతయు నాగుడిలోవసియించియుండి సూర్యుండస్తమింపఁగా నాయిరువురం దీసికొని నడుమ నడుమ నరణ్యంబులో నాహారనిద్రాదులుదీర్చుకొనుచుఁ గొన్నిదినములకుమున్నె యీనగరమునకుం జేరెను. నూతనచిత్రపటంబుం జేపట్టుకొని యామధురిక యంగడివీథిలోనుండఁగా రాజభటులు నాయొద్దకుం గొనితెచ్చిరి. ఆమధురిక వలన రాజకుమారునివృత్తాంతంబు విని యితరులకుఁ దెలియకుండ నతని నాపర్ణశాలయందు నునిచి యీమోహనవతినిఁ దగువిధంబులఁ గాపాడుచుంటిని. ఈమోహనవతిసంప్రాప్తికై యిన్నిదినములు రాజునకు వివాహంబు జరుగనియక విఘ్నాంతరము చేయుచుంటిని. ఇదియుం బట్టమహిషీపదంబునకుం దగినయదిగాన నీజయవర్మను వివాహము చేసికొనందగును. అతండు మీయిరువురభేదంబుఁ దెలిసికొనఁజాలఁడు. ఇప్పుడు చేటివేషంబుధరియింపంజేసి తీసికొనివచ్చియున్నదీనికి భవదీయాలంకారంబు ధరింపంజేసి వివాహవేదికకడ కంపవలయుం. ఈచేటివేషంబు ధరియించి నీ వీమధురికతోఁగూడ మదనమోహనుండువసియించు నాపర్ణశాలకేగి యాతనితోఁగూడ నీరాత్రి యీ పాంచాలదేశంబు దాటిపోవలయుం. అని చెప్పఁగా మదనమాల "భగవతి మందపాలకు నీరహస్యంబు భేదింపంబడెనేని నాచెలియలికి నశేషకష్టంబులు సంప్రాప్తంబులగునేయని నామనంబు సంతపించుచున్నయది." అని చెప్పఁగా నాయమ నేనీవిషయంబులఁ జక్కపెట్టంగలను. వేగిరంబ నీవుపొమ్ము. అనఁగా నేను నామందపాలకిసాహసంబునకు మంత్రాలోచనంబునకు నచ్చెరువందుచుం దదాజ్ఞచేత మోహనవతికిఁ బెండ్లికూఁతురివేషంబును మదనమాలకుం జేటీవేషంబు నలంకరించి యాకపటచేటికను వెంటఁబెట్టుకొని యు

యాలయంబుం దాటితిని. మధురికయుం జూకెదురువడి యాభగవతి పర్ణశాలకుం బిలుచు
కొనిపోయెను. వివాహకార్యంబులకై యనేకదాసీజను లా మందపాలకియుండుచోటికిం
రాకపోకలు సేయుచుండుటగలదుగాన మేముమువ్వరము నచ్చటికేగుట సందేహాస్పదంబు
గాకయుండుటచే రక్షకభటులు మమ్ము నడ్డగించుటకుం బ్రవర్తించరైరి. పర్ణశాల
సమీపమునకుం బోవుచుండఁగాఁ దనచేతనున్న చిత్రపటంబు మధురిక మదనమాలచేతి
కందిచ్చిన నారాజపుత్రి దానిందీసికొని "యో ప్రియసఖి యీపటంబు నాకుం బ్రాణ
పదంబని తెలిసికొని బహుదూర్వప్రయాణాయాసంబునకు వెఱవక యిది తెచ్చి నాకిచ్చిన
నీకు నేనేమియుపకారంబు సేయఁజాలుదును; నాయెడల మీకుంగల ప్రేమాతిశయం
బిట్టి మిమ్ములయించుచున్నయది. నీవు నాప్రాణములకంటెం బ్రియురాలవు" అని
యగ్గించుచు నాకుటీరంబునం బ్రవేశించి యందు గంధర్వతుల్యండై యుండు రాజకుమారు
నిం గాంచి భయసంభ్రమంబులతో వెనుకకొదిఁగి నిలిచి నన్నుం జూచి రహస్యంబుగ 'నో
మకరికా మనము స్త్రీస్వభావసులభమగునజ్ఞానముచేతఁ గార్యాకార్యములు విచారింపక
ప్రవర్తించితిమిగదే? ఈయతిగంభీరుఁడును మహానుభావప్రకృతియు నగుపురుషసత్త
ముం డెక్కడ? మన మెక్కడ? ఈతనిదాస్యమునకుంగూడ నేము తగనే? మనమా
యీతనినిచ్చుటకురప్పించెడు వారము? మహోదారస్వభావముకలవారలగు నృపకుమారులు
శరణార్థులకు దనరు సహస్తవిధములఁ బోషించుచు వారికభీష్టసిద్ధిఁ జేయుం బ్రకృతిగల
వారుగాన నీగుణహీననగు నావాక్య మాదరించి వచ్చియున్నవాఁడు. అనిచెప్పఁగా
నేను నా రాజకుమారునియంతికంబున కరిగినవినయముగఁ జేయి మోడ్చి 'యోకుమారకా
నాప్రియసఖి మదనమాల సహజప్రేమ పరవశహృదయయై విన్నవించుచున్నయది!
బహుదూరంబుగ నొకదేశమునుండి మఱియొకదేశమునకు మిమ్ము రప్పించి మీయతి
సుకుమార మగుదేహమునకు పరిశ్రమంబుఁ గలుగంజేసితి; ఈయపరాధంబు క్షమియింపం
దగును. ఇదియునుంగాక భవదాగమనంబునకు సంతసించి నాజనకుఁడును సహోదరు
లును మహోత్సవంబు నడుపుచు నెదుర్కొని నగరునకుం దోడితెచ్చునట్లు లేకపోయె
గదాయని తనహృదయంబునం బరితపించుచున్న యది.' అని సఖిచెప్పఁగా నామహాను
భావప్రకృతి యగుకుమారుండు పావనవాక్యోపన్యాసంబుల మానసపంకంబుంగడిగి
వేయునట్లు నాతో నిట్లనియె. ఓసీ మీరాజకుమారిరు మమ్మింతటిప్రేమచేఁ బిలిపించుట
వలననైనసంతోషము దూరదేశగమనాయాసంబుఁ గణింపనియ్యదు. మీర లిపుడు పరి
పూర్ణానురాగముచేఁ నాయెడకేతెంచి నన్నువిచారించుటవలన కూరబాహువు నన్నెదు
ర్కొనినంత సంతసమును గలిగె. ఇప్పుడిచ్చోట నేతత్ప్రసంగంబుల ప్రొద్దుజరిగిన
నేమేమిసంకటములు తటస్థించునో యెఱుంగము. తత్క్షణంబ యలువెడలి యీపాంచాల
దేశమును దాటిపోవలయును. మధురిక మందపాలకి యాజ్ఞాప్రతీక్షకురాలై యిచ్చ

టన యుండవలయుం. భగవతి యింతకుముంద పర్యాయత్తము చేసియుంచియున్న యుత్త
మాశ్వంబుపై నీవును మీరాజకుమారు నారోహించి యీవనమునకుం జేరువనయుండు
నరణ్యంబునం బ్రవేశించి క్రమక్రమంబుగ నీదేశము దాటవలయు ననిచెప్పఁగా నేను
నట్లుకానిమ్మని రాకుమారుండు చూపిన యశ్వంబుపై మదనమాలతోఁగూడ నారోహించి
యాతనిగుఱ్ఱంబుతో వెనువెంటనే యచ్చటిచెట్లసందున నితరులకుఁ దెలియకుండ మెల్ల
మెల్లనఁజని యడవిలోఁ బ్రవేశించితిని. ఇట్లా రాజకుమారుండును మేమును బ్రవేశించి
గుఱ్ఱంబుల నతిజవంబునం బరుగు లెత్తించిన మరునాఁ డుదయమునకుఁ బాంచాలదేశంబుఁ
దాటి నూరాయశ్వకారంబులు వాయువేగంబునం జనిచని యొకచోట సింహశార్దూలఖడ్గ
గవయ శరభాదిక్రూరమృగనిబిడంబయి యనేకవిధములగు సాలతాలకపిత్థాశ్వత్థపిచు
మందచందనతిందుక ఖర్జూరవేణునింబకదంబప్రముఖము లగువృక్షములు క్రిక్కిరిసి
యొకతెఱపిలేక సూర్యకిరణప్రసరణంబున కైన నవకాశం బియ్యని యతిభయంకరమగు
నొకగహనంబుం బ్రవేశించెను. రాజపుత్రుండును మాతో తొల్లితానుమధురికను మోహన
వతినిం బిలుచుకొని భగావంతంబునుండికదలి చక్కనిమార్గమునంజనక యీగహనంబు
నం బ్రవేశించి దీనిగుండ కాంపిల్యనగరమునకుం జేరితిని. అనిచెప్పుచుం బూర్వపరిచితము
లగు నాయాచోటులఁ జూపుచు మాత్రోవ కడ్డంబై పైకుఱికి మమ్ము హింసింపంబోవు
శార్దూలాదిమృగంబుల నతిచాతుర్యంబునం జంపి భయంబుడుపుచు, మఱియు రాజపుత్రు
లియ్యాస్థలంబుల నీయామృగంబుల నీయావిధంబుగ వేఁటాడుదు రని యాప్రకారం బభి
వర్ణించిచెప్పుచు, మాకుమార్గప్రదర్శకుండై ముందుఁబోవుచుండెను. సూర్యుండు నాకాశ
మధ్యంబుం జేరె. భూమియు నడుగిడనీయక లలాటతపంబులై యాతపంబులు బిట్టుడి
కించె. మృగకులంబులు మందలుమందలుగఁ జేరుకొని చెట్లక్రిందంబడి నెమరువెట్టుట
కుపక్రమించె. ఎండమావులు పథికులకు జలభ్రాంతిఁ గల్పించి యలయింపసాగె. పక్షి
కులంబులు చెట్లనీడలకుం జేరె. అట్టికఠోరాతపంబున కశ్వంబులు పరిశ్రాంతినొంది నడవ
లేక చిక్కిన మేమును తృషార్తులమయి జలకాంక్షచే నెక్కడనైన జలాశయంబుండు
దనుక మెల్లగ నేగవలయు నని ప్రయత్నపడుచుఁ బ్రతిచెట్టుక్రిందను బ్రతిపొదరింటను
నిలువఁబడుచు నతిప్రయాసంబుతో నరుగుచుంటిమి. అప్పుడు నల్లనిశరీరంబులును పల్ల
వెండ్రుకలును ఘోరమీసంబులును మిడిగ్రుడ్లును తడవిండ్లును గలవారు కొందఱుబోయలు
మా దారి కడ్డంబువచ్చి యిటునటుం దిరుగుచుండిరి. రాజకుమారుండు వారిం గాంచి
యోచెంచులారా యిక్కడకు నీటిపట్టు లెంతదూరంబుననున్నవియని యడిగిన వారును
సమీపమునకువచ్చి యోస్వామీ మీరు విశేషముగ దప్పిగొనియున్నారనితోఁచుచున్నది.
లోకమున ననేకులు ఎడారిత్రోవలఁ జలువపందిరులుంచి పథికులకు శీతోదకంబు
లును పానకంబులును శుంఠీ జంబీరరసాదియుక్తంబగు తక్రంబును చందనంబును

తాళవృతంబులునొసంగి మహాపుణ్యఫలంబులం బడయుచున్నవారు. అట్టివడ మేము మీకు నీటిపట్టుతెలుపలేమా? మీయనుగ్రహంబుఁబడయ నియ్యకొనమా? మీర లొంటరిగఁ బోదురేని యాచోటులుగనిపట్ట బహుకాలంబు సెల్లు. ఈమూఁడువారు ఎండకోర్వక నిశేషంబుగఁ బరితపించెదరు. ఈయశ్వంబులును శ్రాంతంబులై యున్నవి. గాన కొంచెము దవ్వులనున్న జలాశయంబుదనుక నడవలేవు. ఈగుఱ్ఱంబులను ఈకాంతలను ఇక్కడచెట్లక్రిందనిలిపి పాదచారివై నీవువత్తువేని యొకింతసేపటికి జలాశయంబుం జేరి దప్పిఁదీర్చుకొని నీరంబులుగొనిరావచ్చును. అనిచెప్పఁగా రాజకుమారుండును "ఓ బోయలారా యిట్టిమహారణ్యంబున నాఁడువారి నొంటిగవదలి రాకూడదే" యని యనఁగా వారలుసామీ యిది మేమువసియించియుండు తావు; మాయొక్క లేక యీఁగ యైన నిందుం జొరలేదు; భయపడక మీరు మాలోఁగొందఱతోఁగూడ చెఱువునొద్దకుం బొండు. కొందఱము వీరికి మీరు వచ్చునంతవఱకుఁ గావలియుండెదము. లోకమునం బరోపకారమునకుంగాని యీకాయము దోషనికాయంబు కాదాయని పల్కిన నతఁడు వారిపల్కులకు సంతసించి మమ్మునడిగి గుఱ్ఱంబులను మమ్ము నక్కడనిలిపి యాబోయలలోఁ గొందఱం బిలుచుకొని యాయరణ్యమధ్యంబున నొకత్రోవం జనియె. మేము తృషార్థల మగుటం జేసి మతిభ్రంశంబుం జెంది యాతని కొంటరిగఁబోవ ననుమతించితిమి యంతయుఁ గాని వేరు కాదు. విధివిపాకంబు త్వరచేయఁగా నెట్టి దిట్టలకయిన బుద్ధిపెడతలఁ బట్టునుగాదె? అట్లు రాజకుమారుం డరిగిన యనంతరము మేము చల్లని యొక మఱ్ఱిక్రిందం గూరుచుంటిమి. ఒకింతసేపయ్యెను. మఱియు నొకబోయ యచ్చటికివచ్చి మాకుం గావలియున్నవారినడిగి మావృత్తాంతం బెఱింగి కటకటా జలంబునకంతదూరంబు చననేల? సమీపమునన యున్నవే యని మమ్ముం దోడ్కొని పోయి సమీపస్థలంబునన జలంబులు గానిపించె. మేమిరువురము నాజలంబులు ద్రావి యాగుఱ్ఱంబులకు దప్పికఁదీర్చి తొల్లిటిస్థలంబునం గూరుచుంటిమి రాజకుమారునితోఁ బోయియున్న బోయలుకొందఱు బిట్టువాపోవుచు మాయొద్దకువచ్చి మాపాదంబులబయింబడి బాష్పజలముచేఁ భూమిందడుపుచుం బరితపింప మేమును దిగులుపడి యోబోయలారా రాజకుమారుఁ డెక్కడనున్నాఁడు? అతనివిడిచి మీరు పరువిడి వచ్చుటకుం గారణంబేమి? మీరలిట్లు దుఃఖించుట వలన మాహృదయంబులు అతనివిషయంబున ; ననేకానిష్టంబులు చింతించుచున్నయవి. అని యడిగితిమి. వారు ఓయమ్మలారా మేము చెరువుత్రోవంబట్టిపోవుచుండఁగా మామార్గమున కొకసింగం బెదురుగా వచ్చెను. ముందరుగుచున్న రాజకుమారుండు మేము వలదు వలదని చెప్పుచుండఁగా దాని నదలించెను. అదియుం క్షుధాతురంబై యున్నదిగాన నతని యదలింపునకుం గనలి మొగంబు దెఱచుకొని సటలు నిక్కించుకొని యత్యాగ్రహంబున నెగిరి ముందటికాళ్లగోళ్ల హృద

యంబున గ్రచ్చుకొనునట్లు క్రూరప్రహారంబుసలిపిన మన రాజుభూమిపయింబడియె పడునంతలో నామృగరాజంబు నాతనిశరీరమున ననేకవ్రణములు గలుగునట్లు బహుప్రకారంబుల మోదుచుండ మేమందఱమును జేరి యార్భాటంబులు కొన్ని సలుపఁగా విడిచిపోయెను. రాజకుమారుండు పూర్వమె తృషార్తుండై యుండుటచేతను సింహానఖరప్రహారంబుచేతను సొమ్మసోయి యిలపయింబడియె. మేమెంత బిలిచినం బలుకక పొరలాడుచున్నవాఁడు. శీఘ్రముగఁ బ్రాణములు వదలిపెట్టుననితోఁచి మీకీవృత్తాంతము దెలుపవచ్చితిమి. ప్రాణములుండఁగా బంధుజనంబులుచూచి కన్నీళ్లువెట్టుకొని మాటలాడలేని యది జీవముండువరకు మనశ్శల్యంబయి బాధించుచుండునని పెద్దలు వచింపదురుకాదె? యనిచెప్పఁగా మేమును పిడుగుపడ్డట్లు వినఁబడిన యామాటకు మూర్ఛవోయి యొడలు దెలిసి లేచి విలపించుచు నోయయ్యా రాజకుమారుఁడా మమ్మునిట్లు నట్టడవినిడించిపోవుట న్యాయమేనాయని వాపోవుచు మాకై నీకిట్టి యాపద సంభవించె గదాయని ప్రలపించుచు నచ్చటనుండలేక యోయయ్యలారా ఆమహాభాగుఁడు పడియుండుచోటికి మమ్ముం గొనిపొండు ; ఈయనాథలయందుఁ గనికరముంచుఁడు ; అని వేఁడికొనఁగా వారును అట్లనేకానిండు, మావెంటనె రండు. మీకుఋణానుబంధంబున్నఁ బ్రాణంబుతోనుండఁగా నాతనిం జూడఁగలరు. అందుకై కదా మేమతిత్వరితగతింబరువిడివచ్చితిమి; అనఁగా మేమును శోకవేగంబు సహింపంజాలక యారంధంబులను గుట్టింబులను మఱచి వారివెంటనంటి భూమిపైఁబడుచు లేచుచుం బోవుచుంటిమి. కొంతదూరం బఱుగునంతకు మేము ఏయేచోటులుదాటితిమో యేయేగుట్టలు మెట్టితిమొ ఏయేచెట్లు చుట్టితిమొ ఏయేమిట్టల నరిగితిమొ భూమిపైనుంటిమొ ఆకసంబున కెగరితిమొ ఏవిషయంబు నెఱుంగక కేవలము రాజపుత్రాపహృతమానసలమై బహుదూరం బరిగితిమి. సూర్యుం డస్తమించె. అప్పటికిని రాజపుత్రునిం గానక యాబోయలతో యోరీ మారాజకుమారుఁడేడీ? ఒకవేళ మందుపోయినత్రోవ తప్పిపోయెదరో? ఇంతవఱకాతండు జీవించి యుండునా యని యడిగిన వారును మమ్ముంగాంచి నవ్వి మారాజకుమారుం డిచ్చటికి సమీపమునసుండు బోయపల్లెయందున్నవాఁడు ; త్రోవతప్పకయె పిలుచుకొని పోవుచున్నారము రండు. ఈరాజపుత్రిక వేగిరంబ తనదగ్గరకురానిచో మదనబాణంబులచేతఁ బ్రాణంబులు పరిత్యజించును. అతివేగంబునం బోవుదమేని మేలుగలుగు ననిచెప్పిరి. అప్పుడు వారిమాటలకు సంశయించుచు మేము నిలువఁబడి మసల వీరువంచించి యింతదూరంబు గొనితెచ్చిరి; వీరల చేతందగులుకొంటిమి. ఇంకేమి సేయనగునని దిగులుపడుచుఁ గాళ్లుతడంబడ హృదయంబు తటతటనదర వదనంబులు శుష్కంబులై దేహంబులు వడవడవడంక నొండొరుల మొగంబులు గాంచుకొనుచుంటిమి. అప్పుడు ఆబోయలు ఓబాలామణులారా మీరు మాసంగీతంబునకు

హృదయంబు గరఁగివచ్చి మృగంబులు వలలం దగులుకొనురీతి మా నయవంచకంబులగు వచనంబులకేమరి మాచేతం జిక్కుకొంటిరి. ఇఁక దప్పించుకొన మీకుఁ దరంబుగాదు. ఇంతకుం గొన్ని దినములకు ముందు ఆరాజకుమారునితో వచ్చిన యీకన్నియంగాంచి మాయధిపతి మోహించి మమ్ముంబిలిచి యెట్టికపటోపాయంబుననైన నాతనివంచించి యామించుఁబోఁడిని నామంచంబునొద్దకుం గొనిరావలయు; రాజకుమారుండు మహా పరాక్రమశాలిగాన నతనితోఁబోరాడి మీరుగాని మీతోఁగూడిన నేనుగాని జయింప లేము; తుదకు ఆయాఁడువారుగూడ క్షత్రియకాంతలుగాన ధనుర్విద్యాభ్యాసం బునం గడిదేరినవారైయుందురు. వారియొద్దనైన నాయుధంబులుండఁగా మీరు పోఁగూడదు. వారలతో రాజపుత్రునెడవాపి వంచనమెయి నాకాంతల నిరాయుధులం జేసి పట్టుకొని తెచ్చునది అని మాకాజ్ఞఁజేసియున్నవాఁడు గాన మేమిన్నివిధముల మిమ్ము వంచించికొని తెచ్చియున్నారము. ఇదిగో యెదురనుండునని మారాజు వసియించు బోయపల్లెయని చెప్పఁగా విని మేము మనంబుల ఖేదంబు నొందుచు, శ్లో॥ అన్యథా చింతితంకార్యం దైవమన్యత్ర చింతయేత్॥ అనులోకోక్తి యప్రయోజకంబు గాదు. కాంపిల్యాధిపతికిఁ బట్టమహిషియై యుండుటకు సమ్మతించని యీమదనమాలకుం దుదకు బోయల పాలంబడి కాయంబుజెడుపుకొన వలసినట్లయ్యెఁగా ఆహా ఏమిదైవ చిత్రము! అఘటితఘటనా సమర్థుఁడగు విధికిం దుష్కరంబును గలదే? శూరబాహు వునకుం గూఁతురై పుట్టుటయెక్కడ! బోయవానిం జెట్టపట్టుట యెక్కడ! కటకటా ఏమి యీభాగ్యవైపరీత్యంబు! అనివగచుచుం జేయునదిలేక యూరకుంటిమి. ఇట్లు చింతించుచునుండు మమ్ముంగాంచి యాబోయలు ఓకాంతలార యిఁక వగచి యుంప యోగము లేదు. వంటింటిలోఁ బ్రవేశించిన కుందేళ్ళవలెనైతిరి. మారాజు దీనిపై మక్కువచేతఁ బ్రబలతరముగ నస్వస్థశరీరుండై యున్నవాఁడు. దైవము మాపాలనుండి మిమ్మును మాకు లభ్యలగునట్లొనరించి మా ప్రాణంబులు నిలిపినదయ్యెను. వేగిరంబ రండు నేను వలచియుండు కాంతామణింగొనిరాక మీరు మీ మీకాంతలం గాంచితిరేని కృతాంతుని మొగంబును గాంచఁగలరు. అని మాయేలిక యతికఠినంబుగ నాజ్ఞచేసి యుండుటంబట్టి మేము గృహంబులువదలి యన్నాదులుమాని పరిభ్రమించుచున్నా రము. మా పెండ్లాల మొగంబులు చూడ మనంబును భ్రమించుచున్నయవి. మిమ్మతని చేతికొప్పగించి యాతండిచ్చు పసదనంబులు గైకొని మాయిండ్లకేగెదము. అనిచెప్పుచు మమ్ము బహునిర్బంధపూర్వకముగఁ గొనిపోయిరి. మేమును చని శబరబాలకనిహత నానావిధశకుంతతతిప్రోతసిరామయతోరణ ఘోరగృహద్వారంబును, క్రూరసార మేయమాత్రపరిజనకిరాతనివహనిబిడంబును, నానామృగనికాయ మృతకళేబరదుర్గం ధంబు నగుబోయపల్లియం బ్రవేశించితిమి. మాతో నరుగుదెంచుచున్న చెంచులు

మమ్మునొక గుడిసెయొద్దకుంగొనిపోయి వాకిటనిలిపి యందులోనికిం బ్రవేశించి యొక ముసలివానిం గొనితెచ్చిరి. వాఁడు మమ్ముంగాంచి మించినయాశ్చర్యంబునం దన పెండ్లామును బిలిచికొనివచ్చి కూరుచుండి యోసీ వీరిని గాంచితివే? ఇట్టియతిసుకుమారులగు మనుష్యులుకూడ నున్నారుగదా. ఈ కాంత యేమందమనియొ మనవాఁడు రాజకన్యక రాజకన్యకయని తలంచుకొనుచున్నాఁడు; వీరికి దేహమున నేమైనబలమున్నదా? మనవలె నడవులయందు దూఁటి యెగిచియెగిచితఱిమి పిట్టలనుబట్టుకొనఁగలరా? ఏమేమొ బెదరిబెదరి చూచుచున్నారు; ఇసిరో, ఈనాలిలేనిబాలలుమనకేలా? కొన్ని దినములనుండి వానిమాటలువిని వీరి నతికట్టి త్రోవలుకొట్టి ధనము సంపాదించుటలు మాని, మృగంబులం బొరిగొని మాంసంబులు గడించుటలువదలి, వేఁటకుక్కలంగొని వరాహాదులం జంపనువులభ్యసించుటవిడిచి, వలలొడ్డి పులుగులంబట్టి కట్టితెచ్చుటం బరిహరించి యీపనికిమాలిన పనులకుం గడంగిరి. బళాబళా బాగుబాగు! ఓసీ మనలీ మనబిడ్డం డీపిండిబొమ్మలవలె నుండు కొమ్మలంగాంచెనేని మమ్మరంబగు మన్మథవేదనచే నిమ్ములువదలి దిమ్మపట్టినవానివిధమున వీరితోఁదిరుగుచుండు నంతియకాని నెమ్మదితో దాఁచాడవలసిన పనులుచూడఁడు. మృగహింసకుంబోక వలలొడ్డి పులుగులు పట్టుకొనంబనక కన్నములుపెట్టి ద్రవ్యంబులు దొంగిలించుట కటుగక కేవలము వీరితోనే కాలంబుగడపుచుండు. అట్లయ్యెనేని మనకులధర్మంబు చెడును. ఎన్నివిధములనైన వానికీకాంతల నందకుండంజేయుటమంచిది. ఏవ్విధముగ నీకార్యంబు సమకూర్చవలయుం అని పల్కెను. ఇంతలోన నొకబోయ యచ్చటికిరాఁగా నాముసలిబోయవాఁడు నాబిడ్డని సేమంబుఁ దెల్పుము; పోయినకార్యం బేవిధముగ ముగిసెను? అని యడుగఁగా నాకిరాతుండు సామీ మీకొడుకును మేమును బ్రయత్నించినపని చెడిపోవుటకూడగలదా? మీ ఆనతిగైకొని యిల్లువిడిచిబయలుదేరి యీకొండగవిలో నుండు చండికదేవళంబునకుం జని మేమందఱము నేలంబడిమ్రొక్కి యోతల్లీ యీసారి మాకు గొప్పధనసంచయము దొరికెనేని యప్పుడె నీకు మంచిమానిసిని బలియిచ్చెదమని వేడికొని బహుదూరం బరిగితిమి. ఆతల్లివరంబెట్టిదో తెల్పలేము. మేము యీహిమవంతంబుదగ్గఱ నుండు నొకరాజధానిని గొల్లగొట్టి యెన్నరానిధనంబులును వస్త్రంబులును మణులును దొంగిలించుకొని నిరుపద్రవంబుగా దాఁగియున్నారము. రహస్యముగ మీకీ వృత్తాంతంబుందెల్ప నన్ను తమకుమారుం డంపినవాఁడు. అనఁగా నావృద్ధబోయ బహుసంతోషపడుచు మన కింతమేలు చేసినయాతల్లికిఁ బ్రార్థన చెల్లించుటకు జాగుసేయఁగూడదు. అది నెరవేర్చనంగాని మనబిడ్డఁడు రాజోపద్రవములేక మనయుండు చోటికింజేరఁడు కాన నిప్పుడ దేవదాబలి నిర్వర్తింపంబడవలయుం, జాగుసేయక ఘూరాయిరు పురలో నిందువయస్సునా నుండెడిదానింబట్టి తీసికొనిపోయి యీకొండలరాయని

పట్టికి బలిపెట్టుదుం. మఱియొకదాని దఱుమఁగొట్టుఁడు అనియుత్తర్వు చేసెను. అంతట నేను వానిమాటలువిని మదనమాలకుఁ బ్రాణములుపోవునట్లు సంభవించిన కట్టిఁడిసేగికి ననేకవిధముల వగచుచుండ నన్నువదలి యాకిరాతులు మదనమాలంబట్టి కొని యాకొండగవియొద్దకుం గొనిపోయిరి; నేనును దానివెనువెంటం బెనురోదనంబు సేయుచు నురంబుమోదుకొనుచు భూమిపయింబడుచు లేచుచు వాపోవుచు వచ్చు టికింబోతిని. ప్రళయకాలంబునం బనునాలుగులోకంబులు నములం దెఱచికొన్న యమునినోటి దంష్ట్రలవలె నుండు పెద్దకత్తులుగొని యిరువురు కిరాతులు మదనమాలను దత్సమీపముననుండు మఱుగులో ముంచియెత్తి నన్నుంగాంచి యొకపలుకైనం బలుక నియ్యక నన్నింటకుపైన రాకూడదని నిరోధించి యాగుహాలో నుండు నాలయము లోనికిం గొనిపోయిరి. మనరాజపుత్రికిం గలిగిన యీవిధిపైపరీత్యంబుం దలంచుకొని యప్పుడు మూర్ఛపోయి భూమిపయింబడితి ఇప్పుడు నీవచనంబులచేత దేహంబుం దెలిసికొంటిని, ఓ చతురికా వింటివటే! మనమదనమాలగతి! ఏమయ్యెనో! ఆ సుకు మారాంగికిం గలిగినయతికఠినపు మరణముం జూడ నన్ను దేవుఁడు దానితో వెంటఁబెట్టు కొనివచ్చెను వింటివటే! అని యిట్లామకరిక నాకుం జెల్పిన నేను మదనమాల ప్రాణంబుల యందు నిరాశనయ్యెఁ దొల్లి జ్యోతిష్కులు ఇది మహామండలేశ్వరునిం బెట్టపట్టి యఖిల భూమండలంబు నేలుచుఁ బలికిఁ బ్రాణసమానురాలై యనేకవత్సరంబులు సుఖించు చుండును. అని చెప్పియున్నవారు గాన నొకించుక ప్రత్యాశతో నా మకరికం గాంచి యోప్రియసఖి ఇఁక మననుం చింతించుచు జేయఁగ దేమున్నయది? ఇచ్చోట నుండుట వలన నుపయోగములేదు. మెల్లమెల్లఁగఁబోయి కాంపిల్యనగరముం జేరి మోహనవతి నైనఁజూచుచుఁ గాలముఁగడపుచుందము పోదము రా అని చెప్పితిని. అందు కామకరిక సమ్మతించి అచ్చోటువాసికదలి క్రమక్రమంబుగ నాచూపునట్టి మార్గమునవచ్చుచు కాయలును పండ్లును జలంబులు నాహారంబుగాఁ గొన్నిదినములకు కాంపిల్యనగర సమీప మునకుం జేరెను. ఆనాటిరాత్రి నేను నానగరంబునం బ్రవేశింప నిచ్ఛలేనిదానఁగాన దానికిఁ దెలియకుండ నచ్చోటువిడిచికదలి తొల్లింటిపగిది ననేకస్థలములయందు సంచ రించుచున్నదానను. మారాజపుత్రికకుఁ బ్రియసమాగమంబగుదనుక నేనును బ్రహ్మ చర్య వ్రతంబు నలుపవలసినదాననై యుండుటంజేసి యితరులతో మాటలాడనొల్లను. మనోహారములగు నుద్యానవనములయందు సంచరింప సమ్మతింపను. రాజగృహముల యందు విహరింపను. ఓ రాజకీరమా నీవు నాకుఁ బ్రియసుహృత్తు వని నీతో వృత్తాం తము విన్నవించితిని. అని యిట్లాయాఁడుచిలుక పల్కుచుండఁగా మాయింటు పొద రింటికి సమీపంబున ఓ చతురికా తొల్లి యారాజపుత్రి తనకుం బ్రియసమాగమంబు కాకముంద నీకుం బ్రియసంగమమహోత్సవంబుఁ గావించునట్లు చెప్పి యిప్పుడు తానె

క్రమంబు మాని ప్రవర్తించెను. ఈ కిటుకు నీ కెఱుకపడదాయెఁగదా అని యొకపలుకు
వినంబడియె. అందు కా యాఁడుచిలుక మహాహర్షంబుతో నో రాజకీరమా యిప్పుడు
వినంబడిన వచనము నాకుం జెవులయందు సుధావర్షము గురిసినట్లయ్యెను. ఆ మదనమాల
జీవించి సుఖంబుగఁ దన యభీష్టనాయకునిం గలసినదా? శ్లో॥ అథవా భవితవ్యానాం
ద్వారాణి భవంతి సర్వత్ర, అనునట్లు శుభములుగాని యశుభములుగాని సంభవించ
వలసివచ్చినపుడు అన్నియును వానికిం ద్రోవలై యుండును. రానికాలమున
నన్నియుఁ బ్రతిబంధకములుగా నగును. ఆ మదనమాల తానెన్ని విధములఁ బ్రయత్నిం
చినను తుదకుఁ దన ప్రయత్నములు విఫలంబులై పోవుటమాత్రమే గాక ప్రాణములు
పోఁగొట్టుకోవలసి నట్లయ్యెను. జీవితనిరాశయైన యనంతరము ప్రియసంగమసౌఖ్యంబు
సమకూరె. అఖిలజంతువులకును వానివానికర్మములు ఫలములియ్యఁదలఁచియైనచో సుఖ
దుఃఖములు సంప్రాప్తము లగుచుండుటను దర్శించిచూడ నెవ్వనికిని దరంబుగాదు.
ఓ రాజకీరమా యీ వచనామృతము నా చెవులకు వర్షించినదియెవరు? దానిం దెలు
పుము; అనఁగా నేను ఓ చతురికా యీ వచనముం జెప్పినయది యా మదనమాల ప్రియ
సఖి యగు కళావతి. అని చెప్పఁగా నది యిట్లయిన నా రాజపుత్రిక యిలకు సమీప
మున నుండునట్లు తోఁచుచున్నది. లోకమునం బ్రియజనము ప్రవృత్తి దెలియక
బహుదినంబులుగడపినను కుశలవృత్తాంతమును వినినయనంతర మా యిష్టజనముం గాంచు
నంతలోపల మనం బత్యుత్సుకంబై తత్తరించుట సాధారణంబుగదా? కాన నేను నా ప్రియ
సఖిం జూడ నత్యుత్కంఠనై యున్నదానను. అది యుండుచోటుం దెలుపుము. అని
ప్రార్థింపఁగా కళావతి మరల నిట్లనియె. ఓ చతురికా నీ ప్రియసఖియగు మదనమాల
యీ పూఁబోదరింటం దన నాయకునింగూడి నీ వృత్తాంతంబు వినుచున్నయది. నీ ప్రియ
సఖుండగు కలకూజితంబును భవత్సంగమౌత్సుక్యంబుతో నీతో మాటలాడుచున్న
వాఁడు. ఇదియు నీ వెఱుంగలేకపోతివి. అనిన నా యబ్జాక్షి వచనములువిని యా చతు
రిక నన్నుం గాంచి సిగ్గుపడుచుం దటాలున నా పొదరింటిలోనికిం జని యా మదనమోహనుఁ
డును మదనమాలయు నుండుటం గాంచి సంతసించి యా రాజపుత్రిక ముంజేతిమీఁద
వ్రాలిన నా మదవతి యత్యనురాగంబుతో నో చతురికా నీకష్టంబులెల్లవింటిని; కేవ
లము తిర్యగ్జంతుసాధారణ మగు చాపలమువదలి స్నేహధర్మమును బాటించుచు సర్వ
సుఖంబులకు వెలియై యిట్టిదైన్యాకరమగు కఠినవ్రతము ననుష్ఠింప నీకుఁ దరంబుగాని యిత
రులవలనఁ గాదు. ఇందుకు నేనేమి నీకుపకారంబు సేయంగలను. అనుచుం దన
కష్టంబులం దలంచుకొనుటం జేసి పయింబయి నతిశయించు శోకంబువలనం గలిగిన
బాష్పంబులచే నా చతురిక యొడలు దడుపుచుండ నా చిలుకయుఁ బ్రియసఖి మనమిరు
వురము నెట్టెట్లో విపదంబునిధిం గడచితిమి; రాజకుమారుండును నీకు సంప్రాప్తుం

డయ్యె; ఇఁక నవియెల్లం దలంచుకొని యేల దుఃఖింపవలయు; పూర్వదుఃఖస్మరణం
బును విడిచిపెట్టుము; ఆమాయాకిరాతులచేతం జిక్కికొన్న నిన్నుం గాపాడిన వా
రెవరు! ఎట్టులా చండికాలయంబు నుండి యిచ్చటకుం జేరితివి? సంగ్రహంబుగఁ
దెల్పుమన నామదనమాల యిట్లనియె. ఓచతురికా వినుము. నన్నుఁగొనిపోయి
యాకిరాతులు చండికాసమీపమున నిలువంబెట్టిరి. ఇంతలోపలం గొందఱు క్రూరా
త్ములు భయంకరంబు లగుకత్తులుధరించి నాయిరుప్రక్కలనిలిచి యాదేవికిఁ జేతులెత్తి
ప్రణామంబులుచేసి యోతల్లీ యీపల్లవపాణి నిప్పుడు నీకుఁబలిపెట్టెదము, మాయేలిక
యేవిధమగు రాజోపద్రవంబు లేక సుఖముగ తాఁదొంగలించికొన్న ధనంబులతో
మానెలవునకుం జేరునట్లనుగ్రహింపవలయును. అని ప్రార్థించి యేకకాలంబున నా
రెండుకత్తులును బైకెత్తి ప్రహరింపంబోయిరి. ఓచతురికా యప్పుడు నేను ప్రాణ
ములు పోఁగొట్టుకొనవలసినట్లు తటస్థించిన నాదురవస్థకు సంకటపడక యాబోయ
వానిబారికింబడక తప్పించుకొనివచ్చి తన కుపకారముగాఁ జేసికొన్నదని యాజగ
న్మాతం దలంపున స్తుతియించుచుంటిని. ఇట్లు మహోద్ధతంబులుగఁ బైకెత్తంబడిన
యాకత్తులు రెండు నేకారణంబుననో చేయిజారి భూమిపై బడియె. నిరపరాధినైన
నన్నువధింప నుద్యుక్తులయిన పాపంబువలన నేమొ యాయిరువురకును గన్నులుగానం
బడవయ్యె. వారల కట్లగుటకు నేను మనంబున నింకనెన్నికష్టంబుల నన్ననుభవింపఁ
జేయుంటకో వీరి నిట్లు కన్నులుకానని వారలనుగాఁ జేసెను? దైవంబు దుఃఖదానంబున
నతినిపుణముగం బ్రవర్తించుచున్నయది. అనితలంచుచు వగచుచుండ వారలకధిపతియై
యచ్చటికివచ్చినవాఁడు నన్నుంగాంచి యీ కన్యక దేవోపహారంబున కిఁకఁబనికిరాదు;
దీనింగొని యతిరహస్యమార్గంబుగ మనయేలికకుమారుం డుండుచోటికిం గొనిపొండు;
అతఁడు దీనిపై విశేషముగ మరులుగొని యున్నవాఁడని యిరువురి కిరాతులచేతికినన్నప్ప
గించి వారలతోఁగూడ నన్నాయాలయంబువెలిచెను. నేనును నావిధిపై పరిత్యంబు
మానక మరల నాకిరాతుని బారికింబట్టిద్రోచెనేయని వగచుచుం జేయునదిలేక యా
చెంచులతోఁజనుచు నొక రహస్యస్థలంబునకుం జేరితిని. సూర్యుం డస్తమించె. నా
భాగ్యాధిదేవత ప్రత్యక్షమైనట్లు ఈకళావతి నాకుం గనంబడి యచ్చటినుండి కొని
తెచ్చె. ఇదియ నావృత్తాంతంబనినఁ జతురిక సంతసించి రాజకుమారునిం గాంచి యో
కుమారకా మీర లీ మదనమాలామంజరికలం బాసి యరణ్యమధ్యంబునం గిరాతులు చూపు
మార్గంబునం బోతిరిగదా? మీ తరువాతి వృత్తాంతంబేమయ్యె మీర లెట్టిస్థలంబునకుం
జేరితిరి. కల వృత్తాంతంబుం దెల్పి నాహృదయసంశయంబుం దీర్పుమని యడిగిన రాజ
కుమారుండును ఓచతురికా వినుమని యిట్లనియె. అట్లాకిరాతులచేఁ జూపంబడుత్రో
వను బహుదూరంబరిగి నీళ్లుగానక తృషచేఁ బ్రాణములు వెడలిపోవునట్లయిన ఓరీ

జలాశయం బిక్కడ కెంతదూరంబుననున్నది? దేహము బహుదూరంబగు శక్తిచాలక మూర్ఛిల్లునని తోఁచెడిని; అదియునుంగాక యీఁదు వారి నొంటరిగా వదలివచ్చితిని; వారును తృషార్తులయి నేనింతదనుక తమయొద్దకుం జేరమికి దుఃఖాక్రాంతత భయము నొందుదురు; వేగిరంబ జలంబులు చూపితిరేని మీకు పంచరత్నంబులు బహుమానం బుగ నర్పింతును: అని నేను వేఁడుకొనఁగా నాదుష్టాత్ములు ఓరీరాజా మాకు నీయొసంగు రత్నంబులేల? నీవుకొనివచ్చిన కామినీరత్నంబు మాయేలికకుం గావలసియుండి నిన్ను మోసంబుచేసి దానితో నెడబాపె యిచ్చటకుం గొనితెచ్చినారము. ఆకామినీ రత్నంబు మాయేలికయొద్దం జేరియుండును అని చెప్పికొనుచు నాచెట్టసుండిన మూల కొక్కురుఁడుగాఁ బరువులిడిరి. నేనును వారిమాటలువిని యయ్యో! మోసపోతిని గదాయని తలంచుచు నాకాంతామణులగలి యేమైయుండునో? యనిదుఃఖించుచు నతివేగముగం బూర్వచరిగినమార్గముగుండఁ దొలుతటిచోటికివచ్చితిని. అచ్చట మే మారోహించికొనివచ్చిన యశ్వవరంబులుమాత్రముండెను. అదిగాంచి యావామాక్షు లకుం గలిగినకిరాతులవలని మహాసంకటంబునకు వగచుచుం జేతిమీఁదుగ నీబాలా మణినిబోయలచేతి కప్పగించితినేయని వాపోవుచు నొకింతసేపచ్చట నున్మత్తుని విధం బుగందిరిగి దిక్కుగానక యిట్టి దౌర్భాగ్యశాలికి సుకుమారరూపోదారంబగు కామినీ రత్నంబుదక్కునేయని ప్రలపించుచుండి సూర్యాస్తమయమగునప్పటి కచ్చోటు వాసి యాయశ్వవరంబులలో నొకదాని నెక్కితిని. మదనమాలకుం గలిగినమహాసంకటమును దలంచుచు నొడలెఱుంగకయుంటిని గాన నాయశ్వోత్తమం బెక్కడెక్కడ కేగెనో యెఱుంగను. ఆనాఁడురాత్రి జాముప్రొద్దుపోయినసరికిం జంద్రభాగం బను నేపాళ దేశపునగరముసమీపమున నొకజలాశయంబుగట్టున నాగుఱ్ఱంబు నిలిచె. నేనును నా గుఱ్ఱంబుఁదిగి రెండవయశ్వంబును వెంబడించి వచ్చుచుండుటంజూచి యారెండిటికిని జలంబులుద్రావించి నేనును జలావగాహనంబుచేసి యంధకారంబుచేఁ గన్నులేమియుం దెలియకున్నను క్షుద్బాధకోర్వఁజాలక సమీపవృక్షములకుంజని దొరకినన్నిపండులు కోసికొని భక్షించి యాచెరువునందలి యాస్వాద్యంబులగు జలంబులు ద్రావి యచ్చటికి సమీపమున నుండునొకభైరవునిగుడికిం జేరువనఁ బఱపియుండు విశాలమగు శిలాఫల కంబుపయిం బరుండి మార్గాయాసపరిశ్రమంబును దీర్చుకొని యచ్చోటువాసి పోవ నుద్యుక్తుండనైతిని. నాకు నప్పుడు తగుసహాయం బొండుదొరికెను. అట్లు క్రమక్రమం బుగ దేశంబులంగాంచుచు నీనగరంబునకుం జేరితిని. ఇదియ నావృత్తాంతంబు అని చెప్పఁగా నాయాఁడుచిలుకవిని ప్రియసఖియగుమదనమాలం గాంచి నవ్వుచు నేనేమి యొ యడుగంబోయి సిగ్గుచేనన్నుం గ్రేఁగంటఁజూచుచునూరకున్న నాసైగయెఱింగిమదన మాల ఓచతురికా నీకు నీమగనివృత్తాంతంబు తెలిసికొనవలయునని యాశగలిగియున్నది.

సిగ్గుచేత నడుగలేకయున్నావు. కాన చెప్పెదను వినుము. నేనీ యూరికిం జేరంగానే యీ కలకూజితంబును గొన్నిదినంబులకు నాసమీపంబు జేరినయది. నేనత్యాదరంబుతో దీనింగారవించి యోరాచిలుకా మీరిద్దరును నా ప్రాణదాయకులని బిలుచుకొనిరా జేసితిని. అంతియకాని మరల మిమ్ముంగానము. నేను కాంపిల్యనగరమున నుండు నప్పుడు మదనమోహనుండు చెప్పినమాటలవలన మంత్రికుమారునికి వృత్తాంతంబు విన్న వించుటకుఁ దడసి నిలిచినంతవఱకు మీ వృత్తాంతంబు వింటిని. మీరు వచ్చి నగరము చేరకపోవుటకుం గారణం బేమి యోయోయుం గనని యడిగిన నీరాచిలుక యిట్లనియె. ఓసుదతి మాలా వినుము. మంత్రికుమారునికి వృత్తాంతంబు దెలిసివచ్చుచు నడుమ నొక యరణ్యాంబున నస్తమయమగుటచేత నచ్చటి యొక సరోవరసమీపమున నుండు తియ్యని మామిడిచెట్టు తొఱ్ఱలలోఁ జెరియొకచోటఁ బ్రత్యేకముగ నిరువురముఁ జేరుంటిమి. మఱునాఁ డుషఃకాలమున నిదురమేల్కాంచి నేను జతురికాకుశలం బరయుటకుఁ గోరి యాచెట్టుతొఱ్ఱవాకిటి కేగుదెంచి కాలభటప్రతిమానుండగు నొక కిరాతుఁడు నాయుండు వృక్షంబు నారోహించుచు సమీపమునకుం జేరుచుండఁగాఁ గాంచి యీదినము యమునిపాలంబడితినిగదా యనితలంచి యించుకయైన సవ్వడిసేయక వెనుకవెనుకగా జరిగి యాకోటరంబునంతరంబున నొకయెడ నణఁగియుంటిని. ఒకింతసేపటికి వాఁడు నాయుండుకోటరంబునొద్దకుఁ జేరి కాలపాశసమానములగు నంగుళులచే నొప్పుచుఁ గాలసర్పం బనందగిన తన యొడమ చేతిని లోనికిం జొనిపి నన్నుం బట్టుకొని వెలికిదిగిచెను. అప్పుడు చేయునదిలేక మృత్యుముఖంబునం బడినదానివలె నఱచచ్చియున్న నేను మరణభయంబుచే ఱెక్కలు టపటపఁ గొట్టుకొనుచుఁ గుండె లదరుచుండఁగా నెక్కుడుదుఃఖావేశంబునం బొగులుచుంటినిగాని నోరెత్తి యొకమాటయైనను బల్కినవాఁడనుగాను. సహచరియగు చతురికయుంగూడ నీదురవస్థ సంభవించునే మోయని దానిం బిలువనైతిని. నాకుం గలిగినదురవస్థం గాంచె నేని చతురికయుం ముస్నె ప్రాణంబులు వదలును; పట్టయిన రాజపుత్రికి మహావ్యసనంబు సంభవించును. ఇట్లు సర్వనాశం బగుసమయంబు సంప్రాప్తమాయెఁగదాయని యనుకొనుచు నూరకయుండ నన్నుం బట్టి చిక్కంబులోఁ బెట్టుకొని చెట్టుదిగి యాబోయ మఱికొన్ని పాదపంబులపైకెక్కి నావలెనె నేక విహంగమంబులం బట్టికొని తనయింటిదారిం బట్టిపోయెను. అటుపోయి యాకిరాతుండు నొక్కొక్కదానిని చిక్కంబులోనుండి వెలికీడిచి ఱెక్కలు విఱిచి యిలపయిం బెట్టుచుండె. వాని చేతికందక కొంతసేపు తప్పించుకొనియుఁ దుదకు నాదురవస్థకేనును బాత్రము కావలసివచ్చె. అట్టిసమయంబున నేను వానింగాంచి మనుష్యవచనంబుల నిట్లంటిని. ఓయన్నా యిప్పుడు నన్నుఁ దిన్నంతమాత్రమున నీయాఁకలి యడంగదు. నేనొకయుపాయంబు సెప్పెద నాప్రకారంబు నీవొనరించెదవేని మహాధనాఢ్యుఁడవై నీసుకసతీబంధుజనంబులతోడ సుఖంబనుభవింపంగలవు. "యుక్తియుక్తంబగు

గ్రాహ్యంబాలాదపిశుకాదపి." బుద్ధిమంతులు తిర్యగ్జంతువుల వచనములని యనాదరణ
చేయక యుక్తియుక్తంబులగునేని వానివచనములు పరిగ్రహింతురుగదా? అని చెప్పిన
నావచనములకు మనంబున నచ్చెరువొందుచు నాబోయ యోచిలుకా నీవు చెప్పినదేమి
యనిన నేనును ఓయన్నా నన్నుంగొనిపోయి యొక రాకన్నియకమ్ముము. ఆ కొమ్మ
వలన నీ కపరిమితధనంబులందీసియిచ్చెద. దానిలో నీవు సుఖంబున నుండంజనును. వేగి
రంబులెమ్ము. ఏదియేనొకనగరంబునకురమ్ము అనంగా నతండుసంతసించి కృతార్థ్యవహా
రుండై కొన్నిపండులుగొనితెచ్చినాకిచ్చి యవిభుజియించినయనంతరము స్వాదూదకం
బులు గొనితెచ్చిపోసినం దత్పానపరిభ్రష్టతృషావిశేషుండనైన నన్ను నొక పంజరంబున
నిడుకొని సమీపమునయుండు నొకనగరంబునకుంజని యారాజవీధినరుగుచుండంగా నంతకు
సమీపమునంబోవుకాంతలు నాసౌందర్యంబుంగాంచి యచ్చెరువందుచు నిది మనరాజ
పుత్రి చూచెనేని యీచిలుకను విలుచుకొనక మానదని యొండొరు లనుకొనుచు నాతనిం
బిలుచుకొని రాజకన్యకసమీపమునకుంబోయిరి. తన సఖీజనంబువలన నావృత్తాంతంబు
నెఱింగిన యారాజకన్యక యతికుతుకంబున నచ్చటికివచ్చి నన్నుందీసికొని నాపలుకులకు
ముదంబొందుచు నీ సకలజనవిలోభనీయంబగు సౌందర్యంబును ఈ మనోహరములగు
వచనములు సెక్షచాతుర్యం బిశరకీరములయం దెందైన లేవు; దీనిం గొనితెచ్చి
యిచ్చిన యీబోయకుం గావలసినధనములన్నియుం నాజనకునితోం జెప్పి యిప్పింపుండని
యాజ్ఞచేసిన నొకకాంత వానిం దోడ్కొనిపోయి రాజువలన నపరిమితధనంబులిప్పించి
వానిం దఱిమివేసెను.

## చంద్రసేనావృత్తాంతము

ఓ మదనమాలా యా బాలారత్నము సౌభాగ్యమేమని చెప్పంగలను.

సీ. పరిణీతకామి నాభామాశిరోమణి రతియేయనుచుంజెప్ప మతముగాదు
కమలవాసినిగామిం గాంతావతంసంబు భార్గవియేయని పలుకరాదు
భూమినుండుటచేతం గామినీతిలకంబు శచియనిశపథంబు సలుపరాదు
కచ్ఛపీయుతపాణిగామిం జంద్రానన భారతియేయని పదరరాదు.

గీ. కాని సౌందర్యలక్ష్మియం గాంతిసుషమ, భోగభాగ్యంబు వైదుషీపూర్ణతయును
రతిరమేంద్రాబ్జనేత్రిభారతులకంటె, నధిక మని చెప్పనొప్పు నయ్యబ్జముఖికి.

సీ. రంభావిభాసురరామణీయకమెల్ల తొయ్యలిరుటపుంబెందొడలయందు
హారణీప్రభామనోహరవిలాసంబెల్ల కోమలిబెళుకుంగన్గొనలయందు
హేమానుపమకాంతికామనీయకమెల్ల కలకంఠకంఠియంగకములంద
తారాసుసంగతోదారవైఖరియెల్ల కల్కిపాదాగ్రనఖంబులంద.

గీ. లలితశశిలేఖలక్ష్మిఁ ఫాలంబునంద, యామదాలసగరిమయుం యానమంద
యడఁగియుండును గాన నాయబ్జముఖికి, సాటియని చెప్పఁగూడదచ్చరలనైన.

ఆమనోహరాంగి పేరు చంద్రసేన. జనకుని పేరు దీర్ఘబాహువు. ఆదేశము కళింగదేశము. అనిక్రమక్రమముగ నెఱింగితిని. నే నాయతివచేతికి దొరకినది మొదలు నాకు మనోహరములగు ఫలంబులు భుజియింపఁజేయుటయు, శీతజలంబుల నాయొడలు గడుగుటయు మనోహరము లగు సంగకంబులదువ్వి యనేకాభరణంబు లలంకరించుటయు నిటువంటిమత్స్నేహబంధములగు కార్యములచేత నాకామామణికిఁ బ్రొద్దుప్రుంగుటయు నుదయమగుటయుం దెలియకయుండెడి. ఎల్లకాలము నామనోహరములగు వచనములకు సంతసపడుచు వినుచుండును. ఇట్లుండ నొకనాఁ డాకాంతాతిలకంబుతోఁ గన్యాంతఃపురోద్యానపాలికి యగు కపోలిక యనునది యిట్లనియె. ఓచంద్రసేనా యీకలకూజిత మనుశుకంబు దొరకినది మొదలు నీకత్యంతప్రేమపాత్రంబులై యుండునుపవనలతావితతులమఱచి యేవలనికైనఁ జూడరావు. మొదటినుండి నీవు నీప్రాణములతో సమానముగా స్వాదూదకంబులను గొజ్జఁగినీటను జెఱకురసంబులను చందనపంకంబులను తానే పెనిచిన లలిత యను వాసంతీలత నవార్తసంప్రాప్తిచేఁ బుష్పిణియయ్యె. ఇది నీకు మహోత్సవకాలంబు గావున నెఱింగించితిని. అని చెప్పఁగా నాచంద్రసేన సంతసంబంది యోకపోలికా మనలలిత పుష్పిణియయినతోడన వనభూషణ మనునశోకపాదపరాజముతోఁ గూర్చి పరిణయమహోత్సవంబుఁ జరిగింప నేను మహోత్సుకత్వమును జెందియున్నదానను. ఈ దివము సంధ్యాసమయంబున నమ్మహోత్సవంబు నిర్వర్తింపవలయు. ఇంతలోపల నాయుద్యానమునం బల్లవతోరణంబులు గట్టించి చందనోదకంబులను పవనతరువీథికానికరంబుల సువాసితంబు లొనరించి చీని చీనాంబరంబుల నిర్మించిన ధ్వజపటంబు లుద్యానపాదపంబుల పైకెత్తించి యా లలితయు వనభూషణమునుండుచోటం బూలపందిరివేయించి ముత్యాల ముగ్గులు దీర్చి సర్వమంగళవస్తువులు నచ్చటసిద్ధము చేసి యుంచవలయును. ఈనగరమున నాకుం జెలికత్తియలగు కన్నియల నమ్మహోత్సవంబునకు రమ్మనిపిలువవలయు. ఇది నీచేయుపని అని యాజ్ఞ చేసి దానినంపించెను. అది మొదలా చంద్రసేన మహోత్సాహంబున నయ్యా మహోత్సవ కార్యంబులు తానె జరిపించుచు సూర్యాస్తమయసమయము గాంక్షించుచుండెను. అప్పుడు.

క. చటులరవితురగవరఖురి, పటుఘట్టనదళితచరమపర్వతసాను
స్ఫుటధాతుధూళులసఁగా, నటఁదోఁచెను జరఠభాస్వదాతపకాంతుల్.

ఆట్టి సంధ్యాసమయమున నాచంద్రసేనయుఁ బరిజనసమానీతంబగు నందలంబు నెక్కి యనేకపరిజనంబులు గొలుపంగ చెలి నన్నుం బసతోఁ గూరుచుండఁ బెట్టుకొని యా

యుద్యానవనికరిగి దాని పురఃప్రదేశమున నొకతెం; గాషాయంబుధరియించుకొని
స్ఫటికమయమగు నక్షమాలఁ జేఁబూని నిమీలితనేత్రయై బ్రహ్మాసనంబునం గూరుచున్న
దానిం గాంచి భయసంభ్రమంబులతో నా రాజపుత్రి పల్లకిదిగి యా యోగినికి నమ
స్కరించి యో భగవతి మీరలెవ్వరో? యే దేశమునుండి యిచ్చటికేగుదెంచియున్న
వారో? ఇచ్చట నుండుటకుం గారణంబేమొ? నాయందుం దయయుంచి యానతిండని
ప్రార్థించిన నా యోగిని చంద్రసేనం గాంచి యో కన్యకామణీ యేను వసియించుచోటు
సంసారులకగమ్యమైనయది. అంతకు సమీపముననుండు నుజ్జయినియందు మహాకాలునిం
దర్శించి ఆకాశమార్గంబునం బోవుచు నీ యుద్యానవనసీమ సర్వాలంకారాలంకృతం
బై యుండుటం గాంచి వినోదంబు సూడందలంచి యిచ్చటికిం దిగితిని. ఇంతమాత్రమె
కాని నేనిక్కడనుండుటకుం గారణాంతరంబు లేదు. అనిన నా కన్యకయుం మహామోదం
బుతో నో భగవతీ జన్మాంతరకృతంబులగు పుణ్యవిశేషంబులు ఫలప్రదానోన్ముఖంబు
లౌటవలనఁ గదా మీవంటి తపస్సిద్ధులదర్శనంబు మాకుం గలుగును. మాయందుం గరు
ణించి యీ రేయి యిచ్చటనుండి మా చేయు నాతిథ్యంబుం బరిగ్రహించి మమ్ముం గృతార్థులం
జేయవలయుం. అని ప్రార్థింపఁగా నా యోగినియుం నో చంద్రసేనా నీభక్తికిఁ జాల
మెచ్చితిని; నిన్ను విడిచిపోవ నాకు మనసురాదు; అందుకనుగుణముగ నీవు ప్రార్థించు
చున్నావుగాన నిలిచెదను. అని చెప్పఁగా రాజకుమారియు సంతసముతో నా యోగినికిం
గైదండ యిచ్చుచుం బాదచారిణియై లలితావనభూషణమై యుండుచోటికిం దోడ్కొని
పోయి యచ్చట సమర్పంబడియుండు పూఁబందిరిలో నవరత్నమంటపంబయి మధ్యదేశ
మునఁ జేర్పఁబడియుండు ముక్కాలిపీటపయిం గూరుచుండం బెట్టి పాదంబులుఁ గడిగి కంద
మూలఫలంబు లాహారంబుగా నిచ్చి పూసురటీలు చేఁబూని విసరుచుండునట్లు కొందఱు
కాంతల కాజ్ఞచేసి యొకింతసేపు పాదసంవాహనాదికృత్యంబులు సలిపి తదనుజ్ఞాతయై
పరిణయమహోత్సవ కార్యంబులు ప్రవర్తింపం జేయుచుండె. వీణావేణుమృదంగాది
తూర్యవాద్యంబులు కాంతామణులు వాయించిరి. సర్వాలంకారాలంకృతంబై యా
నగరకాంతాజనంబును మహావైభవంబుతో నమ్మహోత్సవంబుం గాంచ నేగుదెంచె.
కార్యనియుక్తలగు పరిచారికలు వారి వారి నత్తదుచితస్థలంబులం గూరుచుండం బెట్టి
చందనపంకంబు దేహంబులకుఁ బూసి సుమమాల్యములు కొప్పులకుం జుట్టి యనేకవిధము
లగు ఫలములును ఇక్షుఖండంబులును దూర్వాదళంబులును మంగళాక్షతలును కానుక
లిచ్చి యుపచరించుచుండిరి. అగురు ధూపధూమంబులు దిక్కులయందంతటనిండి
ఘుమఘుమాయింపుచుండె. నానావిధాభినయచతురంబగు వారకాంతాకదంబంబు కల
కంఠకంఠనాదనిభంబు లగు కంఠధ్వనులు చెవులపండువులు సేయం బాడుచు నర్తనంబు
సలిపె. ఆటచతురలగు గొండెఱకాంతలు చాటుపద్యంబులు రచియించి తక్కున బోటులకుం

చెప్పుచుండిరి. కొందఱు పరిహాసచతురలు నానావిధహాస్యరచనా చమత్కారంబులు కనఁబఱచుచుండిరి. ఇట్లు మహోత్సవంబు ప్రవృత్తంబుకాఁగా నాచంద్రసేనయుం మనంబున సంతోషముప్పొంగం గొందఱు చెలికత్తియలతోఁగూడ నాలలితాలతను దన కరంబులంబట్టి యెత్తి వనభూషణపుశాఖాహస్తంబులం జేర్చి యాయశోకంబుంగాంచి యిట్లనియె.

సీ. ఎండకన్నెఱుఁగక యుండఁగాఁ బెంచిన లేనుతీవె యీమానసీయ
గాలిపైసోకిన కంపంబునొందుచు సుడివడు మిగుల నీసుందరాంగి
హితసరసోష్ణు యిలి:బ్రాకతుండిన వ్రాలఁను భూమి నీవర్ణనీయ
సహవాసచతురలు జాగ్రతపడకున్న లోన వాడుచుచుండు లోకవినుత.
గీ. దీని శాఖాకరంబుల దిద్ది పట్టి, యంగుళీపల్లవంబుల నప్పళించి
యేలుకొనుచుండు మెవ్వేళ లీలమెఱయ, పుష్పిణిని రక్తపల్లవభోగరతుల.

అని యిట్లు చెప్పఁగా దానిరసవ్యంగ్య మనోహారము లగువచనములకు నచ్చట నుండు వారలెల్ల సంతసించి యాచంద్రసేనం బొగడిరి. ఇట్లు లలితాంగనభూషణములకుం బరిణయ మహోత్సవంబు నిర్వర్తింపంబడియె. ఆ చిత్రం బేమని వర్ణింపగలను. అది యదృష్టశ్రుతచరము ఆచంద్రసేన తనచేతంబట్టి యాలలితయను మాలతీలతను ఆశోక వృక్షమునయుం బెట్టగానే యాలత యొకకాంతా తిలకంబయి నిలిచెను. అప్పుడు

సీ. కులుకుమిటారంపు గుబ్బచన్నులదాని కొమరొప్పునలముంగురులదాని
ఎలరారుచేరెడంతేసి కన్నులదాని ముద్దులుగుల్కు నెమ్మోముదాని
నంసనతంబులై యమరుబాహులదాని తోరంపురుటపుఁ బెందొడలదాని
నూనూఁగునూఁగారు జానుమీఱెడుదాని నకనకలాడు లేనడుముదాని
గీ. కంబుసుందర మంగళగళముదాని, సల్లలితనవ్యమందహాసంబుదాని
జూచియాశ్చర్యమగ్నలై సుదతులెల్ల, బాలతిలావణ్యగరిమంబుఁ బొగడిరంత.
ఉ. భూరుహరాజ మప్పు డలపొల్తుక లచ్చెరువందిచూడఁగా
మారసమాన విగ్రహరమాధరుఁడైన విలాసియై మహో
దారత నావిలాసవతిఁ దాఁకి కరాబ్జము పట్టి నిల్చెనా
చారునితుంజమధ్యమునఁ జానను గూడినకంతుకై వడిన్.

అప్పుడు వారలంగని యచ్చెరువునొంది కన్నియలుగావునఁ బరపురుషసన్నిధిం గలుగు లజ్జాభయంబులచేఁ దొట్రుపడుచు నచ్చోటువాసిచన నుద్యోగించుచుండ నా సన్యాసిని వారలం గాంచి యోకన్నియలారా మీరలీదంపతుల నిప్పుడు విడనాడిపోవుట యుక్తంబుకాదు. మీరుచేసిన మహోత్సవంబునకు మనంబునలరి వసంతుండును వనదే

తరయం నిట్లు ప్రత్యక్షమయిరని తోచెడిని; ఉత్సవంబును బూర్ణంబు సేయుండు. అని చెప్పిన నొక్క తెరయైన వారల సమీపమునకుం బోవనొల్లక యుండ నంతలో నాకసంబున నుండి యతివేగమున.

సీ. సురపారిజాత విస్ఫుటవాసన ల్గుభాళించుకీల్జడలతో మించువారు
అనిమేషచంచలాయత సుందరము లైనగొప్పకన్నులతోడ నొప్పువారు
భూస్థలినంటక పొలుపారు మృదుపాదపద్మతలంబులఁ బరగువారు
స్వేదాది సంయుక్తిఁజెందని క్రొమ్మించు మించు దేహముల దీపించువారు.

గీ. సారసౌందర్య చారుసంచారఘూను, లభినవోద్భూత యౌవన ప్రభపుభగ
లమృతకరరేఖలను దీటులైనవారు, లచ్చరలు నేనవేలుగావచ్చి రటకు.

అట్లు వచ్చిన యచ్చరమచ్చకంటులంగని యిదియేమి విచిత్రంబోయని యొక రితో నొకరనుకొనుచు నాశ్చర్యరసమగ్నమానసలై చూచుచుండ నావేలుపుంబువ్వ బోడులు.

సీ. కమనీయమణిదర్పణములు గైకొని కొంద రెదురుగా నిల్చిరి యిందుముఖులు
పల్లవోశీర సంభావితవ్యజనాళిఁ గొందఱు వీచిరి మందయాన
లభినవపారిజాతాది మాల్యంబులు కొప్పులఁ దుఱిమిరి కొంద ఱబల
లనుపమ నవరత్నహారముల్ కైసేసి రం దణుమధ్యలు కొంద ఱెలమి.

గీ. కొంద ఱతివలు బూసిరి చందనంబు, కొర్కెఁ బన్నీరు జల్లిరి కొంద ఱందుఁ
గొంద ఱింతులు సుందరీ సుందరులకు, సలిపి రప్పుడు లలితోపచారవిధులు.

అది యెట్లనిన !

గీ. నవ్యమణిమయ సింహాసనంబు మీఁద, నిందువదనను వేడుక సుందరాంగు
నెదురెదురుగాఁగఁ గూర్చుండ నేర్పఱిచి మ,హాముదంబున బలసియాయతివలెల్ల.

శృంగారములగు పూఁబంతులును చందన పంకంబు నిండియుండు వజ్రంపుగిన్నియలు, నడపంబులును, కపురంపుఁబరిణెలును, పటవాసిపెట్టెలును, అత్తరువు కుప్పెలును, జవ్వాజి కడ్డీలును, మొదలగు మంగళ వస్తువుల నాదంపతుల నడుమునునిచి యందుం గొందఱు చతురలగు కాంతలు మొగంబులం జిఱునగవంకురింప నాసరసునిం గాంచి యిట్లనిరి.

సీ. మదిరాక్షి కుచకుంభమంజరు లనియెంచి యందు యీపూబంతులాడుమయ్యా
ఇందు బింబంబునఁ గం దందమైనట్లు దిలకంబు మొగమున దిద్దుమయ్యా
చందనగంధి యీసారసాక్షి యనంగ గంధంబు మేన నలంధుమయ్యా
చవిఁగన నీయింత చాలునో చాలదో సమ్మతి వీడె మొసంగుమయ్యా

గీ. పాటలాధరవిరహతాపం బడంగ, జ్జ్వలైమించుపన్నీరు జల్లుమయ్యె
నీదుశ్రేటుఁ గుసుమాళనేర నవుచు, సుదతికిఁజ్జిడకును ఖాలు సుట్టుఁజయ్యెఁ

అనుచుం గందంబు మొదలగునవియందిచ్చుచు నతనినిర్బంధింప నావలఁ దాఁడుఁ గించిల్లజ్జాభాసురముఖారవిందుండై యట్లు చేయఁట కొల్లకయుండుటం గాంచి మఱి యొకతె కించిదంకురితమందహాసంబులో నిట్లనియె.

సీ. పూఁబంతులంటఁ గాఁబోలదు బాలరో విరహులనేచెడిమరుశరములు
ఇందుబింబంబునఁ గందులేకుండిన నందంబు గాదటే చంచయాన
సుమగంధి యుటులఁ గ్రమముతోఁ జదువదే చందనంబలఁదినఁ జంద్రవదన
సంకల్పరతములఁ జవిఁజూచియున్నది శంకయేలనే నీకు సారసాక్షి
గీ. రతిపరిశ్రమజస్వేదరసముచందు, తడియకుండిన నడఁగునే తాపభరము
కీలుజడవ్రేటులకు నోర్వఁ గృతియె యితఁడు, వలదువలదిప్పుడితని కీచట్టిపనులు
అనిన నందు మఱియొక్కతె యిట్లనియె.

సీ. పడఁతిచన్బంతులుబట్టఁగోరెడివాఁడు పూఁబంతులంటునే పువ్వుఁబోణి
వలరాచపనులందు వనితదిద్దెడువాఁడు తిలకంబు సూటిగాఁ దిద్దలేఁడె
కుచకోరకంబులఁ గోరిగందములంద నేకాంతమే యిది యిగురుబోఁడి
వీడియంపుంజవి వెలదుక కేలనే సునుమోవిచవిఁజూపుఘనుఁడె వీఁడు
గీ. వాక్సుధాపూరమునఁ దాపవహ్నినడఁచు, వాఁడు పన్నీరుజల్లునే వనితపైన
నబలజడవ్రేటులకు నోర్వనపుడితండు, వనితపాదాబ్జములమైన వ్రాలలేఁడె.

అని సపరిహాసంబుగాఁ బల్కఁగాఁ నందుఁ జెరమందయాన యొక్కతె యక్కలకలింగాంచి చతురత్వంబున నిట్లనియె. ఓసీ! సీప్ర చెప్పినది యొప్పదు. ఏలనన

సీ. చనుబంతులనుబట్టి ననువునేర్చెడివాఁడు విరిబంతులనుబట్టి విడువవలదె
ఏణాంకముఖిఁజూడ నెలమిఁగల్గినవాఁడు కులుకులాడి కిడండె తిలకరేఖ
చేడెన మబల కలందఁడే నెటులోర్చు చందనాచలవాయుసాహసంబు
కామదేవుని భక్తిఁ గనఁబూనెడివేళ తాంబూలమొసగక తప్పునటవె
గీ. సకియమీఁదను బన్నీరు చల్లకున్న, విధుమికిరణంబు లేక వీని వేచవటవె
బాలకీజ్జెడవ్రేటులఁ బడలకున్న, కామదేవునిమన్నన గల్గునటవె.

అని యిట్లాయచ్చరలు పరిహాసచతురంబుగా నాదంపతులం బల్కుటలువి చంద్రసేనాప్రముఖలగుకుమారికలు మనంబున నలరుచు చూచుచుండు నెడ;

సీ. తనదేహకాంతి చెంతలనుండువారిని దత్తహాటకవిభాధరులఁ జేయ
తనవాలుగన్నులధావళ్యంబులు జగమెల్ల క్షీరసంద్రముగఁ జేయ
తనమందహాసకాంతశ్రీలు సవిధోర్వి చంద్రకాంతస్థలీసమితిఁ జేయ
తనవాక్సుధారలు విను వారిచెవుల కానందంబు సృష్టిసేయ
గీ. కనకనూపురములు ఘల్లుఘల్లనఁగ, సరసకాంద్రను మది ఝల్లుఝల్లనంట.
చెలియ కీసీటు చెల్లును జెల్లుననఁగ, రంభ వచ్చెను నాట్యసంరంభయగుచు.

ఇట్లువచ్చినయారంభ వెనువెంటనె మృదంగతాళవేణువీణాదివాద్యవిశేషంబులతో.

చ. అభినవమన్మథాకృతు లహస్కరతేజులు పద్మపత్రస
న్నిభనయనద్వయుల్ కనకనిర్మితచేలులు దివ్యమాల్యసౌ
రభవిభవాధివాసితధరాతలదిగ్వలయాంతరిక్షులున్
శుభు లగుదేవగాయకులు సొంపెలరారఁగ వచ్చి రంతటన్.

వారలంగాంచి యాచంద్రసేన తనతోనుండెడు కుమారికామణులతో లేచి యీపురుషులసన్నిధానంబున నుండంగూడదని ప్రియసఖులతో నచుకొనుచు నావనము దాటి పోవ నుద్యుక్తయయిన నాకన్యారత్నంబుంగాంచి సన్యాసిని యిట్లనియె.

చ. తమతమబావ మామయును తక్కినవారలఁ బాసి యుండఁగా
రమణులు వారిసన్నిధికి రాఁజనదందురు గాని కామినుల్
సుమహితమంగళోత్సవవిశోభితకాలమునందు నిందరీ
క్రమమున నుండ గాయకనికాయము గానము సేయఁ జూడరే.

చ. ద్విజవరసన్నిధానమున దేవతపస్విగురుస్వబంధువుల్
విజయము చేసియున్నయెడ వేడుక గాయక గాయకాంగనల్
నిజపరిచారికల్ భటులు నిండినచోటుల రాణివాసముల్
స్వజనముతోడ నుండుటలు సాజము నింద్యము గాదు దేరికిన్.

కాన యిప్పుడు మంగళసమయమున బాడవచ్చినగాయకమాత్రులకై నీవు తొలఁగి పోనక్కరలేదు. ఇప్పుడీక్రొత్తగావచ్చిన యచ్చరకాంతలనాట్యంబు వీక్షించి యభ్యంతరంబున కేగవలయు. అనిచెప్పఁగా చంద్రసేనాప్రభృతులును గూరుచుండిరి. ఇంతలోపల నారంభోరువును.

క. మురజంబులు వాయించుచు, సురగాయకసమితి వాడ సుస్వనములతో
మెరుగజ్జెలగుత్తమువలె, నరవిందదళాక్షి నాట్యమాడం దొడంగెన్.

సీ. కంబుసౌందర్యమంగళమైనగళమునఁ జిలిబిలిపాట ముద్దులు గటింప
పల్లవతల్లజపరిభావిహస్తము లర్థజాతంబుల నభినయింప.

ఖంజనచయకాంతిభంజనం బగుకన్నుఁగవను భావంబులు గ్రాలుచుండ
కల్హారకమనీయకాంతిరంజితము శ్రీపదములు తాళానుబంధ మెనయ.

గీ. తాళములుదీర్చుచోఁ దనంతటనెకదలు । వజ్రతాటంకకాంతులు వరలి చెక్కు-
టద్దములఁ దోఁచి తద్దయు ముద్దుగుల్కు । మోవ మిసురెత్త నాడె సమ్ముద్దుగుమ్మ.

వ. అట్టిసమయంబున,

చ. కనకమయంపుఁగుడ్యములు గారుడరత్నకవాటకోటులున్
దినమణితుల్య వజ్రమణిదీపితచత్వరముల్ విచిత్రకే
తనములు సత్ప్రవాళములస్తంభములుం గలదివ్యవైభవో
న్నతసుసౌధమై వెలిగెఁ బందిరి యంతయు విస్మయంబుగన్.

ఉ. అందొకచోటఁ గేళిగృహ మప్పెరుపై శుకసారికావళుల్
క్రందుకఁ బల్కుచుండునని గన్పడె మంచము నిల్వుటద్దముల్
గందపుఁగిన్నె పూసురటి కమ్మనిగారపుజాలవల్లికల్
క్రొందళుకుంబసిండితబుకు ల్వెలుగొందుచుఁ డెనచ్చటన్.

మఱియు నందు భోగోపకరణంబులనేకంబులు నిండియుండుటం గాంచి చంద్రసేన మొదలగువార లాశ్చర్యమగ్నమానసలై యుండ నాయచ్చర లాదంపతులం బడకటింటి కంపుఁ బ్రయత్నంబులతో వారల నచ్చోటనుండిలేచిన లజ్జాకులితయై యుందుం జొరఁబోక యీడిగిలంబడుచు సఖియలమరుఁగననిలిచి ముందరికడుగులిడనితలుకులాఁడిం గొందఱు మందయానలు బోదివి సరసాలాపంబుల నిట్లనిరి.

సీ. తమిఁగొద్దిబిగువుగుత్తపుగుబ్బ లదిమినఁ బగులునో యని భయపడియెదొక్కొ
మోహంబుఁగోలఁది లేమోవినొక్కిన తేనియలు గారిపోనని తలఁచెదొక్కొ
వలపుఁగొద్దిగ రతివ్యాయామమున నమించి వలపు మైదీఁగె నంచులుకెదొక్కొ
బాళిమైఁగళలంటి పలుమరు సొలయించి యలయించు నని వెఱపందెదొక్కొ

గీ. సహజలజ్జాసఖీమణి సరసనుండ, నెట్లు పతిఁగూడనానని యెంచెదొక్కొ
గానిచోఁ బ్రాణనాథునికడకుఁబోక, యిచటఁ దలపంచుకొనియుండ దేలబాల.

అనిన నందు మఱియొకతె వచ్చి యాబాలికామణిని సందిటం బట్టికొని యోగోలా యేలనే యిట్టిభయము? నీ ప్రాణనాయకుని కేను కొన్నిహితంబులుపల్కి నీ కీజంకు వదలించెదను రమ్ము అని చెప్పుచు వెనుక కీడిగిలంబడు నాయింతిని మెల్లన నవ్వుతోఁ దిగిచికొనిపోయి యాసుందరాంగుని సరస నిలువం బెట్టి యిట్లనియె.

సీ. తాఁకినగందునీతన్వితనూలత వలపుతోఁ గౌఁగిళ్ల నలమఁబోకు
మీఁటినవిచ్చునీబోటికుచంబులు గట్టిగాఁ గరముల బట్టఁబోకు

తేనెలొల్కెడుదీనివాతెఱయఁగదుః చెంపతోఁ బలునొక్కు లుంపఁబోకు
పాలుగారెడుదీనిబంగారుఁజెక్కిళ్ల పలుమాఱు ముద్దులఁ గలపఁబోకు

గీ. యౌవనము నిండి నవబోడి పూవుములికి, దొరకటారితెఱంగునఁ దోఁచుదనుక
కుసుమసుకుమారదేహను గూడి గాఢ, రతుల గాసిలఁజేయంగరాదువినుము.

అనిచెప్పి యాచెలువకేలుపట్టి యాతనిహస్తంబునఁబెట్టి యందఱు నచ్చోటు వాసి వెలికివచ్చిరి. ఇంతలో నొకప్రక్కనుండి మహాగవ యొకటి మూపునఁధరియించి యతిభయంకరంబులగు దీర్ఘదంష్ట్రలకాంతులు మేదఃపంకసంకలితంబులై యుండు నురంబున నొలయ నొకమహాకాయుం డగురక్కసుఁడు సనుదెంచి యాకేళీగృహ ప్రాంతంబున నున్న కన్నియలు తన్నుఁజూచి భయసంభ్రమాక్రాంతలై చెవర నతి రయంబున నాదంపతులుండు చోటుసొచ్చి పచ్చవిలుకానిములికియనందగునట్టి యామచ్చకంటిని బట్టుకొని యిట్టట్టు గదలనీయక తనయంకతలంబున నిడుకొని.

సీ. విరిజాజిపూసరుల్ వీడియల్లలనాడ మగువకొప్పొకచేతఁ బిగియఁబట్టి
తళుకుఁజెక్కులను బత్త్రములు మాయగ వేగ మోముమోమునఁ జేర్చిముద్దుబెట్టి
గాఢనఖక్షతాక్రాంతమై సొగసేదఁజిన్నారిచనుగవ చిక్కఁబట్టి
యార్ద్రదంతక్షతు లంతట గలయంగ నునుమోవి మొనపండ్ల నొక్కిపట్టి

గీ. ఆసదులేఁగౌను నులియంగ నానిపట్టి, ప్రీతి నూరుద్వయంబును బెనఁగఁబట్టి
కంపమందంగ నంగంబుఁ గౌఁగిలించి, రక్కసుం డాకృశాంగిని రతికిఁ దిగియ.

క. బలుమార్జారముచేతం, జెలువరఁగాఁ దగులుకొన్న చిలుక తెఱఁగునన్
కలకంఠి చేయునదిలే, కలయుచు వెతగూరుచుండె నందఱుసూడన్.

అట్టిసమయంబున నాసుందరుండును మహాక్రోధంబుతోలేచి ఖడ్గంబొరవెరికి యారక్కసుండగ్గఱి యోరీరాక్షసాధమా యిదెనిన్ను నీ కన్నియకుం బ్రీతిగా మన్ను పడంతికిఁ బలివెట్టెదఁ జూడుమని బాహువుపైకెత్తి ప్రహరింపంబోవుఁడు నాకసంబున నీరక్కసునిఁ జంపవలదు చంపవలదని యొకమాటవినంబడియె. ఆ శబ్దంబువినంబడు దిక్కున కెల్లవారును జూచుచుండ మహాఘోరరూపిణి యగునొకరాక్షసి యాచోటికి వచ్చి తొల్లివచ్చియున్న యారాక్షసుని జుట్టుపట్టుకొని వంగదీసి వీఁపున బిడిగ్రుద్దులు గ్రుద్దుచు నోరీ నీకెప్పుడు నిట్టి దుర్బుద్ధియేకదా? నన్నుంగాక యన్యకాంతంజూడవల దని నేఁజెప్పియుండలేదా. నాకెఱుక పడకుండ యెప్పుడు తప్పించుకొని యిచ్చటకేగు దెంచితివో. పోపో! అనిత్రోసిన నారక్కసుఁడు భూమిపయిఁదుల్లి బుడిబుడినల్లఁ గ్రక్కుచుఁ డిల్లపడి గిఱగిఱందిరిగి ప్రాణంబులు విడిచెను. అదిగని యారాక్షసకాంత బాహువులెత్తి మొత్తుకొనుచు అయ్యో నామగఁడు మరణంబునందె; ఇఁక నేమి

చేతును. మగఁడులేక యొకనిమిషంబైన భూమిపయి నుండఁగూడదు. ఈ మ్రుక్కిడి
రక్కసుండుచచ్చిన నేమి? ఈచోట నుండు చక్కనిసామిం దగులుకొని దర్పకబాధఁ
దొలఁగించుకొనియెదనని యాకుమారు నెత్తుకొని యాకాశమార్గంబునకుం జనియె. అది
గాంచి యాసుందరి యచ్చటనుండు గంధర్వుల పాదంబులపయింబడి యేడ్చుచు నా
నాథుని విడిపించి నన్నురక్షింపుఁడని యాక్రోశింప వారునుం గడంగి శక్తితోమరముసల
ముద్గరాద్యాయుధంబులు ధరించి యా రాక్షసియుండుచోటికేగసి దానింజంపి యా
సుందరునిం గొనితెచ్చి యాకాంతకిచ్చిరి. గంధర్వనిహతయగు వారక్కసియొడలుభూత
లంబునంబడి చెల్లాచెదరై రక్తబిందువులు గ్రక్కుచుండె. ఒక్కొక బిందువున కొక్కొక
రక్కసుఁడుగాఁ గోట్లకొలంది పొలసుదిండు లాదేవగాయకులంబట్టిగొట్టి విగతప్రాణులం
జేసిన నాసుందరాంగుండు నొఱవెలికిన ఖడ్గంబుంగొని మండలభ్రమణంబులు సేయుచు
నాక్రవ్యాదుల నెదిరించెను. వారి కతిభయంకరంబగు మహాయుద్ధంబయ్యె. అప్పుడా
మనోహరుండు తనకాంతాతిలకంబును చంద్రసేనయొద్ద నుండ నియమించి శౌర్యంబున
విజృంభించి శత్రులం జంప నుంకించి యాకసంబున కేగసెను. ఒకింతసేపటికి భూమి
మీఁద నారక్కసుల శిరంబులు వడగండ్లపగిది రాలుచుండెను. కబంధంబులు యుద్ధరం
గంబు నిండి పర్వతాకారంబులయిన గుంపులు గుంపులుగఁ గనఁబడెను. ఇంతలోపల
నతితేజోవంతంబయిన యాసుందరాంగుని శిరంబు నిలపయింబడఁ గాంచి యందఱు
శోకకలితచిత్తులైరి. అతనిభార్యయుఁ మిగుల వగచుచు ఓచంద్రసేనా యింక నేనేమి
సేయంగలనే! నాభర్త ప్రాణంబులువాసె; ఇఁక నేనీరక్కసులచేతికిం దొరకకుండఁ
గాపాడుమని వేడుకొనఁగా చంద్రసేనయు నేమియుఁ దోచకయుండ నన్న్యాసినియుం
దానితో నోకన్యకా శరణాగతులవిడనాడుట పాడిగాదు. నీజనకునికిం జెప్పిపంపి వీర
భటులరప్పించి యీరక్కసులం జంపించి యీ కాంతం గావుము. అనఁగా నాచంద్రసే
నయుం నచ్చోటనుండు నొకదాసికంబిలిచి యిక్కడజరిగిన యీవృత్తాంతము విన్నవించి
చతురంగబలసమేతుండై నాజనకుని యుద్ధసన్నాహముతో రమ్మనిచెప్పుమన నదియుంవత్తె
యని యచ్చోటువదలి కదలిపోయె. మఱియు నొకముహూర్తకాలంబునకు దీర్ఘ
బాహువు చతురంగబల సమేతుండై వచ్చి యచ్చటిరక్కసుల నఱికట్టి యుద్ధభూమికింబలి
పెట్టిన నందొక్కరుండా దీర్ఘబాహువుంబట్టి రథంబుతో నిలాతలంబునంగొట్టిన నాతండు
తనరథంబుతోడ మట్టిం గలసె. అదిగని చంద్రసేన మహావ్యసనాక్రాంతయై తనజన
కుని మరణంబునకు వగచుచు నారక్కసులు తన్నుంబట్టికొననుంకించి పైకిరాఁగా
భయమువడి యాసన్న్యాసిని మఱుగుఁజొచ్చెను. మఱియుం నారక్కసులు పుడమి యీనిన
చందంబున నెక్కుడంజాటన తామయై యాసైనికుల నురుమాడి హాహాకారంబులు
సేయుచు నొక్కొక్క రొక్కొక్కతెఁగా నాయచ్చరలనందఱను దగులుకొని సురాపానం

ములు సేయుచు నున్మస్తకంబయిన కైపున నొడలు దెలియక యాడుచుం బాడుచునుండ నందొక్కరుని కాయచ్చర మిగిలియుండమి నాచంద్రసేనంబట్టుకొన నతివేగంబున రాఁగా రాజకన్యక యో భగవతి నన్ను రక్షింపుము; నీకంటె రక్షకులెవ్వరును లేరు ; ఈ రాక్షసుని సంహరింపుమని వేడుకొనుచు దానిగళంబు దృఢంబుగఁ గట్టికొన నదితటాలున నెగిరి యాకాశమార్గమున బహుదూరంబుచని యొకచోట దానిందించి యోదార్చి యో చంద్రసేనా నాయోగబలంబుచేత నిన్నా రాక్షసభటులకు దొరకనీయక రక్షించుకొని యిచ్చటికిం దెచ్చితి. నీతండ్రి మొదలగువారు నాతపోబలంబుచే మరలఁ గొంత కాలంబునకుఁ బ్రతుకఁగలరు. అందుకుఁ జింతింపకుము. ఇచ్చట నాతపోవనంబునకుంజని కొన్నిదినంబులుండుము. నన్ను నీవు తల్లికిని తండ్రికిని మారుగా భావింపుము అని చెప్పి యొక పర్వతగుహాముఖంబున దానిందిసికొనిపోయె. నేనును దానితో నంతవరకువచ్చి యుండియుం మీఁద నలబ్ధమార్గుండనై యచ్చోటికి సమీపమునం దిరుగుచు నీనగరముం జేరితిని. కొన్నిదినములు స్వేచ్ఛాదిరుగుచుండి యనతి చిరకాలంబునను నీ మేడమీఁద వ్రాలిన నీవు నన్నుంగాంచి పూర్వస్నేహంబున నాదరించుచున్నావు. అని యాకలకూజితము తనవృత్తాంతంబుఁ జెప్పెనని మదనమాల చతురికకుం జెప్పె. ఓమంత్రికుమారుఁడా యిది నీకుం గథాసందర్భానుగుణంబుగ వచియించితి. అనఁగా మంత్రికుమారుండును రాజకీరముంజూచి ఓకలకూజితమా యనంతర మామదనమాలా రాజకుమారులవృత్తాంతం బేమయ్యె నని యొఱింగింపు మన రాజకీరము మంత్రికుమారుఁడా నేనిచ్చోటికివచ్చి బహుకాలంబయ్యె. ఒకనిమిషంబైన నన్నుంజూడక యుండు నేని యామదనమాల యేమియుందోఁచక పరితపించును. ఆహారంబైన నొల్లదు. విన్నదనంబుతో మిన్నక యుండును. ఆకన్నియకు మోహము సూపి యెన్ని కార్యంబులున్నను విన్ననువునఁ జక్క బెట్టి పన్నుగ మరల నేతెంచి వృత్తాంతంబు విన్నవించెదనని చెప్పుచుం దిరిగి చూచి ససంభ్రమంబుగ నక్కటా మనకమలవతి భయసంభ్రమంబులతో నతిత్వరితగతి నేతెంచుచున్నయది. ఇందుకుం గతంబేమై యుండునో? రాజకుమారుని రహస్యవృత్తాంతం బుద్ఘాటితంబై యందువలన నేమైనఁ జెట్ట సంభవింపనున్నదో, హృదయం బేమియుం దోఁచక తత్తరించుచున్నది యనునంతలోఁ గమలవతియుం నతిత్వరితగతి నేగుదెంచి హృదయము తటతటమని యదర నడుగులు తడంబడ బిట్టునిట్టూరుపులు నిగుడ్చుచు హృదయనిహితకరాబ్జాతయై దైన్యంబున కాకరంబైన మొగంబుతో బయలు వెడలలేనివచనంబుల నిట్లనియె. ఓయయ్యా మన కళావతిం గాంచితిరే? అది యిచ్చటికి వచ్చియుండెనే? భగవతి సాంఖ్యాయని యిప్పుడు తన పర్ణశాలనుండి సితచంద్ర సౌధంబునకుం జని రాజకుమారునిం గాంచి విచారించ బయలు వెడలినయది. రాజకుమారుండు మదనమాలా సహితుండై మధుమంతోద్యానమున నున్నవాఁడు. సితచంద్రముం జేరెనో చేరఁడో

యెఱుంగను. సాంఖ్యాయనిగాంచునప్పుడు సితచంద్రంబునం గుమారుండు లేనిచో మహాప్రమాదంబుసంభవించు. ఆభగవతికిం గోపంబువొడమెనేని భూమియెల్ల వడవడ వడంకు. పర్వతంబులునుపగిలి బ్రద్దలువాయు. ఆకసంబునువిఱిగి భూమిపయిం బడు. అమరులెల్ల భయభ్రాంతులై పరువులిడుదురు. కట్టా యెట్టిచెట్ట సంభవింపనున్నదో యెఱుంగ. నా కప్రతివిధేయంబైన యీ కార్యంబునం గళావతికింగాక యితరులకుం జేయునదిలేదు. కళావతియుం గనంబడదు. కుమారుండు సితచంద్రంబునం గనంబడండేని తత్క్షణంబున సంశయాపన్నమానసయై యోగచక్షువుచే భూతంబగువృత్తాంతంబరయు! ఆమహనీయచరిత్ర దివ్యజ్ఞానంబున కందని వృత్తాంతంబులు లేవు. ఏదైన నొకకార ణంబు వొడమినంగాని యోగజ్ఞానంబుచే నెల్లవృత్తాంతంబులరయంబూనదు. అట్లుకాంచె నేని మదనమాలా మందారమాలావృత్తాంతంబులును రాజకుమారుని దుర్నీతియును భగవతిహృదయంబున కవగతంబు కాకమానదు. ఏమిసేయనగును. గరుడగామికృపా విశేషంబునంగాక యిది యితరులకు సమాధాతవ్యంబుగాదు. అనిచెప్పిన నాకమలవతిం గాంచి మంత్రికుమారుండు ప్రియసఖీ! కళావతి యింతకుమున్నవచ్చి యీపంజరంబుతో నీచిలుక నిచ్చోనునిచి నాతో నేమియుం బలుకక యతిత్వరితగతి సితచంద్రంబు నకుంబోయె. ఆకళావతిచని యొకజాము కావచ్చెనది. వేకువకు ముహూర్తముకలదనంగా నిటకువచ్చినది. ఇంకెదనుక మరలిరాలేదు. అని చెప్పినవిని కమలవతి యొకిం చుక సంతసంబంది యోరా! కళావతి యతి చతుర! సాంఖ్యాయని సితచంద్రంబునకు వచ్చునని యూహించియె తానచ్చోటికిం జనియున్నది. రాజకుమారుండు నచ్చోటికి వచ్చియుండును. మనము భయపడవలసినదిలేదు. అనిచెప్పి కమలవతియు నచ్చోటన యొకయాస్తరణంబుపై నుపవిష్టయయ్యె. కలకూజితమును వారలపీడొగిని మదనమాల యుండు సాగరధవళంబునకుం జనియె.

తృతీయతరంగము సమాప్తము.

శ్రీ రాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

# చమత్కారకథాకల్లోలిని

## చతుర్థతరంగము



క. సత్యాజాంబవతీముఖ
నిత్యశ్రీయుక్త రుక్మిణీప్రియ కృష్ణా
దైత్యారి దేవకీసుత
భృత్యాయితరాజమౌళి ప్రీతి న్వినుమీ.

ఇట్లు కమలవతి సుఖాసనంబుపయిం గూరుచుండి యనేక ప్రస్తావవశములగు మాటలు మాటలాడుచుండం గొంతతడవునకుఁ గళావతి యచ్చోటికి వచ్చి సంతోషవికాసభాసురముఖాబ్జాతయై యెదుటనిలిచిన నాకాంతం జూచి కమలవతి యిట్లనియె. ఓ ప్రియసఖీ నీమందహాసమువకంబగు ముఖారవిందంబుం గాంచినమాత్రమున భగవతి సాంఖ్యాయనికి మదనమాలామందారమాలా రాజకుమారులవృత్తాంతంబు విదితంబుగా లేదని యెఱింగితిమి. అయిన నీమంగళంబు నేటికి మనకు సమకూరినందుకై మనమెంతయుం సంతసంబున నీప్రొద్దుగడపవలసియున్నది. కాన తదాశ్రితంబగు కథాసందర్భంబును నాలకించుచు నాయుత్సవమును పూర్ణముగావింతము. మొదటినుండి వృత్తాంతము విశదీకరింపుము. మంత్రికుమారుఁడును తచ్ఛ్రవణకుతూహలాక్రాంతాంతరంగుఁడై యున్నవాఁడనఁ గళావతియుం సుఖోపవిష్టయై కమలవతీ మంత్రికుమారులతో నిట్లనియెం.

ప్రియసఖీ కమలవతీ యఘటితఘటనాపటీయసుం డగువిధాతశక్తి యచింత్యము. అపరిమేయము. అవార్యము. అప్రతివిధేయము. అనంతము. అతఁడు మొదట దుఃఖముల నమకూర్చినట్లు కూర్చి యాదుఃఖంబులం సుఖంబులం జేయంగలండు తొలుత మిన్నువిఱిగి మైఁబడవచ్చినట్లు దుఃఖంబులు సంభవించు; నట్లు సంభవించినకష్టంబులు ఏటినీరు తీసిపోయినట్లు గతించు ప్రియసఖీ వినుము. మధువంతము నుద్యానమున మదనమాలా రాజకుమారులు సుఖంబున వసియించుచుండఁగా వేసవికాలమున నేనచ్చటికేఁజని రాజకుమారుని సితచంద్రంబునకును మదనమాలను సాగరధవళంబునకుంబనిపి తద్వృత్తాంతంబి

మంత్రికుమారునికిం జెల్పందలంచి మందారమాల రాజపుత్త్రాపహృతమానసాబ్జాతయై యుండుటం జేసి కలకూజితమున కుపచారంబులు సలుపం బ్రయత్నపడదుగాక దీని కస్మద్గృహంబునకుం గొనిరాం దలంచి దాని పంజరంబున నునిచికొనివచ్చుచుండగా నడివీథిలోఁ దరళిక యెదురయ్యెను. దానిం గాంచి యో తరళికా యెక్కడనుండి వచ్చెదవు తెల్పుమని యడిగితిని. భగవతి సాంఖ్యాయని యుటజమునుండి వచ్చుచున్నాననెను. [illegible] నే తరళికా భగవతి యిప్పుడేమి సేయుచున్నదియని [illegible] సాంఖ్యా యని యింకను [illegible] లగు [illegible] పూర్వజన్మ [illegible] రించి యింద్రపరిచారికోపనీతంబులగు ఫలపుష్పాక్షతల నాకే ప్రదర్శించి హృదయపుండరీకంబునం గొంతతడవు తదీయదివ్యమూర్తి ధ్యానించి ప్రస్థానంబునకుండి [illegible] యిప్పుడ సితచంద్రంబునకుం జనుచున్నది. ఆమె కస్నానార్థానుచారిణియగుచు నేను నిటు వచ్చుచున్నాను. అనఁగా నేనును నామనంబున కలంకటా సితచంద్రంబునకు సాంఖ్యాయని ప్రవేశించునప్పుడు రాజకుమారుఁడు లేకుండెనేని యామె తనదివ్యజ్ఞానంబునం గాంచి వృత్తాంతంబుల నరయు. అందుచే బహుకష్టంబులు సంభవించు. కాన నామె సితచంద్రంబుం బ్రవేశించకముందఱ నేనచ్చోటికిం జని రాజకుమారుని కెచ్చరిక పఱచి యుండఁదగు. కాలవిళంబంబయ్యెనేని కార్యంబు చెడు. అని యాలోచించి యాతరళికతో నేమియుం బలుకక యతిత్వరితగతి నేతెంచి యామంత్రికుమారునితోఁ గలకూజితమునకు నంగసంస్కారాదులు నాహారాదులు నిర్వర్తింపుమని చెప్పి యతిత్వరితగతి సితచంద్రంబునకుం జనితి. అప్పటికి సాంఖ్యాయని సితచంద్రమున కించుక దూరంబున నేతెంచుచుండె. నేను నామెచక్షుఃపథంబునకుం దగులక యాసౌధపు నుద్యానమార్గద్వారముగుండ లోపలం బ్రవేశించితి. అప్పుడె రాజకుమారుండు మధుమంటపమునుండి వచ్చుటకేర్పఱచంబడి యుండు గూఢమార్గముఖమునుండి బయలు వెడలుచుండె. ససంభ్రమంబగు మదాగమనంబున నాతండు సంభ్రాంతుండై మన్నివేదితంబగు సాంఖ్యాయనీసమాగమనంబువిని యపరిమితంబగు భయంబుచేతఁ "దా నాకాలంబున స్నాతుండై ధౌతాంబరంబులు ధరియించి సూర్యోపస్థానంబు చేసి సాంఖ్యాయనీసమాగమనంబునకుం బ్రతిదినమును బ్రతీక్షించుచుండవలసిన జపశాలకుం జని తదాగమనంబునకు వేచియుండెనుగాని కాంతాసంభోగచిహ్నంబులతో నొప్పియుండు తనదేహమును నీటం గడిగి మాఱువేషంబు ధరియించుటకవకాశమును వీలును లేనివాఁడై యుండెను. అతం డాశాలయందడుగిడునప్పుడు భగవతి సాంఖ్యాయనియుం నచ్చటికిం జనుదెంచె. అట్లు చనుదెంచిన సాంఖ్యాయనికి రాజకుమారుండు దూరమున నుండియె భక్తిపురస్సరంబుగ నమస్కరించి లేచి యధోముఖుండై యేమియుం బలుకక యూరకుండె. అప్పుడు,

సీ. ఆర్ద్రదంతక్షతు లంతటఁగలసినసొగసు మీఱినమోవిచిగురువాని
నఱిసౌఖ్యలకుచోటులై జాగరకషాయకాంతిమించెడివిప్పుగనులవాని
కుచకుంభచందనకుంకుమ చిహ్నంబులొప్పఁగల్కెడు వక్షమొప్పువాని
కామినీభుజలతాకలితకంకణ చిహ్నకమనీయబాహుయుగ్మంబువాని

గీ. వాసనామాత్రశేషమైనవన్నెకెక్కు, ఘుమఘుమాయించుమైపూఁతకొమరుమిగుల
మృదితభావంబుగన్పట్టుహృదయసారి, తనువుగలవానిఁగనియెభూపకుమారు.

ఇట్లు కాంచి భగవతి సాంఖ్యాయని యించుక సంశయించి కించిదంకురితరోషారుణితముఖాబ్జాతయయి నిరూపించిచూచునప్పుడు నాహృదయంబు భయసముద్రంబునమునింగి యితికర్తవ్యజ్ఞానశూన్యంబై వృత్తిరహితంబగుచు మూఢంబైయుండె. భగవతియుం నాకుమారునిం దిలకించి యోకుమారా తొల్లి నేని-చ్చోటి కేఁగుదెంచునప్పుడు నీవు పరిపూతుండవై స్నానంబాచరించి సంధ్యోపాసనంబు చేసియుందువు. ఈ దినంబట్లుగాక కేవలమున్ముదితము లగునంగములతోను, నిద్దురమబ్బురిబ్బరంబై యుండుకనుదమ్ములతోను, కుచకలశకుంకుమచిహ్న ముద్రితంబగువక్షంబుతోను, అత్యలసంబగు గమనంబుతోను, అసౌష్ఠవం బగుశరీరంబుతోను, అధికం బగునిశ్వసితంబుతోను, గనుపట్టుచున్నావు. లోకంబునం గందర్పునియాజ్ఞ యఖిలజంతుసంతానవంచనాచంచువై వెలయుచున్నది. అందుకు నానా వికారవిహారస్థానం బగుయౌవనంబునుతోడై ప్రవర్తించుచుండు. అతిలలితంబు లగునా యా భావంబులును పురుషులధైర్యంబువ్వెత్తుగ నపహరించుచున్నయవి. ఇన్నియుం జేరినప్పుడు లజ్జయనునది నిర్జితంబగుదానిభాతి యొకమూలనడంగు. వినయము వినివారింపం బడినచందంబున నావలికింజను. ధైర్యమున్మథితంబైనరీతి క్షోభంబునొందు. వివేకము విశసితంబైనపడువున వినష్టంబగును. ఇప్పుడు నిన్నుంగాంచిన రతిరమణబాణగోచరత్వంబు నందినవిధంబుగ నాకుందోచెడిని. నీవెవరివిషయంబున నపరాద్ధుండవైతివో? ఈసుందరీ మందిరంబున నుండుమందయానలు నాకుఁబ్రాణసమానలు. మఱియుం నాకుం తనూజాత లనందగిమద్రక్షితలై యున్నవారు. వారలెల్ల పాతివ్రత్యభూషణలుగాని సాధారణలుగారు. నీవును మహాకులప్రసూతుండవుగాని కేవలుండవుగావు. నీచకృత్యములయందు నీమనంబు చొరదని నేఁదలఁచియుందు. అది యట్లుండనిమ్ము. నాకు రోషం బుత్పన్నంబగునేని చరాచరంబులుగడగడవడంకు. త్రిమూర్తులును భయభ్రాంతులై తమతమకృత్యంబులఁ దడబడుదురు. సూర్యచంద్రులు తమతమగతులుతప్పి యొప్పుచెడుదురు. అనియిట్లు సాంఖ్యాయని రోషరూక్షంబుగఁబల్కుచుండ నేను నామనంబున నోహో యీసాంఖ్యాయని యీరాజపుత్రుని యాకారవేషంబులుగాంచి యితఁడెవ్వతెనో కాంతామణిం దగులు

కొని దాని ప్రాతివ్రత్యాదులను చెరిపెనని తలంచినయది. ఈమె మనంబునంగల కోపము శాంతిపఱుప నెవ్విధియుం జూపట్టదు. ఏమిసేయుదు. అని యించుకసేపు చింతించి సంతప్తహృదయంబుతో నిట్లు వక్కాణించితిని. ఓభగవతీ నీదివ్యజ్ఞానంబున కెఱుకపడనిది పదునాలుగులోకంబులను గనంబడదు. నీ తపశ్శక్తిచే సకలజంతు సమూహంబుల మనోగతంబులంగూడ నీవెఱుంగుదువు. అట్టి నీయుండుచోట మనంబుననైనం దలంపరాని యిట్టి సాహసకృత్యంబులంజేసి భవదీయరోషానలజ్వాలల వేగం గమకించఁ గలవాఁ డెవ్వండును లేఁడు. భవదీయ తపోవిశేషంబునంజేసి జాతివైరంబులుగల మృగంబులు గూడ తమతమ సహజవైరంబు లెడబాసి పరస్పరమైత్రితో జరించుచున్నవి. ఒక జంతువైన కామాతురంబై కనుపట్టదు. కేవల శమప్రధానంబై వెలయుచుండు నీనగరంబున భవదాజ్ఞలేక తృణమైన నల్లాడదు. అట్టి నీ యాజ్ఞావశవర్తియగు పరిజనము ఇట్టి కట్టిండికృత్యంబున కొడిగట్టసమకట్టునెట్లు. వినుఁడు. ఈరాజకుమారుండు చంద్రచూడ చరణకమల ధ్యానధురీణుండు, అనవరత మాసితచంద్రంబున నేకతంబ వర్తించుచు సంధ్యాత్రయంబునను సావిత్రి జపియించి సాంబమూర్తి దివ్యమంగళ విగ్రహంబు ధ్యానించుచుండు. నిన్న చతుర్దశియగుటంజేసి సాయం సంధ్యోపాసనానంతరము చంద్రమౌళి దివ్యమూర్తిని దర్శింపనెంచి నాతో మందలించె. నేనును మనంబున నీతని భక్తికిమెచ్చి యింతకుం జెంతనున్న భవానీమందిరంబునకుం దోడ్కొనిపోతిని. అచ్చో నాజగన్మాతను నమస్కరించి విరచితాంజలియై స్తుతియించుచుండ నక్కడ కొక సిద్ధపురుషుం డేతెంచి కుమారునింగాంచి యితనివృత్తాంతంబు విచారించి మించిన ప్రీతిచే నాయోగిభవభావానీదివ్యాంగంబుల దేవతాకల్పితంబులగు భస్మమును హరిద్రాపంకంబునుగొని కుమారుని కరంబుననిడి యిది దేవప్రసాదంబు; దీనిని ధరియింపుము మేలు గల్గును; అని చెప్పిన కుమారుండు నట్లధరియించి మఱియొకింతసేపు దేవాలయంబునం గలుగు విశేషంబులం గాంచుచుండి యింతలోపలన వేకువకాఁగా నాతోఁగూడ నిచ్చటికివచ్చె. ఈకారణంబున నీతనికి నిదురలేదు. భస్మోద్ధూళనంబుచే శరీర మించుక పాండురంబై కనఁబడుచున్నది. దేవీప్రసాదరూపంబుగ లభియించిన హరిద్రారసంబు వక్షంబునను ఫాలంబునను ధరియించికొనియె. ఇదియె వృత్తాంతంబని చెప్పుచుండఁగా నొకయోగీశ్వరి యొక వజ్రమయమగు పెట్టియను చేత ధరియించుకొని నాగబెత్తంబు మఱియొండు కరంబునం దెమల్చి యంధకారపటలసమం బగుజటాభారంబు సమీపస్థలంబులకు తమాలకాంతార ప్రభలనావహింప నాకాశయానంబున నేగుదెంచి సాంఖ్యాయనికి నమస్కరించిన నాభగవతియుం నిరువదివత్సరంబులుఁనిండక యుండు నాయోగినీ కన్యకను హస్తములు సాచి లేవనెత్తి కౌగిలించుకొని యానందబాష్పధారల నొదలఁదడుపుచు వత్సేకామందికి నేమమేనా? సౌదామిని నేమంబుగనున్నదే? మాయెడల నేర్చిన యోగవిద్యల

నిర్విఘ్నంబుగ ననుష్ఠించుచున్నదియే? ఆయమయొద్ద నీవు ననుకూలత్వమున యోగ
విద్యాభ్యాస మొనరించెదవే? నిన్నుం జూచినంతన మాకు మా ప్రియశిష్యయగు సౌదామినిం
గాంచినంతసంతసము మనంబునం గలిగె. మిగుల సంతోషభరితాంతరంగనైతిని అని
యనేకవిధంబులుగ నాసాంఖ్యాయని యుపచారోక్తు లుపచరింప నా కామందకియుం
వినయభయభక్తులతో నిట్లనియె. ఓభగవతీ మీ దివ్యకృపాకటాక్షమునకుం బాత్రులైన
వారలకు నెందునైన నేమంబునం గొఱంతయుండునే? తమ ప్రియశిష్యయగు సౌదామిని
యీవజ్రపుం బెట్టియను మీయొద్ద నొప్పగించమని యాజ్ఞ చేసి నన్నంపె. ఇది మీహస్తం
బున కప్పగించితిని. మఱియొకవృత్తాంతంబును అపకర్ణంబుగా విన్నవింపుమని చెప్ప
పంపినయది. కాన నది యవధానదానంబునం జేసి యంగీకరింపుడు. అనఁగా సాంఖ్యా
యనియుం నట్లకానిమ్మనిన నాసౌదామిని సమీపంబునకుం జని యామె చెవిలో నేమేమొ
యొకింతసేపు వచియించినయది. అది వినినతోడన యాసాంఖ్యాయనికి హర్షమును,
వ్యసనంబును, భయమును, మనంబున ముప్పిరిగొనియున్నవి యని తత్తత్కాలజనితముఖ
భావంబులచేఁ బరిజ్ఞాతంబులగుచుండె. నేను ఆబాలయోగినింగాంచి దానిరూపరేఖా
విలాసంబుల కచ్చెరువంది "మహాభోగార్హంబై మృదుతరంబగు నీయంగకంబును ఈ బాల
యిట్లు యోగనిష్ఠలచే గాసిపఱచుటయేలకో? ఆహా దీని యంగసౌష్ఠవంబుం గాంచిన
నొక సర్వసర్వంసహాపతికుమారునిం జెట్టపట్టి పట్టభద్రయై యుండందగునని తోఁచెడిని.
ఇది యిట్లగుటకుం గతం బేమియో యెఱుంగను; అని తలంచుకొనుచుంటిని. ఆయోగినియుం
సాంఖ్యాయని చెవిలో వృత్తాంతంబుఁ దెల్పి యామెనువీడ్కొని యాకాశ యానంబునం
జనియె. సాంఖ్యాయనియుం నావజ్రపుం బెట్టియను దెఱచి యందులోనున్న హారంబు
లను రెంటిని తనచేతం బైకెత్తెను. అందొకటి నవరత్నమయంబును అనర్ఘరత్నప్రభా
పుంజపింజరిత దశదిశాంతరంబునై వెలుంగుచుండె. మఱియొందు అతిరుచిరవర్తులముక్తాళి
గ్రధితంబై శేషభోగిభోగసంకాశంబుగఁ బ్రకాశించుచుండె. ఇట్లు పైకెత్తిన నవరత్న
హారంబుం గాంచిన రాజకుమారునికి జలజలబాష్పబిందువులు త్రుటితంబగు ముక్తామణి
సరంబు విధంబుగఁ గన్నులనుండి యిలపైఁ జాఱె. అతి గంభీరప్రకృతిగాన పునః పునః
నిరుద్ధంబగుచుండుటం జేసి యత్యావేగంబున నధరనాసాపుటంబుల స్ఫురియింపం జేయుచు
శోకవేగంబు హృదయకుహరంబున నతిశయించుచుండె. కొంతతడవునకు ధైర్యం బవలం
బించి రాచకుమారుండును నిలువంబడియె. అప్పుడు సాంఖ్యాయని యాతనితీరుం గాంచి
యోకుమారకా నీవీహారంబుం గనినది మొదలు పూర్వానుభూతంబుం గాంచిన వానివలె
దుఃఖించుచున్నావు. నీకుం బ్రాణప్రియంబగునది యొకటి దీనిం జూచినమాత్రమున
నీకు స్మృతికిందగిలినట్లు తోఁచెడిని. ఈహారముందాల్ప నీవతగుదువని తోఁచెడిని; ఇది
నేనిచ్చినట్టిదిగాన భక్తిపురస్సరంబుగఁ బరిగ్రహించి ధరించికొనుము. అని చెప్పి యాహార

మతనికొసఁగి మఱియొండుహారంబుఁ దాఁ జేతనెత్తికొని మందారమాలాగృహంబునకుం
జనియె. ఆహారంబు కంఠదేశంబున ధరించినంతన నారాజకుమారుండు నభినవోద్భూత
మనోహరకాంతియై నక్షత్రమాలికచేఁ బూర్ణచంద్రునిపగిదిం దోఁచెను. సాంఖ్యాయని
యచ్చోటువాసిపోయినయనంతర మారాజకుమారునిచే నాహారము జీవంకరణనామ
కంబని యెఱింగితిని. ఈ హారంబు చేతికందినదాదిగా నాహారంబును గూడ నా కుమారుండు
గైకొన నిష్టపడఁడని తోఁచెడిని. మహానుభావప్రకృతియగుటం జేసి చెప్పనో చెప్పఁడో
యని నేను దానివృత్తాంతంబు నడిగినదానంగాను. క్రమక్రమముగఁగాని తెలిసికొన
నశక్యము. ఈమణిహారప్రస్తావవశంబుచే నాయసత్యవచనంబులం బాటించక
యాసాంఖ్యాయని యంతకుమున్ను మందారమాలానిరీక్షణకౌతుకితాంతరంగయై తదా
గారంబునకుం జనియె. పూర్వాహ్ణమునఁ బ్రస్తూయమానం బగువృత్తాంతంబు మఱచిపోయె
నని తోఁచెడిని. రాజకుమారుండును స్నానగృహంబునకుం జనియె. నేనిటకువచ్చితిని.
ఇదియె వృత్తాంతంబని చెప్పినఁ గమలవతియు మంత్రికుమారుండును జీవంకరణహార
వృత్తాంతంబును మఱియొక హారవృత్తాంతంబును దెలిసికొన మనంబులఁ గోరుచుండిరి.
ఇట్లు కొన్ని దినంబులు జరిగె.

ఆసుందరీమందిరంబునకు రాజై యున్న చంద్రసేనాభిఖ్యుం డొకనాఁడు తత్పుర
సమీపవనంబుల వేటాడం జని కొంతసేపు ఆఖేటకావిహారంబు సలిపి మరలివచ్చుచు నెండకు
బడలి యాపురబాహ్యోపవనంబునందుం బ్రవేశించి తదీయమధ్యంబునం గనుపట్టు శైత్య
సారమను పుష్పనికుంజంబునం బ్రవేశించి దానినడుమ నున్నశిలాఫలకంబుపైఁ బరుండి
యుండెను. మంత్రికుమారుండును తద్వనమునకు వినోదార్థంబుగ నానాఁడుదయమునం
జని రాజపుత్రుండు దిగినలతాగృహమునకుం బ్రక్కన యుండు మఱియొకనికుంజంబు
నం గుసుమస్తబకసుందరం బగుతమాలంబుక్రిందం గూరుచుండి చందనానిలాంకురంబుల
సేవించుచుండె. అప్పుడచ్చటికి రెండుచిలుకలు మనోహరాకారంబులు సనుదెంచి
యా నికుంజంబులకు రెంటికిని సంబంధపడుచు వానినడుమనుండు నతిరమ్యంబగు మా
కందంబుపయిం గూరుచుండి యలుపుఁదీర్చుకొని యొకింతసేపటికి సమీపస్థలమునుండు
బింబఫలంబులం గొన్నింటిం గొఱికి భుజియించి జంబూఫలరసంబాస్వాదించి మించిన
మోదంబునం జనుదెంచి యొకించుకయేని సూర్యకిరణంబులం జొరనీయక నిబిడితలతానివ
హనీరంధ్రంబై యనవరతనిపతితమకరందబిందు బృందసురభిశీతం బగునారసాలపాద
పంబుశాఖపయిం గూరుచుండె. ఇట్లు కూరుచుండి యాశుకీశుకంబులు పరస్పరప్రేమ
రసార్ద్రంబులగు హృదయంబులతో నొండొంటిని ముద్దుగొని సరసాలాపంబులు వల్కుచు
మహానందంబునం జెలంగుచుండ నందొకచిలుక యిట్లనియె. ప్రాణనాథా మధురరవమా
నేనొకవృత్తాంతంబు నిన్నడుగవలయునని యున్నదానను. అందు కవకాశ మీదినంబున

నిప్పుడు దొరికినది. అదియేమంటివేని? మనరాణి యగుమందారమాల కొన్నిదినముల నుండి బహుదుర్బలంబు లగునవయవంబులతో నీషత్పాండురంబగులవలీతా సౌందర్యంబుఁ గొల్లలాడుచున్నయది. దానిం గాంచిన నాకు నదియొకమహాపురుషునియం దనురాగభరితయయి యుండువిధం బవగతం బగుచున్నయది; అనిన మఱియొక చిలుక పలుకుచున్నది. ప్రాణనాయకీ కలాలాపా ఆ మహాపురుషుం డెవ్వండని నీవుసమ్మి యున్నావు.

కలాలాపము. నాథా వచించెదవిను; ఆమహాపురుషుండు మనయూరనుండెడి సితచంద్రసౌధవాసియగురాజకుమారుండని యూహించెదను.

మధురరవము. కలాలాపా నీతర్కము సుసంగతం బయియున్నది. నిక్కువమే? తొల్లి నూపల్లవపాణి మధుమంతోద్యానంబున నొకపూఁబొదరింటఁ దనప్రియుని బొందియుం ననంపూర్ణమనోరథయై యెడబాసి యనవరతంబును తదీయసమాగమసుఖంబు మనంబునం గోరుచు నుండుదగావున మనోగతంబన్యులకెఱుకపడనీక మెలఁగుచుండును.

సీ. చిలుకకు పద్యంబుఁ జెప్పనొల్లదు బాల పువ్వుఁ ముడుపదు పువ్వుఁబోఁడి
జలకంబులాడదు జలజాతలోచన యాహార మొసఁగదు హంసగమన
సఖులతోఁ గ్రీడింపఁ జనదు చంద్రానన వెన్నెలబయిటికి వెడల దబల
మలయానిలమునకు మది భీతిలును చాన శుకపికారావములఁ సుదతి వినదు
గీ. మది భరింపగలేనట్టి మదనబాణ, జాలనిర్ఘాతపతనసంజాత వేద
నావిహస్తితధైర్యయైనళినవేత్రి, కరధృతకపోలయై దైన్యగతిఁ జెలంగు.

కలాలాప. ప్రాణనాథా నీవు నచించినది వాస్తవమే. ఒకనాఁడా మందారమాల సఖియలు కమలవతియుఁ గళావతియు నియ్యమను గుఱించి మాటలాడునప్పుడు కళావతింగాంచి కమలవతి యిట్లనియె. అది నేనువింటిని.

శ్లో. నబరీభరీతి కబరీభరే స్రజో నచరీకరీతి మృగనాభిచిత్రకం
విజరీహరీతి సపురేవ మత్సరో వివరీవరీతి నచ విప్రియం సఖీ.

[ఓకళావతీ మనసఖియగు మందారమాల తొలుతటివలెఁ గనఁబడదు. మందు పువ్వులంగాంచినచో నత్యాసక్తిదీసికొని తానెముడుచుకొనును. సఖులువచ్చిముడుచు నంతవఱకాలస్యముసహింపదు. అట్టిది యిప్పుడు మనము గొప్పనఁబూలుదుఱిమి ననుభరించుటకు శక్తిలేదనితీసివేయుచున్నది. ముందుతనయొడలిలో మకరికాపత్రములు తిలకమును నొకయెడ యొకింతమాసిపోయిన నప్పుడుదిద్దినఁగాని మనస్సమాధానపడనియా యింతిమకరికాపత్రంబులను వ్రాయించుకొననొల్లదు. మృగనాభ్యర్ధంబుగఁ గస్తూరితిలకంబు మాత్రము ధరించుకొనుచుంతియు కాని చిఱుచెమటం గఱఁగిపోయె

నేసి మరల జక్కనొత్తదు. ఇందుకుముందు మన మొల్లకయుండినను వనవిహారాదులకుఁ దానె నిర్బంధించికొనిపోవుచుండుఁగదా. అట్టిది యిప్పుడు మనము పిలిచినను క్రీడించుటకురాదు. అది యట్లుండనిమ్ము; తనమనంబునకుఁ దోఁచిన ప్రియాప్రియంబులఁ దత్క్షణము నాతో మందలించక యుండదు. అట్టి దిప్పుడు నేను పలువిధములనడిగి బలిమాలుకొనినను ఒకమాటయైనం బలుకదు.

ఇట్లు మందారమాల వర్తించుచున్నదియని కమలవతి చెప్పుచుండఁగా వింటిని అంతఁ దనుగుణంబుగ నీవును పలుకుచున్నావు. మధుమంతసునందు మందారమాలకుం గలిగిన ప్రియసమాగమంబునకుం గారణభూతయై సర్వసహాయంబు లొనరించినది కమలవతియని వింటి. అట్టిది యాకాంతకు రెండవహృదయంబై యుండదగునుగదా. ఇప్పు డాకమలవతికింగూడ మనసియ్యక నిగూఢహృదయయై యుండుటకుం గతం బేమొకో.

మధుర. కలాలాపా యది సుధీరయం మగుదయంగాన మధుమంతోద్యానమునం దనకుంగలిగిన పరిభవంబునకు భయపడి కమలవతి యతిచతురయగుటం జేసి తొలుతటివలె నింకే మేమియనర్థంబులకుం బాలుపడఁ జేయునోయనితలఁచి దానిని మునుపటివలె నండఁ జేర్పకయున్నది. తనకు ప్రాదుర్భావికాలంబున మదలేఖ యను రాజపుత్రికఁ బిలిపించి లోకవృత్తాంతంబు మాటలాడుచుండు. మఱియుఁ దనమగండైన చంద్రసేనునిం దలంచి యతిశంకితచిత్తయై యుండుచుండు.

కలాలాప. ప్రాణనాథా చంద్రసేనునికిని మందారమాలకును వివాహంబు జరిగినదా? చంద్రసేనునికి మందారమాలయందుఁ బ్రేమ విశేషించియుండునుగదా?

మధుర. ప్రాణనాయకీ సాంఖ్యాయనిసమక్షంబునం బాణిగ్రహణంబు జరిగినది. మందారమాలయందు చంద్రసేనునికిం బ్రీతి యతిశయించియేయుండును. ఇరువురును సమానవయస్కులు. సమానరూపరేఖావిలాసభాసురాంగులు. అత్యుత్తమవంశప్రసూతులు. అట్లుండఁ బరస్పరానురాగంబునకుం గొఱంతయేమియున్నది. మందారమాల యష్టాదశవర్షీయయయిన యనంతరము చంద్రసేనునితోఁ గూర్చి సుందరీమందిర పట్టాభిషేకోత్సవము జరుపవలయునని సాంఖ్యాయని పలుమరు తనశిష్యసంఘముతో వాక్రుచ్చియున్నది.

కలా. ప్రాణనాథా యట్లుండ నీమందారమాల సితచంద్రసౌధవర్తి యను రాజపుత్రునియం దనురక్తయయినవిధంబు ఆత్మనాశక వంచనాపదాయకత్వంబునం గాదె యనుయుక్తమయియున్నయది.

మధుర. కలాలాపా! మనకందుసం గలకీలెఱుంగుటకు శక్యంబుగాదు. అతిబుద్ధిచతురులకుంగాని యీయుద్దేశచాతుర్యంబు మదికిం బట్టదు. అట్లుండ నీర్ష్యాజాతి సులభమాధుర్యుల మగు మనకది యెట్టులెఱుంగనగును!

కలా. నాథా అతిదుర్భరంబగు విషయంబు సంప్రవర్తించి మానస వృత్తి నేల శ్రమపెట్టుకొనవలయు. ఇప్పుడు మందారమాలవృత్తాంతంబు నీకెఱుకపడినదనుక వినిపింపుము.

మధుర. కలాలాపా కొన్నిదినంబులకుముందు సాంఖ్యాయని యొకతారహారంబు గొనివచ్చి మందారమాలకిచ్చిన నాసుదతి దానింగాంచి పూర్వానుభూతంబుం దలంచుకొన్న దానివలె వ్యసనాక్రాంతయై యడంపరానిశోకవేగంబునం బెదవులదర కనుదమ్ముల నుండి బాష్పబిందువులు చనుకట్టుపయింబడి చెదరి సమీపస్థలంబుల నార్ద్రంబులు సేయ నొకింతసేపు దుఃఖించుచుండె. అయ్యవసరంబున నే నాకాంతామణింగాంచి యోమందారమాలా యీహారంబు పేరేమి యనియడిగితిని. అదియు నీహారంబు భోగంకరణం బనంబరగుచుండునని నాకుత్తరం బొసంగె; అంతట నేను నాకన్యకాశోకావేశం బణంగిన యనంతరము తద్వృత్తాంతంబు విచారింతమనియుంటిని గాని యవకాశంబు దొరకమి మరల విచారింప నవుపడక యపోయె. మఱియుం బతిదినం విరహతాపం బాకన్యకామణి కధికంబగుచువచ్చె. అందులకుం గారణం బిట్టిదియని తెలిసికొన నేనికిం దరంబుగాకయున్నది. మందారమాలయు నెల్లప్పుడును గరకలితకపోలయై యాలోచించుచుండునంతియ కాని సఖులతోమాటలాడుటయు నలంకరించుకొనుటయు నాహారంబుఁగొనుటయుం బొత్తిగావదలి విరహవేదనా విషణ్ణచిత్తంబుతోఁ బరితపించుచుండె.

కలాలాప. ప్రాణనాథా యిట్లు పరితపించుటవలన నేమిఫలంబు వాటిల్లునో యా పాటలాధరకు?

మధురరవము. ప్రాణనాయకీ వినుము. ఇట్లనవరతవిరహవేదనాదోదూయమాన మానస యగునా మందారమాలం గాంచి మదలేఖయనురాజపుత్రిక మనంబున వితర్కించి "యింక దీని కభిమతనాయకసమాగమంబు సమకూరనినాఁడు ప్రాణంబు లుండవని తోఁచెడిని. దీనిహృదయగుహాంతరాళవిలీనం బగుపుష్పసింహు నేలాగు గాననగు.

శ్లో. ఔదుంబరాణిపుష్పాణి శ్వేతవర్ణంచ వాయసం
మత్స్యపాదం జలే పశ్యేన్న నారీహృదయస్థితం.

అన్నట్లు అత్తిపూలు తెల్లకాకి నీటియందు మత్స్యపాదము కనఁబడవు. ఒకవేళ వానిని జూచినను జూడవచ్చునుగాని స్త్రీహృదయంబున నుండువిషయంబు నెఱుంగుట దుర్లభము. కానిమ్ము చేతనైనంతదనుక ప్రవర్తించిచూతము." అని నిశ్చయించుకొని యొకనాఁడు మందారమాల యుండుపడకటింటికింజని యందొకచిత్రఫలకంబున నొకమనోహరాకారుని వ్రాసియుండుటం గాంచి యానందపూరపరిచిరానిచయంబులం బోలిన వీక్షణంబుల నాతని ననిమేషదృష్టి నిరీక్షించుచుండు మందారమాలం గాంచి

ప్రియసఖి యీ నవమన్మథుం డెవఁడు? ఈమాన్యుం డెందుండుచోటు నీకవగతంబగునే? ఈమానినీమన్మథుని పేరును కులశీలంబులును నీకు విదితంబులయినవియో? అని యడిగెను. అందుకు మందారమాల లజ్జావనత ముఖాబ్జాతయై యేమియుం బలుకక యూరకున్న మదలేఖయుం దనకరాంగుళీయకంబుల దాని మొగంబు పైకెత్తి యో ప్రియసఖీ లోకంబున నెవ్వరైనను పంచశరబాణగోచర వ్యాపారంబులు కాని వారలు లేరు; నావృత్తాంతంబెల్ల నప్పుడప్పుడు ప్రసంగవశంబున నీకెఱింగించియున్నానుగదా? నీవునట్లు నీ వృత్తాంతంబుదాచక నాతోఁ దెల్పుము. నీప్రాణవల్లభుం డెచ్చోటనున్నవాఁడు? ఇంతమాత్ర మెఱింగింపుము; అని యనేకవిధంబుల వేడికొన నామందారమాలయు సిగ్గుచే నేమియు మందలింపలేక బహుకాలము సంతసించి తుదకు నీవడుగు మనోహరాంగుండు సితచంద్రసౌధవర్తి యగు రాజకుమారుండని యుత్తరమిచ్చెను. ఇట్లుండ నొకనాఁడు మదనలేఖయు మందారమాలయు నిరువురును సాయంతనమజ్జనంబు నిర్వర్తించికొని ధౌతాంబరంబులు ధరియించి వెన్నెలబయట గొంతతడవు సంచరించుచుండిరి. అప్పుడు నేను మందారమాల స్నానసమయంబునందీసి తన మెడనున్న భోగకరణంబను ముక్తాహారంబు నచ్చట నొకచిలుకకొయ్యకుం దగిలించియుండుటం గాంచి తిర్యగ్జాతి సులభచాపలంబునం జేసి యీ చిలుకకొయ్య నుండు హారంబును ముక్కునం గఱచుకొని యాకసంబున కెగిరితిని. అదిచూచి యామందారమాలయు నతివేగంబునం జనుచుం జక్కోరయు దాడిమీఫలబీజంబులును బింబఫలంబులం గొనుచు నావెనువెంట నన్నుం బలిమాలుకొనుచు నొంటిగ వచ్చుచుండె. నేనాయింతి యెంతబతిమాలుకొనినను హారంబివ్యక నాకన్యక చేయలంతినన వర్తించుచు దానికిం జిక్కక కొంతదూరంబు చనుచుంటి. తత్సౌధసమీపవర్తి యగుమధుమాసితం బను పాలకాననంబునం బ్రవేశించి నేను నాసుందరియుం గొంత దూరంబరిగితిమి; దానిమధ్యంబున నతిసంకులశుకపికారావమనోహర మగులతానికుంజంబు చెంతనుండి యొకవిలాసి మందారమాలయున్నచోటికి కభిముఖుండై వచ్చుచుండె. నేను నతం డెవ్వఁడో కనుగొనవలయునని సమీపించి యోహో సితచంద్రసౌధవర్తియగు రాజకుమారుండుగదా యనియంటిని. ఆమాటవిని మందారమాల సిగ్గుభయంబును పెనంగొన నేమియుం దోఁచక యవనతముఖాబ్జాతయయి యుండఁ గాంచి యాపంచశరాకారుండు కించిదంకురితమందహాస సుందరముఖారవిందుండయి ప్రాణనాయకీయని సంభోధించి యిట్లనియె.

శ్లో॥ గాఢాలింగనగండచుంబనకుచస్పర్శాదిలీలాయుతం
సర్వం విస్మృతమేవ విస్మృతవతో బాలే ఖలేభ్యో భయాత్
సల్లాపస్త్వధునా సుదుర్ఘటతమస్తత్రాపి కాలివ్యథా
యత్త్వద్దర్శన మప్యభూ దసులభం తేనైవ దూయే భృశం.

[తా. ఓ బాలారత్నమా మనము మధుమంతోద్యానమునందు గూడినప్పుడు నిన్ను నేనురహస్యముగ బిగికౌఁగిటఁజేర్చుకొనుటయును నీచెక్కిలులు ముద్దుగొనుటయును నీకుచకోరకంబులను గరంబుల స్పృశించుటయు మొదలగు క్రీడావిశేషంబు లెన్నియో జరిగె. ఖలజనంబులవలని భయంబునంజేసి మనమప్పుడ యెడబాసితిమి. అందుచే నవియన్నియు జన్మాంతరానుభూతంబులయిన చందంబున విస్మృతిఁజెందనే చెందెను. ఇప్పుడు నీతోసల్లాపముగూడ మిగులదుర్ఘటమైయున్నది. అందును నామనంబు వ్యథపడదు. మఱియెందుకు సంతాపింతుననఁగా నిన్నుఁగంటంగాంచి నీముఖచంద్రబింబమునుండి వెడలుస్మితసుధామధురకటాక్షములను క్షణకాలమైనను పాత్రుండనుగాకయున్నాఁడననుటకు మిగులవగలం బొగులుచున్నాఁడను.]

అనిపల్కిన నామందారమాలయు నేమియుననక యూరకుండె. అంతనాకాంతుండంతరంగంబున నుప్పొంగుచు నోప్రాణనాయకీ నీవుమాటలాడకపోయెదవేనిపొమ్ము. నామాటయొకటివిని నన్నుబహూకరించి యీలతానికుంజంబున నుండుచంద్రకాంతశిలాఫలకంబుపయి యొకింతసేపు నాతో సహవాసం బంగీకరించి, యనంతరం బేగుము. నాయదృష్టవిశేషంబు ఫలోన్ముఖంబై యీదినంబీనిర్జనభూమికి నిన్నును నన్ను నేకతంబ దైవంబు సమకూర్చినయది. నిన్నెడబాసినది మొదలు నేను క్షణంబులు గడియలుగను గడియలు యామంబులుగను యామంబు లహోరాత్రంబులుగను అహోరాత్రంబులు యుగంబులుగను గడపుచున్నాఁడను. వేయేల? సర్వకాలసర్వావస్థలయందును నీమీఁది తలంపున నున్నవాఁడఁగాన మఱియొండుదలంప. అని యిట్లనేకవిధంబుల ననునయించినం గన్నియయును వన్నెకానిం గాంచి కించిదంకురిత మందహాసంబుతో నాథా యిట్టి కట్టిఁడిచెయ్వులకొడిగట్టుట మీకుందగునా? నామగండు మహాపరాక్రమశాలి. ఇది యించుకేనియాతని చెవికెక్కెనేని యందఱకును మహాసంకటంబు సంభవించు. భగవతి సాంఖ్యాయనియును దుర్ధర్షరోషావేశగాఁగనుపట్టు మనయిరువుర మనోరథంబులు దరిద్రమనోరథంబులతెఱంగున మానసంబునన లీనత్వంబు నొందవలసియున్నవి యంతెకాని ఫలవంతంబులెన్నటికిని కానేరవు.

శ్లో. అనాతురోత్కంఠితయోః ప్రసిధ్యతా సమాగమేనాపిరతిర్నమాం ప్రతి
పరస్పరప్రాప్తినిరాశయోర్వరంశరీరనాశోపిసమానురాగయోః.

అని చెప్పంబడియున్నట్లు ఆతురుఁడు నుత్కంఠితయుఁగాని పురుషునికిని కాంతకును సమాగమముకలిగియు రసావహంబుగాదు. మఱి పరస్పరానురాగంబు విశేషించి గురుజనాదినిర్బంధమునంజేసి యొండొరులకుం బ్రాప్తికలుకక తత్సుఖలాభమునందు నిరపేక్షఁజెంది యాయిరువురును మదనవేదనకుఁ దాళంజాలక శరీరంబుఁ దొఱంగుటయు

రసావహంబై యుండుఁగాన నిధిమనంబున నుంచుకొనుము అనిన నాకాంతుం డాకాంతా
మణి సమీపంబునకేతెంచి తనకరంబా మహిళారత్నంబు కరంబునంగీలించి మఱియొకకర
పల్లవంబున దానిచుబుకంబువట్టియెత్తి ముద్దిడుకొని యనేకములగు చతురాలాపంబుల
దాని సిగ్గును భయంబును నపనయించి మెల్లన నానికుంజాంతరంబునకుం దీసికొనిపోయె.
అట్లిరువురును నానియంతరంబునకుంజని సరసాలాపంబులాడుచు నందు మందమారు
తాభిరామంబగు చంద్రకాంత శిలాఫలకంబుపయిం గూరుచుండిరి. ఇట్లు కూర్చుండి
యా రాజకుమారుండు మందారమాలం గౌఁగిలించుకొని తదీయ మనోహరాంగ సంగమ
సుఖంబునకు పరమానందంబు నొందుచు మెల్లన

సీ. తలిరులశయ్యకుఁ దార్చి మోహనగాత్రి మోము మోమునఁ జేర్చి ముద్దుగొనుచు
పడఁతిహారములు చిక్కెడలించు నెపమునఁ గులుకుచన్బంతులఁ గొసరితాకి
సుమములుదురిమెడు సొంపు గాన్పించుచుఁ గొప్పొకచేత బా గొప్పఁబట్టి
ముచ్చటల్ జెప్పెడిమురువు దోపించుచు మోవి చురుక్కున మొనసినొక్కి
గీ. పోకముడిజార్చి యనువునఁ బోలఁతియూరు, కాండములకును తమిమీఱఁగరముసాచి
యున్నతం బగు కటిసీమ సనికిఁజేసి, రతులఁ గరఁగింపసాగె నారాజముఖిని.

ఇట్లు సమరతిం గొంతతడవు సుఖాంబుధిం దేలిన బాలామణియుఁ దత్కాలశం
బరసూదనాభ్యస్తసురతవిద్యా పాటవంబునం గడిదేరి కాముని మదమత్తగజంబుచందంబు
ననుసులుచు ముసిముసినగవుల పసందనమోముదామరకు అసమానకాంతి సంభవింపఁ
దత్కాల సముపజాతకాంతకరసంక్రమేషత్ క్షుభితకళావిశేష సుఖపరవశసుకుమారాం
గంబులతో నాయకునింపైకొని

చ. కామిని సొంపుమీఱుపలుగంటులు నిండినలేఁతమోవితో
సామియురంబుపైనఁ బెలుచ న్నటియించెడు జాఱుకొప్పుతోఁ
గోమలమానఖాంకములు గూడివెలింగెడియంగవల్లితో
శ్రీమహితంబుగా సలిపెఁ జేడియ తా మగబాడి ప్రౌఢయై.
చ. కాముకుఁ డాపరానితమిఁ గ్రక్కున తేనుతుమోవినొక్కఁగా
భామిని యోర్వలేక కరపంకజనాళముల న్విదిర్పఁ ద
త్కోమలకంకణక్వణనగుంభితవైఖరు లందుఁ బర్వి ని
స్సీమముగా వినంబడియెఁ జెంతల నుండెడివారి కత్తటిన్.

ఆ వినోదంబులు వర్ణింప నవసరంబుచాలదు. ఇట్లావసికులు మహానందాంబుధిం
దేలుచుండు నవసరంబునం దత్సవిధాశస్థలంబున నొక శ్లోకంబు వినంబడియె.

శ్లో. దష్టం బింబధియా ధరాగ్ర మరుణం పర్యాకులో ధావనా
ధమ్మిల్లి స్తిలకం శ్రమాంబుగళితం ఛిన్నా తనుః కంటకైః

ఆః కర్ణజ్వరకారికంకణఝుణాత్కారం కరౌ ధూన్వతీ
కిం భ్రామ్యస్యటవీశుకాయ కుసుమాన్యేషా ననాందా గ్రహీత్.

[అవతారిక. రాజకుమారునితో జారరతి సేయుచున్న మందారమాలకుఁ దాని సంభోగచిహ్నంబులను అన్యవిధంబుగ నైనవిగా సమర్థించి దానివదినగారికిఁ దెలుపుచు సంశయంబుగలుగనీయక జారరతిసక్త యగుమందారమాలికను "నీవదిన వచ్చుచున్నది జారపురుషునిబాసి చిలుకను వెదకు నెపంబున పాతరలాడుచుండు" మని హెచ్చరిక సేయుచున్నది.

టీ. ఓకాంతా ! అరుణం అధరాగ్రం = ఎఱ్ఱనగు నీపెదవికొన, బింబధియా = దొండపండని భ్రమసిన (చిలుకచే) దష్టం = కొఱుకఁబడెను. ధావనాత్ = పరుగులిడుట చేత, ధమ్మిల్లః = కొప్పు, పర్యాకులః = చెదరిజాఱిపోయినది. తిలకం = నొసటిబొట్టు, శ్రమాంబుగళితం = శ్రమవలనఁగలిగినజలముచేతఁ గరఁగిపోయె. తనుః = నీశరీరము, కంటకైః = ముండ్లచేత, ఛిన్నా = చీల్పఁబడినది. ఆః = కటకటా, కర్ణజ్వరకారికంకణఝుణాత్కారం = చెవులకువినఁగూడక బాధగలిగించుచున్న రత్నకంకణముల ఝుణాత్కారము బయలుపడునట్లు, కరౌ = హస్తములను, ధూన్వతీ = విదిలించుచున్నదానవై, అటవీశుకాయ = అడవియందుఁ దిరిగెడు చిలుకకై. కిం భ్రామ్యసి = ఏల పరిభ్రమించెదవు. ననాందా = నీమగనితోఁబుట్టువగు నీ వదినెగారు, ఏషా కుసుమాన్యగ్రహీత్ = పుష్పములుగోయ నిదె వచ్చుచున్నయది.

తా. ఓముగుదా నీవేల యీయడవిచిలుకను బట్టికొనసమకట్టి యిట్టికష్టంబులనుభవించెదవు. నీయెఱ్ఱనియధరంబునుజూచి యీచిలుక దొండపండని భ్రమియించి మాటిమాటికిఁ గొఱికెఁగదా? ఆక్షతంబులుగాంచినచోఁ బరపురుషకృతంబులని సంశయింపరా! ఆచిలుకతోఁ బరుగెత్తుటంజేసి నీకొప్పుజాఱిపోయినది. కస్తూరీతిలకము శ్రమాంబువుచేతఁ గరఁగిపోయినది. మఱియును నీ శరీరమున నచ్చటచ్చటఁ బూబొదలలోఁ దూరుటంజేసి ముండ్లుతగిలి గీఁచులుగల్గినవి. కటకటా నీవు చెవులకు చీదరపుట్టునట్లు కంకణఝుణాత్కారముఖరంబుగఁ జేతులువిదిర్చుచు నీ యడవిచిలుకకుఁగా నేలతిరిగెదవు. నీవదినగారు పువ్వులుగోసికొనుటకు వచ్చుచున్నది. అది నిన్నుం గాంచి యన్యథాగా సంశయించును గాన మఱలిరమ్ము.]

అనియిట్లు వినంబడిన మందారమాల తనకెచ్చరికపలుకుచున్న విధంబుం దెలిసికొని తన వదినగారు తన సమీపమున కేతెంచుచుండుటకు భయపడుచు రాజపుత్రు నెడబాసి తటాలున నానికుంజంబుం దాఁటి తన భోగంకరణం బనుతారహారంబు చెత్తికొనిపోవుచున్న నన్ను వెంబడించివచ్చునట్లుగఁ బాతరలాడుచుండె. ఇంతలో చందనలేఖయను చంద్రసేనుని చెలియలును మదలేఖయుం నికుంజసమీపంబునకేతెంచిరి. అప్పు

డా చందనలేఖ మందారమాలను నిరూపించిచూచి "యిది తనకిష్టుం డగుజారపురుషునితో సంబంధపడినవిధంబు దీనియొజ్జలు తెలుపుచున్నయది. ఇది నాకెఱుకపడునని యీమదనలేఖ యన్యవిధంబుగ సమర్థించినది. ఔర యీమదనలేఖాచాతుర్యంబు మెచ్చందగినదియే. ఇంతలోపల నాజారపురుషుండు నీనికుంజాంతరంబుం బాసి పోవం జాలండు ఎవ్విధంబుననైన వెదకి కనిపెట్టవలయు" అనితలంచి యాచందనలేఖ యానికుంజాంతరంబుం జొచ్చి యచ్చటచ్చట వెదకుచుండ నందొకయెడ మూర్తీభవించినమన్మథుని చందంబున వెలుంగు రాజకుమారునిం గాంచి తదీయసుషమావిశేషంబుం గాంచుటచే మనంబు నచ్చెరువు ననురాగంబును విచ్చలవిడి నాక్రమింప ఱెప్పవేయక చూచి తలయూచి యావంచలాక్షీమణియు తనమఱందలిచౌర్యంబునకుం గోపగించుకొనుచు నిట్టి యనవద్యరూపరేఖావిలాసవంతుండగు పురుషపుంగవుంగన్న కన్నెలు మనంబున మరుబాధలకోర్వం జాలుదురే? ఇది మందారమాలయపరాధంబుగాదు. వీని సౌందర్యంబె యిందపరాధంబై యున్నది. అని తలంచుకొనుచు మదనలేఖతోఁగూడ నయ్యారణ్యంబునం గొన్ని పుష్పములుగోసికొని తనయింటికిం జనియె. మదనలేఖ కొంతదూరంబు చందనలేఖతోఁ జని యాకాంతనువీడ్కొని మందారమాలయింటికేతెంచి చిన్నబోయినవదనారవిందంబుతో నున్నయామన్మథవాడిం గాంచి ప్రియసఖీ మందారమాలా వెఱవకుము చందనలేఖవలన నీవృత్తాంతంబు బయలుపడునని భయంపడియెదవేమో? అది యట్టిది కాదు. రాజకుమారునిం జూచి తానును స్మరార్తయయి యున్నయది. అట్లు కాదేని బయలుపఱచు. ఇప్పుడు తన ప్రియునికేమైన సెగ్గు వాటిల్లునోయని విశదీకరింపదు. అని యిట్లూరార్చి మదనలేఖయును నారాత్రి మందారమాలతో స్నానభోజనాదులు నిర్వర్తించి సుఖంబుగనుండె. నేనును భోగోపకరణంబను హారంబుసుగొనిచని మందారమాల చేతికిచ్చితిని. అందుకు మందారమాల సంతుష్టాంతరంగయై నాకు ననేక భూషణంబులు బహుమతిగ నిడి చక్కిలిలు వెట్టి ముద్దిడుకొని లాలించె.

కలాలాప. నాయకా యమా రాజకుమారునితోఁ బొందు గోరియుండుమంద యానలు మందారమాలయు, మదనలేఖయు, మదనమాలయు, చందనలేఖయు వీరలిప్పుడెవ్విధంబున నాతనిం జేరఁగోరి ప్రయత్నంబు లొనరించి యున్నవారు.

మధుర. కలాలాపా వినుము. మదనలేఖయు మందారమాలయు నీదినముదయకాలంబున నేకతంబ రాజకుమారాసక్త కథాలాపంబు లొనరించుచుండిరి. అప్పుడేను మేలుకనియుండియు నిద్రించువాని తెఱంగున నుండియు వారల భాషణంబులు వింటిని. ఈ దినము సూర్యాస్తమయానంతరము రాజకుమారుండు కుసుమాకరోద్యానభూమిమధ్యసంబద్ధంబగు సముద్రగృహంబునకు వచ్చునట్లును, అచ్చటికి మందారమాలామదనలేఖలు పోవునట్లును అచ్చట మనుష్యసంచారంబు రాత్రి లేకుండుటం జేసి స్వేచ్ఛను

సారంబుగఁ గొంత తడవు కామినీకాముకులు విహరించి గూఢమార్గంబుగ తమతమ యిండ్లకుం బోవునట్లును, ఇందుకుం దగిన వెరవు కమలపత్రికంగాని యితరుల కెఱుకపడదు గాన నాకాంతామణింగొనిరమ్ము ప్రవర్తించవలయుననియుం నీవిషయంబు వారల ప్రసంగంబున నవగతం బయ్యె.

అని చెప్పుచుండఁగా నావృత్తాంతంబును లతానికుంజంబునం దాగియుండి వినుచుండిన చంద్రసేనుండు తన చేతనున్నదాని నొకకళవు బహుదీర్ఘసూక్ష్మదండాగ్ర సంయోజిత సూత్రంబగుదాని నతివేగంబునం బైకివిసరినం దానిసూత్రముఖంబున విలిప్తంబైయుండు బంక యాచిలుకల ఱెక్కలనంటుకొనిన రాజకుమారుండు దక్షిణంబున నాకళఁ బట్టి యీడ్చెను. అప్పు డాచిలుకలు రెండును కళాసూత్ర సంసక్తంబులయి రాజకుమారుని చేతికిఁ జిక్కి చేయునది లేకయుండఁగా నతఁడు వాని రెంటినిం దనయుత్తరీయంబునం గట్టికొని యతి త్వరితంబున నచ్చోటు వాసి తన యింటికిం జనియె. మంత్రికుమారుండు నున్నట్టుండి ప్రసంగము చిలుకలు నిలుపుటకుం గారణం బేమని యాలోచించి సమీపస్థలంబులకు దృష్టులు నిగుడించినఁ జంద్రసేనుని చేతికిఁ జిక్కులు దొరకకొనుటయుం నతండు కోపారుణముఖకమలుండై వికటగమనంబునం జనుచుండుటయుం నెఱుకపడఁగా దనమనంబున నిట్లు వితర్కింపసాగె. ఈచిలుకలు దంపతులుగాఁ జేరి వివిక్తదేశంబని యిచ్చటికివచ్చి లతానికుంజంబునం జంద్రసేనుఁడు దాఁగియున్నాఁడని యెఱుంగక తత్పత్ని యగుమందారమాలా వృత్తాంతంబు సర్వంబును బ్రసంగవశంబున దెల్పె; అది విని కోపాక్రాంతుండై చంద్రసేనుండు తనకివియెఱుకపడిన విషయంబు దెలిసికొని యీచిల్కలు సముద్రగృహంబునం జరుగఁబోవుజారభావంబున కంతరాయంబు గల్పించు. అట్లైన రాజకుమారమందారమాలలను బట్టి శిక్షించుటకు వీలు కాదు. అంతవఱకు వీనిం బట్టి తనయింటిపంజరంబున నునుచుట మంచిదనియెంచి యీపులుగులం బట్టుకొనియె. ఇది మన రాజపుత్రుని కనర్థాంకురంబు వాడమంటకు మూలంబగు. ఎదిజరిగిన నేమి? కాముకులు ప్రాణములనైనఁ బరిత్యజింతురు గాని ప్రాణనాయకీసందేశంబు నిరాకరింపరు. ఇప్పుడు సముద్రగృహంబునకుం బోవలదన్ననో రాజకుమారునికి మనోవ్యాకులత్వంబు గలుగక మానదు ఏమి సేయనగును? అని చింతించి చింతించి కొంతసేపటికి రాజకుమారుండు వోవునప్పుడు శరచాపంబులు ధరియించి ఖడ్గఖేటకంబులతో జనునట్లుమాత్రము సేయనగు. నేను నంతకుం జెంతలన పొంచి పొంచి వసియించియుండి సమయము వచ్చినప్పుడు సహాయపడనగు ననితలంచి యచ్చోటు వాసి తనయింటికిం జని యానాఁడు సాయంసమయమున సితచంద్ర సౌధంబునకుం బోయి రాజకుమారునిచేఁ దనమనోవృత్తిప్రకారము శరచాపంబులును ఖడ్గ

ఖేటకంబులు ధరియించి సముద్రగృహంబునకుం జనునట్లు ప్రతిజ్ఞ చేయించుకొని యచ్చోటువాసి రాజపుత్త్రుఁడు పోవుటకుముందె సముద్రగృహసమీపస్థలంబునకుం జని యొక సంకుచితస్థలంబున డాగియుండె. చంద్రసేనునాజ్ఞావశవర్తులై కొందఱు రాజభటులు సహస్రసంఖ్యలు మాఱువేషంబులు ధరియించుకొని వచ్చి యచ్చటచ్చట పొంచి పొంచి డాగుచుండిరి. బహుకాలంబుజరిగె. అప్పుడు కలకూజితంబును చతురికయును ఈరెండు చిలుకలునుంగలసి సముద్రగృహమునుండి వెలుపలికివచ్చి తత్సమీపవర్తి యగునొక రసాలవృక్షపుగొమ్మపయిం గూరుచుండి యనురాగపేశలంబుగఁ గొన్నిభాషణంబులుపలికి యొండొంటికి ముద్దుగొనుచు నుపగూహంబు సలుపుచు ననేకవిధచుంబనంబు లాచరించి యొండొంటితో మాటలాడుచున్నవి.

కలకూజితము. ప్రాణనాయకీ చతురికా కంటివే సందర్భచాతుర్యంబు. కమలవతీకళావతులసామర్థ్యంబు లేమనిపొగడందగును. ఈదినము మధ్యాహ్నము కళావతి మదనమాల యుండుసాగరధవళ సౌధంబునకువచ్చి తనయిచ్చవచ్చినట్లు లోకాభిరామంబుగ మాటలాడి "మదనమాలా తొల్లిమధుమంతోద్యానమునందు నీతోనొకించుక సుఖమనుభవించిన సితచంద్రసౌధవర్తి యగురాజకుమారుండు భవదీయసమాగమంబుంగోరి పంచబాణంగుల పరితాపపడుచున్నవాఁడు. ఆతనియవస్థలం గాంచినచో మావంటికఠినచిత్తలకును మనంబు గరంగుచున్నయది నీవంటి రసికవతంసురాలదిగనెనేని యతనికిదాసివై సర్వంబునతనికి వశగతంబుసేయకమానదు. ఈదినమతండు కుసుమాకరోద్యానమధ్యవర్తి యగుసముద్రగృహంబున కేకతంబనరుదెంచు. అక్కడకు నీవును చనుదెంచెదవేని సర్వంబు ననుకూలంబగు" నని చెప్పిన మదనమాల యంతకుమున్న రాజపుత్త్రసమాగమంబునకు నువ్విళులూరుచున్నదిగాన నందుకు సమ్మతించి సిగ్గుచేఁ దలవంచుకొని ముసిముసినగవులు నగుచుండె. ఆ సన్నయెఱింగి కళావతియుఁ గొంతతడవు తత్సంబద్ధాలాపంబులఁ బ్రొద్దుపుచ్చి సాయంసమయంబున నా కాంతామణికిఁ బన్నీటం జలకంబాడించి చలువవలువ ధరింపంజేసి సమస్తాభరణంబు లలంకరించి చందనకుసుమతాంబూలంబులొసంగి తానును యథోచితాచారంబుగ నలంకరణాదుల నిర్వర్తించుకొని మదనమాలను వెంటఁబెట్టుకొని సాగరధవళమునుండి నిర్గమించి యింతకుముందుఁ దనకుఁగూడ నపరిచితంబై యుండు నొకగూఢమార్గముగుండ సముద్రగృహంబునకు వచ్చుచుండె. ఏనును వారలవెనువెంటవచ్చుచుంటిని. ఇట్లాగూఢమార్గమునం గొంత దూరం బరిగి కళావతీమదనమాలలు సముద్రగృహమునంతరంబున నుండు సురంగమున నిర్గమించిరి. నేనును వారిలంబాసి యాగృహమధ్యవర్తి యగు రసాలపాదపంబుపై కెక్కితిని. అందొకచో రాజకుమారుండును మందారమాలయు నొకపొన్నమ్రానిక్రిందం గూరుచుండి సరసాలాప సుధాధారలం గ్రోలుచుండిరి. అప్పుడు కళావతి నను

కటనొడిగి దూరంబున నిలువంబడిన మదనమాల యభ్యంతరస్థలంబునకుం జనియె. అప్పుడా రాజకుమారుండు ప్రేమాతిరేకంబునం దనకంఠమునం దుండు జీవరక్షకరణం బను హారంబును మందారమాలా కంఠంబునసైవ మందారమాల నెనగళంబున నుండు భోగంకరణ హారంబును వానికంఠంబున నిడి యాహారసౌందర్యంబును కన్నులు జల్లవడం జూచుచుం గౌఁగిలించి కుచకుంభయుగంబున నాథునియురంబు ముద్దుగొనుచుండె. అతర్కితోపనతం బగు తద్భాగమునంబున మందారమాల యెడలు ఝల్లునం దిగిచూచి భయసంభ్రమంబులతో నచ్చోటు వాసి మఱియొకచోటికిం జనియె. మదనమాలయుం దననాయకుం డితరకాంతం గూడి యుండుటం గాంచినదిగాన మనంబున నీర్ష్యాతిశయము జనియించి నాథునిమొగంబుం గాంచనొల్లక బొటనవ్రేల నేల వ్రాయుచు నవనతముఖాబ్జాతంబుఁ గేలఁ ధరియించి నిలువ నది గని రాజపుత్రుఁడు మదనమాలయొద్దకు వచ్చి యాకాంతామణిహస్తంబు తనహస్తంబునం బట్టి యనేకవిధానునయాలాపంబులు పల్కుచు నిట్లనియె.

శ్లో. శేతే శీతకరోంబుజే కువలయద్వంద్వా ద్వినిర్గచ్ఛతి
స్వచ్ఛా మౌక్తికసంహతి ర్ధవళిమా హైమీం లతా మంచతి
స్పర్శా త్పంకజకోశయో రభినవా యాంతి స్రజః క్లాంతతా
మేషోత్పాతపరంపరా ప్రియతమే జీవస్పృహాం కృంతతి.

[టీ. ప్రియతమే=ఓ ప్రాణనాయకీ, శీతకరః=చంద్రుఁడు, అంబుజే=కమలము నందు, శేతే = పరుండియున్నాఁడు. కువలయద్వంద్వాత్ = నల్లకలువలజంటనుండి, స్వచ్ఛా=ధవళమగు, మౌక్తికసంహతిః=ముత్తియంబులసమూహము, వినిర్గచ్ఛతి=బయలు వెడలుచున్నది. ధవళిమా=తెల్లందనము, హైమీంలతాం=బంగారపుదీఁగియను, అంచతి=పొందుచున్నది. పంకజకోశయోః=తామరమొగ్గలయొక్క, స్పర్శాత్=స్పర్శమువలన, అభినవాః స్రజః=క్రొత్తపూలమాలికలు, క్లాంతతాం యాంతి=వాడిపోవుచున్నవి. ఏషోత్పాతపరంపరా=ఈయుత్పాతములవరుస, జీవస్పృహాం = ప్రాణములయందలి యిష్టమును, కృంతతి=గిల్లివేయుచున్నది. లోకమున నెవ్వని కుత్పాతములు వరుసగాఁ గనంబడునో వానికి మరణకాలము సమీపించుటం జేసి జీవస్పృహ చెడిపోవునుగదా. అట్లు నాకు నుత్పాతపరంపరలు కనంబడుటం బట్టి యిఁక నే బ్రతుకుట దుర్లభమని తలంచెదను. చంద్రుఁడు తనకువిరోధ మగుకమలంబుపై బరుండుచున్నాఁడు. తెల్లనిముత్యముల గుంపు శుక్తికలం గలుగుట సహజమై యుండ నల్లగలువలనుండి వెడలుచున్నది. బంగారపుదీఁగె యెల్లకాల మెఱుపుమీఱినదిగానే కనఁబడుచుండు. అట్టిదానికిం దెల్లఁగాంతి క్రమ్ముకొనుచున్నది. పుష్పమాలలను దాఁకినచో పుష్పములు వాడిపోవుట యిదివరకుఁ గానము. ఇపుడు క్రొత్తపూదండలు తామరమొగ్గలపైఁ దాఁకి వాడుచున్నవి. ఇవియు

న్నియుం నుత్పాతకముల వరుసలు. ఇట్టి యుత్పాతములం గాంచితివిగాన నీకనేను ప్రాణముల నిల్పుకొననోపను అని తాత్పర్యము. కమలమునందు జంద్రుడు వరుండె ననఁగాఁ గమలమున ముఖము ధరింపఁబడియున్నది; కువలయద్వయమునుండి స్వచ్ఛమగు ముత్తెపుగుంపు వెడలుచున్నది యనఁగా శోకవేగంబుచేఁ గన్నులనుండి బాష్పధారలు గుంపులు గుంపులుగాఁ గారుచున్నవి; బంగారుతీవియందుఁ దెల్లందనము కలుగుచున్నది యనఁగా నొడలు తెల్లబాఱుచున్నది. తామరమొగ్గలు తాఁకి క్రొత్తపూమాలికలు వాడుచున్నవియనఁగా దీని స్తనకుట్మలములయందు వియోగజ్వరంబు పెచ్చువెరిగి యుండుటం జేసి యవి తాఁకఁగానే యిప్పుడు క్రొత్తగా నిడినపూలమాలికలు వాడిపోవుచున్నవి. ఈ వియోగజ్వరమును జూచి నాప్రాణంబులు నిల్వవు. అని భావము.]

అనిచెప్పిన మదనమాలయు నించుకకోపంబుతో మరలిచూచి సమీపంబునఁ గళావతి యున్నదని యనుకొని యో కళావతీ ఈ రసికశేఖరునికిం బ్రాణంబులకంటె బ్రియతమయగు మందారమాల సమీపంబుననుండఁగా నా పదుపాట్లఁగాంచి ప్రాణంబులు మానుట యొకయక్కజంబుగాదే! అదియునుంగాక యీతని ప్రాణంబులును శరీరంబును తదధీనంబులై యుండ ప్రాణంబులు వదలుట కీతని కేమిస్వాతంత్ర్యమోయెఱుంగము. అని కోపరూక్షంబుగాఁబల్కు రాజకుమారుండును దాని మొగంబు తనకరంబునం బట్టి యెత్తి మరల నిట్లనియె.

శ్లో. చక్షు ర్జాడ్య మపైతు మానిని ముఖం సందర్శయ శ్రోత్రయోః
పీయూషస్రుతిసౌఖ్య మస్తు మధురాం వాచం ప్రియే వ్యాహర
తాప శ్శామ్యతు మే ప్రసాదశిశిరాం దృష్టిం శనైః పాతయ
త్యక్త్వా దీర్ఘ మభూతపూర్వ మచిరా క్రోధం సఖీదోషజమ్.

ఓప్రాణనాయకీ నన్ను సఖీజనము నిర్బంధించుటచేత నిప్పుడ యిట్టిదోషంబు నాయందు సంభవించెను. ఇట్టియపరాధం బింతకుముందు నేఁజేసినవాఁడఁగాను. ఇందుకై నీవు దీర్ఘకోపంబుధరించితివి. ఓమానినీ యిది మాని నీప్రసాదసుముఖం బగు ముఖంబుం జూపుము. నాకుం గన్నుఁగవంగలిగియున్న జాడ్యము నివర్తించిపోనుగాక. మఱియుం నమృతవర్షము వర్షించుటవలనం గలిగిన సౌఖ్యమబ్బునట్లు అతిమధురమగు నొకవాక్యము నాతోమందలింపుము. నీకరుణారసశీతలంబులగు కటాక్షంబులు మెల్లన నాపైఁజల్లుము. నావిరహవేదనాయాసంబునమైన జ్వరతాపము చల్లారి నాకు సౌఖ్యంబు గలుగుఁగాతయని వేడికొనుచుండె. అట్టిసమయంబున నాసముద్రగృహమధ్యదేశంబున నించుకదూరదేశంబున నిరువురు కాంతలు పరస్పరము మాటలాడుకొనుచుండు విధంబు వినంబడిన నేనును నాదిక్కునకు మిగుల వ్యాపించియుండు నారసాలశాఖకు

మఱియొకదానికిందాఁటి వారియాలాపంబులు వింటిని. అందొకతె ఓ తరళికా యా పురుషపుంగవుండు ఈదినము రాత్రి యీసముద్రగృహంబు నలంకరించునని నీకెట్లు తెలిసె. తరళిక. ఓ ప్రియసఖీ చంద్రరేఖా యీ దినము సాయంసమయమున నేను సాంఖ్యాయనికిం బూజాద్రవ్యంబులు సమర్పించి యాభగవతి చంద్రచూడపూజా విధానంబున కుపక్రమింపఁగా నది ముగియునంతలో మరలరావచ్చునని తలంచి నీయన్న యగు చంద్రసేనుఁడు వేటాడివచ్చుటం జేసి శ్రమాకులుండై యుండునుగాన వేగిరంబ సాయంతనస్నానమునకు శీతోదకంబులు పాటలీపున్నాగోశీరకాశ్మీర చందనమందారాదివాసితంబులు గావించి స్నానశాలకుం గొనిపోవఁ బరిచారికలకు నాజ్ఞయిడియున్నదానఁగాన నదిపరీక్షింపనెంచి యతిత్వరితగతి రాజసౌధంబునకుం జనుచుంటి. అప్పుడు కమలవతి యొకనవరత్నహారంబుంగొని సితచంద్రసౌధంబునకుం బోవుచుండి మధ్యమార్గంబున సమ్ముఖాగత యగుకళావతిం గాంచి నిలిచినయది. అపుడు కళావతియును సమీపంబున కేగుదెంచి యోకమలవతీ యీ నవరత్నహార మెవరిది? ఎక్కడకుం గొనిపోయెదవు? అనియడిగె. కమలవతియు నిది జీవంకరణమను పేరంబరగు హారము. సాంఖ్యాయని రాజకుమారునికిం బ్రేమపురస్సరంబుగనిడినది. ఈ దినముదయమున మంత్రికుమారుండు దీనిని తనకు రెండవహృదయం బనందగు నాచేత నతనికంపినవాఁడాయె. మంత్రికుమారుండు ఈహారముం గాంచి యిది దివ్యమణి నిర్మితంబుగాన మహాప్రభావసంపన్నంబు; ఈహారంబుధరియింప రాజకుమారుండె తగును; అనిచెప్పి మరల నాచేత రాజకుమారుని సన్నిధికంపించి యున్నాఁడు. ఆ రాజకుమారుండు నీ దినము సాయంతన క్రియలు ముగింపుచేసికొని వేగమె యొంటరిగ కుసుమాకరోద్యానమున నుండు సముద్రగృహంబునకుం జనఁ బ్రయత్నపడుచున్నవాఁడు. ఇది ధరించికొని తానచ్చటకుంజన మదాగమనంబునకు వేచియుండు. త్వరితగతిం జననగునని చెప్పి వేగంబ చనియె. కళావతియు మదనమాలయుండు సౌగంధశాలంబునకుం బోయె. నేను వారు మాటలాడుచుండినచోట నొకకదళీతరువు మరుగున నిలిచి యిది వింటిని. ఓచంద్రరేఖా నీవు మధుమాలతోద్యానమునకుం జని మరలివచ్చినది మొదలు నిన్నన్యాదృశఁగాఁ దలంచుచున్నాను. ఒకవేళ సితచంద్రసౌధవర్తి రాజకుమారుండు నీకుం దృష్టిగోచరుండై యుండనోపు. కాదేని యింతలోపల యీ మేనితాపంబును ఇంచుకించుక గనంబడు పాండిమయును నుత్కంఠాకులత్వంబును గలుగుట యెట్లు? నిక్కువంబుగ నాతండె నీమనోవర్తియయి యుండునని నిశ్చయించుకొనుచు రాజసౌధమునకుంజని పరిచారికలు తమ తమ కార్యములయందు జాగరూకలై యుండుటంగని యీసందర్భము నీకు విన్నవింతు ననియెంచి నీయుండు సౌధంబునకేగుదెంచితిని. నా మనంబునం దోఁచినపగిది నీవును దదాసక్తచిత్తవై యున్నావు.

చందనరేఖ. తరళికా యీసముద్రగృహంబునకుం గలగూఢమార్గంబు నీకు విదితంబైనతెఱంగెట్టిది? చతురిక. ఓచందనరేఖా నేను ఎల్లకాలము సాంఖ్యాయనికి సమీపంబుననుండుదానం గానా? ఆభగవతి యొకనాఁ డొకశిల్పికి సముద్రగృహనిర్మాణపత్రకంబు వ్రాసి చూపుచుండఁగా నే నచ్చోటికొకకార్యవ్యాపృతనై యరిగి దానం గొంత భాగంబుఁ జూచితిని. ఇంతలోపల నా యమ యాపత్రకంబుం దాచుకొని నా కార్యంబు సేయువిధంబు నెఱింగించి న న్నచ్చోటు వాపె. ఇందుం జోరనౌకమార్గంబు నాహృదయంబున నదిమొదలు విదితంబైయున్నది. ప్రియసఖీ స్నేహంబునం జేసి నిన్నిచ్చోటికామార్గంబునం దీసికొనివచ్చితి.

ఇవ్విధంబుగ తరళికాచందనరేఖలు మాటలాడుకొనుచుండుట లోననుండు మదనమాలయును కళావతియును విని భయసంభ్రమంబులు పెనఁగొనం దత్తరింప రాజపుత్రుండు వారలభయంబు బుడిపి యతిత్వరితగతి నచ్చోటువాసి చందనరేఖ యేతెంచు మార్గమువట్టి యాకాంతకెదురు నడిచి సమీపించుచుండె. రాజపుత్రునిరాక యెఱిఁగి చతురిక వెనుకకు వెనుకకు నొదిగి మెల్లమెల్లన దవ్వయిపోయె. రాజపుత్రుండును చందనరేఖం గాంచి యనురాగబంధురంబుగ; శ్లో. క్వ ప్రస్థితాసి కరభోరు ఘనే నిశీథే (కరభములవలె మీఁదబలిసినవై అడుగున సన్ననివియగు నగుతొడలుగల యోకాంతామణీ ఈ మహానిశీథమందు నీ వెక్కడికిఁబోవ బయలువెడలితివి) అని యడుగఁగా నా చందనరేఖయుం. శ్లో. ప్రాణేశ్వరో వసతి యత్ర మనఃప్రియో మే. (నామనః ప్రియుండైన ప్రాణనాయకుం డెక్కడ వసియించుచున్నాఁడో అక్కడికిఁబోవ బయలువెడలితి) అని యుత్తరమిచ్చెను. అది విని రాజపుత్రుఁడు. శ్లో. ఏకాకినీ వద కథం న బిభేషి బాలే. (ఓ కాంతా నీవు పసిదానవు. నీ వెట్లు భయపడక యొంటిగా వచ్చెదవు) అని యడుగఁగా నాయింతి. శ్లో. నన్వస్తి పుంఖితశరో మదనస్సహాయః. (మన్మథుఁడు తన ధనుస్సునెక్కుపెట్టుకొని నాకు సహాయుఁడై యుండలేదా) అని యుత్తరమిచ్చెను. అప్పుడు రాజకుమారుండు దానిచాతుర్యంబునకు సంతసించి యా నామాత్మీం గాంచు.

శ్లో. బాలే తవాధరసుధారసపానకాలే చేతో మదీయమభివాంఛతి శేషభావం

ఆలింగనే తవ విరోచనపౌత్రభావ మాఖండలత్వ మఖిలాంగనిరీక్షణేషు.

[ఓబాలామణీ నీచాతుర్యంబనన్యాదృశంబు. నీయొక్క సరసాలాపసుధారసంబుం గ్రోలి మహానందంబు నొందితి. ఇఁక నీమనోహరమగు నును మోవినొక్కి యాయధరామృతముం గ్రోలుటకుగా నామనంబున నాదిశేషుండనై యుంటినేని వేయినాలుకలచేఁ గ్రోలనగునుగదా యీయొంటినాలుకచే నాస్వాదింప సాధ్యంబుకాదని తలంచుచున్నాఁడను. మఱి నిన్నాలింగనము చేసికొనుటకుగా బాణుండనై యుండక పోతినే యని తలంతును. వేయికరంబులున్నచో నన్నింట నీమనోహరాంగంబుల నాలింగనం బొనరించుకొని యందునం గలిగినమహానందంబు ననుభవింపఁగలనే యనియుఁ మనోరథించెదను నీ ప్రత్యవ

యవనిరీక్షణంబునందును తదీయసుషమావిశేషంబు గనుంగొన నీ నయనద్వయంబు చాల
దని సహస్రనయనుండగు నింద్రుఁడనుగా నుండకపోతినేయని తలంచెదను.]

అని పల్కఁగా నా చందనలేఖయు నాతని చతురభాషణంబులకు లోన మెచ్చు
కొనుచు నేమియుఁబల్కక నవనతముఖకమలయై నిలుచుండె. ఓచతురికా నీవునప్పుడ
నాయుండుచోటికిం జనుదెంచితివి. మనమిరువురము నచ్చోటువాసి యీతియ్యమామిడి
గున్నపైకి వచ్చితిమి.

చతురిక. ప్రాణనాథా ఇదెచూడుము కమలవతి యిక్కడ కేగుదెంచుచున్నయది.
అనియిట్లు మాటలాడుచుండఁగాఁ గమలవతి యాసముద్రగృహపు దేహళీప్రదేశంబు
నకు సనుదెంచె. ఇంతలోఁ గళావతియుం నాకాంతామణితోఁ గలసికొని ప్రియసఖి
కమలవతీ! నీవిచ్చోఁ గనఁబడుచుండుటంజేసి మందారమాల రాజపుత్త్రుని మనో
రథంబు పూర్ణంబుగావింప నేతెంచినయదియని యెంచెదను.

కమల. మెల్లఁగాఁబల్కుము. ఔను. నీవేల యిచ్చటి కేతెంచితివి.

కళావతి. ప్రియసఖి నీవు జీవంకరణహారం బెత్తికొనిపోవుచు నన్ను సంధించి
రాజపుత్త్రుండు సముద్రగృహంబున కరుగు ననిచెప్పితివి. మందారమాల వచ్చెడివృత్తాం
తం బెఱింగింపక కార్యవ్యాపృతవై వేగిరంబ యరిగితివిగాన నేను మధుమంతోద్యాన
సమాగమంబు మొదలుకొని యామదనమాల యనుభవించు నతి దుస్సహవిరహవేదనా
యాసంబుఁ బ్రతిపదంబుఁగాంచుచు ననతిచిరకాలంబునన కాంతసమాగమంబు సమ
కూర్పనినాఁడు దీని ప్రాణంబులుండవని నిశ్చయించుకొని సమయంబువేచియున్నదానం
గాన నందు కిదియ యదనని యాకాంతం దోడితెచ్చితిని.

కమలవతి. భయసంభ్రమంబులతో నెదుటం గాంచి, ఓకళావతీ యేమి యీ
వింత. ఆకసంబున మేఘంబులులేకయ మెఱుపులు తళత్తళలాడుచున్నయవి.

కళా. నిరూపించిచూచి, శరీరంబు గడగడ వడంక, కమలవతీ యాతళత్తళలాక
సంబునం గలిగినవికావు. మనకు సమీపప్రదేశంబునం బొడసూపుచున్నయవి. మరల
దృష్టులునిగుడించి, అక్కటా రాజభటులు ఒరలువెఱికినకత్తులతో నిశ్శబ్దముగ నీసముద్ర
గృహంబును ముట్టడించుచున్నవారు. ఈకత్తులతళత్తళలు మనకు మెఱుపుఁదీగెలవలెఁ
దోచినయవి. ప్రియసఖీ యేమియనర్థకంబు. స్త్రీబుద్ధిచే సులభంబులుగఁ జేసిన పను
లిప్పుడందఱకును బ్రాణహానికరములై వచ్చినవి ! ఇందుకుం బ్రతివిధేయం బేమి
యున్నది మందారమాలా మదనమాలల నీయెదరునుండి తప్పించుటయెట్లు (అనుకొనుచుం
డఁగా) సముద్రగృహంబులోనుండు రాజకుమారుండు వారలపలుకులువిని ససంభ్రమం
బుగ వారలకడ కేతెంచి యోకమలవతీ యోకళావతీ మీరలు భయపడకుఁడు ; రాజ
భటులనైనను యమభటులనైనను మదీయచాపనిర్ముక్తంబు లగునారాచంబులందలలు
తరిగి యిలకుం బలిపెట్టెద. మీప్రియసఖు లగుమదనమాలామందారమాలల కొంకించుక

యైన చెడుగుకలుగనియ్యను. నాబాహుసాలంబునం డాగియుండు నాయండజరాజయా
నల దేవదానవసంఘములైనం దలయెత్తి చూడలేవు. అని వికటాటోపంబుతోఁ బరిక్ర
మింప లోపలనుండి మదలేఖ ఖడ్గఖేటకంబులును శరచాపంబులును గొని తెచ్చి రాజకుమా
రునిచేతికందిచ్చె. అవిదాల్చి యతఁడు యుద్ధసన్నద్ధుండై నిలిచిన రాజభటులందఱు
నొక్కుమ్మడి నాతని నెదిరించి పటుతరబాణపరం పరలంబఱపిన రాజకుమారుండును
కోదండంబు నెక్కుపెట్టి పైపైశరవర్షంబుగురియించిన నాశరంబులుదాఁకి రాజభటులు
తలలువొగిలియు, కంఠంబులు కుంఠితంబులయ్యు, బాహువులు ఖండితంబులయ్యు,
పాదంబులు విఱిగియు, డొక్కలు చెక్కంబడియు, ముక్కులు నికృత్తంబులయ్యు,
చెవులు తెగియు, చాపంబులు జాఱియు, శరంబులు విడిచియు, కవచంబులు చూర్ణంబు
లయ్యు, నడుములు తునిఁగియు, వీపులు విఱిగియు, ఊరంబులు వ్రగ్గియు, శౌర్యంబులు
స్రుక్కియు, ధైర్యంబులేమఱియు నిట్లనేకవిధంబులం జీకాకుపడి చెల్లాచెదరైరి.
అప్పుడు చంద్రసేనుండు తనబలంబులు రాజకుమారునిబాహుబలంబున కోడిపాఱుటం
గాంచి కోపంబుపెచ్చుపెరిగి ధనుర్ధరుండై యతనియెదుటికివచ్చి నిలిచి నారిసారించి
కన్నుల నగ్నికణంబులురాల వైరింగాంచుచు నతనిపైశరంబులుగురియింప నుద్యుక్తుండగు
చునుండె. ఇంతలో మందారమాలయు రాజపుత్రుని సమీపంబునకువచ్చి ప్రాణనాథా
మీరు నాతో సరసాలాపంబులాడునప్పుడు మీకంఠంబునయుండు సంజీవకరణహారంబును
నాకంఠంబున వైచితిరి. అంతలోపల మదనమాల యచ్చటికివచ్చుటం జేసి నే నభ్యంత
రంబునకుం జనిన మీరదిమఱచి మదనమాలాచంద్రసేనలతో మాటలాడుచు యుద్ధప్రసం
గంబుతటస్థించిన నదిమఱచితిరి. అది మీకంఠంబున లేనినాఁడు మీకపజయంబు వాటిల్లుఁ
గాన మీ రిది గ్రహించి గళంబున ధరియించికొని యుద్ధంబున జాగరూకతతోఁ బ్రవ
ర్తింపనగునని వేడుకొనియెద; అనిచెప్పి యాహారము నతనిగళమున కలంకారంబు
గావించి పురఃప్రదేశమునకు దృష్టులు నిగుడించిచక్కఁగాఁజూచి భయంబునుసిగ్గునుగదురఁ
దనలో నక్కటా నాయపరాధంబు కన్నులార నామగండె యిప్పుడుసూచె; నింకేమి
కావలయు! ఇదె నామగండు చంద్రసేనుండు ధనుర్ధరుండై వీరరసావేశంబున వెలుంగు
చున్నవాఁడు. నేను రాజపుత్రునికంఠంబున హారంబిడుటయుం బ్రత్యక్షముగఁ
గాంచినవాఁడయ్యె. ఇఁక నన్నుశిక్షింపకమానఁడు. స్త్రీలు స్వల్పబుద్ధులుగాన మీఁదె
ఱుంగక తీవియ లుపఘ్నంబులపయిం బ్రాకిన తెఱంగున సమీప వర్తులపయిమచ్చిక
తెచ్చి వారితో బెనంగి తుదకు గురుజనంబులచేతికిం జిక్కుకొని యిహమున దూరుపడు
దురు. నాగతియునిట్టులయ్యె. ఇదియంతయు నీకమలవలివలననైనదిగదా ? దానినేల
దూషింపఁబోవలయు. నాబుద్ధి యప్పుడు పెడతలఁబట్టెఁగదా ? ఇప్పుడు ప్రాణం
బులుపోవుటకు భయపడను. మానంబుపోవుటకుం జింతించెదను. అనుకొనుచుండఁ

చంద్రసేనుఁడు దానిం గాంచి సటలువెఱికిన సింగంబుపగిది మండిపడి యోసీతొత్తా వం
దారమాలా నీ పాతివ్రత్యంబు నేఁడు వెల్లిదంబయ్యె. నీ ప్రాణనాయకుని యెదుట నిన్నుఁ
గత్తి కోకకండగాఁ గోసి యిలకుం బలిపెట్టెద. ఇట్టిజారిణులు నగరంబుననుండుదురేని
తక్కినవారలును చెడుదురు. అనిచెప్పి రాజపుత్రునిం గాంచి యోరీ నరాధమా నీ ప్రాణ
నాయికలు నీ ప్రక్కన యున్నవారు. వారియెదుట నిన్ను యుద్ధరంగంబునకుం బలిపెట్టి
యనంతరము నీతోఁ గూడ నీజారిణులను శమనలోకంబునకనిచెదను. బహుదినంబులుగ
జరుగుచుండు నీదొంగతనంబు నేటికి బయలుపడినది. వీరలతోఁ బరలోకంబునం గాని
యీలోకంబున సుఖించుట నీకనువు పడదు. అని వీరాలాపంబులు వల్కఁగా రాజపు
త్రుండును కోపంబుతో, కం. మొగమున మీసము కలిగిన, మగవాఁడైతే కడిందిమగ
టిమిచేతం, దెగబడి పోట్లాడవలెన్, బిగువేమిరరాచములఁ జవిడుతునెరిన్నున్. అని
చెప్పుచు శరసంధానంబుం జేసి బాణంబులు ప్రయోగింపంబూని యందుకుం జేతులాడక
తనమనంబులో నిట్లు వితర్కించె. ఇంతులకేమిమోహకారణంబె యుంగను. ఇతనిపై బాణం
బులు ప్రయోగింపం జేతులాడవు. వనంబీతని గాంచినది మొదలు శృంగారాయత్తంబయి
వీరరసావేశంబుం దొరంగుచున్నయది. ఈతనికటాక్షంబు లతినీలంబులై హృదయ
మర్మంబు భేదించుచున్నయవి. ఈరాజపుత్రుఁడు ప్రయోగించినబాణములు పుష్ప
బాణములపగిది నాకు శరీర మర్మంబు భేదింపక హృదయస్థైర్యంబు పగులఁగొట్టుచున్న
యవి. ఇది చింతింపం జింతింప మనంబున కచ్చెరువై తోఁచుచున్నయదిగాని హేతువు
స్ఫురియింపకున్నయది. అదియనుకొనుచుండఁగాఁ జంద్రసేనుండును కోదండం బెక్కు
పెట్టి కోట్లకొలఁదిబాణంబులు రాజపుత్రుని పయింబఱపిన నతండు వానికన్నింటికోర్చు
కొని యనువుఁగని చంద్రసేనునిచేత నున్నధనువును తుత్తునియలుగ నఱికి యిలపయిం
బడవ్రేయఁ గోపోద్దీపితుండై చంద్రసేనుండు ఖడ్గఖేటకంబులు ధరియించి విజృంభించి
రాజపుత్రునిపైకి నడిచి యనేకవిధమండలభ్రమణంబులం దననేర్పుసూపుచుఁ గదంగి
చండతరభుజాదండంబున మండలాగ్రంబుం ద్రిప్పుచు వైరిశిరంబుఁ దెగవ్రేయఁగమ
కించి యుప్పరంబున కెగసి దెప్పరంబునఁ గత్తివిసరిన రాజకుమారుఁడు నతనివ్రేటునకుం
దప్పించుకొని యొప్పిదంబుచెడ నాచంద్రసేనునిహస్తంబున నుండుఖడ్గంబు భూమి
పయింబడఁగొట్టిన నతండు దంష్ట్రలువెఱికినం జేయునది లేక రోజుచున్న భుజంగంబు
చందంబునఁ దోఁచుచు భూమిపయి నిలువంబడియె. అది గని మదనమాలయుం మదలే
ఖయుం మొదలగు కాంతలు నవ్విరి. చంద్రసేనుండు వాదువారలనడుమ తనకుంగలిగిన
యవమానంబునకు మిక్కిలి యక్కసించుచుం జేయునదిలేకయుండ రాజపుత్రుండు
చంద్రసేనునిం జూచి ముసిముసి నగవులు నగుచు నిట్లనియె. ఓశూరశేఖరా నీవు ననుం
బట్టి శిక్షించెద నంటివి. ఇప్పుడు శరచాపంబులు నష్టంబులయి ఖడ్గఖేటకంబులు వదలి
విఫలమనోరథుండవై యున్నాఁడవు; ఈరెంటియందు నీసామర్థ్యంబుం గంటి; నింక

బాహుయుద్ధంబున నించుక సేపు వినోదింప జికీర్షంబయ్యెనేని యదియు నుపక్రమింతువు గాక. అందు నీకేమియుం దెలియదేని జితోస్మియని చెప్పి యీసుతనువులకుందహాసంబు నకుం బాత్రుండవై యింటికేగుము అని యిట్లు ధిక్కరించి పలికిన విని చంద్రసేనుండు కోపోద్దీపితుండై తనహృదయంబున "నిప్పుడు నేమారకయుంటినేని యిక నన్నెవ్వరు నీయూరం గౌరవింపరు; ఇప్పు డీకాంతాసమూహములు చేతులుతట్టి నవ్వెను; ఈయవమానంబు సహించుట మహాదుస్తరంబు. కాన నిప్పుడు చేతనైనంతవనుక నీతనితోం బోరాడిచూచెదను అని నిశ్చయించుకొని రాజకుమారునింగాంచి హుంకరించి యోరీ నీపతిప్రగల్భత్వమున మాటలాడెదవు. నాసామర్థ్యం బీబాహుయుద్ధంబున జూడుము. అని బాహువులప్పళించి ముష్టాముష్టింబెనంగ నుపక్రమించినం బరస్పరహస్తసంస్పర్శంబున నిరువురకును మేనంబులకలును సర్వాంగంబుల స్వేదసలిలంబు నుద్భూతంబులు కాంగా నదివదలి యిరువురును బెనకువకుందలంపడి లిగిచియుం ద్రోచియుం నెగచియుం నొగిలిచియుం నెత్తియుం మొత్తియుం పరిగాతగిలి యలఘుపాటవంబునంబోరి యొండొరులు మెడలంటంబట్టుకొని ఢట్టించినం బరస్పరాంగసంశ్లేషంబునం బొడము సుఖవిశేషంబునకుం వనంబులసొక్కి తొడలుతొడలతో భుజంబులు భుజంబులతో మోము మోముతో వక్షస్థలంబు వక్షస్థలంబుతోం జేర్చి యారాజకుమారులు మహానందంబు నొందుచు నసివెలిక దోపింపక యొండొరుల విడువనొల్లక బెనంగుచుండిరి.

సీ. ఉరముతో నురము భాసురరీతిం గదియించి పీడరు బహుచిత్రవేల్లనముల
మోముతో మోము సమ్ముఖముగాం గదియించి యొత్తుదు రలఘుధైర్యోద్ధతముగ
నూరువు లూరులం జేరిచి మెలియించి సారెకు నెదురెత్తి చౌకళింతు
రొండొరుచేతుల నొండొరు బిగియించి పాయరు దృఢబంధపాటవముల

గీ. రసికవరు లీవిధంబుగ వెస నియుద్ధకాంక్షం బెనకువ నలుపుటం గాంచ గాంచ
నల్లములం దోంచె సుమశరమల్లయుద్ధ రీతి సవిధోర్వి నుండునారీతతికిని.

అప్పుడు బాహుయుద్ధంబున నారాజకుమారులు పరస్పరాంగసంశ్లేషంబులేని యితరాంగంబుల నకృతార్థంబులంగాం దలంచుకొనుచు మిథ్యాకోపం బభినయింపుచు వీరరసావేశంబునం బోరుచుండువారి తెఱంగునం దోచుచు శృంగారరసావేశంబుం జరితార్థంబు సేయుచుండిరి. అట్టిసమయంబున సాంఖ్యాయని తరళికాముఖంబుగ వృత్తాంతంబు విని మహారోషావేశంబున నయ్యెడ కరుదెంచినం గాంచి రాజపుత్రులిరువురును మల్లయుద్ధంబు చాలించి యాభగవతికిం బాదవందనాదులు నిర్వర్తించి యధోముఖులై నిలువంబడిన నా యోగిని వారింజూచి మండిపడుచు రాజకుమారుని సంబోధించి యోరీ నిన్నింతదనుక ధర్మచింతాపరుండ వనియుం పరదారపరాఙ్ముఖుండ వనియుం శీలసంపన్నుండ వనియు నెంచి మించినరాగంబునం గుమారునిగ నెంచి పోషించుచుంటి. ఓమూఢహృదయా యదియైన నెనరున నుంచకపోతివి. మాయోపాయంబుల మందారమాలాది

కన్యకలకుఁ గన్యాప్రతహానిఁ గావించితివి. స్త్రీలఁగోరుట, వేఁటాడుట మొదలగునవి సప్త వ్యసనములనంబడు; నట్టివానియందుం దగులుకొన్నవాని మొగంబుఁ గాంచినను పాతకంబు సంభవించు. నీమొగంబుం గాంచి వేయిమాటలు చెప్పవలసినదిలేదు. నిన్నిదిమొదలు కారాగారబద్ధునిం జేసి యుంచవలసినదిగాన నీవందు కొడంబడవేని యిప్పుడీశాపాగ్నిచే నిన్ను భస్మంబుసేయక మాననని చెప్పిన రాజకుమారుండును వినయభయభక్తులు దోఁప భగవతి సాంఖ్యాయని యిది నీకు స్వాధీనంబగు జనంబు. నీవిందెవ్విధి నొనరించినను సరే. తప్పుకుఁ దగినదండనం బొనరింపవలసిన గురుజనులకుం దగవు. దాసజనంబునకు నడఁగి యుండుట మేలు. అని విన్నవించుకొనఁగా సాంఖ్యాయని యోరిదొంగా చేసినపనులు చేసి పైపైమాటలాడెదవా యిట్టివాఁ డీయూరనున్న సెట్టికొట్లైనం జెసుదురు. ఈకాంతా తిలకంబులం గలంచినందుకై నిన్నును, నీతో సంగరంబునల్పినందుకై యీచంద్రసేనుని నీతోఁ జేరి తమతమపాతివ్రత్యంబులు గోలుపోయినందుల కీమందారమాలా మదన మాలా చందనలేఖలను, మీకు సహాయంబు లొనరించి మిమ్మీవిధంబుగఁ జెఱచినకార ణంబునం బట్టి యీకమలవతీ కళావతీ మదనలేఖలనుబట్టి కారాగారనిబద్ధులం జేయ నిదె వచ్చియున్నదానను. అని చెప్పి యచ్చటనుండు రాజభటులం గాంచి యోరి వీరి నిరువురం బట్టి పాతాళగృహంబునం బెట్టుఁడు. మదనమంజర్యాదికాంతలను చెఱసాలనుంచి యానా స్థలంబుల స్త్రీజనంబులఁ గాఁపుంచందగు నని వారినిరువురను రాజభటులు పట్టుకొనిపో యిన యనంతరము తరళికాదికాంతలచేత మందారమాలాది స్త్రీలను జెఱసాలం బెట్టించి మించిన కోపంబున రాజసౌధమునందుండె. మంత్రికుమారుండును తనస్నేహితునికిని మదన మాలాదికాంతలకు సంభవించిన దుర్దశావిశేషంబునకు మనంబున దుఃఖించుచుం దన యింటికిం జనియె.

మరునాఁడు భగవతి సాంఖ్యాయని యొకభటునిచేత మంత్రికుమారుని రప్పించి చంద్రసేనునిచేత నుండు రాజమోహరుగల యంగుళీయకంబుం దీసికొని మంత్రికుమారుని చేతికిచ్చి సర్వపరిజనులం బిలిచి యిప్పుడు సుందరీమందిరాధిపత్యమునుండి, చంద్రసేనునిం దొలంగించి యాచోట మంత్రికుమారు నునిచితినిగాన నిఁకనందఱు నీతని రాజుగా భావించుకొనుచుఁ దదాజ్ఞావశవర్తులయి ప్రవర్తించుచుండఁదగు నని యాజ్ఞయిడి మంత్రి కుమారునిం గాంచి యోకుమారుఁడా యాధిపత్యంబుగల్గెనని గర్వింపఁబోకు. ఎవ్వరెవ్వరి యెడ నేయేవిధముగఁ బ్రవర్తింపవలయునో యది యెఱింగి ప్రవర్తింపుము. పరిజనుల యందు మిగుల దయతో మెలంగుచుండుము. రాజ్యకార్యములయం దప్రమత్తుండవై నడువుము. పాతాళాగారంబున నునిచిన రాజకుమారులఁ బాటించుచు మందారమాలాది కాంతల కష్టసుఖంబులు చేటికాముఖంబుగ విచారించుచుండుము. బుద్ధిచాతుర్యం బుతో మెలంగుచుండెదవేని మేలుగల్గునని వచించి రాజ్యకార్యములన్నియుం నతనికొప్ప గించి తాను తనయుటజంబునకుఁ జనియె. మంత్రికుమారుండు తనకాధిపత్యంబు గల్గుటకు

సంతసింపక తనకుఁ బ్రాణమిత్రుఁడగు రాజకుమారుని గావవలయుంగదా యని మనంబున మనోరథించుచుండె తనకుఁ బ్రియులగు వారలుఁగొని రాజపుత్త్రుని కన్నుపాన స్నానానులేపనాదుల నా పాతాళగృహంబునన నిర్వర్తింపించుచుండె. మఱియాహారమాల్యాదులకు నెవ్విధమగు కొఱంత లేకుండ సమస్తవస్తు సంభారంబుల నాయత్తపఱిచి పంపి వశవర్తినులగు పరిచారికలవలన సమస్తోపచారంబులు జరిపించుచుండె. ఆతని యధికారమునందు రాజపుత్త్రాదులకుఁ దమయిచ్ఛవచ్చిన చోటుం దిరుగుటకు వీలుపడక యొకచోట నుండవలసిన నిర్బంధ మొకటిగాక తక్కిన కష్టంబేదియు లేదు. ఇట్లు కొన్నిదినములు జరిగిన యనంతరము మూఁడవనాఁడు కొందఱు పరిచారికలు రాజపుత్త్రులుండు పాతాళగృహంబుఁదెఱచి యందుఁ జంద్రసేనునిఁ గానక సంతపించుచు నాగృహంబెల్ల వెదకి చూచి యెచ్చటను గానక యపరాధిని బోవిడిచినందుకు మంత్రికుమారుండు కోపగించుకొనక యుండునే యని భయపడుచు రాజకుమారునియొద్ద కేగుదెంచి చంద్రసేనుం డెక్కడనని యడిగిన నాతండును ఓ పరిచారికలారా మీరు వచ్చినప్పు డిక్కడనయుండె నెటకేగెనో యెఱుంగనని యుత్తరము చెప్పెను. మృచ్ఛిండబుద్ధులగాన నది సత్యమని యెంచి చంద్రసేనుఁడు లేమికి విచారగ్రస్తలయి యచ్చోటుఁ బాసిచని చంద్రసేనుఁడు కారాగృహంబునుండి తప్పించుకొని పోయెనని మంత్రికుమారునికిం దెల్పిరి. మంత్రికుమారుండు వృత్తాంతంబువిని యిట్లు వితర్కించె. భగవతి సాంఖ్యాయని యనతి చిరకాలమునన నాకు రాజ్యంబప్పగించినయది. పాతాళగృహమునుండి యపరాధియగు వాఁడు తప్పించుకొని పోయెనను ప్రసంగము చెవికెక్కెనేని నాపై నాక్రోశింపక మానదు; ఏవిధంబుగనైన నాచంద్రసేనునిం బట్టుకొని తేఁ బ్రయత్నపడవలయు" నని వితర్కించి పలాయిత చోరగ్రహణాధికారంబున నున్నవాని నొక్కని రప్పించి వానికి "నీవు చంద్రసేనునిం గాంచియున్నావుగదా? తదాకార సదృశంబు లగుభావ చిత్రంబులు గలపటంబు లనేకంబు వ్రాయించి సమస్తదేశాధీశులకుం బంపవలసినది. ఆ పటంబులందెల్ల సుందరీ మందిరాధిపతి చంద్రసేనుండు అపరాధియై పరువిడిపోయె నతని యాకారం బీపటంబున వ్రాయంబడియున్నది. కనుగొన్నవారతనిం బట్టియుంచి మాకుఁ దక్షణంబ తెలుపవలెను. అని వ్రాసియుండనగు. ఇట్టిది శీఘ్రంబునం జరిపింపుము" అని యాజ్ఞసేయ నాయధికారియునట్లుచేసి చంద్రసేనుని పటంబు లనేక దేశాధీశులకుం బంపె. క్రమక్రమంబుగ నీపటంబొకటి కళింగదేశాధిపతి యగుదీర్ఘబాహువుహస్తంబునందె. దీర్ఘబాహుండును బహుకాలమునుండి పుత్త్రికావిరహంబుచేఁ బీడితుండై యున్నవాఁడుగానఁ దదాకారం బమరియుండు చిత్రపటంబును బ్రత్యుత్ఫుల్లలోచనుండై కని తన మనంబున నిట్లువితర్కించె. ఇప్పు డీ పటాంతరవర్తి రాజకుమారుని యాకారంబు చక్కఁగా నిరూపించి చూచినం బురుషాకారంబుగాదని నిర్ణయింపఁజనును.

సీ. ఉరమున వక్షోజగిరులించుకించుక యుత్తరీయము పైకి నుబ్బుసూపె
క్షామోదరమనోజ్ఞ సీమ నూనూఁగారుచాయ పొల్పెసలారుచుండ మొదవె
నధరంబు పక్వబింబానూనరాగంబుఁ గొల్లలాడుచునన్నకుదురు సూపె
బాహువుల్ నవలతాశ్రీహారత్వము నొందె సరసమృణాళసచ్ఛాయఁ దనరె.

గీ. చిత్రరూపంబుఁ బరికింపఁ జేడె యనుచు, దోఁచుచున్నది యందు సంస్తూయమాన
చరిత యైనమదాత్మజ చంద్రసేన, యిదియె యని చెప్ప నొప్పగు నెంచిచూడ.

అదియునుంగాక నాతనూజాత యగుచంద్రసేన తనకుం బ్రాణప్రియం బగులలితాలకకును వనభూషణంబునకును బరిణయంబు సేయించుట కుపవనమునకుం జని మరలి రాదయ్యెను తత్పరిణయోత్సవంబునకు వచ్చియున్న పౌరకన్యా కదంబంబు గంధర్వహరణంబున సంత్రస్తంబై పరుగిడి చంద్రసేనాగతి యిట్టిదయ్యెనని యెఱుంగకయ యున్నది. చంద్రసేన నపహరించుకొని పోవవచ్చి యాభిక్షుకి చేసిన యింద్రజాలం బది యని తోఁచెడిని. తుదకదియ దానినపహరించి యున్నదియని నిర్ణయించెదను. ఈ సుందరీమందిరంబునం జంద్రసేన దొరకుటకు సందియం బేమియునుండదు. నేను చతురంగబలసమేతుండనై చని సుందరీమందిరంబు ముట్టడించితినేని వృత్తాంతము వెల్లడంబగు. అని యెంచి యా పటముఁ దెచ్చినవాని కపరిమిత ధనంబులిచ్చి యా నగరంబునకుం బోవు మార్గంబుఁ దెలిసికొని సకలసైన్య సమేతంబుగా గదలి కతిపయప్రయాణంబుల సుందరీమందిరంబుఁ జేరి యానగరంబు ముట్టడించెను.

ఇట్లు కళింగదేశాధిపతి సుందరీమందిర నగరంబు ముట్టడించి జనులకుమాత్రము విరోధము చేయవలదని సైనికులకాజ్ఞ చేసి రణభేరి వాయింపఁబంచిన నప్పుడు ప్రళయకాలభైరవుని చేత నుండు ఢక్కా పదునాల్గులోకంబులు నతలసుతలంబు లానటులు కఠోరధ్వనులు వెలయిడు చందంబున సైనికకరవాదితం బగురణభేరి ప్రళయకాలమేఘ గర్జాధ్వనుల నాకసంబుఁ బఱప నుపక్రమించె. ఇట్లు తనసైనికుల యుద్ధసన్నద్ధులుగానుండఁ బనిచి యాదీర్ఘబాహువు ఒకదూతం బిలిచి కొన్నిసంగతులు సుందరీ మందిరాధికారికిం దెల్పనాజ్ఞయిడి యాతని యొద్దకుం బనిచిన దూత మంత్రికుమారునకుఁ జేతులు మోడ్చి యిట్లు దెల్పుచున్నాఁడు. ఓ మంత్రికుమారుఁడా కళింగదేశాధిపతి దీర్ఘబాహువు తన కూతురగు చంద్రసేన యీనీనగరంబుననుండుటయెఱింగి దానివిడిపించుకొనిపోవ నడుకట్టి యుద్ధసన్నద్ధుండై సుందరీమందిరము నుముట్టడించి యిప్పుడీవృత్తాంతంబు నీకుం దెల్ప నన్నంపియున్నవాఁడు. చంద్రసేనను సమర్పించితివేని ప్రాణంబులతో నుండఁగలవు. అట్లు చేయవేని నీనగరంబుఁ బెల్లగించి నిన్నుఁబట్టి వధియించి తావచ్చినకార్యంబు నెఱవేర్చుకొనువాఁడు. చంద్రసేనను సమర్పించిననుసరే ! యుద్ధమునకు వచ్చిననుసరే! యిది మాయధిపతి చెప్పిపంపిన వృత్తాంతంబని చెప్పి దూతయు నందుకుత్తరం బేమియో యాసం

గని మంత్రికుమారుని వీక్షించి తనరాజుకడకుఁ జనియె. మంత్రికుమారుండును
సాంఖ్యాయనుని యాజ్ఞానుసారముగ [illegible] దీర్ఘబాహువుతోఁ బోరుటకు
నుపక్రమించి తనవిక్రమంబునఁ గళింగదేశాధిపతి [illegible] నొక్కరుండ
యశ్వారూఢుండయి యుద్ధరంగంబున నంతకాకారుండయి వాక్రుచ్చి [illegible]
యాతని సైనికులెల్లఁ జంపి కళింగదేశాధిపతి [illegible] తుల దన నోడించి యతని
మాత్రము వదలిపెట్టి విజయలక్ష్మీవిభాసమానుండై తన నగరంబునకుఁ జనియె. అట్టి పరా
క్రమశాలి యగు కళింగాధిపతిని జయించిన మంత్రికుమారుని శౌర్యంబు సకలజనంబులును
బొగడుచుండిరి. అంత నవమానితుండై దీర్ఘబాహుండు నిశ్చిత దూతలం బిలిచి వారితో
మీరు మహాజవంబు లగు నశ్వవరంబుల నారోహించి యొకండు చిత్రకేతన పట్టణంబున
కును మఱియొకండు కాంపిల్యనగరాధిపతి యగు జయవర్మ కడకును జని మత్సహాయా
ర్థంబు దోడుకొని రావలయునని యాజ్ఞ చేసి పంపిన దూతలట్లు చని దీర్ఘబాహువృత్తాం
తంబుం దెలుపఁగా చిత్రకేతన కాంపిల్యనగరాధిపతు లగు శత్రుంజయ జయవర్మలు
బహుసైన్యసమేతులై దీర్ఘబాహు సహాయార్థంబుగ సుందరీమందిర ప్రాంతంబున నుండు
నతనియొద్దకు వచ్చి చేరిరి. ఇట్లు బలవంతులగు రాజులు సుందరీ మందిరంబును ముట్టడిం
పఁగా ననవరతంబు గజఘటాఘీంకారంబులును శూరభటసింహనాదటంకారంబులును ప్రజ
నహాయహోహావిరావంబులును. అనవరతతాడిత భేరీపటహధమధమధ్వానంబులును
బెరసి దిశాగజంబులకుం జెవులు చీదరఁబుట్టింపుచు బ్రహ్మాండంబు బ్రద్దలు వాపుచుండె.
మరల నను రాయత్తుండై మంత్రికుమారుండు సమ్ముఖంబునకు రాదొడంగె. బాహుపరాక్రమంబున
నోడించి వారలసైన్యంబులం బెక్కింటిని రూపుమాపిన శత్రుంజయుండును దీర్ఘబాహు
వును జయవర్మయం నొకచోటఁ జేరి యిట్లు చింతించిరి. సమస్తదేశవిఖ్యాతకీర్తులమగు మన
బాహువీర్యంబును పరాక్రమంబు నొకకుమారునియొద్దఁ గుంఠీభూతంబులై చెడిపోవు
చున్నవి. ఆకుమారుండు నమితసాహసవంతుం డనియుం వీని నెదిరించి జయించుట మనకు
సాధ్యంబుగాదనియుఁ దోఁచెడిని. ఇంకొకయుపాయమువచ్చి వీనిని జీవగ్రాహంబుగఁ
బట్టికొనుట మనకుఁ దగవు. అది యెట్లంటిరేని! మనము కుమారునితో సఖ్యంబుగోరినట్లు
నటించుచు నతని నిచ్చట రప్పించి మనయెడల విశ్వాసంబునొంది వర్తించుచు నాయుధ
విహీనుండై యుండునపుడు పట్టుకొని కారాగారనిబద్ధుం జేసి యనంతరము సుందరీ
మందిరంబునం బ్రవేశింపఁదగు. అని యాలోచించి యందుకుం దగినదూతలను బనిపిన
వారు మంత్రికుమారునొద్దకువచ్చి శత్రుంజయుండును జయవర్మయుం దీర్ఘబాహువును
నీపరాక్రమంబునకు మెచ్చి నీతో సఖ్యంబుఁ బాటించియుండుటకుం గోరికవొడమి
యున్నది మీరువిన్నవింపుచున్నారని చెప్పఁగా మంత్రికుమారుండును వారిమాటలనువిని
సాంఖ్యాయనునికిం జెప్పిపంపి తదాజ్ఞాప్రకారంబుగ సఖ్యంబున కొప్పుకొనియె. మంత్రి
కుమారుండు నిష్కపటహృదయుండై వారలుండు పటకుటీరంబులకుంజనుచు వారలతో

సరసాలాపంబులు సేయుచు వారల మిగులగారవించుచు వారలతో నిష్టగోష్ఠీవిహారంబులు సలుపుచు విశేషప్రీతియోగంబున రాజ్యవిచారణకాలంబుగాక తక్కినసమయంబులందు వారందుచోటుల వర్తించువాఁడయ్యె. ఇట్లుండ నొకనాఁడు జయవర్మయు శత్రుంజయుండును దీర్ఘబాహువును మంత్రికుమారునితో రమణీయంబగు నొకమామిడి చెట్టుక్రిందం గూరుచుండి లోకవృత్తాంతంబులు మాటలాడుచుండ నొకచెంచువాఁ డచ్చోటికేగుదెంచినం గాంచి నీయొద్ద నేమేమివస్తువులున్నవి యనియడుగఁగా వాఁడు తనయొద్దనున్న పచ్చికస్తూరియును, పులిగోళ్లును, వరాహముల ముంగ్లును, మొదలగువానిం జూపెను. అప్పుడా చెంచువాఁ డిచ్చినకస్తూరి మొదలగువస్తువులనుగాంచి శ్లాఘించుచు శత్రుంజయాదులు మంత్రికుమారునికిం జూపుచుండిరి. కొంతసేపటికా చెంచువాఁ డొక చూర్ణంబును చూడుమని మంత్రికుమారునిచేతికియ్య నతఁడది గాంచుచుండ వాయువుచే దానిపరాగములు నాసికారంధ్రమూలంబు బ్రవేశింప నొడలెఱుంగక భూమిపయిం బడిన నందఱుఁ జేరి యతనిం బట్టుకొని దృఢతరపాశంబులచేఁ గట్టి యొకకారాగృహంబునం బెట్టిరి. ఇట్లు మంత్రికుమారుండు తమచేఁ బట్టువడిన మహాసంతోషముతో శత్రుంజయాదులు జయభేరి వేయించి తమతమ సేనాసముదయంబులతో సుందరీమందిరనగరంబునం బ్రవేశించి యాపట్టణ రామణీయతకు మనంబున నచ్చెరువొందుచు నిందు స్త్రీప్రాయజనంబులు వసించియున్నారు; ఏలకో పురుషులు తఱచుగ గనంబడరు, అని వితర్కించుచు పౌరులకేమియుం బాధచేయకుండునట్లు సైనికులకు నాజ్ఞాపించి ప్రతిగృహంబునందుం బ్రవేశించి చూచుచు రాచనగరునం జొచ్చి విచ్చలవిడి సర్వప్రదేశంబుల నిచ్చమెయిం జూచి యొకచోటం బాతాళగృహంబును కారాగృహంబునుం గాంచిరి. అందు దీర్ఘబాహువు పాతాళగృహంబుతలుపు తాళంబులు పగులంగొట్టించి యందుం జొచ్చి,

సీ. రతితోడఁ జేర్మి సంగతి సేయుచుండిన యభినవమన్మథుం డనఁగ నొప్పి
లక్ష్మితో గూడి లీలలఁ దేలుచుండెడు శ్రీవత్సధరుని సుశ్రీలఁ దెగడి
రంభతోఁ గూడుసంరంభంబుతో నొప్పు ధనదపుత్రునికాంతిఁ దస్కరించి
పౌలోమితోడ సౌభగరీతి సుఖియించు దేవనాయకుచాయఁ దేజరిల్లి.

గీ. రామణీయకవిధియైన రాజవదన, యొకతె జనలోకలోభనీయోద్యదతుల
యౌవనమనోజ్ఞ సరసనయుండ దానిఁ,గూడి వెలుగొందువాని రాకొమరుఁ గాంచె.

ఇట్లు దీర్ఘబాహువు వారలం గాంచి యందు కందర్పసుందరీ సౌందర్యంబునధఃకరించు రూపరేఖావిలాసంబుల నొప్పు మందయానను చక్కఁగ నిరూపించి చూచి యది తనకూఁతురు చంద్రసేనయని నిశ్చయించుకొని యది తనకుం దొరకినందుకు సంతసించియుం నది పరపురుషహస్తగత యగుటకు మనంబున నుడుకుచు నారాజకుమారునిం గాంచి యోరీ మూర్ఖ నీవు నాకూఁతుం జంద్రసేన నపహరించుకొనివచ్చి పరులెవ్వరును బ్రవేశింప

రాని యీనగరంబునఁ బాతాళగృహంబునందాఁగి యీసత్కులజాతయెడ ననుచితం
బాచరించుచున్నాఁడవు. ఇప్పుడు నిన్నుం బట్టి వధియించి నాకులంబునకుం గలిగినకలం
కంబుఁ బోఁగొట్టికొందును. అని చేతనున్నధనువు నెక్కిడి యతి రోషావేశంబున బాణ
జాలంబులు పఱప రాజకుమారుండును కించిదంకురిత మందహాస సుందర ముఖారవిందం
బుతో నతనియంపజడి తన దేహంబునకుం దాకకుండునట్లు మండల పరిభ్రమణంబులఁ
జేయుచుఁ దప్పించుకొనుచుండ దీర్ఘబాహువు కొంతతడవునకుఁ దనసైనికులం బిలిచి
యీ రాజకుమారునిం బట్టికట్టుండని యాజ్ఞసేయ వారందఱు నొక్కపెట్టున దలపడి
తనపైకిరాఁగాఁ గుమారుండు నుప్పరంబునకు లంఘించి సైనికులనడుమదూఁకి యొకనితల
తనకరతలాఘాతంబునఁ బఱియలుగావించి వానిఖడ్గంబును ఖేటకంబును దీసికొని విజృం
భించి తన్నుంబట్టుకొన సమకట్టు సైనికులం గొందఱఁ దలఁబదఱిగి దీర్ఘబాహువుం దఱిసి
యతని చేతిధనువును తుత్తునియలుచేసి శిరంబువెగవ్రేయఁగఁ గరవాలంబునారింప నంతలో
చంద్రసేన యతనిసమీపంబునకువచ్చి ప్రాణనాథా యితనికిఁ బ్రాణదానం బొసం
గుఁడు. ఇతఁడు నాతండ్రియగు దీర్ఘబాహువు. నిన్నెఱుంగక నన్నపహరించుకొని
వచ్చితి వని యెంచి యుద్ధంబునకుం గడంగె. నిన్నెఱింగెనేని నాతండ్రి యపరిమిత
సంతోషంబుఁ జెందునని చెప్పిన రాజకుమారుండు నతనిం జంపుతెం పుడిగె. ఒండుచోట
జయవర్మయుం శత్రుంజయుండును కారాగృహంబుల తలుపులు పగులఁగొట్టించి లోనం
జొరంబడిరి. అందు మదనమాలం గాంచి జయవర్మ యోసీ యనేక కపటోపాయంబులు
చేసి నీచెలియలగు మోహనవతి నతిచతురత వివాహమండపంబునకంపి నీవు నానగరు
దప్పించుకొని పరుగిడితివి. ఆహా స్త్రీలజాణతనంబె మెచ్చందగినది. నేను మోహనవతిం
గూడ బెండ్లాడవలయునని యుంటిని గాన నప్పుడు తత్సమాగమంబు నాకిష్టంబయ్యె
భవదీయ విరహంబు మనంబునకు మిగుల నుమ్మలికంబుఁ గల్పించుచుండె. నీవు నితరపురుష
సహాయంబులేక యింతదూరంబు రాఁజాలవు. అందునదుష్టవయ్యె నీమీఁది ప్రేమభరంబున
నిన్ను నా యింటిదాసిగానైన నుంచుకొన నెంచెద. రమ్ము నాసన్నిధానంబునకు. అని
బిట్టుదలించి పలుకు నచ్చటికాంతలు దుఃఖాక్రాంతలై తమకుం గలిగిన క్రూరదశకు
సహింపలేక యందఱు నొక్కపెట్టున నేడిచిరి. వారల రోదనధ్వనివిని రాజకుమారుండు
చంద్రసేనను వెంటందీసికొని కారాగారంబునకుం జనియె. అప్పుడు జయవర్మ మందార
మాల సమీపంబునకుం జని యోసీ యిఁక నీవు తప్పించుకొనుట యెక్కడిది. నిలువుము
అని దానిచేయిపట్టుకొనం బోవుడు నది వానిం జుఱచుఱం జూచి రాజా పతివ్రతలగు
కాంతల నన్యులు స్పృశింపంజనదు. కులకన్యకాజనంబులు ప్రాణంబులకంటె మానంబును
మిగుల పాటింతురు. అనిచెప్పియవలకుం జనిన దాని వెంటనంటిపోయి బలాత్కారంబున
దానిచీరచెఱంగుం బట్టుకొనియె. అది రాజకుమారుండుగని మహారోషావేశంబున వానికడ్డంబు
సని యోరీ పురుషాధమా యిట్టిపనులు క్షత్రియులకుం దగునటరా. అన్యకర్త యగు

కాంతంబట్టికొనుట పరువుగలవారి కుచితంబగునటరా. ఇప్పుడా కాంతచెఱంగుపట్టినందుకై నీహస్తంబును రెండుఖండంబులుగ దెగవ్రేయఁజూతును; అని యాతనిపైకిం గవిసిన జయవర్మకును రాజకుమారునికిని చండతరంబగు మల్లయుద్ధంబు ప్రవృత్తంబయ్యె. అప్పుడు రాజకుమారుండు దృఢముష్టింబట్టి జయవర్మనొసటం బొడిచిన నతఁడు ఫాలంబుననుండి రక్తధారలుగార నిలపయింబడి మూర్ఛవోయి కొంత తడవునకుం దెప్పిరిలి రాజకుమారునిపైకింగవిసి దండతాడితంబగు భుజంగంబు చందంబున రోజుచు నశనిసమానంబగు పిడికిట రాజకుమారు నురంబునఁ బొడిచిన నడసరకుగొనక యతండు జయవర్మంగాంచి ఔరీ నీపిడిముష్టితో యమలోకంబుంగాంచెదవు; చూడుము నాపిడికిగుద్దునంగల బలము. అని ముష్టితో శిరంబుపగుల నడువఁబోవుడు మదనమాల సత్వరంబుగవచ్చి రాజపుత్రుని చేయిపట్టుకొని యార్యపుత్రా యితఁడు నాచెలియలిమగండు; ఇతఁడు మృతి జెందెనేని నాసోదరి యనుభవించు వైధవ్యంబుసూడ నసహ్యంబుగాన నన్నుంగాంచి యితనిని విడిచిపెట్టుఁడు; అనిచెప్పఁగా శత్రుంజయుండు తనమిత్రునికింగలిగిన చేటుపాటునకుంగనలి రోషావేశంబున రాజకుమారునిపైకి సైనికులం బురికొల్పుకొనుచు వచ్చి యనేకాయుధముల పరశుముద్గర భిండివాలముసలాద్యాయుధంబులఁ బఱపింప నన్నింటికిం దప్పించుకొని యారాజకుమారుండు సింహంబు చందంబునఁ బరాక్రమించి యాసైనికులంజంపి శత్రుంజయునిపైకి నడిచి యతనిశరచాపంబులు ఖండించిన శత్రుంజయుండును మఱియొండు చాపంబెత్తికొని బాణసంధానంబు సేయునంతలోనన దానిని రెండుఖండంబులుగావించి నిరాయుధునింజేసిన నప్పుడు ససంభ్రమంబుగ సాంఖ్యాయని యచ్చోటికి వచ్చి కుమారునింజూచి ఔరీ నీకిట్టిపనులుతగునా? గొప్పవారిఁబట్టి యవమానించుట నీకుదోషావహంబుగాదా? గురుజనంబుల నధిక్షేపించి ధిక్కరించుటంజేసి నీయొనర్చిన పుణ్యంబెల్ల మన్నుఁగలసిపోదా? నీ కిది తగదు. ఊరకుండుము. అని యలసని యుద్ధమునుండి వారించి శత్రుంజయునింగాంచి యోమహారాజా యీ కుమారుఁడు పసితనంబుంజేసి నీయెడలనపరాధుండయ్యె. ఇతఁడు మిమ్మెఱుంగక యొనరించిన వినయవిహీనతకుం గనలక నన్నుంగాంచి క్షమియింపుము. నేను నిన్నమహాప్రదోష సమయంబని యీ యూరికొకించుక దూరముననుండు గిరిసుతాపతికినమస్కరింప నేగియుంటిని. ఏనొకింతసేపు లేనిచో నిట్టిచెట్టలీయూరికి సంభవించుచుండును. గౌరవ్యులగువారు బాలభావంబున నెఱుంగక చేసినతప్పు మనంబునం దలంచక దీనులయెడ దయారసంబునం బ్రవర్తింతురుగదా? ఈదినంబు నాచేయునాతిథ్యంబు నంగీకరించి యిచట వసియించి మీపట్టణంబునకుం జననగు. మీరలు దీర్ఘబాహునకు సహాయము చేయ వచ్చియున్నారనివింటి. అయినను తపస్సిద్ధి మీయొద్దకు వచ్చుట కభ్యంతరమయ్యె. పార్వతీశుని సన్నిధిబాసివచ్చిన యప్పుడె పరిచారికాజనంబువలన మీయుదంతంబువిని యిదెవచ్చితిని. అని చెప్పఁగా శత్రుంజయుండును సాంఖ్యాయనింగాంచి నమస్కరించి యిటు

నియె. ఓభగవతి యీకుమారుం డెవ్వండో? ఈ శౌర్యరాశింగన్గొ మన్మనంబేఁడొ సరిం
చినప్రశ్రయంబునకు మేరలే దని తోఁచెడిని. ఈ మహాపురుషునియందు వర్తించుటం జేసి
సార్థకంబయియున్న నామధేయంబునందగిలి గౌరవమును వహించినయక్షరంబు
లేవియొ? ఈతనిం జూడఁజూడ నాహృదయంబు ప్రేమార్ద్రంబై వాత్సల్యంబుచే
ద్రవించుచున్నయది. ఇతఁడు నాపైఁ బ్రయోగించిన బాణంబు లెల్ల నాయంగకంబుల
సమీపంబునకువచ్చి యిలపయింబడె నంతియకాని యొకటియైన నామేనం దాఁకినది
కాదు. ఈచతుస్సముద్రముద్రితధరామండలంబున నింతదనుక నాచేతనుండు చాపంబు
ఖండించిన యఖండశక్తిం జూడలేదు. ఈబాలకుం డతిచతురత రెండు మారులెత్తిన
ధనువును ఖండించె. ఇతని కిరీటాననం బపరిహార్యంబై యున్నది. వీనింగాంచినది
మొదలు ఎప్పుడెప్పు డాలింగనము చేసికొందమా యని యున్నదిగాని వీనిపై శరంబులు
వేయమనంబురాదు. ఇందుకు గారణం బేమిహో యని యడిగిన సాంఖ్యాయనియు మహా
రాజా యిదియేకదా తారామైత్రియు చక్షూరాగంబని (ఒండొరుల మొగము చూచు
కొన్న వేళయని తెలుఁగునవాడుక) యాలంకారికులు చెప్పుదురు. తొల్లింటి సౌహార్దం
బులు భావస్థిరంబులై యుండి వారలు గనంబడినచో నబోధపూర్వకంబుగ నౌత్సుక్యాదు
లు గలుగఁజేయుచుండు నంతియకాని వేఱుకాదు. అని చెప్పి కలహానివృత్తులగు శత్రుం
జయదీర్ఘబాహు జయవర్మాదులం గొనిచని యాతిథ్యంబు గావించి సంతృప్తులం జేసె.
ఇట్లు సత్కృతులై యారాజులు మహోల్లాసంబుతో నాదినంబు గడపి సూర్యాస్తమయా
నంతరంబు భుజించి సాంఖ్యాయని చే నుపనీతంబు లగుచందనకుసుమ తాంబూలాదుల స్వీక
రించి తన్నిర్దిష్టంబగు నొక మనోహరరంగమండపికాభ్యంతరంబున సమర్పింపబడి యుం
డెడు మహామంచంబులపయిం గూరుచుండిరి. అప్పుడు కాపాలికి యచ్చోటకు వచ్చి
యోమహీపతులారా భవద్వినోదార్థంబుగ నొకమనోహర రూపకం బభినయింప వలసినట్లు
భరతకులంబున కాజ్ఞ యొసంగియున్నదానం గాన సావధానమతులరై యీ నాటకంబు
నిరీక్షింపుఁడు. అని చెప్పి తాను రంగమంటపంబులోనికిం జనియె.

---

## మందారమాలా చరిత్రము

### నాంది

క. శ్రీరుక్మిణీమనఃప్రియుఁ, డారూఢఖగేశ్వరుం డహస్కరతేజుం
డూరీకృతార్తరక్షణుఁ, డారూఢిం బ్రోచుగాత నందఱ నెమ్మిన్.

నాంద్యంతంబున సూత్రధారుండు రంగంబుఁ బ్రవేశించి నలుప్రక్కలుగాంచి
ఆహా సౌభాగ్యం బేమని వర్ణింపుదు. అఖిలభూమండలాధిపతులును ఒక్కచోటం జేరి
యున్నారు. నేపథ్యంబుం గాంచి. నటీమేల యింకను రంగస్థలంబునకురాక యుండెదవు.
నటి ప్రవేశించి. ఆర్యమిశ్రా యిదె వచ్చితి. కరణీయంబు నిరూపింపుఁడు. సూ. నటీ

ప్రస్తుతంబగు ఋతువునవలంబించి యించుక వర్ణింపుము. నటి. ఆర్యమిశ్రా! అట్లే
కం. పల్లవలసమానములై, కల్లలితామోదపర్వసంయుక్తములై, యల్లసిలుచున్న
విప్పుడు, మల్లియలుం జారిణులును మధుమాసమునన్. సూ. నటీ, నీ నుడివిన పద్యంబుచే
రూపకార్థంబు నామనంబున కుపగతంబయ్యె. అని వారు రంగస్థలంబునుండి నిష్క్రమిం
చిరి. ప్రస్తావన.

చేటికలిరువురు ప్రవేశించిరి. ఒకతె: పరభృతికా రాజపుత్రి యగుమందార
మాలకు వీణాసంవాహనంబు సేయం బూనుకొంటివో? కాదేని నీ కొంకించుకయైన తీరు
బాటు గనుపట్టదుగదా? పరభృతిక. ఓ కలకంధరా, నీవు నన్నడిగినపని మానుకొన్న
దాననుగాను. మందారమాలయట్లి రత్నావళి యనవరతమ్ముం దనకూతున కభినయవిద్యా
విశేషంబులం గఱపించుచున్నది: వీణావాదనంబునకు సమయంబు దొరకదుగాన నాకొ
కించుక విశ్రాంతి యబ్బెను. కలకంధర పరభృతికా రత్నావళికిం దనకూతు నభినయ
విద్యాపారంగతం జేయవలయు ననియేల పట్టిపట్టుదల గలిగె. పర. కలకంధరా తన
చవతికూతునకంటెం దనకూతును సమర్థురాలు గానిచో నోర్వకట్లు సేయించుటలకు? కల.
ప్రియసఖి చవతికూతురు వసంతసేన గాదా? అది యభినయచతుర యనియును నిది వీణా
వాదనచతుర యనియును నివి ప్రసిద్ధంబులే. రత్నావళి చవతియగు మదయంతిక యూర
కున్నదాయేమి? పర. అదియును దనకూతును సమానవయోవిలాస భాసురాంగి నభినయ
తత్త్వవిత్తమం జేయించుచున్నది. కల. ప్రియసఖి యభినయవిద్యయందింత సామర్థ్యము
గలిగి బోధింపంగల గురువులెవ్వరో? పర. ఓసి యవంతీనగరమునుండి వచ్చిన రాజ
దత్తుండను విప్రవర్యునింగొని రత్నావళియు ధారానగర సమాగతుం డగువివేకదత్తుం డను
బ్రాహ్మణునింగొని మదయంతికయును విద్యలు నేర్పుచున్నవారు. కల. ప్రియసఖి యెన్ని
మొదలుకొని వీరి కిట్టిపట్టుదల గల్గెనో? పర. సౌదామిని యనుకాపాలిక యీయూరం
గొన్నిదినములనుండి వసియించుచున్నదిగదా. అదిమొదలుకొని రత్నావళీమదయంతి
కలకుం బరస్పరము హృదయంబున నాగ్రహముకల్గియున్నది. రాజగు పరంతపుండును
వీరిభావంబులింగితంబులనెఱింగి తత్తదుచితాలాపంబులం బ్రవర్తించుచున్నవాడు.
ఇది యితరులచెవికెక్కనేని సంకటంబు గలుగుంగాన హృదయంబునన యుండనిమ్ము.
కలకంధరా నీవిప్పుడెక్కడకేగెదవు. కల. పరభృతికా, ధర్మకవచునికూతురు కళావతి
నాకుం బ్రాణసఖి. దానిం గాంచంజనియెద. పర. ధర్మకవచుండు పరంతపుని ప్రధాన
మంత్రిగదా? కల. ఔను. అతనిభోగపత్నికిం జనియించినది కళావతి. అని యిరు
వురును రంగస్థలంబుం బాసిపోయిరి.

పరంతపుండును రత్నావళియు మదయంతికయు సౌదామినియుం బ్రవేశించిరి.
రత్నావళి. ప్రాణనాథా యీమదయంతికతనకూతు రగువసంతసేనతో నభినయ
విద్యయందు మందారమాల సరి కాదని వాదలించుచున్నదిగదా. ఇప్పు డాయిరువురను

రప్పించి పరీక్షింపుఁడు. తారతమ్యము తెలిసికొనఁగలరు. మదయంతిక. అహూ మాదోష
కొంచెము నవ్వుచు. ఓరాజా యీరత్నావళి తనకూఁతుకొంత నేర్పినను వసంతసేన కాలి
గోటికైన దీటుగాదు. రంభోర్వశీమేనకాదులు ఒకవేళ యభినయంబున పరిపాలింపఁగల
రేమొ యెఱుంగను కావ్యధాత్రిమాఁ బిడి యేలపహించుకొనుచున్నయది సౌదామిని.
ఓదేవి మదయంతికా నీకూఁతుకత్తె యభినయచాతుర్యంబు లేనను నీవంతగర్వపడుట
యుక్తముంబుగాదు. ఇప్పుడు మందారమాలయు నభినయవిశేషంబులు జెక్కొంటి నాఱోఁగి
యున్నదిగాన వసంతసేన నతిక్రమించుననియుఁ దోఁచెడిని. మదయంతిక. అట్లయ్యేని
చేసిరత్నావళికి దాసినయ్యెద. మందారమాల వసంతసేన నతిక్రమింపకేని యీరత్నా
వళి యేమగునో యడుగుము. రత్నావళి. ఓభగవతి మందారమాల వసంతసేన నతిక్ర
మింపదేని నే నీమదయంతికకుం జేటినై దేవీపదంబుం గోలుపోయెదను. ఇప్పుడ యిరు
వురను బరీక్షింపవలసినది. పరంతపుఁడు. (తనలోపల) కటకటా యీ యిరువురకును
విరోధంబు పెరిగి దారుణతరంబుగ ప్రతిజ్ఞలు పలుకుకొనిరి. వలదని యెంతపల్కినను వినరు
తక్కిన విషయంబులందు విధేయలై ప్రవర్తింతురుగాని యీవిషయంబు ప్రసక్తం
బగునపుడు ఒండొరుల మొగంబులనైనఁ గాంచుకొనక యెంతకంటె నంతకు
నగదిగుచు యుక్తాయుక్తపరిజ్ఞానంబులేక ప్రవర్తించుచున్నారు. ఈయాగ్రహం
బిప్పుడారోపితంబుగాని వీరలకు స్వాభావికంబుగాదని తోఁచెడిని. ఇది మందారమాలా
వసంతసేనలను పరీక్షించి సామర్థ్యాసామర్థ్యంబు లేర్పఱచినం గాని తీరదు. ఏమి
సేయవచ్చు (అని ఆలోచించి ప్రకాశముగ) ఇది పరీక్షించుట నాకు నిష్టమే.
భరతకళారహస్యవేది యగుమధ్యవర్తి యెవఁడో తెల్పుఁడు. రత్నావళి ప్రాణనాథా
వేఱొక్కని మధ్యవర్తిగ నేల ప్రార్థించి కొనిరావలె. మీరును ఈ సౌదామినియుం
మాధ్యస్థ్య మంగీకరించి పరీక్షింపుఁడు. అప్పుడప్పుడీభగవతితోడ నీభార్య తనకూఁతురు
సామర్థ్యంబు స్తుతించుచుండును. మదయం. సగర్వముగ ఓరాజా నాకూఁతు నభినయకళా
కుశలత్వంబుం బరీక్షించుటకు మీరలు సమర్థులుగారు. ఎప్పటికిని మాధ్యస్థ్య మంగీక
రించువారు పరీక్ష్యులకంటె నతిచతురత్వంబు గలిగియుండనగుంగదా ? సౌదా. ఓరాజా
యీమదయంతిక చెప్పినవి గర్వోక్తులుగావు. నిక్కువంబులే. ఇందుకుం దగిన భరత
శాస్త్రకుశలు నొక్కనిం దేఁగడంగవలయు. పరంతపుఁడు: భగవతి నీవు బాల్యము
మొదలు సంసారవిరక్తవై భూప్రదక్షిణంబు నేయుచు సమస్తనగరములకు బల్లియలును
గాంచి వానియందుంగల పండితుల నఖిలశాస్త్రతత్త్వవేత్తలం బరిశీలించియున్నదానవు
గదా. మందారమాలావసంతసేనలం బరీక్షించి వీరితారతమ్యముం దెల్పందగువాఁడు
గలఁడే నిం దెల్పుము. సౌదా. రాజా వినుము. శ్లో. భరతాగమతత్త్వజ్ఞాః త్రయోవిఖ్యాత
కీర్తయః, భరతస్తు నందికేశో రోచనశ్చ జగత్త్రయే. [ముల్లోకములందును భరతశాస్త్ర
తత్త్వజ్ఞులు భరతఋషియు నందికేశ్వరుఁడు రోచనుండు ననువారుమువ్వురు జగద్విదిత

మహా కీర్తిశాలిగాదు] అను పద్య మింతకు నీ వికెఱిఁగిన దానవుకాదా? సకల కళాభరితు లందఱు బంధీకృతులు సేయఁబడి యున్నారు. ఆ దినము నుండి యీ సభాసదులగు వారు గుణరహితుల రోచనునివంటి సాహిత్యకళారహస్యముఁ జెలిసి గుణవంతుఁ డగుటచే ఆజ్ఞాపకుల నీ సభలోని కెంగల చతురులయందు భరతాగమమును సాంగముగా నెఱిఁగి జన్మాదయమోదావహంబై యున్నయది యాతని యాబాల్యంబు నాకు నాకును. మిగుల శాపగ్రస్తుఁడగు భగవతి ఆ మహాత్ముండు దొరికినవాఁడో? అతని మఱి యెవ్వరు రప్పింపఁగల రో? అతని కేమేమి ప్రయత్నంబులు సేయంబడినవో తెలిసికొనుము, ఆ విరహించి పీనిన వాదంబున దంతము. సౌ. రాజా ఆ కుమారుం డిప్పుడు కుసుమాదిత్యుని నగరంబున నున్నవాఁడు. అతనిం జూడక యవనిమిసంబైన నాఁ డేఁడు ప్రాణములు ధరియించుకొనలేఁడు గాన నతని నంపుము. అయ్యుదయాదిత్యుఁడు నీకుఁ బహుదినములనుండి శత్రువై యున్నవాఁడు. కపటోపాయంబులం గాని రోచనుని రప్పించుటకు అనువుపడదు. రాజు. ఓ భగవతి యట్లయిన నాతని దెప్పించుటకు తగినయుపాయంబులుఁ గన్న గూఢచారులం బనిచెదను. సభాస్థలంబున ననేకపౌరులు తనుతమ వివాదంబులం జెప్పుకొన వేచియున్నవారు గాన నచ్చటికి బోవలెను. ఓరత్నావళీ ఓ మదయంతికా మీరు మీమీ కామినుల కుసుమ ధ్యానయంలచే శక్తివంచనలేక విద్యాపరిశ్రమంబు సేయింపం బ్రయత్నపడుచుండుఁడు. అని రాజు లేచిపోవఁగా సౌదామినియుం రాజపత్నులును లేచిపోయిరి.

## ప్రథమాంకము సంపూర్ణము.

---

మాయామంథరుఁడు ప్రవేశించి తనలో. మనరాజు పరంతపుఁ డుదయాదిత్యుని నగరమునందున్న రోచనుం గపటోపాయంబునం గొనిరా నాజ్ఞ యొసంగియున్నవాఁడు. తద్వశవర్తినై యిచ్చోటికి వచ్చియున్నవాఁడ నిందుమించుక రెండు నెలలు గతించిన వయ్యెం. కార్యాంశంబున నేమియు ననుకూలత గానంబడదు. మహానుభావప్రభావశోభితుండు తేజస్వియు నగు నారోచనకుమారకుండు కపటోపాయంబులకు సాధ్యపడండని తోఁచెడిని. రాజగు పరంతపుఁడు నన్నంతఃపురపు టేకాంతమున నొకగూఢచారా నీవు మాయామంథరుండ వగుట నిక్కువంబేని యీకార్యంబు సమకూర్పంగలవు అనిచెప్పినమాట మనంబునఁ బెద బాయకున్నది. ఇందు కేమి సేయనగు. అని చింతాస్తిమితుండై యోచించి, తన యెదుటికి దృష్టులు నిగుడించి, మనమే మితిలేని చింతాక్రాంతస్వాంతులమై యున్నారమనుకొంటిని. మనకంటెఁ జింతావ్యాకులుం డొక్కరుం డిచ్చటం గూరుచుండి యేకాగ్రచిత్తుండై శోకపలకు వేచియుండు కొంగ చందంబున ధ్యానించుచున్నవాఁడు. వీని చందంబుం గాంచిన ఘనంబగు కార్యంబు నెఱవేర్చుకొనంగోరి వచ్చియున్నవాఁడని తోఁచెడిని. మంచిది. ఇతని వృత్తాంతంబు విచారింపక పోఁగూడదు. (ప్రకాశముగ) ఓయన్నా యీ తటాకంబు గట్టునం గూరుచుండి కపటకౌశికుని విధంబున నాలోచించెదవు. ఏమి

యీ విచారము. కపటకౌశికుఁడు. (ప్రవేశించి జనాంతికముగ) ఓయన్నా కపట కౌశికుండ నేనని యెట్లెఱింగితివి. మాయా. (జనాంతికముగ) ఆహా నేను వీనిని కపట ప్రధానుం డగువిశ్వామిత్రునిం బోల్పఁ బల్కుటచేత వీఁడు కపటకౌశికుఁడను పేరు గలవాఁడని యెఱుకపడియె. మంచిది. ఈ నెపంబున నీతని వృత్తాంతంబెల్ల నెఱుంగుదుంగాక. (ప్రకాశముగ.) ఓయన్నా నేను పెక్కండ్రు సిద్ధపురుషులకు సేవచేసి దృష్టిమాత్రమున నెదుటివారి నామగోత్రాదులు చరిత్రాదులు నెఱుంగువిద్య నభ్యసించితిని. దానచే నెఱుంగుదు. కపట. (తనలో.) ఔర యీతని మాహాత్మ్యం బేమని వర్ణింపుదు. ఇతని సహాయంబున మనకార్యంబు సాధించుకొనందగుఁ గాని వేఱువిధంబున సాధ్యంబు గాదు. (ప్రకాశముగ): ఓయన్నా తమనామధేయంబు విన గోరియున్నాఁడను. వీనులకు విందొనర్పుము. మాయా. ఓకపటకౌశికా నన్ను మాయామంథరుండని జనులు వాడు కొందురు. కపట. ఓయన్నా నీకు పదివేల నమస్కారములు. బహుదినములనుండి నిన్నుఁ జూడఁ గోరియున్నవాఁడను. మాయామంథరుండు మాయమారీచుండనియె జనులు వాడుకొందురు. ఏను పాపాకరంబగు నగరమునకుం జను ధనలుబ్ధునికిం గూఢచారుండను. ఈనగరమున సుదయాదిత్యునికిం బ్రియమిత్రుండగు రోచనునిభార్య మదలేఖయనునది యనసమానరూపవయోవిలాసభాసురాంగియని యాదేశచారిని దాని నెవ్విధినైన వంచించి కొనిరమ్మని నన్నుంపియున్నవాఁడు. నేను వచ్చి రెండునెలలు గడిచినవి. ఇది వరకుం దదనుకూలప్రవర్తనంబు ఫలియించినది కాదు. నాయందు గరుణించి యా కార్యంబు సమకూర్చుకొను నుపాయం బొక్కటి చెప్పుము. మాయా. మిత్రమా యట్లే కానిమ్ము. సమయంబు వేచియుండినఁ గాని కార్యంబు చేకూరదు. నీతోఁగూడ మదలేఖా వైనపథ్యంబు ధరింపంగలవాఁడున్నాఁడా తెల్పుము. కప. అన్నా నాతమ్ముఁడు కృత కైతవుండనువాఁడు నాతో వచ్చి దాసీవేషధారియై రాజాంతఃపురంబుం జొచ్చి పనులు చేయుచున్నాఁడు. రాణికి కీకపటంబు విదితంబు గాదు అసంఖ్యాకంబులగు దాసీజనంబుల నడుమ నిదియు నొకతె యని యెంచియున్న దంతియె కాని నిరూపించినది కాదు. అట్లుండి యొకనాఁడు రాణిచే విందుకై పిలువంబడియుండు మదలేఖం గాంచి దాని వేషభాషా చతురత్వం బభ్యసించియున్నాఁడు. మా. ఓమిత్రమా అట్లయిన నేనొక్కయుపాయంబుం జెప్పెదను. ఈరాత్రి మదలేఖావేషంబు ధరించుకొని కృతకైతవుండు రోచనుఁడు రాజసభనుండి యింటికి పొయ్యెడి త్రోవలోని చండికాలయమున వేచియుండవలయు. అప్పటికి రోచనుండు తప్పక యరుగుదెంచును. వానికి వలపుగొలుపుచు నతినైపుణ్యం బునం దీసికొని యతని చేతికిం జిక్కక యవంతీనగరపుత్రోవం బట్టి యరుగుచుండవలయుం. అతఁడు వెంబడింపుచుండ నయ్యేని మదలేఖ సులభసాధ్య యగును. కప. అన్నా నీవు చెప్పి నది యత్యంతయుక్తమే. ఇది నా తమ్మునికిం జెప్పి యీ కార్యంబునందు జాగ్రత్తగల్గి యుండునట్లు దిట్టపఱిచి యిదె వచ్చెదను. ఇక్కడనయుండుము. అని వెడలిపోయెను.

మాయా. (తనలోఁ) ఇప్పుడు నా మాయాసాధకార్యంబు సార్థంబయ్యెఁగదా. ఇంచు కేనియు శ్రమములేక కార్యం బనుకూలంబగు. కృతకైతవుఁడు మదలేఖావేషధారియై వంచించి రోచనుని నిజనగర మగునుజ్జయినికిం గొనిపోవును. అచ్చట విశ్వస్తులగు గూఢ చారులు రాజకుమారునింగనిపెట్టి రాజునొద్దకుం గొనిపోవుదురు. ఇట్లయ్యెనేని నా కార్యంబు అనుకూలంబగు. కపటకౌశికుని కార్యం బెట్లు నెరవేర్పఁదగునో తెలియదు. ఇట్లు తలంచుచు కూరుచుండె. కపటకౌశికుండు (ప్రవేశించి). ఓయయ్యా నీ చెప్పినయట్లు కృతకైతవునికి మదలేఖావేషంబువేసి చండికాలయంబునకంపి కార్యంబుగని వాని కిం దెల్పి యిదె వచ్చియున్నాను. మాయా. మిత్రమా నీచేసినపనికి సంతసంబయ్యె. ఇంతలో నొక్కరుండు ఖడ్గంబుకేలం దాల్చి యక్కడికివచ్చి ఓయయ్యా కపట కౌశికా నీమానతిరీతి కృతకైతవుం డచ్చోటనుండ రోచనకుమారుండువచ్చి దేవికి నమస్కరించి క్రిందనునిచిన యీచంద్రహాసంబుమఱచి తోడవచ్చినదాసికతో నతిత్వరిత గతింజనియె. ఇదె యీ చంద్రహాసము. ఇది మీకెఱుకపడఁజేయఁ గృతకైతవుఁడు నన్నంపె. ఇఁక జరుపంగల కార్యములకు భవన్నియోగంబుం బ్రతీక్షించుచున్నాను. కప. ఓరీ మంచిది యీచంద్రహాసంబు నాచేతికిచ్చి నీపనిలో జాగ్రతగానుండుము. మను ష్యుఁడుఖడ్గం బాతనిచేతికిచ్చి నిలుచుండెను. మాయా. మిత్రమా యీఖడ్గంబుదొరకుట మనకత్యనుకూలమె. దీనిందాల్చి నీవు రోచనవేషధారివై యాగుడిలోనం బ్రవే శింపుము. ఖడ్గంబునకై మరల రాచకుమారుండు చనుదెంచు. అది లభింపమి నిక్కడఁ గొంతసేపు వెదకుచుండి మదలేఖావేషధారియగు కృతకైతవునిచేత నపహృతమానసుండై రోచనుండు బహుదూరం బరుగు. రాజపుత్రవిరహంబుం దాళలేక యొకింతసేపటికి మద లేఖయుం నక్కడికిరాఁగలదు. అప్పుడు నీవు దానికగపడి తీసికొనిపోవచ్చును. ఈ పనులలో నీపరిజనులు బహుజాగ్రతతోఁ బ్రవర్తించుచుండనగు. ఓమిత్రమా నీవు మద లేఖంబట్టుకొనిపోవుటకు ఏమి తెచ్చియున్నావు. కపట. నేను దారుమయంబైన బో నొకటి తెచ్చియున్నాను. మాయా. ఓరీ దానినాగుడి కుత్తరపువాకిటి కెదురుగా జరిచి పెట్టుకొనియుండుమని నీభటులకాజ్ఞచేసి దానియం దామదలేఖ ప్రవేశించినతోడన తలుపులుబిగియించి యెత్తించుకొనిపోవునట్లు నీ ప్రధానభటునికిం జెప్పి నీవు రోచనుని వేషంబుధరించి ఆలయంబుం బ్రవేశింపుము, నీవెనువెంట నేను నచ్చటికిం బ్రచ్ఛన్నం బుగవచ్చెద. వేగిరంబపొమ్ము. కపటకౌశికుండు నిర్గమించెను. మా. తనమనంబులో. నేనిప్పుడీయత్యున్నతమగుగోపురంబుపైకెక్కి గుడిలోజరుగువృత్తాంతంబు కనుంగొని యెదను. అని యాలోచించి గోపురంబెక్కి తిరిగి చూచి. ఇదె రాజకుమారుండు రోచనుం డతిత్వరితగతివచ్చి తొల్లి ఖడ్గంబుంచిన తావునఁ జూచి యదిలేమిసంశయించు చున్నవాఁడు. మఱియొండు చోటికి దృష్టులనిగుడించి భళా యాకృతకైతవునిచాతుర్యం బేమనివర్ణింతు, వేషభాషాదులెల్ల మదలేఖంబోలె వీనిగొప్పియున్నవి. వీఁడును

రాజకుమారునియొద్దకు వచ్చుచున్నాఁడు. ఔర యేమి యీరాజపుత్రునికి మదలేఖ యం దుండుప్రేమాతిశయంబు! చూచినంతమాత్రమున సమీపమున కేగి ప్రాణవల్లభా యిచ్చటికేల వచ్చితివి యని యడిగి యవియేమియుం బలుకకున్న నోమదలేఖా నీతో నతివేగంబున వచ్చెదనని చెప్పి యిచ్చటవడసియున్నందుకై కోపగించితివా? నేనేమి సేతు. నాచంద్రహాసంబు గానకపోయె. అనిచెప్పఁగా నామదలేఖావేషధారియుం "ప్రాణనాయకా వింటివా యీయుదయాదిత్యునిదుర్నయంబు నన్నువదలి నీవు రాగానే నలుగురు రాజభటులును ఇరువురు దాసికలును మనయంతఃపురంబునం బ్రవేశించిరి. అదిగని నేనుభయంబందుచు నొకమూల నొదిగియుండ నందొక్కతె యోమదలేఖా మారాజుదయాదిత్యుఁడు తనయంతఃపురకాంతా జనంబువలన నీరూపరేఖాదులు విని నీపైమక్కువతో నిన్నుం దనశయనగృహంబునకుం దెమ్మనియె. రాజకుమారుం డేదేనియాటంకంబుఁ జేసెనేని యాతనింబట్టి శిరంబునరికివేయుండు అని యాజ్ఞచేసి యున్నాఁడు. లెమ్ము వేగిరంబరమ్ము. అని చెప్పగా నేను వారల కట్టే కానిండు; నాకును రాజుపై మరులుకలదు. బహుదినములనుండి రాజభోగంబునకు వేచియున్నదానను. ఇదె సర్వాభరణభూషితనై వచ్చెద నిక్కడన యుండుఁడనిచెప్పి యలంకారశాల కేకతంబ యరిగి యచటసమర్పంబడియుండు. గూఢమార్గంబున వెలువడి యిదె నీయండఁ జేరితిని; నన్నురక్షించుభారంబు నీది" అని చెప్పిన రాజపుత్రుండు ఉదయాదిత్యునికిం గూడ నిట్టిమిత్రద్రోహంబున బుద్ధిప్రవర్తిలెఁగదా ఇఁక మనమిచ్చోట నుండఁ జనదు. రాజవిరోధంబుగల్గెనేని పౌరు లాయూరు పరిత్యజించిపోవుట మంచిదిగాని వారితో కలహించుకొనుచు అక్కడన యుండుట మంచిదికాదు. అని చెప్పిన కృతకైతవుఁడును ప్రాణనాయకా అదియనాకునుసమ్మతంబు. మనము నీమార్గంబున నిర్గమించి మఱియొక గ్రామాంతరంబునకుంజని యక్కడ సుఖంబుగనుండెదము. అని చెప్పిన నందుకువల్లె యనిన రాజకుమారునిందీసికొని కృతకైతవుండు చనుచున్నాఁడు. వీరునుజ్జయినీమార్గంబుం బట్టిపోవుచున్నారు. మంచిదయ్యె. మరియొండుపలనికిం దిరిగిచూచి. ఓహో కపట కాళికుఁడు రోచన వేషధారియై ఖడ్గంబుధరియించి గుడిలోనికిం బ్రవేశించు చున్నాఁడు. రోచనవేషధారియై కపటకాళికుండు ప్రవేశించి తనలో నామిత్రుండు మాయామంథరుండు వచించిన యుపాయం బతిశ్లాఘనీయము. అత్యంతలాభకరము. తొలుత నన్నుం గాంచినతోడన యామదలేక ప్రాణనాథాయని పైఁబడి కౌగిలించుకొని యధరామృతంబొసంగి తనకుచకుంభంబుల నురంబుం గ్రమ్మునుగదా. ఈ మదలేఖా పరిష్వంగలాభము నాకు సమకూరుటకు నేఁజేసినపుణ్యయం బెట్టిదియొ? ఒండుచోట లలితాసఖితో మదలేఖ ప్రవేశించి, లలితంగాంచి యోప్రాణసఖి మనరోచనుం డిట్టు వెడలిపోయిం యొకగడియయయ్యె. కాళికాలయంబు నిక్కడనె యున్నది. ఆతండు పోడగానమికిం గతంబేద్దియో తెలియదు. గుడిలోన ప్రవేశించి చూతము అని లలి

తలో ప్రవేశించుచున్నది కపాలాపీడుం డను. కాపాలికుండు ఆకాశయానంబునం ప్రవేశించి: ఔర నాకు కాపాలికమతతత్త్వం బుపదేశించి వేషధరియింప నతి పావనంబు లగునీనరకపాలమాలికలును భిక్షాటనంబున కీయం త్తను తపస్వితలపుఱ్ఱెయుం సాంత్రమయభూషణంబులు నస్థిమయములగు యోగవాగెలునొసంగి చంద్రచూడచరణపూజావిధానంబుఁ దెల్పి నన్నుఁ గృతార్థునింజేసి తదుక్తప్రకారంబుగ నాకాపాలిక వ్రతంబు సలిపిన నాయెడల సంతసించి యీదినంబు వ్రతసమాపనదినం బని తెలిసికొని యోరీ కపాలాపీడా నీకాపాలికవ్రతం బీదినంబున సమాప్తంబయ్యె. నేఁటఁ జే యొకమానిసిని చండికకుం బలిపెట్టినం గాని సఫలంబుగాదు. నీవిప్పుడ యుదయాదిత్యునినగరంబున నుండుచండికాలయంబునకుం జని యచ్చటఖడ్గధారియై వచ్చునొక రాజకుమారునిం దెగసరికి చండికకుం బలిపెట్టెదమ్ము అనియాజ్ఞచేసె. అందుకై యతి త్వరితగతి నేను వచ్చియున్నాఁడను. దిగువకుఁజూచి ఆహా యీ సౌదామినికిం గల త్రికాలజ్ఞత్వంబునకు మిగుల సంతసింపవలయు. ఆమె చెప్పిన చొప్పున నొక పురుషుండు ఖడ్గధారియై వచ్చుచున్నాఁడుం. మేలయ్యె. అని యాకసంబున నధోముఖుండగుచు యోగపట్టికలోనుండు ఖడ్గంబుందీసి ఈటాలున సామాయాలోచనుని తలనరికె యనివార్యగతి బుద్బుదంబులతో కంఠంబునుండి వెడలు రక్తప్రవాహంబును దన చేతితలపుఱ్ఱెలోనికిం బట్టుకొని చండికాదేవికి నివేదనంబుచేసి యాకాశగమనంబున నరిగెను. కపటకౌశికుని యొడలును తలయును ఆయాలయంబునంబడి తన్నుకొనుచుండెను. మాయామంధరుండు ఈవృత్తాంతంబుం గాంచి తనమిత్రునికిం గలిగిన చేటునకు మనంబున దుఃఖించుచుండ మదలేఖయుం లలితాసఖితో గుడిఁజొచ్చి యామొండెంబులు తనభర్తవి యనినిశ్చయించి వానిపైబడి మూర్ఛనొంది కొంతతడవునకుం దెలిసి ప్రాణంబులు విడువఁదలఁచి యాయాలయపు నుత్తరద్వార సమీపంబున నుండు కొలనిలోఁబడి శరీరంబువిడువ నిశ్చయించి యాద్వారసమీపంబునకుం జనియె. హా హా. చూచి, కటకటా పటికిచీఁకటిగాన నేమియుం దెలియక యుత్తరద్వారముగుండ బోనులోనికిం బ్రవేశించిన మదలేఖను బోనుతలుపులు బిగియించి యనేక పురుషులు నిశ్శబ్దముగ నెత్తుకొని ప్రాకార పట్టణపుం ద్రోవఁబట్టుచున్నారు. హరిహరీ యీకన్యారత్నంబుగతి యేమయ్యెనో చూచితివా. అన్ని యనర్థకంబులుగల్గుట కేనుగదా మూలంబు. రాజాజ్ఞ యనతిపాత్యము. ఏమిసేయనగును! ఇఁక మనముజ్జయినీ నగరంబునకుం జని రాజపుత్రుని పరంతపుని యొద్ద నొప్పగించి బహుమతులం బడయుందు మని యాగోపురంబు దిగిపోయెను.

ద్వితీయాంకము సంపూర్ణము.

చేటికలిరువురు ప్రవేశించిరి. ప్రథమ. ఓకేళికా నేను రాజనియుక్తనై యీదిన ముదయము మొదలు మాయామంథరుం డుదయాదిత్యుని నగరమునుండి కొని తెచ్చిన రోచనకుమారునికిం బరిచర్య సేయుటకుం బోయి తన్నికటంబునన యుండి యిప్పుడ యిచ్చటికివచ్చితిని. గావునఁ దెలియక మందలించెదను. ఈనాట్యశాల రమణీయ పరిష్కార రాజితయై చందనోదకంబులఁ జల్లి యగరుధూమధూపితంబై వెలయు నట్టిప్పుడు రచియించుటకుం గారణం బేమియో? విశేషకారణం బులేక యింతయలం కారం బొకసాండ్రైనఁ జేసిరో యెఱుఁగము. దానం జేసియడిగెదను. ద్వితీయ. ఓమరాళికా యీదినమందు రోచనకుమారునింగొని మందారమాలా వసంతసేనల యభినయ విద్యావిచక్షణత్వంబు పరీక్షింపంబడును. అందుకై యీ యలంకారము సల్పంబడి యున్నది. మరాళిక. అటులైననే! మఱియొకరహస్యంబు నిన్నడిగెదను. ఆ రోచన కుమారుండు సాక్షాత్కరించిన నవమన్మథునింబోలి వెలయుచున్నాఁడు. మందార మాలావసంతసేనలును అభినవయౌవనవిభూషితలై యున్నవారు ఆతనింగాంచి నప్పుడ యీయిరువురకు ననురాగంబుగల్గకపోదు. అట్లయిన ననేకానర్థంబులు సంభ వింపకమానవే. కేరళిక. ఎన్నెన్ని యనర్థంబులు సంభవించకయే యీచపలిపోరు శాంతించెందునా? ఇందుకు మనము చింతించి చేయునదేమియు లేదు. మనము నాటాచ కన్నియలకుం దగిన నాట్యోచితనేపథ్యంబులు సిద్ధపఱచి యుంచవలయుంగాన నందు జాగరూకలమై యుందము. అనుచు నిష్క్రాంతలైరి. ప్రవేశకము. నాట్యశాలయందు యథోచితాసనంబులపైఁ గూర్చున్నట్టు పరంతపుఁడు రోచనుఁడు సౌదామినియుం ప్రవేశించిరి. సభలో గూరుచుండియున్న శత్రుంజయుండు రోచనునింగాంచి యానందబాష్పంబులతో. ఓరికుమారకా మదనమోహనా యిన్నిదినంబులనుండి నీ వెక్కఁ డెక్కడఁ దిరిగితివో? ఏయేకష్టంబుల ననుభవించితివో? నీముఖారవిందంబుం గాంచి పెక్కుదినంబులయ్యెనే? నీవిల్లు విడిచి పోయినదిమొదలు నీతల్లి యాహారంబువదలి యన వరతము నీసేమమునకై భవానికిం బూజసేయుచున్నది. నేనును మరల నీమొగంబుఁజూడం గోరి ప్రాణంబులు ధరించుకొనియున్నాఁడ నంతియకాని వేఱులేదు. నిన్నింక నాలింగ నంబు చేసికొని యాదలమూర్కొనక నాప్రాణంబులు నిలువవు. అని తనయాసనంబు విడిచి లేచుచున్నాఁడు. సమీపముననుండిన బుద్ధిసాగరుండను మంత్రి ఓమహారాజా యిదినాటకము. మీరు పుత్రవాత్సల్యంబుచేత నేమియుం దెలియక ప్రవర్తించెదరు. ఓర్చుకొనుఁడు. శత్రుంజయుఁడు కూరుచుండెను.

సౌదా. రాజా ఏల తామసించెదవు? నాట్యం బుపక్రమింప నానతియొసం గుము. పరంత. ఓభగవతి తొలుత నేకన్యక విద్యావైశారద్యంబుం బరీక్షింపనగు. సౌదా. రాజా నీకుం బ్రథమమహిషీపుత్రికగాన మందారమాలయే తొలుతఁ బరీక్ష ణీయయగు. పరంత. అట్లయిననరే. ప్రతిహారినిం బిలిచి. ఓసీ నీవుచని మందారమాలా

నాట్యాచార్యుండైన రాజదత్తునిం గాంచి తొలుత భవత్ప్రియశిష్యనాట్యంబు పరీక్షణీయంబు గాన నతివేగంబున రమ్మనుమని చెప్పుము. ప్రతిహారి యట్లయగుంగాక యనిపోయి నాట్యాచార్యునితోఁ బ్రవేశించి మహారాజా యిదె యాచార్యుండు వచ్చియున్నవాఁడని చెప్పి చనియె. రాజును రోచనుండును రాజదత్తునికి నమస్కరించి సమీపాసనంబునం గూరుచుండం బ్రార్థించి యతండు గూరుచున్న వెనుక తా ముపవిష్టులైరి. రాజు. ఆచార్యోత్తమా మందారమాల తమచే నుపదిష్టంబు లగునర్థంబులం గ్రహింప సమర్థురాలై యున్నదియె. రాజదత్తుఁడు. రాజా వినుము. శ్లో. యద్యత్ప్రయోగవిషయే భావికముపదిశ్యతే మయా తస్యై । తత్తద్విశేషకరణాత్ప్రత్యుపదిశతీవ మే బాలా॥ అన్నట్లు నేను అభినయప్రయోగవిషయమందు ఏయే భావము నుపదేశించుదునో అది యప్పుడ యనేకవిధముల విశేషింపఁజేసి నాకు ప్రత్యుపదేశము చేయుచున్నట్లుగా నున్నది. నేపథ్యమున మృదంగధ్వని వినంబడుటయుం రోచనుఁడు తనమనంబునం గా.

కం. నవజలధరపటలావి, ర్భవగలిగంభీరనినదభావ్యం బగుచున్
నవమురజమధ్యమస్వర, మువగతమైయుల్లమునకు హర్షం బొసఁగెన్.

ఇట్లనుకొనుచుండ నచ్చటి యవనికాభ్యంతరమునుండి.

క. జలధరపటలవినిర్గత, విలసచ్ఛంపాప్రభాళి వెల్లిగొలుపు చా
యలివేణి వెడలెఁగలువల, విలుకానిజయాస్త్రమనుచు విబుధులు తలపన్.

ఇట్లు వెడలివచ్చిన రాచకన్యకం గాంచి రోచనుఁడు మనంబునందు ఈ నవమోహనాంగి నాట్యాలంకారంబు నాకు మిగుల మనోవినోదంబుం గల్పించుచున్నది.

సీ. గుదియఁగట్టిన మొల్లకుల్కు చన్నులపైన ముత్తియంపుసరాలు హత్తుపఱిచి
బలితంపుఁదొడలకు బాగుమీరెడునల్ల యర్ధోరుకంబుఁ దాసాఁదొడిగి
బటువు లౌపిఱుఁదులపైన జాళ్వామించు రతనంపు మొలనూలు రహిఁ ధరించి
మెత్తనియడుగులనత్తమిల్లఁగఁ గుల్కు టందియల్ బాగుగాఁ బొందుపఱిచి
గీ. చూచువారలహృదయంబుల్ చూరగొనెడి, మొలకనవ్వులు మోమునసమురువుగుల్క
జగముఁ గెల్వఁగవచ్చెడుశంబరారి, విజయలక్ష్మియనందగి వెలఁదియొప్పె.

ఇట్లు ప్రవేశించి మందారమాలయుం తనయాచార్యునికి నమస్కరించి సౌదామిని పాదంబుల కెరఁగి జనకునికి వందనంబు లాచరించి కించిదంకురితలజ్జావిలాసభాసురమందహాససుందరముఖారవింద యగుచు రోచనకుమారునిం గ్రేగంటం జూచుచు సంగీతంబు సేయువారికి మున్నుగా నిలిచియుండెను. రాజదత్తుఁడు॥ భగవతి సౌదామిని యభినయింపందగువస్తువొక్కదాని నిరూపించిన నది యథాశక్తి సూచింపంబడును॥ సౌదా॥ పూర్వము అగ్నిమిత్రునియెదుట మాళవిక యభినయించినది లయమధ్యంబును చతుష్పదంబై యుండునదియు నిప్పుడు సూచనీయము. మందారమాల గానము చేయుచున్నది.

ప్రాకృతము. దుల్లహో పిఓ మే తస్సిం భవ హిఅఅ ణిరాసం
అంహో అపంగఓ మే పప్ఫురఇ కింవి వామో
ఏసో సో చిరదిట్ఠో కహం ఉణ ఉవణఇదవ్వో
ణాహ మం పరాహీణం తుఇ గణఅ సతిణ్హం.

[మే = నాకు, పిఓ = నాయకుఁడు, దుల్లహో = దుర్లభుఁడు. హిఅఅ = ఓహృదయమా, తస్సిం = అతనియందు, ణిరాసంభవ = ఆశలేనిదానవగుము. అంహో = ఔరౌర, వామో మే అపంగఓ = నాయొక్క యెడమకడకన్ను. కింవిపప్ఫురఇ = ఏమోఅదరునట్లున్నది. ఏసో సో చిరదిట్ఠో = ఇతఁడో! బహుకాలమునకుఁ గనంబడియె. కహం = ఎట్లు, ఉవణఇదవ్వో = చెందఁదగినవాఁడగును. ణాహ = ఓనాధ! పరాహీణం మాం = పరాధీనవైననన్ను. తుఇ = నీవిషయమందు, సతిణ్హం = ఆశతోనుండుదానిఁగా. గణఅ = తలంచుము.]

అనియథాభావముగ నభినయించుచున్నది మందారమాలయభినయించినవెంటనె వసంతసేనయు నభినయించెను. రోచనుఁడు ॥ ఓమహారాజా మీరు నన్ను మధ్యస్థత్వమున నునిచియుండుటంబట్టి వీరలయందుఁగల తారతమ్యంబు వచింపవలసియున్నది. వీరియొక్క ప్రథమతనూజ యగుమందారమాల అనతిచిరకాలాభ్యస్తనాట్యవిద్య యని తోఁచెడిని. ద్వితీయతనూజ యగువసంతసేన బహుకాలాభ్యస్తవిద్య. ఇదియతారతమ్యంబుగాని మఱియొండు తారతమ్యంబులేదు. మృదువైనయభినయమందు నిరువురుచతురలే. ఆయభినయమును అనువర్తించి వికల్పించుటలో నీమందయానలకు సాటియగుబోఁటులు లేరు. తక్కిన తాళలయాదులందును ఈకాంతలు విశేషశిక్షితలు. పూర్వవిషయంబుం బరిత్యజించి విషయాంతరంబుస్వీకరించునప్పుడు పూర్వభావాపనోదనంబుచేసి భావాంతరం బభినయించుచో మఱికొన్ని యాశాస్త్రరహస్యంబులు సూచితంబులుకాకయున్నవి. ఆరహస్యంబులు దేవతానుగ్రహంబున నిప్పుడు నాకును పూర్వంబున బృహన్నలయగు నర్జునునికిం గాని యితరమనుష్యులకెఱుకపడునవి కావు. పరం ॥ అట్లయిన నవియు నాతనూజల కభ్యస్యంబులే. ఓమందారమాలా ఓవసంతసేనా నాసమీపమునకు రండు. మీ మాతల్లులు తమతమ కూఁతులధికురాండ్రని పరస్పరము విరోధించుకొనుచున్నారు. రువురును మీరు సమానలే యని తీర్మానింపంబడినది. ఇట్లు వారికి స్పర్ధకలుగుటకు కారణమేమనఁగా నొకనాఁడు మీతల్లు లిరువురునుండఁగా నేను మీమీకూఁతులయభినయవిద్యాపాటవం బెట్లున్నది యని యడిగితిని. అందుకు వారు సమర్థురాలికి మీ రిచ్చుబహుమానం బెట్టిదియో తెలుపవలయునని నన్నడుగఁగా నేను వారింగాంచి మనమందారమాలావసంతసేనలలో నెవ రభినయవిద్యాచతురయొ దాని నొకచక్రవర్తికిఁ బట్టమహిషిగా రెండవదానిని రెండవదిగా నొసంగుదు నని యంటిని. అందుపై మీతల్లులకీ యాగ్రహంబుగల్గె. ఇఁకమీరు నాయభిప్రాయంబుమేరకు నీరాజపుత్రునియొద్ద నాట్య

విహారమహాస్థానము సిద్ధించినిచేసి మిమ్మెల్లఁ గట్టి నీ మనోహరాంగనకిం బరిణయంబు సేయుచుంటిమి. బంధువులును పౌరులు ప్రజలును సుందరాకారులా వనమున సేనలు॥ సిద్ధులోఁ ప్రేరణం రాజకుమారునింగాంచుచు తండ్రి యొద్దకువచ్చి ॥ ఓయయ్యా యిట్లే మనుమహాజ్ఞాపరిపాలనంబు సేయుచుంటిమి. అనిచెప్పి నిష్క్రాంతులైరి. తక్కినవారును నిష్క్రమించిపోయిరి.

## తృతీయాంకము సంపూర్ణము.

---

కేరళికామరాళికలు ప్రవేశించిరి. మరాళిక ఏడుచుచు ఓ యక్కా మన రాజు ఇంత కఠినచిత్తుండని యెఱుంగక పోతిమిగదే! కడుపునంబుట్టిన కూఁతులు చేసిన తప్పొకటైన క్షమింపంగూడదటే॥ కటకటా యెట్టి కట్టిఁడివానికైన నిట్టికార్యకృత్యంబు గూడునటే! కేరళిక. ఓసీ ఎవరికైన సరే తప్పు చేసినవారిని తానే జూడక పరులవలన వినిరేని కోపంబధికంబ యగు. అందుగూడ వంచనావిప్రుని వేషంబుదాల్చి వచ్చిన గూఢతక్షకుని తమ్ముఁడు కాలకరోటకుని వచనవిషంబులచే వ్యాకులీకృతమానసుండై కదా పరంపరలు డిట్లు చేసెను. మరాళిక, ఓ యక్కా వానికి పీగియందిట్టి కోపముగల్గుటకుం గారణం బేమొకో? కేరళిక. ఓసీ గూఢతక్షకుఁడు మనయూరనుండు జనిబాలుర దొంగిలించుకొనిపోయి కాళికి బలియిచ్చుచు రాజునకు దొరకక యీ యూరియొద్ద నుండు మహారణ్యంబున డాగియుండెను. ఇది యెల్లవారు నెఱుంగుదురుగా? మరాళిక ఔను నేను నెఱుంగుదును. కేరళిక. ఒకనాఁడీవృత్తాంతంబువిని రోచన కుమారుండు గూఢతక్షకుం డుండునడవికి వేఁటకుఁబోయి వానితో మహాఘోరయుద్ధంబునలిపి వానిని బంధుపుత్రమిత్రవర్గంబులతో సంహరించివచ్చిన గుకు మనరాజు రాజకుమారుని పరాక్రమంబుం గని సంతసించి సౌదామినీ సమక్షంబున నిట్లనియె. ఓభగవతి యీ రోచన కుమారుండు నా యిరువుర తనూజాతలకు భర్త యని మున్నె వక్కాణించి యుంటింగదా. ఇప్పుడును నా రాజ్యంబునకుంగూడ యీతండె భర్తయగుఁ గాక. నేను పురుషసంతానహీనుండనై యున్నవాఁడను. ఇఁక రెండు మూఁడు దినములలోఁ బరిణయ ముహూర్తంబు నిశ్చయించి నాకన్యకల నిచ్చి పెండ్లిచేసి పట్టాభిషేకంబును సేయంగలను. అని చెప్పి పరిణయకార్యంబుల నెఱవేర్పఁ గార్యనియుక్తుల కాజ్ఞయొసంగెను. అట్లుండ మరునాఁడుదయంబున నారాజకుమారుండా నగరంబున లేకపోయె. ఆదినమందయమున నొక సన్యాసి రాజునగరు సేరవచ్చెను. రాజును ప్రత్యుత్థానాదుల బహూకరించి యాదినంబు తనయింట భుజియింపు మని ప్రార్థింప నాతఁ డందుకొల్లక రాజుతో నోరీ నీవు పరిశుద్ధుండవైనను నీ తనూజలు పాణియమా కాకముంద రాజపుత్రునిం గలసినవారు. వారి నింటనుంచుకొని యుంటివి గాన నీకు దోషంబుగలదు. వారిఁ బరిత్యజించువరకు నావంటివారలు నీయింటం గుడుచరు అనిచెప్పి తనయిచ్చం జనియెను. వాఁడు కాల

కర్కోటకునిపోలికయుం గల్గియున్నాఁడు. వాఁడు పలుమరు భిక్షుకవేషంబు ధరియించు
కొని యీనగరంబు సిద్ధనాక్షి బిచ్చమెత్తఁగా నేను గాంచియున్నదానను. ఆ కపట
సన్యాసిమాటలు విని తన కూఁతులయెడఁ దనకులంబున కపకీర్తి దెచ్చి రను ద్వేషబుద్ధి
యుంచి వారు నిదురించుచుండఁగా మంచంబులతో గొనిపోయి యడవియం దొండొరుల
కెఱుకపడకుండోటుల విడిచిరండని తన భటుల కాజ్ఞసేయ వారు నిన్నరాత్రి యట్లుచేసిరి.
మరాళిక. ఓకేరళికా మొదటనె వారు రాజపుత్రికలని ప్రదత్తలైరి. ఇదివరకు
సంప్రాప్తయౌవనలును గారు. ఏ గొప్పవారైన నిట్టి పాదంబు చెప్పిన వారిమాటలు
రాజు ఎట్లు విశ్వసించెనే. కేరళిక. ఓసి రాజుల హృదయములు వజ్రములకంటె
కఠోరములు. కుసుమములకంటె మృదువులుగ నుండవె. కేవలము కీర్తికళంకము లేకుండఁ
జేసికొనుటయే వారి క్రమము. మరాళిక. ఈ దినము మొదలుకొని కమలావతీకళా
వతులును మన యంతఃపురంబున నుండరే. అందు కమలవతి మన రాజునకు భోగపత్ని యగు
శృంగారవతి కూఁతురుగనుక తనకు సహోదరీభావంబు పాటించుకొని మందారమాల
యందతిప్రేమతోఁ బ్రవర్తించుచుండును. అది యతిచతుర. మఱియుఁ గళావతియనునది
ధర్మకవచునికూఁతురు మందారమాలను స్నేహంబునఁ బాటించుచుండును. వీరిరువురు
వారలతోఁగూడ రాజకుమారుసెద్ద సాహిత్యాభ్యాసంబుచేయుచున్నవారు. కేరళిక.
వారి వృత్తాంతంబు దెలిసినది మనమిఁక పోవుదమురా. అని నిష్క్రాంత
లైరి. ప్రవేశకము. కమలవతి కళావతులు ప్రవేశించిరి. మంచంబుమీఁదనుండి నిదుర
లేచుచుండు మందారమాలం గాంచి. అక్కటా! యీమగువ యంతఃపురంబునుకొని
యీ ఘోరాటవియందు నిదురపోవుచున్నది. రాజభటులు తెచ్చి యిక్కడనుంచి
పోయినది యెఱుంగదు. నిదుర మేల్కాంచ యెట్లు ఖేదింపఁజేయుచునో? మందారమాల.
మేల్కాంచి నలుగడలం బరికించి ఏమి నేను రాత్రి నాయుపవనంబునం బరుంటినో?
కానిచో నాయంతఃపురమున జేలలేకపోయినని! కమలవతీ నేను ఒకవేళ పరాకుపడి యుప
వనమందు నిద్రపోయినను మీరలైన నిదుర లేపకూడదటే. ఏమే నేనిట్లు అనాథవలె
నిదురింప నాతల్లి యూరకుండెనటవే (శయనంబువిడిచిలేచి.) కటకటా యిది నా
యుపవనంబు కాదు. ఉపవనంబైనచో మయూరంబులును శుకపికంబులును లతానికుం
జంబులు నుండవా? ఒకటైనం గానమే యిక్కడ. అదియునుంగాక నాయంతఃపురంబు
సమీపంబున లేదే. ఈస్థలంబు నెన్నఁడును నేను వచ్చినదానంగాను. ఈ కంటక
కంటకితంబులగుచెట్లును భయంకరారావముఖరితంబు లగు క్రూరమృగంబులను నే నెన్నఁ
డును గాంచినదానంగాను. నామనంబున బహుభయంబు గలుగుచున్నది. కమలవతి.
ఓముగుదా నీకల్గినని నీయందు దయలేకపోయెఁగదే. యని పైటచెఱఁగు మొగంబుపై వేసి
కొని యేడ్చుచున్నది. మందారమాల (తాను నేడ్చుచు.) ప్రియసఖి సంగతియేమే.?
కమల. ఓసి మనకు సంగతులేవియు లేవు. గతిలేనివారమైతి మంతేనే. మందార. ఓసీ

యేల యట్లుసిరియెదవు? నా జనకుండును నాజననియును మొదలగువారల కేదేని కీడు సంభ వించెనో? కమలవతి. వారల కేమియు లేదు. మఱివారలచే మనకు. మందార. (సశోక ముగ) ఏమి యిది, వారు బాగుండఁగా నాకు శోకకారణంబేమి? కళా. ఓకమలవతీ యేల సంకోచించెదవు. ఈ దుఃఖంబు చెప్పక తీరునటవే. ఎంతసేపీడఁ దనుక సందిగ్ధపు మాటలాడెదవు అని చెప్పి మందారమాలతో రాజు దానివిషయంబున జేసిన యుప కారంబుం దెల్పెను. మందారమాల భూమిపయింబడి మూర్ఛపోయెను. ఇంతలో కాల కర్కోటకుండు ప్రవేశించి యతివేగంబున వచ్చి మందారమాలనెత్తికొని దురవగాహం బగు నరణ్యపు మార్గముగుండ నొక సమీపమున నుండు నొక కొండపేటుపైకెక్కెను. కమల వతీ కళావతులు ఎంత ప్రయత్నపడియు నక్కడికెక్కలేక విరమించుచుండగా యామం దారమాలకుం గలిగిన దుర్దశావిశేషంబునకు మిగుల పరితపించుచుం జేయునది లేక నా కొండచఱియలోబడి ప్రాణంబులు వదల నిశ్చయించుకొని యందులో గూడుటకు ఒక యెత్తైన ప్రదేశంబు నిరూపించి దానిపైకెక్కి దూకిరి. నిష్క్రాంతలైరి.

కాలకర్కోటకుండు ఆకొండపేటుమీఁద నొకపలకరాతిపైన మందారమాల నునిచి తట్టిలేపిన నాకన్యకలేచి యోకమలవతీ యని పిలిచిన కాలకర్కోటకుండు 'ఓ పిల్లా కమలవతి లేదు. ఇది కాలకర్కోటకుండు వసించుతావు. బెట్టుపి చేరం జిక్కికొన్న చిన్ని లేడిచందంబున నైతివి. ఇక దప్పించుకొన నీకుం దరంబు గాదు. లెమ్ము. ఇచ్చటికి సమీపమున నొక భైరవాలయంబు గలదు. అందు పలకరాతిపై "శ్రీభైరవుని యెదుగున నొకపెట్టియయందు రెండు నారంబులున్నవి. అవి దేవతా నిర్మితంబులు. అవి కావలసినవా రొక సర్వలక్షణోపేత యగుకన్యకను సమర్పించఁబోవుదానిం గాని భైర వోపాసనాసిద్ధపురుషునిం గాని బలియిచ్చినం దీసికొనవచ్చును" అని వ్రాసియున్నది. అందుకై బహుదినంబులు భైరవోపాసన చేసి నేను నిన్ను గొనిపోవ నిశ్చయించుకొని వల పెట్టుకొనియుంటిని. ఇందుకై బ్రాహ్మణవేషంబున నరిగి మీ సంప్రపానికి వచ్చి మిమ్ము విడనాడఁజేసితి. ఈ నెపంబున నీమగండు నా సహాయుండని యెంచిన పగ యిప్పుడు దీర్చుకొందును. ఈ దినంబు నాకు పండుగదినము' అని చెప్పిన మందారమాల భయంబునం జేమియుం దోఁచక యేడ్చుచున్నది. ఇంతలోపల చెట్లసందునుండి రోచనకుమారుండు ప్రవేశించి. మందారమాలం గాంచి సమీపమునకు వచ్చి ఓ మందారమాలా యని పిలిచెను. రాజపుత్రియు కన్నులు దెరచి ససంభ్రమంబుగ ప్రాణనాథా యని యార్చు చుం బరువిడి యాతనిం గౌఁగిలించుకొనెను. రోచనుండు మెల్లగ దానిం బుజ్జగించి యో ప్రాణనాయికా యిప్పుడు నే నీకుం జేయవలసిన యుపకారంబేమి తెల్పుమనన మందార మాల రాజపుత్రా నీవేమియు విచారింపక యిప్పుడ ఈ క్రూరునిం బట్టి తలతెగఁగొట్టి యీ భైరవునికిం బలిపెట్టుము. తక్కిన విషయంబు లవ్వలం దెల్పెద నని రోచనుం డట్ల యని తన్నుం గని చెట్లసందున బరుగిడిపోవు నా కాలకర్కోటకుని వెంటనంటి కొప్పు

పట్టి తిగిచికొని తెచ్చి తలతెగగొట్టి భైరవునికిం బలిపెట్టెను. అంత మందారమాల ప్రాణనాథా యీ భైరవుని క్రింద నవరత్నహారంబు లున్నవట. ఈవిగ్రహంబుం బెరికి యవి గ్రహించుకొనవలయును అనఁగా నా ప్రకారంబుగ భైరవునిం బెరుకఁగా వజ్రమయంబగు పెట్టియును రెండుహారంబులుం గనంబడియె. అవి యెత్తుకొని రోచనకుమారుండు మహామోదంబు నంది యో మందారమాలా యీ రెండుహారంబులును దేవనిర్మితంబు లనుటకు సందియంబు లేదు. ఇది యెవ్వరెవ్వ రెట్లు ధరియింపవలయునో తెలియదు. క్రమంబు దప్పి ధరించుకొన్న నేమేమి కీడు వాటిల్లునో యేమియుం దెలియకయున్నదే. అనఁగా మందారమాల ప్రాణనాథా ఆ విషయంబుంగూడ నీయాలయంబున నెందైన వ్రాసియుండకపోదు. పరిశీలింతము అని యా భైరవాలయకుడ్యంబులం జూచుచుండిరి. అందొకచోట "భోగంకరణహారము రాజ్యకన్యక ధరించుకొనందగినది. అది నియమముతో ధరించునది. చతుస్సముద్రముద్రితభూమండలాధిపత్యంబు వహించు నొకరాజకుమారునకుం బట్టపుదేవియై యనేకవత్సరములు భోగంబు లనుభవించును. జీవంకరణమను హారము రాజకుమారుఁడు ధరించుకొనవలసినది. ఇది ధరించుకొన్నవానికి సకలశత్రుజయంబును అపరిమితధనసంపదయుఁ గలుగు" అని వ్రాసియుండెను. ఇట్లు వ్రాసియుండుటం గాంచి మహాసంతోషాంబుధిం దేలి యాయిరువురును తమకొండొరులం బెండ్లిచేసికొనవలయు నని యెంచి యది చెప్పుకొనలేక సిగ్గుపడుచుఁ గొంతతడవు గడపుచుండ నందు రాకొమరుండు భోగంకరణహారంబును మందారమాలకంఠంబున నిడి హర్షోత్ఫుల్లముఖారవిందుండై యా బాలికామణి మొగంబు ముద్దుగొనియెను. జీవంకరణహారంబును రోచనుండు తాను ధరించుకొనిన యనంతరము మందారమాల 'ప్రాణనాథా మీ రిచ్చటకు వచ్చుటకుం గారణం బేమి? నన్నుఁ గాలకరోత్కటకునిబారినుండి తప్పించుటకై దైవము మిమ్ము ప్రేరణచేసెనో? అనుపమమగు భవత్ప్రాప్తిచేత బంధుజనవిరహదుఃఖం బెంతమాత్రము నాకుఁ దోచదు.' అని యనఁగా రోచనుఁడు 'ప్రాణనాయికా నీతండ్రి గూడ తక్షకునిం జంపినందుకు సంతసించి యుజ్జయినీనగరంబునకు నన్ను రాజుం జేయందలంచి తనభావంబు బయలుపఱుచుటం జేసి యది యే నొల్లక సకలదేశవిలోకనోత్కంఠచేత నెవ్వరికిం దెలుపకుండ నానగరంబు నిర్గమించి యీయరణ్యంబునం జొచ్చి నడచుచు నీదిన మీదయమున నీకొండచఱియయొద్దకుఁ జేరి నీచేయు రోదనధ్వని వినంబడఁగా నిచ్చోటికి వచ్చితిని. భవల్లాభంబువలన నపరిమితానందంబు నొందియున్న వాఁడ. ఇంతకంటెఁ గావలసినది యధికం బేదియును లేదు. భరతవాక్యము. కం. మనకనుదినమానందము, ఘనజాతదళాక్షుదయనువర్ధిలు గాతన్, ఘనములు వర్షించి జగంబును గాచుచునుండుఁగాత భూమిసురులకై. అని యందఱును నిష్క్రాంతులైరి.

చతుర్థాంకము సంపూర్ణము.

నాటకము సమాప్తమైనయనంతరము శత్రుంజయుండు తనమంత్రి యగు విచారసాగరునితో 'నో ప్రధానశేఖరా యీ నాటకమునందు నాకుం బరమమిత్రుం డగు పరంతపుని కూఁతురగు మందారమాలా కన్యకచరిత్రంబు నిరూపింపఁబడియె. రోచన కుమారుండనువాఁడు నా తనయుఁ డగుచున్న మోహనుండే యని తోఁచెడిని. లేనిచో వానికి దుఃఖము వచ్చినప్పుడు నాకు దుఃఖమును వానికి సుఖము సంభవించినప్పుడు నాకు మహా మోదంబును నేలగల్గు? ఆరోచన కుమారుం డెవండు? ఈభైరవాలయంబు నొద్ద నుండు రోచనుండును మందారమాలయు నెవ్వరి. వృత్తాంతంబును పూర్ణముగా విన నాయన మత్యుత్కంఠతో నున్నది.' అనిపలుకుచుండఁగా మంత్రివరుం డాంఖ్యాయనునిం బిలి పించి రా జడిగినవిషయంబు విన్నవించిన నాతఁ డిట్లనియె. సింహాచలంబుపై తపంబు సేయుచున్న మణికంఠుండను సిద్ధుం డొకనాఁ డుజ్జయినీక్షేత్రంబు దర్శింపవచ్చి మహా కాలదర్శనానంతరం బాకాశయానంబునం బోవుచుండె యమూల్యరత్నప్రభాప్రజ్వలి తంబులగు నీహారంబులు రాజపుత్రుల కంఠంబులం బ్రకాశించుటఁ గాంచి యా భైర వాలయ సమీపంబున దిగి యొక బ్రాహ్మణవేషంబు ధరియించుకొని పరిహాసపురనకుం జని ప్రాణములుఁ బోవువానివలె విలపించి యేలయేడ్చెద వని వా రడిగిన మీఁదట యా కపట విప్రుం డిట్లనియె. ఓ రాజపుత్రా నేను బీదబ్రాహ్మణుండను. మీయొద్ద యాచించి యేమైన సంపాదించుకొనం బ్రయత్నపడి వచ్చుచుండఁగా నీసూర్యోదయంబున మహాసర్పం బొకటి నాతోఁ బ్రవృద్ధమై యముదంష్ట్రలంబోలిన కోఱల విషంబు గ్రక్కుచు నన్నుం గఱచి వేగంబ పారిపోయినది. నేనిదివరకు ప్రాణంబులు బిగబట్టుకొని వచ్చితిని. ఇంక నాశరీరము నీయధీనము అని భూమిపయింబడి విలవిలఁదన్నుకొని విగతప్రాణుని చందం బునయుండె. రోచనుండును తనయా నావిప్రుని బ్రతికించు నుపాయంబుంగానక తన హారము జీవాకరణంబని చెప్పంబడునుగాన నది యితనిని బ్రతికించునని తలంచి తటాలున తన మెడనుండు హారంబునుదీసి యాతని కంఠంబునవైచెను. ఒకింతసేపటికి వాఁడిటు నటుం బొరలెను. అదిగాంచి సంతసంబున మందారమాల తనహారంబు భోగకరణంబు గాన నీతనికి సౌఖ్యము సేయునని తలంచి తన మెడనుండుహారంబు నాతనికంఠంబున వైచెనంతలో నాసిద్ధుండు నవ్వుచులేచి యాకాశయానంబున నెగరిపోయె. అది మొదలు వీరు బుద్ధిచాంచల్యంబు గల్గి యొండొరులతోఁ జేరక యెడఁబాసిపోయిరి. క్రమక్రమముగ రాజకుమారుండు పాపాకరపట్టణంబులఁ బ్రవేశించెను. ఏను భూత భవిష్యద్వర్తమానంబుల నెఱింగిన వాఁడఁగాన మందారమాలగతి యెఱింగి యది రాజ కుమారు నెడబాసిన వెంటన యదియుండుచోటికింజని దాని నీయూరికిం గొనితెచ్చితిని. మందారమాలను విడిచిపెట్టినరీతి వసంతసేనను గూడ నట్టడవియందు రాజు విడిచి పెట్టఁగా సౌదామిని యచటికిం బోయి దానిం గొనిచని శ్రీపర్వతంబునం దనయాశ్ర మంబున నుంచుకొనియున్నది. ఆవసంతసేన ప్రౌఢవోకకు కామందకి యను పేరుతో

యోగం బభ్యసించుచున్నది. మణికంఠుం డీ హారంబులం దెచ్చి శ్రీపర్వతంబున
సౌదామినీతపోవనంబున కరిగి యామె యడుగఁగా నాహారంబులు తనకు దొరికినమార్గం
బంతయుం జెప్పె. అంతట సౌదామిని యీ హారంబులు తనకిచ్చి పొమ్మనియడుగఁగా
తప్పించుకొనిపోలేక తదీయతపోవిశేషంబునకు భయపడుచు నామెకు సమర్పించినవాఁడు.
ఆ సౌదామిని యాహారంబులుగొనుచు భైరవాలయంబునకువచ్చి యచ్చట మందార
మాలా రోచనులు లేమికి దుఃఖించుచు నాగుడి కలయం గాంచునెడ నొకచోటం
బూర్వోక్త ప్రకారము వ్రాసియుండుటం జూచి మఱియొకచోట "ఈ హారంబులు
శూద్రతపస్వి చేతం జిక్కెనేని హారస్వాములకు చిత్తచాంచల్యంబున పరస్పరవియోగం
బును సంభవించును; అనియమున కీ హారంబులు మరల బంధుజనంబులయొద్దఁ జేరునేని
తమయొద్దనున్నరీతి మహాలాభకరములు నగును అని వ్రాసియుండుటం గాంచి సంతసించి
తన తపోవనంబునకుం జనియె. రోచనుం డీపురంబునకు వచ్చియున్నాఁ డని విని వసంత
సేనచే వానిని కొన్నిదినంబులకుమూంపి యిచ్చుటకుం బంపినయది. వసంతసేనం దోడ్కొని
యీదినం బిచ్చటికి వచ్చినట్లు సౌదామినికి వృత్తాంతంబుం దెల్పియున్నాను. ఇప్పు
డిచ్చోటికి వచ్చెను. ఈతఁడు నీతోయుద్ధము చేసినవాఁడే నీకుమారుండైన మదన
మోహనుండు. ఇతని కుదయాదిత్యుని నగరంబున రోచనుం డను పేరుగల్గె. మీరు
మోసముగఁబట్టి బంధించినవాఁడె కృతబుద్ధియను నీ విచారసాధునికుమారుండు. దీర్ఘ
బాహునికూఁతురు చంద్రసేనయే చంద్రసేనుండను పేరఁ సుందరీమందిరాధిపత్యము వహించు
చుండెను. కమలవతీ కళావతులు కొండచఱియలోదూకి ప్రాణంబులు వాయ యత్నించి
దూకఁగా నందొక సాధకునిచేఁ బట్టఁబడి దేహంబుల నొకించుకేనియుం క్షతిలేకయుండ నే
నచ్చటికేగి వారలం గొనితెచ్చి మందారమాలకు దాసికలుగాఁ జేసియున్నదానను. అని
చెప్పఁగా శత్రుంజయుండును దీర్ఘబాహుండు మొదలగువారును ఆ సాంఖ్యాయని
ప్రభావంబునకత్యాశ్చర్యంబునొంది యామె పాదారవిందములకు నమస్కరించి యో
తల్లీ యిట్టికారణవత్సలతం గాపాడిన నీ ప్రేమను మే మేమని వినుతింతుము. కరుణించి
కుమారుల రప్పింపుము. అని వేడుకొనఁగా సాంఖ్యాయని భటులచేత మదనమోహనుని
కృతబుద్ధిని కారాగారములనుండి విడుదలచేయించి రప్పించి ముందుగవచ్చి తనకుం
బ్రణామంబుచేసి నిలిచినకృతబుద్ధిసహితుండైన మదనమోహనునిం జూచి ప్రమో
దంబుతో నో మహారాజకుమారకా యని యాదలమూర్కొని నాయనా నిన్నొక కార
ణంబుచే కారాగారంబున బంధనంబు సేయవలసివచ్చె. ఇది తప్పు కాదు. నీమనంబున
నుంచుకొనకుము. ఇదె నీతండ్రి శత్రుంజయ మహారాజు వచ్చియున్నవాఁడు. నిన్నుం
గాంచ నత్యుత్కంఠతో నున్నవాఁడు. ఆతని చరణకమలంబుల కెరఁగుము. అనఁగా
మదనమోహనుండు భయభక్తులతోఁ దండ్రిపాదారవిందంబులకు వందనం బాచరిం
పఁగా శత్రుంజయుండు ఆనందబాష్పంబులఁగుమారు నొదల తడుపుచు బాహువులు

సాచియొత్తి సిందుకవుఁగిటం జేర్చుకొని దగ్గుత్తికతో నేమియుం బలుకలేకయుండె
మదనమోహనుండు. బుద్ధిసాగరుని చరణంబులకు నమస్కరించి యాతనిచే గౌరవింపం
బడి నిలుచుండె. కృతబుద్ధియుం జంద్రికకు నమస్కరించి రాజునకు వంగిన వానిని
రాజు కౌఁగిలించుకొని వాయసమా మనుష్యులం బాయని నీడంబోలె రాముని బాయని లక్ష్మ
ణునివలె రాజకుమారు ననుసరించుకొని యనేకకష్టంబు లనుభవించితివి. లోకంబున
స్నేహధర్మంబు నీవలన నిరూపంబడియె. అనిపల్కుచుండఁగా సాంఖ్యాయని కమలవతీ కళా
వతీ తరళికా ప్రముఖులచేత మందారవల్ల్యాది కాంతలను రావించి నమస్కరింపం
బనిచి యందు మందారమాలం జూపి యిదియె యీ రాజ్ఞి నీపలికూతురు. దీని పేరు మం
దారమాల. ఇది పట్టమహిషీ పదంబునకుం దగినయది. అని మదనమాలం జూపి ఇది మదన
మాల. నీకత్యంత మిత్రుండైన ధరావంతనగరాధిపతియగు శూరబాహుని కూఁతురు.
అని చంద్రసేనం జూపి యిది కళింగ దేశాధిపతి యగు దీర్ఘబాహుని కూఁతురు. ఇది
లతావివాహ ప్రస్తాపమున నుండఁగా నే నచ్చోటికిం జని కొన్ని యింద్రజాలంబులు
చూపించి భీతం జేసి యిచ్చటికిం గొనివచ్చి నీకుమారునికి బత్నిఁగాఁ జేసినాఁడను.
అని మదనరేఖం జూపి యిది నేపాళదేశపు రాజధాని యగు చంద్రభాగ నగరాధిపతియైన
ధర్మపాలుని కూఁతురు. అని చంపకరేఖ జూపి ఇది నాకుం బ్రియశిష్యుండగు సింహ
దేశాధిపతి ధృతవీర్యుని తనూజ. నీకుమారునికి వివాహయోగ్య యని యారాజుతోఁ
జెప్పి తెచ్చి చంద్రసేనునికిం జెలియలి వరుసగా నేర్పరచియుంటిని. ఈ ఏడుగురును
నీకుమారునిచే గాంధర్వ వివాహంబునం బరిణీతలై యున్నవారు. అని చెప్పుచుండఁగా
సౌదామినియు వసంతసేనం దోడితెచ్చి రంగాంచి సాంఖ్యాయని తనయొద్ద నుండు పరి
చారికాజనంబుచేత దానితపస్వివేషంబు బాపి రాజకన్యకావేషంబును ధరింపఁజేయ
నాజ్ఞ యిడి వారలట్లు చేయ నొరవెలికిఁ జికిలిచేసిన పంచబాణుని బాణంబు రీతి వెలుఁగు
చున్న యనుంజూపి దీనిని నీవు కోడలిగాఁ బరిగ్రహింపుమని చెప్పినవిని శత్రుంజ
యుం డిట్లనియె. ఓ భగవతీ నీయాజ్ఞ మీఱుకు జరుగుట కాటంకంబు లేదు. అయినం
దెలియక యడిగెదను. సంసారంబు వదలి సన్యాసవృత్తిలో నుండు తమ కీసంసారప్రవృత్తి
యేలగల్గె; తెల్పుమి. అనఁగా సాంఖ్యాయని యిట్లనియె. ఓ మహారాజా యీ విచార
సారుఁడు నాకు బాల్యస్నేహితుఁడు. మే మిరువురము బ్రహ్మవిద్యాభ్యాస మొక గురువు
నొద్దన యొనరించితిమి. ఇతఁ డొకనాఁడు నా తపోవనంబునకు వచ్చి నమస్కరించి
యో భగవతి ! నాయందు శిష్యవాత్సల్యంబుంచి యొక కార్యంబు నిర్వర్తింపఁ బ్రార్థించె
దను. మా రాజకుమారుఁడు మదనమోహనుఁడు పరకీయాపరాయణుం డగునని జ్యోతి
ష్కులు వచియించిరి. వారలమాట లసత్యంబులు కావు. పరదారపరాయణుం డగు రాజగు
నేని రాజ్యంబు చెడునని రాజు భయపడుచున్నాఁడు. ఇందుకుం దగిన వెరవూహింప
వలసిన భారము నీది అని చెప్పెను. అందుకు నేను సమ్మతించి లోకంబునం గన్యకలను

తమతమ తండ్రిమొదలగువారు కన్యాదానము చేయవలయును. అట్లుచేయక కన్యకలే తమ కిష్టుని వరించిరేని వారు కన్యకలనం దగు పరకీయ లగుదురు. "కన్యాయాః పిత్రాద్యధీన త్వేన స్వాధీనతా" అనియున్నదిగదా ? కాన పిత్రాద్యనుమతి లేకయే తమకు తామె కోరి యీపతిని వరించిరేని యీతనికి పరకీయాగమనము సిద్ధించు. ధర్మశాస్త్రప్రకారము మిది విరుద్ధముకాదు. శ్లో. గాంధర్వేణ వివాహేన బహ్వ్యో రాజర్షికన్యకాః, శ్రూయంతే పరిణీతా స్తాః పితృభిశ్చాభినందితాః. అన్నట్లు శకుంతలాదులగు రాజకన్యకలు గాంధర్వ వివాహంబున భర్తలను వరించియుండుటంజేసి దోషావహము కాదని యితనికి పట్టమహిషి గాదగిన రాజకన్యకల నాలుగు సాశిష్యలగు మందపాలకి సౌదామిని మొదలగు వారలంగూర్చి యశోదాయముల నిచ్చటికి రప్పించి వారికి పరస్పర స్నేహంబు కల్గునట్లు గావించి యీసుందరీ మందిరంబునం గాపాడుచుంటిని. ఇందొక్కొక్కనికి చేర్చి నవీన శ్రమము లనుభవించితిని. ఈ నగరము మదీయతపోబలంబుచే నితరుల కగమ్యస్థలముగనుంగట్టిన పట్టణము. అనిచెప్పఁగా శత్రుంజయుండు తన మంత్రిబుద్ధికి మిక్కిలి సంతసించి సాంఖ్యాయనితో నోభగవతి నా కుమారుని కింతటితో జ్యోతిష్కులు చెప్పిన దోషముపోయినదా యనియడుగ సాంఖ్యాయనియు ఓరాజా యీ సుందరీమందిరంబున నీకుమారుండు డీకాంతలకై పడిన ప్రయాసము పరదారలకై తిరుగువాఁడును అనుభవింపలేఁడు. మందారమాల చంద్రసేనుని పత్ని యని యిందీవర కెల్లవారును దలంచియున్నారు. ఇతఁడును చంద్రసేనుని పత్నితో వ్యభిచరించుచున్నానని యూహించి ప్రవర్తించెను. అందుతో నా దోషమును సమాప్తంబయ్యె. ఇతనికిం దగిన నాయికలు ఈ భూలోకంబున వీరలే కాని యితరులు లేరు. వీరలంగాక యన్యుల నీక మనంబున నైనం గోరఁడు. వీరలు కులరూపవయోవిద్యాదుల నీకుమారునికి సమానలు. అనిచెప్పఁగా శత్రుంజయుండు ప్రమోదమేదురహృదయుండై భగవతి యింత ప్రియముచేసిన నీకు మే మేమి ప్రియంబు సేయంగలము. కొండంత దేవునికిం గొండంతనై వేద్యము పెట్టలేముగదా యన్నట్లు మాయెడం గలుగు ప్రియకార్యంబొకటి నెరవేర్చుకొనుమని ప్రార్థింపఁగా సాంఖ్యాయని యోరాజా నాకుం ప్రియంబుచేసెదవేని ఈ కన్యకలజనకులరావించి యీ సుందరీమందిరంబునన మంచిముహూర్తంబునందు వివాహంబు జరుపుము. కన్నులు చల్లవడంజూతు నిదియ నాకు ప్రియంబని చెప్పఁగా శత్రుంజయుండును జయవర్మం గాంచి మదనమాల తండ్రియగు శూరబాహువును అతనికుమారులను కారాగార విముక్తులంగావించి నీభార్యయగుమోహనవతితోడ నెల్లి సాయంకాలమున కిచ్చటికి వచ్చునట్లు వేగవంతంబులగు గుఱ్ఱంబులుగల భటులను తత్క్షణంబ పంపుమన నతండు నట్లయొనర్చెను. ఉజ్జయినీపతి

యగుపద్మకోశునికిని సింహదేశాధిపతియగు భృకవీర్యునకును, చంద్రభాగ నగరాధిపతియగు ధర్మసేనునికిని వృత్తాంతంబు విశదంబుగ వ్రాసి కల్యాణపత్రికలు తాను శత్రుంజయుండు పంపెను. సకలబంధుజనంబులును వచ్చిచేరిరి. చిత్రకేతనపట్టణమున కతివేగ హాలంబులగు గుఱ్ఱంబులెక్కి పోయి యుధాజిత్తునకు మదనుడను వృత్తాంతంబు దెల్పి కల్యాణంబు శుభపత్రికఁగా మదనమోహనునితల్లి మణిమాల మిగుల ప్రమోదంబు నొంది కుమారుని యుదయంబునకు సుందరీమందిరంబునకు వచ్చి కుమారునిం గని సంతసపడి కోశంబు వచ్చి నమస్కరించిన దీవించి యుపాయముగ కౌగిలించుకొని మహానందాంబుధిని దేలుచు పెండ్లిపనులు నిర్వర్తించుచుండె. దేశంబులం గల విప్రముఖ్యులును రాజులును వైశ్యులు శూద్రులును పరిణయవీక్షణకౌతూహలంబుతో నాగరంబునం జేరి యిష్టమృష్టాన్నంబులచే పరితృప్తివడసెరి. శత్రుంజయుండును సాంఖ్యాయనునిర్దిష్టంబగు శుభముహూర్తంబునందు మంగళవాద్యంబులు మ్రోయ విప్రముఖ్యులు వేదంబులు చదువ గాయకులు వీణావేణుముఖ్యములగు సంగీతంబులు పాడ నప్సరసలను బోలు వారకాంతలు నర్తనంబులు సలుప మహాసంతోషంబున కుమారునికి మందారమాలాదిక్రమంబుగఁ బరిణయంబు నిర్వర్తించెను. ఇట్లు నాలుగుదినంబులు మహోత్సవంబుగాఁ బరిణయంబు జరిగిన యనంతరము శత్రుంజయుండును సాంఖ్యాయనుని ప్రార్థించి చిత్రకేతననగరంబునకుఁ గొని చని తన్ని దేశంబున సకల బంధుసమక్షంబున పౌరులును బాంధవులును సంతసింప మదనమోహనునికిం బట్టాభిషేకమహోత్సవంబు రచియించి మంత్రిపదంబునం గృతబుద్ధి నునిచి తానును విచారసారుండును నిర్భరభక్తియుక్తంబుతో భగవంతుని ధ్యానించుచు సంతోషంబున నుండిరి.

కం. మకుపజ్ఞంబుగఁ జేసితి, నిది నీ వంగీకరింపు మెలమి సెలంగన్
మదనజనక సరసులకును, హృదయాహ్లాదావహంబు హితమయి వెలయున్.

ఇది శ్రీ మదనగోపాలచరణారవిందవందనాభిలాషి యగు చిలకపాటి వేంకట
రామానుజశర్మచే రచియింపఁబడిన చమత్కారకథాకల్లోలినియందుఁ

జతుర్థతరంగము సర్వంబును సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951.